# వాల్మీకి రామాయణము

## యుద్ధకాండ

## (ద్వితీయ భాగము)

### ౬౩

రావణాసురుడు దిగులుపడిపోయి మాట్లాడింది అంతా కుంభకర్ణుడు విన్నాడు. నవ్వుతూ "అన్నా, ఇదివరకు ఈవిషయము మనము ఆలోచించినాము. ఈ ఆపద వస్తుంది అనే అనుకొన్నాము. సీతను ఇచ్చి వేయమని నీ మేలు కోరి చెప్పిన మాట నీవు వినలేదు. అందువల్ల ఇప్పుడు నీకు ఆపద వచ్చింది. దుష్కృత్యాలు చేసిన వారు దేహము చాలించిన తరువాత నరకములో పడిపోతారు, అని అంటారు. సీతను అపహరించుకొని వచ్చిన పాపకృత్యానికి నీవు వెంటనే ప్రతిఫలము అనుభవించవలసి వచ్చింది.

"రాజా, నీవు కేవలము పరాక్రమమువల్లనూ దర్పమువల్లనూ సీతను ఎత్తుకొని వచ్చినావు. కాని ఎటువంటి ఆపదలు వచ్చేదిన్నీ ముందుగా నీవు ఆలోచించలేదు. నీతిజ్ఞుడుఅయిన ప్రభువు ఎవడూ ముందు చేయవలసిన పనులు వెనకనూ వెనక చేయవలసిన పనులను ముందూ చేయడు. నియమపూర్వకముగా వేదాధ్యయనము చేయనివారు యజ్ఞాదులలో వేల్చిన ఆజ్యాది హోమ ద్రవ్యాదులవలె దేశకాలవిరుద్ధముగా చేసిన పనులు ప్రతికూలము అయిపోవడమే కాకుండా దోషఫలాన్ని కూడా ఇస్తవి.

"రాజా తాను బలవంతుడు అయి శత్రువు బలహీనుడుగా ఉంటేనే యుద్ధము చేయవలెను. తానూ తన శత్రువూ తుల్యబలవంతులుగా ఉంటే సంధి చేసుకోవలెను. తాను బలహీనుడుగానూ శత్రువు బలవంతుడుగానూ ఉన్నప్పుడు తాను లొంగిపోయి శత్రువుకు కప్పము కట్టవలెను. మంత్రులతో చక్కగా ఆలోచించి ఈ ఉత్తమ మధ్యమాధమ మార్గాలలో దేనినో ఒకదాన్ని నిర్ణయించి పనిచేయవలెను. అంతేకాదు. ఆ చేయ నిర్ణయించుకొన్న పనిని ఆరంభించే ఉపాయమూ అందుకు అవసరముఅయిన ద్రవ్యసాధనసంపత్తీ అందుకు అనుగుణముఅయిన దేశమూ కాలమూ అందుకు వచ్చే విఘ్నాలూ ఆ విఘ్నాలకు ప్రతీకారము ముందుగా ఆలోచించుకోవలెను. ఇట్లా ఈ అయిదింటినీ ఆలోచించి పనులు చేసే వాడే నీతిజ్ఞుడు.

ఏ పని చేయడానికి అయినా మంత్రుల అభిప్రాయము ముందుగా తెలుసుకోవలెను. ఆ తెలుసుకొన్న అభిప్రాయాన్ని ఆప్తమిత్రులతో ఆలోచించవలెను. ఆ తరువాత నీతిశాస్త్ర విరుద్ధముగా కాకుండా పనిచేయవలెను అట్లా చేసే రాజు ఎప్పుడూ జయిస్తాడు.

"ఓ రాజా, ప్రాతఃకాలాన ధర్మాన్నీ మధ్యాహ్నకాలాన అర్థాన్నీ సాయంకాలాన కామాన్నీ సేవించ వలెను. అట్లా కాకపోయేట్లయితే జంటలు జంటలుగా అంటే ప్రాతఃకాలాన ధర్మార్థాలనూ మధ్యాహ్నకాలాన అర్థ ధర్మాలనూ సాయంకాలాల కామార్థాలనూ సేవించ వలెను. లేదా ధర్మార్థ కామాలను మూడింటినీ సాయంకాల మప్పుడు అయినా సేవించ వలెను. సర్వ కాలాలలోనూ కామాన్ని మాత్రము సేవించ కూడదు. ధర్మార్థకామాలు మూడింటిలో శ్రేష్ఠము అయింది ధర్మము. అది అట్లాగు అని తెలిసి కూడా దానిని ఆచరణలో పెట్టని రాజు కానీ రాజు అంతటి వాడు కానీ సంపాదించిన శాస్త్రజ్ఞానము అంతా వ్యర్థము. ధర్మార్థకామాలను అనుష్ఠిస్తూ అవసరము అయినప్పుడు మంత్రులతో కూడా ఆలోచించి సామదానభేదదండాలు అనే చతురోపాయాలలో ఏ ఒక్క ఉపాయాన్నో రెంటినో కాక నాల్గింటినో ఆచరించ వలెను. అట్లా చేయని రాజు ఈ లోకములో దుఃఖాలపాలు అయి పోతాడు. తనకు యేది మేలో యేది కీడో తాను యే పని చేయవలెనో యే పని చేయకూడదో కార్యతత్వజ్ఞులు అయిన మంత్రులను ముందుగా ఆలోచించి పనులు చేసే రాజు ఎప్పుడూ సుఖపడుతాడు.

నీతి శాస్త్రార్థము ఏ కొంచెమూ తెలియని మంత్రులూ తమ ప్రాగల్భ్యము చూపించడానికి ఆలోచనాసభలలో పశుబుద్ధితో ఏమేమో వదురుతారు. నీతిశాస్త్రాన్ని కానీ ఇతరశాస్త్రాలను కానీ తెలుసుకోకుండా చెప్పే వారి వల్ల కీడు మూడుతుంది. కనుక మహదైశ్వర్యము కాంక్షించే రాజు అటువంటి అజ్ఞానులు చెప్పే ఏ పనీ చేయకూడదు. వారు తమ ప్రాగల్భ్యముతో కీడును మేలుగా చేసి చెప్పుతారు. అటువంటి వారి మాటల వల్ల పనులు పాడు అయి పోతవి. కాబట్టి అది తెలుసుకొని అటువంటి వాండ్లను మంత్రసభకు రానీయకుండా వెలుపలనే ఉంచ వలెను.

మంత్రులు శత్రువులతో చేరి తమ రాజును నాశనము చేయడానికి తమ రాజా చేతనే విపరీతపు పనులు చేయిస్తూ ఉంటారు. పయికి మిత్రుల వలె నటిస్తూ శత్రువుల సొమ్ము తిని అమిత్రులు అవుతారు. అటువంటివారిని వారి మంత్రనిర్ణయాలను పట్టే తెలుసుకోవచ్చును. అందువల్ల శత్రువుల సొమ్ము తిన్న

మంత్రులు చెప్పినట్టు ఆ యా పనులు అమితవేగముతో చేసే చపలచిత్తపు రాజుల లోపాలను శత్రువులు ఇట్టే కనుక్కొని కలుగుతారు. దారి కనపడని పక్షులు క్రౌంచపర్వతరంధ్రములోనుంచి దూరి అవతలకు పోయేట్టు శత్రువులు తమ పనులను ఎదటి వారి దుర్మంత్రుల మూలకముగా సాధించుకొంటారు. శత్రువులను తెలుసుకొని తనను కాపాడుకోని రాజు ఆపదల పాలు కావడమే కాకుండా రాజ్యాన్ని కూడా పోగొట్టుకొంటారు.

"అన్నా, నీవు ఈ విషయములో ఇదివరకు విభీషణుడు చెప్పినట్టు చేసి ఉండవలసింది, ఇప్పుడున్నూ అది మంచిపని అని నాకు అనిపిస్తూ ఉంది. అట్లా కాదు అనేటట్లయితే నీ ఇష్టము వచ్చినట్టు చేయవలసింది" అని కుంభకర్ణుడు చెప్పినాడు.

ఇట్లా కుంభకర్ణుడు చెప్పింది అంతా రావణాసురుడు విన్నాడు. అతనికి కోపము వచ్చింది. కోపముతో కనుబొమలు ముడివేసి కుంభకర్ణుణ్ణి చూచి "తమ్ముడా, నీవు ఏదో పరమపూజ్యుడివలెనూ ఆచార్యుడివలెనూ గురువు వలెనూ నన్ను శాసిస్తూ ఉన్నావు. ఇట్లా చెప్పడము వృథా ప్రయాస. ఈ మాటలవల్ల ప్రయోజనము ఏమీ లేదు. ఇది నీతివిచారానికి సమయము కాదు. ఈ సమయానికి ఉచితము అయిన పనిని ఇప్పుడు చేయవలెను. భ్రాంతివల్లనో తెలివితక్కువ వల్లనో నేను ఏదో చేసినాను. ఆ చేసినదాని గురించి ఆలోచించడానికి కానీ దానిని తిరగతోడడానికి కానీ వీలులేదు. దానిని గురించి ఇప్పుడు ఏమి అనుకొన్నా ఏమీ ప్రయోజనములేదు. బుద్ధిమంతులు అయి పోయిన దానికోసము దుఃఖపడరు. అయిపోయింది ఎట్లాగూ అయిపోయింది. అది తిరిగి రాదు. తమ్ముడా, నీకు నా మీద స్నేహము ఉన్నట్లయితే నీవు నీ పరాక్రమాన్ని నమ్ముతూ ఉన్నట్లయితే నీవు నాకు సహాయము తప్పకుండా చేయవలెను అనుకొనేట్లయితే నా దోషాన్ని నీ పరాక్రమముతో సరిచేసి పెట్టు. ఆపదలపాలు అయి దీనదశలో ఉన్నవాడికి సహాయము చేసే స్నేహితుడే స్నేహితుడు. నీతితప్పి సహాయము కావలెను అనుకొంటున్నవాడికి సహాయ పడే బంధువే బంధువు" అని రావణాసురుడు అన్నాడు.

ఇట్లా తెగతెంపులుగా చెప్పినందువల్ల రావణాసురుడికి కోపము వచ్చింది అని కుంభకర్ణుడు తెలుసుకున్నాడు. అంతట మెల్లగానూ మృదువుగానూ "రాజా, నీవు సంతాపపడవద్దు. కోపము వదిలిపెట్టు. స్వస్థముగా ఉండు. నేను జీవించి ఉండగా నీవు దుఃఖపడవలసిన పనిలేదు. నీవు ఎవరికోసము ఇట్లా పరి తాప పడుతున్నావో వాణ్ణి నేను నాశనము చేసివేస్తాను. బంధుత్వము నుంచి

అందులో భ్రాతృగౌరవమునుంచి నేను ఎప్పుడూ నీకు హితము చెప్పవలెను. అది నావిధి. అందువల్ల చెప్పినాను. బంధువు అయినవాడు అందులో స్నేహితుడు అయినవాడు ఈ సమయములో ఏమి చేయడము మంచిదో అది యుద్ధములో చేసి చూపిస్తాను. నేను నీ శత్రువులను అందరినీ సంహారము చేసి వేస్తాను.

“ఓ మహాబాహూ, నేను ఇప్పుడే రామలక్ష్మణులను చంపివేస్తాను. వానరసైన్యాన్ని పరుగెత్తిస్తాను. యుద్ధభూమిలోనుంచి రాముడి శిరస్సు తీసుకొనివచ్చి నీకు సమర్పిస్తాను. ఆశిరస్సును చూచి సీతాదేవి దుఃఖపడవలెను. నీవు సుఖపడవలెను. బంధువులను కోలుపోయి ఇప్పుడు లంకాపట్టణములో దుఃఖపడుతూఉన్న రాక్షసులు అందరూ చూచి సంతోషపడేట్టు రామలక్ష్మణులను సంహారము చేసివేస్తాను. ఓ రాజా, నీ శత్రువులను అందరినీ నాశనము చేసివేయడానికి నేను దేవేంద్రుడితోనయినా యముడితోనయినా పోరాడుతాను. నేను సింహనాదము చేస్తే నా తీక్ష్ణదంష్ట్రలనూ నా పర్వతాకారాన్నీ నా చేతిలో ఉండే శూలాన్నీ చూచి దేవేంద్రుడు అయినప్పటికిన్నీ పారిపోతాడు. నాకు శూలముకూడా అవసరములేదు. నేను ఏ ఆయుధమూ లేకుండా నా బాహువులతోనే శత్రువులను చంపివేయకలను. నేను అట్లా నా బాహువులతో శత్రువులను చంపివేయడము మొదలుపెట్టితే బ్రతుక తలచుకున్నవాడు ఎవడూ నాఎట్టఎదట నిలవలేడు. నాకు శక్త్యాయుధము అక్కరలేదు. గద అక్కరలేదు. ఖడ్గము అక్కరలేదు. నిశితాస్త్రాలు అంతకన్నా అక్కరలేదు. నేను కోపముతో చెలరేగితే దేవేంద్రుణ్ణి అయినా చంపివేయకలను. ఆరాముడు నా పిడికిటిపోటు తాళుకోగలిగితేనే వాడు బాణాలు వదలడమూ అవి వచ్చి నా నెత్తురు తాగడమూ సంభవిస్తుంది.

“రాజా, నేను జీవించి ఉండేటంతవరకూ నీవు దుఃఖపడడము ఎందుకు. బాధపడడము ఎందుకు. నేను నీ శత్రువులను అందరినీ నాశనముచేసి వేయడానికి పోతున్నాను. రాముణ్ణి గురించిన భయము వదిలిపెట్టు. నేను రామలక్ష్మణులనూ సుగ్రీవుణ్ణీ చంపివేస్తాను. అంతటితో ఊరుకోను. రాక్షసులను చంపివేసి లంకాపట్టణాన్ని దహించివేసిన హనుమంతుణ్ణీ మిగతా వానరయోధులనూ రూపుమాపి వేస్తాను. నీకు అసాధారణము అయిన మహాయశస్సు సంపాదించి పెట్టుతాను.

“రాజా, నీకు బ్రహ్మదేవుడి వల్లకానీ దేవేంద్రుడి వల్లకానీ భయము లేకుండా చేసివేస్తాను. నాకు కోపమువస్తే దేవతలను అందరినీ నేలమీద పడకొట్టుతాను. నేను యముణ్ణి అయినా ఎప్పటికి నిద్రలేవకుండా చేసివేస్తాను.

అగ్నిహోత్రుణ్ణి అయినా భక్షించివేస్తాను. నక్షత్రాలతోకూడా సూర్యుణ్ణి నేలమీద పడకొట్టుతాను. సముద్రాన్ని దాహము తాగివేస్తాను. పర్వతాలను చూర్ణము చూర్ణము చేసివేస్తాను. ఈ భూమిని పగులకొట్టివేస్తాను. నేను ప్రాణి కోటిని భక్షిస్తూ ఉంటే బహుకాలము నిద్రపోయిన కుంభకర్ణుడి పరాక్రమము అందరికీ తెలుస్తుంది. ముల్లోకాలూ నా ఆహారానికి చాలవు.

"ఓ అన్నా, నీవు సుఖము అనుభవించవలెను. అందుకోసము ఆ రాముణ్ణి చంపివేయడానికి పోతున్నాను. వాడితోపాటు వాడి తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి చంపివేస్తాను. వానరయోధులను అందరినీ భక్షించివేస్తాను. రాజా, నీ చిత్తము వచ్చినట్టు నీవు ఇక్కడ క్రీడిస్తూ ఉండు. మంచి మద్యము తాగుతూ ఉండు. నీ ఇష్టము వచ్చిన పనులు చేసుకొంటూ ఉండు. దిగులు పడవద్దు. ఇప్పుడే రాముణ్ణి చంపివేస్తాను. సీతాదేవి నీ వశము అవుతుంది. ఆమెతో బహుకాలము సుఖము అనుభవించు" అని చెప్పినాడు.

## ౬౪

రామలక్ష్మణులను చంపివేస్తాను అని చెప్పిన ఆ మహాబలవంతుణ్ని ఆ మహాబాహువును కుంభకర్ణుణ్ని చూచి మహోదరుడు అనే మంత్రి "ఓ కుంభకర్ణుడా, నీవు ఉత్తమ వంశములో పుట్టినావు. కాని ప్రాకృతుడవు. మోటవాడవు. ఏ సమయములో ఏ పని ఎట్లా చేయవలెనో నీకు తెలియదు. రాజుకు నీతులు తెలియక పోలేదు. నీవు అజ్ఞానం వల్లనూ మొరటుతనము వల్లనూ అధిక ప్రసంగము చేసినావు. మనరాజు దేశకాల విభాగము బాగా ఎరిగినవాడు. తన స్థానాన్నీ శత్రువుల స్థానాన్నీ తన వృద్ధిక్షయమునూ శత్రువుల వృద్ధిక్షయాలనూ చక్కగా తెలుసుకొన్నవాడు. బలవంతుడు అయినవాడు. అందులో పెద్దలను ఉపాసించనివాడూ బుద్ధిబలము లేనివాడూ చేయరాదు అనుకొనే పనిని సర్వమూ తెలిసిన పండితుడు ఎందుకు చేస్తాడు. మనరాజు ఏదీ తెలియకుండానూ ఆలోచించకుండానూ చేయలేదు.

"ధర్మార్థకామాలు ప్రత్యేకముగా ఫలాన్ని ఇస్తవి అని నీవు చెప్పినావు. వాటి స్వభావము అది అని నీకు ఎట్లా తెలిసింది. అందుకు ప్రమాణము ఏమిటి. రాజు సీతను ఎత్తుకొని రావడము అధర్మమనీ అందువల్ల ఆయనకు ఇప్పుడు ఈ ఆపద వచ్చింది అనీ నీవు చెప్పినావు. మంచిపని చేస్తే మంచిఫలము వస్తుంది అనీ చెడుపని చేస్తే చెడుఫలము వస్తుంది అనీ నీ అభిప్రాయము అయి ఉండవలెను. అయితే ఈ ప్రపంచములో నీవు చెప్పినట్లు జరగడములేదు. మంచి పనులు చేసినా చెడు ఫలమూ చెడుపనులు చేసినా చెడుఫలమూ అనుభవించడం

చూస్తూనే ఉన్నాము. ఫలప్రాప్తి ఆయా పనులనుబట్టి ఉంటుంది. ధర్మార్థాలను పట్టి సుఖఫలమూ అధర్మానర్థాలను పట్టి దుఃఖఫలము వస్తుంది అనుకోవడము పొరపాటు. ఈ పనికి ఈ ఫలము అనే నియమము ఏమీలేదు. తాను కష్టపడి సంపాదించిన ధనము సుఖఫలాన్ని ఇతరుల దగ్గర దొంగిలించి తెచ్చిన ధనము దుఃఖఫలాన్నీ ఇస్తుందా. అదేవిధముగా తన సొంతభార్యను అనుభవిస్తే సుఖము పరాయివాడి భార్యను అనుభవిస్తే దుఃఖమూ వస్తుందా. అందువల్ల ఏ పనివల్ల సుఖము వస్తుంది అనుకొంటే ఆ పని చేయవలెను. ఇహలోక సౌఖ్యానికీ పరలోక సౌఖ్యానికీ అందరూ ఆయా పనులు చేస్తూవుంటారు. శాస్త్రవిహితము కాని పనులు తమ చిత్తము వచ్చినట్లు చేసినవారున్నా ఈ లోకములో సుఖము అనుభవిస్తున్నారు. అందువల్ల శాస్త్రవిహితము అయిన పనులే సుఖఫలాన్ని ఇస్తవి అనే నియమమూ శాస్త్రనిషిద్ధము అయిన పనులు దుఃఖఫలాన్ని ఇస్తవి అనే నియమమూ లేదు. ధర్మార్థాలకు వలెనే కామానికి కూడా ఫలనియమము లేదు. ఏ పని చేసినా ఒక సమయములో సుఖమూ మరి ఒక సమయములో దుఃఖమూ రావచ్చును. రాముడు జనస్థానములో చేసిన పనినుంచి మనరాజుకు శత్రువు అయినాడు. శత్రువు విషయములో సాహసము చేస్తే తప్పు ఏమీ లేదు. అందువల్ల మనరాజు సీతను ఎత్తుకొని వచ్చినాడు. అందుకు మేము మంత్రులము సమ్మతించినాము.

"ఓ కుంభకర్ణుడా, నీవు ఒంటరిగాపోయి యుద్ధముచేస్తాను అంటున్నావు. అందుకు నీ పరాక్రమమే కారణము అని చెప్పినావు. నీవు చెప్పిన కారణము యుక్తియుక్తముగా లేదు. ఇదివరకు జనస్థానములో మహాబలవంతులు అయిన రాక్షసులను అనేక వేలమందిని రాముడు ఒక్కడే చంపివేసినాడు. అటువంటి వాడితో నీవు ఒంటరిగా ఎట్లా పోరాడుతావు. ఎట్లా జయిస్తావు. జనస్థానములో అంతమంది రాక్షసులను చంపివేసినందువల్లనే రాముడి పేరుచెప్పితే రాక్షసులు అందరూ భయపడుతూఉన్నారు. అది తెలియక రాముడిమీదికి నీవు ఒంటరిగా పోవలెను అనుకొంటున్నావు.

"ఆ రాముడు కుపితసింహమువంటివాడు. నిద్రపోతున్న మహాసర్పమువంటివాడు. ఎప్పుడూ మహాతేజముతో జ్వలించే. అగ్నిహోత్రమువంటివాడు. ఎదిరించ నలవికాని మృత్యువువంటివాడు. అతడికి కోపమువస్తే ఎంతటివాడు అయినా అతనిని తట్టుకొనడము ఉత్తది. ఆ రాముడి ఎట్టఎదట మన ఈ రాక్షస సైన్యము అంతాకూడా నిలవకలదో లేదో సందేహమే. అటువంటివాడిమీదికి ఒంటరిగా పోవడము ఎంతమాత్రమూ పనికిరాదు. మహాబలవంతుడుఅయిన శత్రు

వును అల్పుడు అనుకొని లెక్క చేయకుండా బలహీనుడుపోయి తన ప్రాణాలు పోగొట్టుకోకూడదు.

"ఓ కుంభకర్ణుడా, నీవు రాక్షసులలో మహాబలవంతుడవు కాదు అని ఎవరూ అనడము లేదు, కాని సమస్త మానవులలో రాముడితో సరిసమానము అయిన బలవంతుడూ పరాక్రమవంతుడు మరి ఒకడు లేడు. ఇది నీవు తెలుసుకో. అతడు దేవేంద్రుడివంటి పరాక్రమవంతుడు. సూర్యుడివంటి తేజోవంతుడు. అతడితో నీవు ఒంటరిగా ఎట్లా పోరాడవలెను అనుకొంటున్నావు" అని అడిగి నాడు.

ఈ విధముగా కుంభకర్ణుణ్ణి అడిగి ఆ మహోదరుడు ఆ రాక్షసులు అందరి మధ్యనూ కోపముతో రేగి లోకరావణుడు అయిన రావణుణ్ణి చూచి "రాజా, నీవు సీతాదేవిని తెచ్చుకొన్నావు. ఆమె ఇక్కడనే ఉంది. కాని నీవు ఏమేమో మాట్లాడతావు. నీవు కావలెను అనుకొన్నప్పుడు ఆమె నీవశము అవుతుంది. నాకు ఇప్పుడు ఒక ఉపాయము తోచింది. చెప్పుతాను. నీ స్వబుద్ధితో ఆలోచించు.

"నేనూ ఈ కుంభకర్ణుడూ ద్విజిహ్వుడూ సంహ్రాది వితర్దనుడూ రాముణ్ణి సంహారము చేయడానికి పోవలెను అని నీవు చాటించు. అంతట మేము అయిదు గురమూ పోయి పెద్ద ప్రయత్నముతో యుద్ధము చేస్తాము. రాముణ్ణి మేము జయించేట్లయితే ఏ ఉపాయమూ అక్కరలేదు. పోరాటములో మేము జయించ లేక పోయేట్లయితే నేను ఇప్పుడు చెప్పే ఉపాయము పనిచేస్తుంది.

"మేము మా దేహాలను బాణాలతో భేదించుకొని నెత్తురుతో తడిసి రాముడి పేరు చెక్కిన బాణాలతో ఇక్కడికి వస్తాము. మేము రామలక్ష్మణులను భక్షించి వేసినాము అని చెప్పుతూ నీ పాదాలు పట్టుకొని నమస్కారము చేస్తాము. నీవు అప్పుడు మమ్మలను బహూకరించవలెను. అంతట ఒక రాక్షసుణ్ణి ఏనుగు మీదను ఎక్కించి అయిదుగురు రాక్షసులూ రామలక్ష్మణులనూ వానరులను చంపివేసి నారు అని లంకాపట్టణము అంతటా చాటించేట్లు చేయవలెను. అప్పుడు నీవు నీ సంతోషము ప్రకటించడానికి నీ పరివారానికీ నీ భృత్యులకూ కోరుకొన్న ధనాన్ని భోగద్రవ్యాలనూ ఇవ్వవలెను. యోధులకు పూలదండలూ వస్త్రాలూ వీరాను లేపనాలూ మద్యమూ ఇప్పించవలెను. నీవున్నూ సంతోషముగా మద్యపానము చేయవలెను.

"రాక్షసులు రామలక్ష్మణులను చంపివేసినారు అనే వార్తను బాగా ప్రచారముచేయవలెను. అంతట నీవు సీతాదేవినిచూచి ఊరడించవలెను. ఏకాంత

ముఖ్యం ఆమెకు నీవు మంచిమాటలు చెప్పవలెను. ధనాదులతోనూ రత్నాద్యాభరణాలతోనూ నీవు ఆమెను ప్రలోభ పెట్టవలెను.

"రాజా, ఈ కపటోపాయమువల్ల సీతాదేవి తన భర్త పోయినాడు అని నమ్ముతుంది. ఆమె తన భర్త పోయినాడు అనే దుఃఖమువల్లనూ నీవు ఏమి చేస్తావోను అనే భయమువల్లనూ ఇదివరకు నీ మీద ఇష్టము లేకపోయినప్పటికిన్నీ మరి ఒక దారిలేక నీ వశము అవుతుంది. తన భర్త రాడు అనే నిరాశవల్లనూ స్త్రీ చాపల్యమువల్లనూ సీతాదేవి నీ వశముఅయి తీరుతుంది. ఆమె పుట్టినప్పటినుంచీ ఎంతో సుఖముగా పెరిగింది. ఎప్పుడూ సుఖము అనుభవించవలసిన సీతాదేవి దుఃఖముతో కృశించి కుంగిపోయి ఉంది. అందువల్ల నీ వశము అయ్యేట్లయితే సుఖపడవచ్చును అనుకొని ఆమె నిన్ను ఆశ్రయిస్తుంది. నేను ఆలోచించి చూచినాను. నాకు ఈ ఉపాయము తోచింది. నీవు రాముడి ఎదటికి పోవడము అపాయము. కాబట్టి నీవు యుద్ధానికి పోవద్దు. యుద్ధము చేయకుండానే నీ కోరిక ఇక్కడనే ఈడేరుతుంది. నీవు మహాసుఖము అనుభవించవచ్చును.

"రాజా, నీ సైన్యాలను నాశనము చేసుకోవద్దు. యుద్ధము చేయవద్దు. ప్రాణభయములేదు. శత్రువును జయించు. బహుకాలము మహదైశ్వర్యము అనుభవించు. సుఖముగా ఉండు" అని చెప్పినాడు.

## ౬౫

మహోదరుడు చెప్పిన మాటలు కుంభకర్ణుడు విన్నాడు. అతనిని అటువంటి మాటలు చెప్పవద్దు అని బెదిరించినాడు. అంతట రావణాసురుణ్ణిచూచి "అన్నా, నేను ఇప్పుడే ఆ దురాత్ముణ్ణి రాముణ్ణి వధించి వేస్తాను. నీవు నిర్భయముగా ఉండు. ఇక శత్రువులు లేకుండా నీవు హాయిగా ఉంటావు. వాన కురవని మేఘాలవలె శూరులు వృథాగా గర్జించరు. నేను చెప్పినట్టుగా పోరాడుతాను. నీవు చూస్తావు. శూరులు తమను అవమానించే మాటలు అంటే విని సహించరు. తమను తాము పొగడుకోరు. ఇతరులకు ఎవరికీ చేయనలవికాని పనులుచేసి చూపిస్తారు.

"ఓ మహోదరుడా, నీ వంటి పిరికివాండ్లూ బుద్ధిలేని వాండ్లూ సమస్తమూ తెలిసిన పండితులము అనుకొనే అహంకారులూ చెప్పిన మాటలు విని మా అన్న రాక్షస రాజు రావణాసురుడు ఆపదల పాలు అయినాడు. యుద్ధము అంటే భయపడుతూ ఎప్పుడూ ఇచ్చకాల మారి మాటలు మాట్లాడుతూ రాజు

చెప్పిన ప్రతిదీ బాగుంది అంటూ తిరిగి మీరు సీతాపహరణమూ అందువల్ల యుద్ధమూ తెచ్చి పెట్టినారు. రాజు, మిమ్మలను మిత్రులు అనుకొని నమ్మినాడు. మీరు మాత్రము మిత్రులవలె పయికి నటిస్తూ రాజుమీద మీ మనస్సులో ఉన్న శత్రుత్వమునుంచి అతడు చెప్పిన ప్రతిదానికీ తలలు ఊపి అంతా తారుమారు చేసి వేసినారు. మీ నుంచి సైన్యము అంతా హతము అయిపోయింది. బొక్కసము అంతా క్షీణించి పోయింది. రాజు మిగిలి ఉన్నాడు. లంకాపట్టణము మిగిలి ఉంది. మీ దుర్నయాన్ని సరిచేయడానికి నేను ఇప్పుడు యుద్ధము చేయ వలసి వచ్చింది. శత్రువులను జయించడానికి యుద్ధభూమికి పోతున్నాను" అని చెప్పినాడు.

ఇట్లా ఆ బుద్ధిమంతుడు కుంభకర్ణుడు చెప్పింది విని రావణుడు నవ్వుతూ, "నాయనా, కుంభకర్ణుడా, నీవు యుద్ధవిశారదుడవు. నాకు తెలుసును. ఈ మహోదరుడు రాముడికి భయపడి పోయినాడు. అందువల్ల యుద్ధమువద్దు అంటు న్నాడు. నీ అంతటి బలవంతుడు ఈ లోకములో మరి ఒకడు లేడు. నీ వంటి బంధువూ స్నేహితుడూ నాకు మరి ఒకడు లేడు. నీవు పోయి శత్రువులను వధించు, జయించు. నీవు నా భయము పోగొట్టుతావు అనే నిన్ను నిద్రమేల్కొల్పించినాను. అరిందమా, నా వాళ్లు అయిన రాక్షసులు అందరూ యుద్ధము చేసి నన్ను సంతోష పెట్టడానికి ఇదే సమయము. నాయనా, నీవు నీ శూలము తీసుకో, పాశహస్తుడు అయిన యముడివలె పో. వానరులను అందరినీ వధించు. ఆదిత్య తేజస్సు వంటి నీ తేజస్సుతో దుర్ధర్షుడవు అయి రామలక్ష్మణులను భక్షించు.

"నాయనా, నీవు యుద్ధము చేయవలసిన అవసరమే ఉండదు. నీ మహాదాకారాన్ని చూడగానే వానరులు అందరూ పరుగెత్తి పారిపోతారు. రామలక్ష్మణుల గుండెలు పగిలిపోతవి" అని చెప్పినాడు.

ఈవిధముగా రావణాసురుడు కుంభకర్ణుడితో చెప్పి తాను పునర్జన్మము ఎత్తినట్టు భావించుకొన్నాడు. కుంభకర్ణుడి బలమూ పరాక్రమమూ అతడు బాగా ఎరుగును. అందువల్ల సంతోషముతో స్వచ్ఛచంద్రుడి వలె తేజరిల్లినాడు. ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు అంతట యుద్ధము చేయడానికి బయలు దేరినాడు. అమిత వేగముతో శత్రువుల ప్రాణాలు తీసివేసే శూలాన్ని అందుకొన్నాడు.

ఆ శూలము ఉక్కుతో చేసింది. మేలిమి బంగారు అలంకారాలతో ధగ ధగలాడుతూ ఉంది. ఇంద్రుడు వదిలే పిడుగువలె అది భయంకరము అయింది. వజ్రాయుధమువలె అది కఠినము అయింది. అలంకారముగా కట్టిన పూలదండల

నుంచి మహాతేజముతో నిప్పులు కక్కుతూ ఉన్నట్టుగానూ శత్రు రక్తముతో తడిసి ఉన్నందువల్ల మంటలు మండుతూ ఉన్నట్టుగానూ కనిపించింది. ఆ శూలముతోనూ దేవదానవగంధర్వయక్ష కిన్నరోరగులను అనేకమార్లు అదివరకు కుంభకర్ణుడు చంపి వేసినాడు. ఆ శూలాన్ని తీసుకొని రావణాసురుణ్ణి చూచి, "అన్నా, ఇప్పుడు నేను ఒక్కణ్ణే పోయి పోరాడుతాను. నా సైన్యాన్ని ఇక్కడే ఉండనివ్వు, నా క్రుద్ధరూపాన్ని చూచి ఈ వేళ వానరులు అందరూ వ్యాకుల పడిపోతారు. నేను వాండ్లను అందరినీ భక్షించి వేస్తాను" అని కుంభకర్ణుడు చెప్పినాడు.

ఇట్లా కుంభకర్ణుడు చెప్పింది విని రావణాసురుడు "నాయనా, నీవు సైన్యాలతో కూడా పోవడము మంచిది. శూలాలూ ఇనుప గుదియలూ తీసుకొని సైనికులు నీ వెంట ఉండవలెను. వానరులు అమిత పరాక్రమవంతులు. వేగవంతులు. చక్కని యుద్ధప్రయత్నము చేస్తారు. ఒంటరి వాణ్ణి కానీ ఏమరినవాణ్ణి కానీ వాండ్లు తమ కోరలతో కొరికి చంపివేస్తారు. అందువల్ల నీవు ఎదిరించవలవి కాని మన సైన్యాలను వెంటపెట్టుకొని పో. రాక్షసులకు అపకారము చేసిన శత్రువులను అందరినీ రూపుమాపు" అని చెప్పి సింహాసనము మీది నుంచి లేచి రత్నాలు పొదిగిన బంగారు పూలహారాన్ని కుంభకర్ణుడి మెడలో వేసినాడు అంతే కాకుండా బాహువులకు బాహుపురులూ వేళ్ళకు ఉంగరాలూ చెవులకు తళతళలాడే కుండలాలూ వరాభరణాలూ చంద్రహారాలూ ఇచ్చి దివ్యసుగంధము గుబాళించె పూలదండలు మెడలో వేసినాడు.

అంతట ఆ పెద్ద పెద్ద చెవుల కుంభకర్ణుడు బంగారు బాహుపురులతోనూ అనేక వరాభరణాలతోనూ అలంకరించుకొని వేల్చిన అగ్నిహోత్రము వలె తేజరిల్లినాడు. అమృతమంథన సమయములో వాసుకిని చుట్టిన మందరపర్వతము వలె నల్లటి మెలతాడుతో కనిపించినాడు. ధగ ధగలాడుతూ ఉన్న బంగారు కవచము తొడుగుకొన్నాడు. అది చాలా బరువు అయింది. గట్టిది. పర్వతాలతో కొట్టినా అది పగిలి పోదు. గాలి లోపలికి దూరదు. మంటలు మండుతూ ఉన్నట్టుగా ఉన్న ఆ బంగారు కవచము తొడుగుకొన్న కుంభకర్ణుడు సంధ్యాకాల మేఘాలు కమ్ముకొన్న హిమవత్పర్వతము వలె భాసించినాడు. సమస్తాంగాలకూ పెట్టుకో వలసిన సర్వాభరణాలూ పెట్టుకొన్నాడు. చేతులో శూలము తీసుకొన్నాడు. మూడు అడుగులు వేయడానికి విజృంభించిన శ్రీమన్నారాయణమూర్తి వలె కుంభకర్ణుడు అప్పుడు కనిపించినాడు. ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు అంతట తన అన్నను రావణాసురుణ్ణి కౌగలించుకొన్నాడు. పోరాటానికి పోబోతూ అతనికి ప్రదక్షిణము చేసి సాష్టాంగనమస్కారము చేసినాడు.

పోరాటానికి అట్లా బయలుదేరి పోబోతున్న ఆ మహాకాయుణ్ణి ఆ మహా బలవంతుణ్ణి మహానాదము చేసే ఆ కుంభకర్ణుణ్ణి రావణాసురుడు ఆశీర్వదించి నాడు. అప్పుడు శంఖాలు పూరించినారు. దుందుభులు మోగించినారు. ఆ రథికశ్రేష్ఠుడు కుంభకర్ణుడు అప్పుడు యుద్ధభూమికి ప్రయాణము అయినాడు. అతని రథము వెంట మేఘగంభీరధ్వనులు చేస్తూ రథాలూ ఏనుగులూ గుర్రాలూ వివిధవరాయుధాలూ ధరించిన సైన్యాలూ నడిచినవి. గొడుగు వేసుకొని శూలము చేతిలో పట్టుకొని రక్తగంధము అద్దిన మహాకాయముతో స్వాభావిక మదముతో పోరాటానికి పోతూ ఉన్న ఆ కుంభకర్ణుడిమీద రాక్షసాంగనలు పూల వాన కురిపించినారు.

ఆ కుంభకర్ణుడి వెంట మహానాదాలు చేస్తూ బయలుదేరిన పదాతులు మహా బలవంతులు, భయంకరాకారులు, భయంకర రక్తనేత్రులు, కాటుక రాసుల వంటి మహాకాయులు, వాండ్లు అందరూ శూలాలూ ఖడ్గాలూ పదును పెట్టిన గండ్రగొడ్డళ్ళూ పెద్ద పొడుగాటి ఇనుప గుదియలూ గదలూ ముసలాయుధాలూ లావుపాటి తాటి బోదెలూ సమీపించడానికి అలవి కాని క్షేపణీయాలూ అనే ఆయుధాలూ పట్టుకొని పోయినారు.

అట్లా యుద్ధభూమికి పోతూ ఉన్న ఆ మహాపరాక్రమవంతుడు, మహాబల వంతుడు కుంభకర్ణుడు అప్పుడు తన రూపాన్ని మరింత భయంకరంగా మార్చు కొన్నాడు. ఒండ్లు గగురు పుట్టించే మహాభయంకరము అయిన మహాదాకారము ధరించినాడు. బండి చక్రాలు అంతటి కన్నులతో నూరు ధనుస్సుల వెడల్పునా ఆరునూరు ధనుస్సుల పొడుగునా చెట్లూ చేమలూ తగులబడిపోయిన మహా పర్వతమువలె కనిపించినాడు. నోరు తెరిచి నవ్వుతూ తన వెంట వస్తూఉన్న రాక్షసయోధులతో "ఓ యోధులారా, నాకు ఇప్పుడు చాలా కోపముగా ఉంది. వానర ముఖ్యులనూ వానర సమూహాలనూ అగ్నిహోత్రుడు మిడుతలను వలె నేను ఇప్పుడు రూపుమాపి వేస్తాను. అడవులలో తిరిగే వానరులు నాకు ఏ అపరాధమూ చేయలేదు. పయిగా వానరజాతి వాండ్లు మా వంటి వాండ్ల పురోద్యానవనాలకు అలంకారముగా ఉంటారు. అయితే వానరులు అందరూ లంకా పట్టణాన్ని ముట్టడించినారు. అందుకు కారకులు రామలక్ష్మణులు వాండ్లను ఇద్దరినీ వెంటనే చంపివేస్తాను. వాండ్ల వెంట వచ్చినందుకు వానర వీరులను అందరినీ భక్షించివేస్తాను" అని చెప్పినాడు.

అట్లా కుంభకర్ణుడు చెప్పగానే సంతోషాతిశయముతో రాక్షసులు అందరూ సముద్రము కంపించి పోయేట్టు మహాభయంకరముగా గర్జించినారు.

ఆ ధీమంతుడు అట్లా అనుచరులతో చెప్పి అమిత వేగముతో పోరాటానికి పోతూ ఉంటే ఘోరము అయిన అపశకునాలు అన్ని వైపులా అగుపించినవి. మేఘాలు కంచరగాడిదలవలె ఎర్రటి రంగుతో కనిపించినవి. ఆ మేఘాలలో నుంచి కొరవులు పిడుగుల ధ్వనులతో కింద పడ్డవి. సముద్రముతోనూ వనాలతోనూ భూమి కంపించింది. మహాభయంకరాకారాలతో ఉన్న నక్కలు నోళ్లలో నుంచి మంటలు కక్కుతూ అరిచినవి, పక్షులు బారులుకట్టి అపసవ్యమండలాకారముగా ఆకాశములో తిరుగ సాగినవి. దారిలో గద్దలు పంక్తులు పంక్తులుగా నేలమీద వాలినవి. అప్పుడు కుంభకర్ణుడి ఎడమ కన్నూ ఎడమ భుజమూ అదిరినవి. మంటలు మండుతూ భయంకరధ్వని చేస్తూ ఒక కొరివి ఆకాశమునుంచి పడ్డది. సూర్యుడి కాంతులు మాసిపోయినవి. హాయిగా వీస్తూ ఉన్న గాలి ఆగిపోయింది. ఒండ్లు గగురు పుట్టించే మహోత్పాతాలను యముడు తోసుకొని పోతూ ఉన్నందువల్ల కుంభకర్ణుడు లెక్క చేయలేదు. అంతట అతడు లంకాప్రాకారాన్ని దాటి మేఘసమూహమువలె అద్భుతముగా ఉన్న వానరవాహినిని చూచినాడు.

అప్పుడు ఆ పర్వతాకారుణ్ణి వానరులు అందరూ చూచినారు. గాలి తరుముకొనిపోయే మేఘాలవలె వానరులు అందరూ చెల్లాచెదరు అయి అన్ని దిక్కులా పరుగులెత్త సాగినారు. తనను చూడగానే ఆ ప్రచండవానరవాహిని పరుగులెత్తడము ఆ మహామేఘాకారుడు కుంభకర్ణుడు చూచి సంతోషాతిశయముతో మహామేఘమువలె గర్జించినాడు. ఆ భయంకర సింహనాదానికి మూలము నరికివేసిన ఏపిచెట్టువలె వానరయోధులు అనేక వేలమంది నేలకూలినారు. ఆ మహాకాయుడు కుంభకర్ణుడు లావాటి ఇనుపగుదియ పట్టుకొని ప్రళయకాలములో దండధరుడు అయి కింకరులను వెంటపెట్టుకొని పోయే యముడివలె వానరవాహినీ సమూహాలమీదికి పోయినాడు.

౬౬

అమిత వేగముతో లంకాపట్టణ ప్రాకారము దాటిపోయిన ఆ పర్వతాకారుడు కుంభకర్ణుడు సముద్రము చెలరేగి మహాఘోషము చేస్తూ ఉన్నట్టూ పిడుగులు పడుతూ ఉన్నట్టూ పర్వతాలు అన్నీ పగిలిపోతూ ఉన్నట్టూ మహాభయంకరముగా సింహనాదము చేసినాడు.

దేవేంద్రుడూ వరుణుడూ యముడూ వధించలేకపోయిన ఆ భయంకర శత్రువు తమమీదికి రావడము వానరులు అందరూ చూచినారు, పరుగులెత్తి పారిపోవడము మొదలుపెట్టినారు అట్లా పారిపోతున్న వానరులను అందరినీ

అంగదుడు చూచినాడు. అంతట వారిలో బలవంతులు అయిన నలుణ్ణీ నీలుణ్ణీ గవాక్షుణ్ణీ పిలిచి "ఓ వానరవీరులారా, మీరు అందరూ బలవంతులు, గొప్ప వంశాలలో పుట్టినారు. ఇది ఏమిటి నీచ వానరులవలె మీరు అందరూ ఇప్పుడు ఎక్కడికి పరుగులెత్తుతున్నారు. ఎక్కడికి పారిపోతారు. శూరులకు ప్రాణము కన్నా మానము అధికము, పోరాడటానికి పొండి, ప్రాణాలు కాపాడుకొని ఏమిచేస్తారు. ఇంతకూ ఈ కనపడుతున్నవాడు యుద్ధముచేయడానికి వచ్చిన రాక్షసుడు కాడు. ఇది ఒక బిభీషిక, మనలను ఝడిపించడానికి రాక్షసులు వెంటపెట్టుకొని వచ్చిన ఒక యంత్రము, ఒక పెద్ద బొమ్మ. మనము మన పరాక్రమముతో దీనిని ధ్వంసము చేసివేదాము, బయలుదేరండి, పదండి" అని అంగదుడు చెప్పినాడు.

ఎంతో కష్టముమీద వానరులు అందరూ ధైర్యము తెచ్చుకొన్నారు. అందరూ మెల్లగా ఏకము అయినారు, వృక్షాలూ పర్వతశిఖరాలూ తీసుకొని క్రుద్ధులుఅయి మళ్లీ యుద్ధభూమికి ప్రయాణముఅయి పోయినారు. మదముఎక్కి చెలరేగిన మదపుటేనుగులవలె కుంభకర్ణుడిమీదికి పోయినారు, పొడుగాటి పర్వతశిఖరాలతోనూ పెద్ద రాళ్లతోనూ చావతేలిన చెట్లతోనూ కుంభకర్ణుణ్ణి కొట్టినారు. అందుకు ఆ రాక్షసుడు చలించలేదు. అంతేకాదు, వానరులు విసరి వేసిన పర్వతశిఖరాలూ పెద్ద పెద్ద రాళ్లూ మహావృక్షాలూ ఆ కుంభకర్ణుడి దేహాన్ని తాకి ముక్కలు ముక్కలు అయి నేలమీద పడిపోయినవి.

అంతట కుంభకర్ణుడు కుపితుడు అయిపోయినాడు. అడవిలో చెట్లను అన్నిటినీ కార్చిచ్చు వలె ఆ మహాబలవంతుడు వానరులను అందరినీ చంపి వేయడము మొదలు పెట్టినాడు. ఆ రాక్షసుడి దెబ్బలకు గాయాలు అయి దేహము అంతా నెత్తురుతో తడిసి పోయి ఎంతో మంది వానరులు నేల కూలి ఎర్రటి పూల చెట్లవలె కనిపించినారు. అట్లా దెబ్బలకు నేల కూలకుండా మిగిలి పోయిన వానరులలో కొందరు వెనకకు తిరిగి చూడకుండా ఒకరి మీది నుంచి ఒకరు దూకి పరుగెత్తి పారి పోయినారు. ఆబలవంతుడి దెబ్బలకు ఓర్వ లేక కొందరు వానరులు సముద్రములో పడి పోయినారు. కొందరు సేతువు మీదికి పరుగెత్తినారు, కొందరు ఆకాశానికి ఎగిరి పోయినారు; కొందరు భయముతో ముఖాలు వెల వెల పోతూ మిట్టలకు పరుగులెత్తినారు. కొందరు పల్లాలకు పరుగులెత్తినారు. భల్లూకవీరులు కొందరు చెట్లు ఎక్కినారు. ఆ భల్లూకవీరులలో కొందరు కొండలు ఎక్కినారు. ఆ వానరులలో కొందరు సముద్రములో మునిగి పోయినారు. కొందరు కొండ గుహలలో దాగు కొన్నారు. కొందరు నేల మీద

కూలబడి పోయినారు. కొందరు ఉన్న చోట ఉండ లేక అదే తీరున పరుగెత్తినారు. కొందరు చేష్టలు తప్పి మూర్ఛపోయినారు.

పరాజితులు అయి అట్లా పారిపోతూ వున్న వానరులను అందరినీ అంగదుడు చూచి "ఓ వీరులారా, నిలవండి, పారిపోవద్దు. వెనకకు మళ్ళండి. మనము పోరాడుదాము. మీరు యిట్లా భయపడి పరుగులెత్తి ఈ భూమి అంతా తిరిగినా మీరు బ్రతికి ఉండడానికి ఎక్కడనూ చోటు దొరకదు. తిరిగి రండి. ప్రాణాలు కాపాడుకొన్నందువల్ల ప్రయోజనము ఏమిటి.

"ఓ వీరులారా, ఇదివరకు మీ పరాక్రమాన్ని ఎవరు అడ్డగించ లేదు. ఏ యుద్ధములోనూ మీరు అపజయము ఎరగరు. మీరు యిప్పుడు ఆయుధాలను పార వేసి పారి పోతే మీ భార్యలే మిమ్ములను ఎగతాళి చేస్తారు. పెండ్లాల చేత ఎగతాళి చేయించుకోడము కన్నా యుద్ధములో చచ్చి పోవడమే మేలు. మనము అందరమూ దేవాంశసంభూతులము. నీచులవలె భయపడి మీరు అందరూ ఎక్కడికి పోతారు. మీరు ఇప్పుడు కుంభకర్ణుడికి భయపడి మీ పరాక్రమాన్ని వదిలి పెట్టి పారిపోతున్నారు. అందువల్ల అయోగ్యులు అవుతారు. మీరు ఇదివరకు అందరి ఎదటనూ మేము ఇంత వాళ్లము అంతవాళ్లము అని చెప్పకొన్నారు. ఆ ఆత్మస్తుతులు అన్నీ ఇప్పుడు ఎక్కడికి పోయినవి.

"పరాజితులు అయి ప్రాణాలతో వుండే వారిని అందరూ పిరికిపందలు అని పిలుస్తారు. అట్లా పిలిపించుకొనే కంటే చచ్చి పోవడము మేలు. శూరులూ వీరులూ పోయే దారినే మనమూ పోదాము. మీరు యిప్పుడు భయాన్ని అవతలకు త్రోసి వేయండి. మనము అల్పాయుష్కులము అయి ఒక వేళ యుద్ధములో చచ్చి పోయేట్లయితే సామాన్యులకు ఎవరికీ పోవడానికి వీలులేని బ్రహ్మలోకానికి పోతాము. మనము ఒక వేళ యుద్ధములో జయించేట్లయితే అఖండము అయిన కీర్తి వస్తుంది.

ఓ వీరులారా, మనము ఈ కుంభకర్ణుడివల్ల చచ్చిపోము. మంటలు మండుతూఉన్న అగ్నిహోత్రముమీదికి పోయే మిడుత ప్రాణాలతో తిరిగిపోదు. అదేవిధముగా ఆ రామప్రభువును చూడపోయే వీడు ప్రాణాలతో తిరిగిపోడు.

అంగదుడు ఈవిధముగా చెప్పతూఉండే భయపడిపోయిన వానరులు "ఓ యువరాజా, కుంభకర్ణుడు మమ్ములను ఘోరముగా మర్దించినాడు. మేము నిలవలేము. పోతున్నాము. ఎట్లాగో బ్రతికిఉంటాము" అన్నారు. వానర యోధులు ఇట్లా చెప్పతూ ఉండగా కుంభకర్ణుడు అక్కడ కనిపించినాడు. ఆ భయంకర నేత్రుణ్ణి ఆ భయంకరాకారుణ్ణి చూచి వానరయోధులు పరుగులెత్త

పోయినారు. అంగదుడు అంతట మంచిమాటలతోనూ అనేకదృష్టాంతాలతో ఆ వానరయోధులను అందరినీ పారిపోనీయకుండా చేసినాడు. అప్పుడు వారికి అందరికీ తోడుపడడానికి హనుమంతుడు అక్కడికి వచ్చినాడు. అంతట ఆ వానరయోధులు అందరూ పరమసంతోషముతో సుగ్రీవాజ్ఞను ఎదురుచూస్తూ మళ్లీ యుద్ధసన్నద్ధులు అయినారు.

అప్పుడు హనుమంతునివెంట ఋషభుడూ శరభుడూ మైందుడూ ధూమ్రుడూ నీలుడూ తారుడూ కుముదుడూ సుషేణుడూ గవాక్షుడూ రంభుడూ ద్వివిదుడూ పనసుడూ యుద్ధాభిముఖులు అయినారు.

## ౬౭

ఆ మహాకాయులు వానరవీరులు అందరూ అంగదుని మాటలు విన్నారు. ప్రాణాలు తెగించి యుద్ధముచేయడానికి సంసిద్ధము అయి తమ తమ పరాక్రమాన్ని గురించి చెప్పుకొంటూ పర్వతశిఖరాలూ వృక్షాలూ తీసుకొని ఆ కుంభకర్ణుడి మీదికిపోయి దొమ్మిగా పోరాటము సాగించినారు. ఆ రాక్షసుణ్ణి తరిమివేసినారు.

అప్పుడు ఆ మహాకాయుడు కుంభకర్ణుడు పరమకుపితుడు అయి గద తీసుకొని ఆ వానరయోధులను అందరినీ ఎడా పెడా కొట్టినాడు. ఒక్కొక్క దెబ్బకు వానరయోధులు ఏడు వందలమంది ఎనిమిది వందలమంది వేలకు వేలమందీ వెదచల్లినట్టు నేల కూలినారు. కుంభకర్ణుడు మరింత క్రుద్ధుడు అయినాడు. గరుత్మంతుడు పాములను పట్టుకొని భక్షించేట్టు కుంభకర్ణుడు చేతులుచాచి ఒక్కొక్కసారి ఎనిమిది మందినీ పది మందినీ పదహారు మందినీ పద్దెనిమిది మందినీ ఇరవై మందినీ పట్టుకొని నోట వేసుకొని భక్షించివేస్తూ ఆ యుద్ధభూమిలో విహరించసాగినాడు.

అప్పుడు వానరులు ఎట్లాగో ధైర్యము తెచ్చుకొని అందరూ ఏకము అయి రాళ్లూ చెట్లూ తీసుకొని యుద్ధసన్నద్ధులు అయి నిలచినారు. వానర యూథపతి ద్వివిదుడు ఒక పెద్ద పర్వత శిఖరాన్ని పెల్లగించి చేతులతో పట్టుకొని నేల మీదికి వాలుతూ ఉన్న మేఘమువలె పోయి ఆ పర్వతాకారుడిమీద ఆ పర్వత శిఖరాన్ని విసరి వేసినాడు. అది గురి తప్పిపోయింది. ఆ మహాకాయుడిమీద పడలేదు. అతడి సైన్యముమీద పడ్డది. ఆ పర్వతము అట్లా పడి గుర్రాలూ ఏనుగులూ రథాలూ నుగ్గు నుగ్గు అయిపోయినవి. అనేకమంది రాక్షసయోధులు చితికిపోయినారు. ద్వివిదుడు అప్పుడు మరి ఒక పర్వతాన్ని పెళ్ళగించుకొనిపోయి

కుంభకర్ణుడిమీద మళ్లీ విసరినాడు. అదిన్నీ గురి తప్పిపోయింది. ఆ రాక్షసుడి వెంట ఉన్న సైన్యము మీదనే పడ్డది. అప్పుడు ఆ యుద్ధభూమిలోనుంచి రాక్షసుల రక్తము వెల్లువలు అయి పారింది. రాక్షసరథికులు అంతట ధనుస్సులు మోగిస్తూ అమితవేగముతో మృత్యువు వంటి బాణాలను సింహనాదాలు చేస్తూ ఉన్న వానరయోధులమీద వదిలి వాండ్ల శిరస్సులను ఖండించి వేసినారు. అంతట మహాబలవంతులు అయిన ఆ వానరులు మహావృక్షాలను పెళ్లగించి తీసుకొనిపోయి రాక్షసయోధులనూ వారి గుర్రాలనూ ఏనుగులనూ ఒంటెలనూ రథాలనూ చితుక కొట్టినారు.

ఆ సమయాన హనుమంతుడు ఆకాశమార్గాన పోయి కుంభకర్ణుడి శిరస్సు మీద పర్వత శిఖరాలనూ వివిధ వృక్షాలనూ వానగా కురిపించినాడు. ఆ మహాకాయుడు కుంభకర్ణుడు తన శూలముతో ఆ పర్వతశిఖరాలను భేదించినాడు. ఆ మహావృక్షాలను ఛేదించినాడు. ఆ తీక్ష్ణశూలముతో వానరసైన్యము మీదికి పరుగెత్తినాడు. హనుమంతుడు అంతట పరమ కుపితుడు అయి ఒకపర్వత శిఖరాన్ని తీసుకొని కుంభకర్ణుడికి ఎదురుగుండా పరుగెత్తుకొని పోయినాడు. ఆ పర్వతశిఖరముతో కుంభకర్ణుణ్ని కొట్టినాడు. అప్పుడు ఆ పర్వతాకారుడి మెదడులో నుంచి నెత్తురుకారి అతడి దేహము అంతా తడిసిపోయింది. ఆ రాక్షసుడు అప్పుడు కొంచెము కలవరపడిపోయినాడు. పూర్వము కుమారస్వామి శక్త్యాయుధముతో క్రౌంచ పర్వతాన్ని భేదించినట్టు అప్పుడు కుంభకర్ణుడు కొనలు మంటలు మండుతూనూ మెరుపుతీగవలె తళతళ మెరుస్తూనూ ఉన్న తన శూలాన్ని ఊపి హనుమంతుడి వక్షఃస్థలాన్ని గురిచేసి విసరినాడు. ఆ శూలము దెబ్బకు హనుమంతుడు నోట నెత్తురు కక్కుతూ ప్రళయకాల మేఘము వలె మహా భయంకరముగా గర్జించినాడు. అప్పుడు అతనికి ఒండ్లు తెలియకుండా పోయింది. అట్లా అయిపోయిన హనుమంతుణ్ని రాక్షసయోధులు అందరూ చూచి సంతోషాతిశయముతో సింహనాదాలు చేసినారు.

అప్పుడు ఆ కుంభకర్ణుడికి భయపడి వానరయోధులు అందరూ పరుగులెత్తసాగినారు. వారికి నీలుడు ధైర్యము చెప్పి ఆ వానరయోధులు అందరూ పరుగులెత్తి పారిపోకుండా చేసి ఒక పర్వతశిఖరాన్ని తీసుకొని కుంభకర్ణుడిమీద విసరివేసినాడు. తనమీద పడబోతూవున్న ఆ పర్వతశిఖరాన్ని కుంభకర్ణుడు తన పిడికిటితో ఎదుర్కొన్నాడు. ఆ పిడికిటి పోటుకు ఆ పర్వత శిఖరము పగిలిపోయి అగ్నికణాలు లేస్తూ మంటలు మండుతూ ముక్కలు ముక్కలుగా నేలమీద పడిపోయింది.

అప్పుడు ఋషభుడూ శరభుడూ గవాక్షుడూ గంధమాదనుడూ నీలుడికి అండగా పోయి ఆ అయిదుగురు వానరులూ ఏకము అయి కుంభకర్ణుడి మీదికి పోయినారు. ఆ మహాకాయుడి చుట్టూ పెద్దపులులు వంటి ఆ అయిదుగురు వానరులూ మూగి పర్వతశిఖరాలతోనూ వృక్షాలతోనూ కొట్టినారు. అరచేతులతో చరచినారు. పిడికిళ్లతో పొడిచినారు. గుద్దినారు. అట్లా ఆ వానరవీరులు అన్నివిధాల కొట్టుతూ ఉంటే ఆ మహాకాయుడు తన దేహాన్ని వారు హాయిగా చమురుతూ ఉన్నట్టు నిలుచున్నాడు.

కుంభకర్ణుడు అంతట మహావేగుడు అయిన ఋషభుణ్ణి తన రెండు చేతులూ చాచి పట్టుకొని గట్టిగా అదిమి వేసినాడు. ఆ వానరపుంగవుడు ఋషభుడు అంతట నోట నెత్తురు కక్కుతూ నేల మీద పడిపోయినాడు. ఆ మహాకాయుడు అంతట శరభుణ్ణి పిడికిటితో గుద్దినాడు. నీలుణ్ణి మోకాలితో కుమ్మినాడు. గవాక్షుణ్ణి అరచేతితో చరచినాడు. గంధమాదనుణ్ణి పాదముతో తన్నినాడు. ఆ దెబ్బలకు ఆ వానరవీరులు అయిదుగురు నెత్తురుతో తడిసి మూర్ఛపోయినారు. నరికి వేసిన మోదుగు చెట్లవలె నేలమీద కనిపించినారు. ఆ మహాబలవంతులు వానర వీరులు అట్లా నేల మీద పడి పోవడము చూచి వానరవీరులు వేల కొద్దీ కొండల మీదికి పరుగులెత్తేటట్టు ఆ మహాకాయుడి మీదికి పరుగులెత్తినారు. ఆ మహాకాయుడి మీదికి ఎక్కిన ఆ వానరవీరులు అతనిని గోళ్ళతో గీరినారు. కోరలతో కొరికినారు. పిడికిళ్లతో పొడిచినారు. మోకాళ్ళతో కుమ్మినారు. అన్ని వేల మంది అన్నివిధాల కొట్టినా ఆ రాక్షసవ్యాఘ్రము కుంభకర్ణుడు మహాపర్వతమువలె అచలముగా నిలుచున్నాడు. ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు పరమక్రుద్ధుడు అయి వానరులను పట్టుకొని మింగి వేయడము మొదలుపెట్టినాడు. ఆ మహాకాయుడు పాతాళకుహరము వంటి తన నోటిలో వానరులను వేసుకొని మింగుతూ ఉంటే ఆ వానరులు అందరూ ఆ రాక్షసుడి ముక్కు రంధ్రాలలో నుంచీ చెవులలో నుంచీ బయటికి వెళ్లుకొని వచ్చినారు. అట్లా వానరులు బయటికి వెళ్లుకొని వస్తూ ఉంటే ఆ పర్వతాకారుడికి పట్టరాని కోపము వచ్చింది. అంతట పట్టుకొన్న వానరులను అందరినీ విరిచి వేసి మింగ సాగినాడు. ప్రళయకాలాగ్నివలె చెలరేగి ఆ మహాకాయుడు భూమిని అంతా మాంసమయమూ నెత్తురు మయమూ చేసి వేస్తూ వానరసైన్యములో తిరుగ సాగినాడు.

అప్పుడు ఆ యుద్ధభూమిలో కుంభకర్ణుడు చేతిలో శూలము పట్టుకొని వజ్రాయుధము ధరించిన దేవేంద్రుడి వలెనూ పాశహస్తుడు అయిన యముడి

వలెనూ తేజరిల్లినాడు. ఆ మహాకాయుడు ఎండా కాలములో ఎండిపోయిన అడవులను దహించివేసే అగ్నిహోత్రమువలె ఆ వానరసైన్యాలను రూపుమాపి నాడు. ఆ రాక్షసుడు కుంభకర్ణుడు అట్లా వానరవీరులను సంహారము చేసి వేస్తూ ఉంటే వానరసేనా సమూహాలు అనాయకము అయి పోయినవి. వానరసైని కులు ఇందరూ భయపడి వికృతముగా కేకలు పెట్టుతూ ఏడుస్తూ ఖిన్నులు అయి పోయి రాముడి శరణు చొచ్చినారు.

ఆ మహా సంగ్రామములో వానరయోధులు అందరూ పరాజితులు అయి పోవడము అంగదుడు చూచినాడు. ఆ కుంభకర్ణుణ్ణి వెంబడించిన రాక్షస యోధులు అందరూ భయపడి పోయేట్టు పదే పదే సింహనాదము చేస్తూ అంగ దుడు ఒక పెద్దపర్వతశిఖరాన్ని తీసుకొని కుంభకర్ణుడి మీదికి పరుగెత్తినాడు. ఆ పర్వతశిఖరాన్ని అతడి శిరస్సుమీదికి విసరి వేసినాడు. అది ఆ రాక్షసుడి నెత్తిమీద పడ్డది. ఆ దెబ్బకు కుంభకర్ణుడు కోపముతో మండి పోయినాడు. వానరులు అందరూ భయపడేట్టు కుంభకర్ణుడు పెద్దపెట్టున అరుస్తూ అంగదుడి మీదికి పరుగెత్తినాడు, మహా కోపముతో అంగదుడి మీద శూలము విసరివేసి నాడు. పోరాటములో సమస్తోపాయాలూ తెలిసిన అంగదుడు ఆ శూలము తన మీద పడకుండా తప్పించుకొని చటుక్కున ఎగిరి కుంభకర్ణుడి ఎదురు రొమ్ముల మీద తన అరచేతితో ఇట్టే చరిచినాడు. అంగదుడు అమితకోపముతో చరచిన ఆ చరుపుకు ఆ పర్వతాకారుడు మూర్ఛపోయినాడు. మహాబలవంతుడు అయి నందువల్ల ఇట్టె తెప్పరిల్లినాడు. తెలివి వచ్చింది. ఉత్తరక్షణాన తన కుడిచేతితో అంగదుణ్ణి ఒక గుద్దు గుద్దినాడు. అంగదుడు చేష్టలు తప్పి నేలమీదపడి పోయి నాడు.

అంగదుడు మూర్ఛపోగానే కుంభకర్ణుడు శూలముతీసుకొని సుగ్రీవుడి మీదికి పరుగెత్తినాడు. అప్పుడు ఆ వానరరాజు సుగ్రీవుడు తనమీదికి పరుగెత్తు కొని వస్తూ ఉన్న కుంభకర్ణుణ్ణి చూచి యుద్ధోత్సాహములో ఎగిరి గంతులు వేసినాడు. ఒక పర్వతశిఖరాన్ని తీసుకొని గిరగిర తిప్పుతూ అమితవేగముతో కుంభకర్ణుడికి ఎదురుగుండా పరుగెత్తినాడు. అట్లా పరుగెత్తుకొని వస్తూ ఉన్న సుగ్రీవుణ్ణి చూచి కుంభకర్ణుడు తన సమస్తావయవాలూ విదిలించుకొంటూ నిలు చున్నాడు. వానర రక్తముతో సమస్తాంగాలూ తడిసిపోయి ఉన్న ఆ కుంభ కర్ణుణ్ణి చూచి సుగ్రీవుడు "ఓ రాక్షసుడా, నీవు పరమపరాక్రమవంతులను పడ వేసినావు. ఎవరూ చేయలేని పని చేసినావు. నా సైన్యాలను భక్షించినావు.

అల్లులను ఏమిచేస్తే ఏమి ప్రయోజనము, ఇదిగో, నీవు ఈ ఒక పర్వతము దెబ్బకు ఓర్చుకో" అని చెప్పినాడు.

అట్లా ఎంతో ధైర్యముతో చెప్పిన సుగ్రీవుడి మాట విని పెద్దపులివంటి ఆ కుంభకర్ణుడు "ఓ వానరుడా, నీవు బ్రహ్మదేవుడి మనుమడివి. ఋక్షుజుడి పుత్రుడవు. పరాక్రమానికి ప్రసిద్ధికెక్కినావు. నేను ఎరుగుదును. నీవు ఇప్పుడు ఊరక అరవవద్దు" అన్నాడు.

ఆ మాట వినే వినడముతో చేతిలో ఉన్న పర్వతశిఖరాన్ని సుగ్రీవుడు గిర గిరా తిప్పి కుంభకర్ణుడిమీద విసరి వేసినాడు. అది వజ్రాయుధము వలెనూ పిడుగువలెనూ పోయి కుంభకర్ణుడి విశాల వక్షఃస్థలాన పడి ముక్కలు ముక్కలు అయిపోయింది. ఆ రాక్షసుడి వక్షఃస్థలము చెక్కు చెదరలేదు. అది చూచి వానరయోధులు అందరూ దిగులుపడి పోయినారు. రాక్షసయోధులు అందరూ సంతోషాతిశయముతో సింహనాదాలు చేసినారు. అప్పుడు కుంభకర్ణుడికి పట్టరాని కోపము వచ్చింది. నోరుతెరిచి భయంకరముగా అరిచినాడు. మెరుపు తీగవలె మెరుస్తూఉన్న తన శూలాన్ని గిరగిర తిప్పి సుగ్రీవుడిమీద విసరి వేసినాడు. అప్పుడు హనుమంతుడు చటుక్కున ఎగిరి కుంభకర్ణుడు విసరివేసిన ఆ తీక్ష్ణశూలాన్ని పట్టుకొన్నాడు. వెయ్యి బారువుల ఇనుముతో చేసి బంగారు పొదిగిన ఆ శూలాన్ని హనుమంతుడు తన మోకాలికి ఆనించి రెండు చేతులతో పట్టుకొని విరిచివేసినాడు. అది చూచి వానరయోధులు అందరూ పరమ సంతోషముతో గంతులు వేసినారు. సింహనాదాలు చేసినారు. హనుమంతుణ్ణి స్తోత్రము చేసినారు.

ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు తన శూలాన్ని హనుమంతుడు విరిచి వేయడము చూచి మహోగ్రుడు అయినాడు. ఆ లంకాద్వీపములో ఉన్న మలయపర్వతశిఖరాన్ని పెళ్లగించి తెచ్చి సుగ్రీవుడిమీద విసరి వేసినాడు. ఆ దెబ్బకు సుగ్రీవుడు చేష్టలు తప్పి నేలమీద పడిపోయినాడు. రాక్షసులు అందరూ సంతోషముతో "భళే—భళే" అని కేకలు వేసినారు. అప్పుడు కుంభకర్ణుడు నేలమీద పడిఉన్న సుగ్రీవుడి దగ్గరకు పోయినాడు. ఆ అద్భుత పరాక్రమవంతుణ్ణి ఆ భయంకర పరాక్రమవంతుణ్ణి సుగ్రీవుణ్ణి లేవనెత్తి తన భుజాన వేసుకొని మహామేఘాన్ని ఎత్తుకొనిపోయే ప్రచండవాయువు వలె లంకాపట్టణములోకి పరుగెత్తినాడు. ఆ పర్వతాకారుడు కుంభకర్ణుడు యుద్ధ భూమిలోనుంచి ఆ మహా మేఘాకారుణ్ణి సుగ్రీవుణ్ణి అట్లా మోసుకొని పోతూ ఉంటే మహోన్నత శిఖరముతోఉన్న మేరువు పర్వతము పరుగెత్తుతూ

ఉన్నట్టు తోచింది. అట్లా వానరరాజును ఎత్తుకొని పోతూఉన్న ఆ కుంభకర్ణుణ్ణి చూచి రాక్షసస్త్రీలు అందరూ పొగడినారు. అది చూచి దేవతలు అందరూ ఆశ్చర్యపడ్డారు.

దేవేంద్రుణ్ణి ఎదిరించిన కుంభకర్ణుడు దేవేంద్రుడితో సరిసమానము అయిన సుగ్రీవుణ్ణి ఎత్తుకొనిపోతూ మనస్సులో "ఇంతటివాణ్ణి నేను ఎత్తుకొని పోతూ ఉన్నాను. ఇక రామలక్ష్మణులూ వానరసైన్యమూ నాకు ఒక లెక్కా" అనుకొన్నాడు. కుంభకర్ణుడు సుగ్రీవుణ్ణి ఎత్తుకొనిపోవడము చూచి వానరసైనికులు పరుగులెత్త సాగినారు. అది ఆ మతిమంతుడు హనుమంతుడు చూచి తనలో "నేను ఇప్పుడు ఏమిచేయవలెను. ఏమిచేస్తే బాగుంటుంది. పర్వతాకారుడు అయిన కుంభకర్ణుణ్ణి ఎదిరించి నా పిడికిటిపోట్లతో వాడిదేహాన్ని ఛిన్నాభిన్నము చేసి వానరరాజును విడిపించుకొని రావలెను. అట్లాచేస్తే వానరులు అందరూ సంతోషిస్తారు.

అట్లాకాదు, నేను అట్లాచేయకూడదు. సుగ్రీవుణ్ణి దేవతలూ అసురులూ ఉరగులూ ఏకములయి పట్టుకొన్నా వారిని అందరినీ అతడే తప్పించుకొని రాకలడు. పోరాటములో కుంభకర్ణుడి పర్వతము దెబ్బకు వానరరాజు మూర్ఛపోయినాడు. అందువల్ల ఏమిజరుగుతూ ఉందీ అతడు తెలుసుకోలేక పోయినాడు. కొంచెముసేపటికి అతడికి తెలివివస్తుంది. అప్పుడు అతడు తనకూ వానరులకూ ఏది మేలో అది అతడే ఆలోచిస్తాడు. అతడు మహాయుద్ధము చేసి చూపిస్తాడు. నేను అతడిని విడిపించుకొని వచ్చేట్లయితే ఆ మహాపరాక్రమవంతుడు సుగ్రీవుడు మనస్సులో బాధపడుతాడు. నేను వదిలించుకొని వచ్చేట్లయితే అతడు పరమ పరాక్రమవంతుడు అనే కీర్తి శాశ్వతముగా పాడు అయిపోతుంది. అందువల్ల కొంచెముసేపు కనిపెట్టుకొని ఉంటాను. అతడు ఏమి చేస్తాడో చూస్తాను. అతడు వచ్చేలోపల ఈ వానరసైన్యాన్ని ఓదారుస్తాను," అని ఆలోచించి నిశ్చయించుకొన్నాడు. హనుమంతుడు అంతట వానరసైన్యాలు పారిపోకుండా నిలిపినాడు.

కుంభకర్ణుడు ఆమహాకపిని సుగ్రీవుణ్ణి ఎత్తుకొని పోతూఉంటే లంకాపట్టణములో విమానగృహాలలో నుంచీ గోపురాలలోనుంచీ రాక్షసులు అతని మీద పూలవాన కురిపించినారు. పేలాలు చల్లినారు. పన్నీరువాన కురిపించినారు. ఆ సుగంధానికీ ఆ చల్లదనానికీ కుంభకర్ణుడి భుజానఉన్న సుగ్రీవుడు మెల్ల మెల్లగా తేరుకొన్నాడు. ఆ మహాపరాక్రమవంతుడు సుగ్రీవుడు ఆ లంకాపట్టణ రాజవీథులు చూస్తూ మనస్సులో "నేను ఇప్పుడు ఏమి ప్రతీకారము

చేయవలెను. నేను ఏమిచేస్తే వానరులు సంతోషిస్తారు. ఏమిచేస్తే వానరులకు మేలు అవుతుంది" అని ఆలోచించినాడు, చటుక్కున తన కరుకుగోళ్లతో కుంభకర్ణుడి చెవులు చీల్చివేసినాడు. కోరలతో వాడిముక్కు కటిక్కున కొరికినాడు. అంతటితో వదిలిపెట్టకుండా ఆ పక్కనూ ఈ పక్కనూ కొరికినాడు. కుంభకర్ణుడి చెవులు తెగిపోయినవి. ముక్కు తెగిపోయింది. పక్కలనుంచి కండలు బయటికి వెళ్లుకొని వచ్చినవి. దేహముఅంతా నెత్తురతో తడిసిపోయింది. బాధపడుతూ కోపముతో రేగి కుంభకర్ణుడు సుగ్రీవుణ్ణి నలిపివేస్తూ నేలమీద పడవేసి కొట్టినాడు. నేలమీద పడవేసిన సుగ్రీవుణ్ణి రాక్షసులు అప్పుడు నానావిధాలా కొట్టినారు. ఆ దెబ్బలను సుగ్రీవుడు లక్ష్యపెట్టలేదు. అమిత వేగముతో ఆకాశానికి ఎగిరినాడు. రాముడి దగ్గరకు వచ్చినాడు.

ముక్కూ చెవులూ తెగి పోయిన కుంభకర్ణుడు నెత్తురు కారుతూ సెలఏళ్లు ప్రవహిస్తూ ఉన్న పర్వతము వలె కనిపించినాడు. నల్లటి కాటుకరాశి వంటి ఆ కుంభకర్ణుడు దేహము అంతా నెత్తురుతో తడిసి పోయి సంధ్యాకాల మేఘము వలె తేజరిల్లినాడు. సుగ్రీవుడు తప్పించుకొని పోయినాడు అనే కోపముతో పరమకుపితుడు అయి భయంకరము అయిన ఒక ఇనుప గుదియ తీసుకొని కుంభకర్ణుడు యుద్ధభూమికి పరుగెత్తుకొని వచ్చినాడు. వానర సైన్యములలో చొరపడి ప్రజలను దహించి వేసే ప్రళయకాలాగ్ని వలె వానరసైన్యాలను రూపు మాపి వేయసాగినాడు.

అప్పుడు ఆ కుంభకర్ణుడికి ఆకలి వేసింది. రక్తమాంసాలమీద ఆశ పుట్టింది. రాక్షసులూ వానరులూ పిశాచాలూ భల్లూకవీరులూ అనే భేదము లేకుండా కన పడ్డ ప్రతివాణ్ణీ పట్టుకొని భక్షించి వేయ సాగినాడు. ప్రళయకాలమృత్యువు వలె వానరులూ రాక్షసులూ అనే భేదము లేకుండా పట్టుకొని ఏక కాలన ఒకణ్ణీ ఇద్దరినీ ఎంతెమందిని పడితే అంతమందినీ ఒక చేతితో లాగుకొని నోటిలో వేసుకోడను మొదలు పెట్టినాడు. పర్వత శిఖరాలతోనూ వృక్షాలతోనూ వానరులు ఎంత కొట్టుతూ ఉన్నా బుగ్గలలోనుంచి మేదస్సూ రక్తమూ కారుతున్నా వానరులను ఏడు వందల మందిని ఎనిమిది వందల మందిని ఇరవై వందల మందిని ముప్ఫయి వందల మందిని చేతులతో పట్టుకొని అదిమి వేసి నోటిలో వేసుకొని భక్షిస్తూ పరుగులెత్తినాడు. ఆ కుంభకర్ణుడికి చిక్కకుండా మిగిలిన వానరులు అందరూ పరుగెత్తి పోయి రాముడి శరణు చొచ్చినారు.

అప్పుడు శత్రుసంహారకుడు లక్ష్మణుడు క్రుద్ధుడు అయి పోయి ఆ కుంభకర్ణుడి మీద ముందుగా ఏడు బాణాలు వదిలినాడు. అంతట ఎడ తెగకుండా ఆ

రాక్షసుడిమీద బాణవర్షము కురిపించ సాగినాడు. ఆ బాణాలను లెక్క చేయకుండా ఆ మహాకాయుడు కుంభకర్ణుడు భూమి పగిలి పోయేట్టు అడుగులువేస్తూ రాముడి మీదికి పరుగెత్తినాడు. రాముడు అప్పుడు రుద్రదేవతాకము అయిన అస్త్రాన్ని వింట సంధించినాడు. అందులో నుంచి అప్పుడు అనేక బాణాలు దూసుకొని పోయి కుంభకర్ణుడి ఎదురు రొమ్ములమీద పడ్డవి.

ఆ బాణాల దెబ్బలకు ఆ రాక్షసుడికి అప్పుడు ఒళ్ళు తెలియకుండా పోయింది. వాడిచేతిలో ఉన్న పెద్ద ఇనుపగుదియ జారి నేలమీద పడిపోయింది. బాణాలు గుచ్చుకొని గాయాలు అయినవి. ఆ గాయాలలోనుంచి కారిన నెత్తురుతో ఆ రాక్షసుడి దేహమంతా తడిసిపోయింది. మూర్ఛ తేరుకొన్నాడు. నిరాయుధుడు అయిపోయినట్టు తెలుసుకొన్నాడు. వాడికి కోపము వచ్చింది. అప్పుడు వాడి నోటిలోనుంచి అగ్నిజ్వాలలు వెలువడినవి. వానరులమీదికి పోయినాడు. పిడికిళ్ళతో పొడుస్తూ పాదముతో తన్నుతూనూ పోరాటము సాగించినాడు. ఆ కోపములో వాడికి తనవాండ్లూ పరాయివాండ్లూ అనే జ్ఞానము లేకుండా పోయింది. రాక్షసులు వానరులు అనే భేదము లేకుండా అందరినీ పట్టుకొని చంపివేస్తూ పెద్ద పెద్ద కేకలు పెట్టుతూ ఆ యుద్ధభూమి అంతటా పరుగులెత్తినాడు.

ఆ మహాబలవంతుడు ఆ భయంకర పరాక్రముడు యముడివంటి ఆ కుంభకర్ణుడు అంతట ఒక భయంకర పర్వతశిఖరాన్ని పెళ్ళగించి రాముడిమీద విసరివేసినాడు. రాముడు ఆ పర్వతశిఖరము వచ్చి తనమీద పడేలోపలనే ఏడు బంగారుబాణాలు వదలినాడు. మేరుపర్వత శిఖరమువంటి ఆ పర్వతశిఖరము రెండువందల ముక్కలుగా పగిలి భగభగ మంటలు మండుతూ వానరసైన్యము మీద పడబోతూ ఉంటే రాముడు బాణాలు వదిలి ఆ పర్వతశిలలను చెదరకొట్టి వానరసైన్యాన్ని కాపాడినాడు.

అప్పుడు ఆ కుంభకర్ణుణ్ని చంపివేసే ఉపాయము ఆలోచిస్తూన్న లక్ష్మణుడు రాముణ్ని చూచి "ప్రభూ, ఈ కుంభకర్ణుడు ఇప్పుడు రక్తపానము మత్తులో ఉన్నాడు. వీడు తనవాండ్లు ఎవరో పరాయివాండ్లు ఎవరో తెలుసుకోలేకుండా ఉన్నాడు. రాక్షసులు ఎవరో వానరులు ఎవరో వీడికి ఇప్పుడు తెలియడము లేదు. కాబట్టి వానరయోధులు అందరూ వీడిమీదికి ఎక్కవలెను. వీణ్ని కదలనీయకుండా మెదలనీయకుండా వానర సేనానాయకులు చుట్టూ ముట్టడించవలెను. ఇట్లా చేసేటయితే ఈ దుర్బుద్ధి తనమీదికి యెక్కిన వానరుల బరువు మోయలేక నేలమీద పడిపోతాడు. నేలమీద పడిపోతే వీడు లేవలేడు. కనుక వీడు ఇక వానరులను చంపివేయడము ఆగిపోతుంది" అని చెప్పినాడు.

లక్ష్మణుడు చెప్పిన ఈ మాటలు విని వానరయోధులు అందరూ సంతోషముతో బయలుదేరినారు. వందలకొద్దీ వేలకొద్దీ వానరయోధులు కుంభకర్ణుడి మీదికి ఎక్కినారు. తనమీద అట్లా వానరులు ఎక్కినందుకు కుంభకర్ణుడికి కోపము వచ్చింది. మదముయొక్క చెలరేగిన ఏనుగు మావటివాణ్ని విదలించి వేసేట్టు కుంభకర్ణుడు తనమీదికి యెక్కిన వానరులను అందరినీ విదలించి వేసినాడు.

అది చూచి రాముడు క్రోధతామ్రాక్షుడు అయినాడు. కన్నుల వెంట నిప్పులు రాలుస్తూ కుంభకర్ణుణ్ణి సంహారము చేసివేయడానికి ఉద్యుక్తుడు అయినాడు. మహాసర్పమువంటి అల్లెత్రాడుతో ఉన్న భయంకరము అయిన ధనుస్సు తీసుకొన్నాడు. ఉత్తమోత్తమము అయిన బాణాలతో ఉన్న అంబుల పొదులు కట్టుకొన్నాడు. వానరయోధులకు అందరికీ ధైర్యము చెప్పినాడు. అంతవరకూ భయపడుతూ ఉన్న వానరవీరులు అందరూ అప్పుడు సంతోషపడ్డారు. అంతట ఆ పరమదుర్జయుడు రాముడు లక్ష్మణుణ్ణీ వానరసైన్యాలనూ వెంటపెట్టుకొని కుంభకర్ణుడి మీదికి పోయినాడు.

కోపముతో చెలరేగిన దిగ్గజమువలె అందరి మీదికి పరుగులెత్తుతూనూ రాక్షసులను వెంటపెట్టుకొని క్రుద్ధుడుఅయి వెదికి పట్టుకొన్న వానరులను అందరినీ మర్దించి వేస్తూనూ వాన కురుస్తున్న మేఘమువలె నోట నెత్తురు కారుతూనూ ఆ కారుతూ ఉన్న నెత్తురును నాలుకతో నాకుతూనూ, నెత్తురువంటి నేత్రాలతో చూస్తూనూ ఉన్న ఆ అరిందముణ్ణి సర్వాంగాలూ నెత్తురుతో తడిసిపోయిన ఆ మహాబలవంతుణ్ణి వింధ్య మందర పర్వతాలంత ఎత్తున ఉన్న ఆ మహాకాయుణ్ణి ప్రళయకాలములో సర్వ నాశము చేసి వేసే యముడివలె బంగారు బాహుపురులతో కిరీటముతో ధగధగ లాడుతూ ఉన్న ఆ కుంభకర్ణుణ్ణి రాముడు చూచినాడు.

జ్వలిస్తూ ఉన్న అగ్నిహోత్రమువంటి ఆ రాక్షసుణ్ణి చూచే చూడటముతో ఆ పురుషోత్తముడు రాముడు ధనుష్టంకారము చేసినాడు. ఆ టంకార ధ్వనిని కుంభకర్ణుడు సహించలేకపోయినాడు. కోపముతో రేగి రాముణ్ణి ఎదుర్కొనడానికి పరుగెత్తినాడు. ఆ పర్వతాకారుడు వాసుకీ సర్పమువంటి బాహువులతో గాలి తెరుముకొని వస్తూ ఉన్న మహామేఘమువలె తన మీదికి రావడము చూచి "ఓ కుంభకర్ణుడా, రా, నేను రాముణ్ణి. నీవు దిగులుపడవద్దు. నీవు దేవేంద్రుణ్ణి ఎదిరించినవాడవు అని నాకు తెలుసును. నిన్ను నేను ఇప్పుడే విచేతనుణ్ణి చేసివేస్తాను" అన్నాడు రాముడు.

ఆ చెప్పింది రాముడు అని కుంభకర్ణుడు తెలుసుకొన్నాడు. ఉరుములు ఉరుముతూ ఉన్నట్టు భయంకరముగా వికృతస్వరముతో పకపక నవ్వుతూ వానరుల గుండెలు పగిలిపోయేట్టు రాముడిమీదికి పోయి "ఓరీ, నేను విరాధుడను కాను. ఖరుణ్ణి కాను. మారీచుణ్ణి కాను. కబంధుణ్ణి కాను. కుంభకర్ణుణ్ణి. వచ్చినాను. ఇదిగో ఈ ముద్గరాన్ని చూడు. ఎంతో భయంకరముగా ఉంది. అంతా ఇనుములో చేసింది. నేను ఇదివరకు ఈ ముద్గరముతోనే దేవతలనూ దానవులనూ సంహారము చేసివేసినాను. ఓ రామా, నాకు ముక్కు చెవులూ పోయినందువల్ల తక్కువ వాణ్ణి అనుకోవద్దు. అవి పోయినందువల్ల నాకు ఏమాత్రమూ బాధలేదు. నీ పరాక్రమాన్ని చూపించు. నేను నీ పరాక్రమాన్నీ నీ పౌరుషాన్నీ నిన్నూ భక్షించి వేస్తాను" అన్నాడు.

ఈ మాటలు కుంభకర్ణుడు ముగించే లోపలనే మంచి మంచి రెక్కలతో ఉన్న బాణాలను రాముడు ఆ కుంభకర్ణుడిమీద వదిలినాడు. అవి అమితవేగముతో పోయి ఆ రాక్షసుడి మీద పడ్డవి. అయితే అవి అతనిని ఏమీ చేయలేక పోయినవి. ఆ రాక్షసుడు ఏ మాత్రమూ చలించలేదు. అదివరకు ఆ బాణముతో సప్తతాల వృక్షాలనూ ఛేదించి వేసినాడు. ఆ బాణముతోనే వాలిని చంపివేసినాడు. అది వజ్రాయుధము వంటిది. అవి ఆ కుంభకర్ణుణ్ణి ఏమీ చేయలేక పోయినవి.

రాముడు వదిలిన ఆ బాణాలను అన్నిటినీ కుంభకర్ణుడు తన మీద పడుతూ ఉన్న జలధారలవలె భావించినాడు. చేతిలో ఉన్న ముద్గరాన్ని గిర గిర తిప్పుతూ తనమీద వచ్చి పడుతూ ఉన్న బాణాలను అడ్డగించినాడు. నెత్తురుతో తడిసి ఉన్న ఆ ముద్గరముతోటే అదివరకు ఆ రాక్షసుడు దేవసేనలను నుగ్గు నుగ్గు చేసినాడు. ఆ ముద్గరముతోనే వానరసైన్యాలను మర్దించినాడు.

అప్పుడు రాముడు వాయువ్యాస్త్రాన్ని కుంభకర్ణుడి మీద వదిలినాడు. అది ఆ కుంభకర్ణుడి బాహువును తెగవేసింది. దేహమునుంచి తెగిపోయిన ఆ బాహువు ముద్గరముతో కూడా పోయి వానరసైన్యము మీదపడి వానరసైనికులను చంపివేసింది. చావగా మిగిలిపోయిన వానరులు దిగులుతోనూ భయముతోనూ గజ గజ వణికిపోతూ రామకుంభకర్ణ యుద్ధము చూడడానికి దగ్గరకు పోయినారు.

వాయువ్యాస్త్రానికి ఒక చెయ్యి తెగిపోగానే ఆ పర్వతాకారుడు కుంభకర్ణుడు రెండవ చేతితో ఒక వృక్షాన్ని పెల్లగించినాడు. దానిని పట్టుకొని రాముడి మీదికి పరుగెత్తినాడు. అట్లా సాలవృక్షము పట్టుకొని తనమీదికి పరు

గెత్తుకొని వస్తూ ఉన్న కుంభకర్ణుణ్ణి చూచి రాముడు ఐంద్రాస్త్రముతో బాణాన్ని సంధించినాడు. మహాసర్పము వంటి కుంభకర్ణుడి బాహువును గురి చేసి ఆ బాణాన్ని వదిలినాడు. ఆ బాహువు తెగి గిర గిర తిరుగుతూ పోయి చెట్లనూ పర్వతాలనూ రాళ్లనూ రాక్షసులనూ నలగకొట్టి నేలమీద పడ్డది. రెండు చేతులూ తెగిపోయిన కుంభకరుడు పెద్ద పెద్ద కేకలు పెట్టుతూ రాముడి మీదికి పరుగెత్తిపోయినాడు. అది చూచి రాముడు రెండు అర్ధచంద్రాకారపు బాణాలను తీసి ఆ కుంభకర్ణుడి పాదాలను గురిచేసి వదిలినాడు. ఆ రెండు పాదాలూ తెగి మహాధ్వని చేస్తూ నేలమీద పడ్డవి. ఆ మహాధ్వని దశదిశలానూ పర్వతాలమీదనూ పర్వతగుహలలోనూ మహాసముద్రములోనూ లంకాపట్టణము లోనూ వానరసైన్యాలలోనూ రాక్షససైన్యాలలోనూ మారుమోగింది.

బాహువులు తెగిపోయి పాదాలు తెగిపోయి కుంభకర్ణుడు నోరు తెరిచి బడబాముఖము వలె అరుస్తూ చంద్రుడుమీదికి పోయే రాహువు వలె రాముడి మీదికి పరుగెత్తినాడు. అప్పుడు రాముడు తీక్ష్ణము అయిన ములుకులతోనూ బంగారు రెక్కలతోనూ ఉన్న బాణాలను ఆ కుంభకర్ణుడి నోటినిండా వదిలి నాడు. ఆ అమ్ములతో ఆ తెరిచిన నోరు అంతా నిండిపోయింది. నోట మాట పెగలలేదు. ఎట్లాగో ఒక పెద్ద కేక పెట్టినాడు. మూర్ఛపోయినాడు. అప్పుడు రాముడు సూర్యకిరణాల వలె కన్నులు మిరుమిట్లు కొలిపే ఒక బాణాన్ని తీసి నాడు. అది బ్రహ్మదండము వంటిది. అతి తీక్ష్ణము అయింది. అది వాయు వేగ ముతో పోతుంది. బంగారు రెక్కలు అమర్చిన ఆ బాణము వజ్రాయుధము వంటిది. పిడుగువంటిది. దానిని దేవేంద్రుడు నిర్మించినాడు. ఆ బాణాన్ని రాముడు కుంభకర్ణుడి కంఠాన్ని గురిచేసి వదిలినాడు.

ఆ అమ్ము పొగలతో భగభగమండుతూ ఉన్న మంటలతో దశదిశలా తేజ వల్ల చేస్తూ దేవేంద్రుడి వజ్రాయుధ వేగముతో రాముడి వింటిలో నుంచి దూసు కొని పోయి కుంభకర్ణుడి కంఠము మీద పడ్డది. పూర్వము పురందరుడి వజ్రాయు ధము వృత్రాసురుడి శిరస్సును తెగవేసినట్టు ఆ అమ్ము పర్వతశిఖరము వంటి కుంభకర్ణుడి శిరస్సును తెగవేసింది. వంకరతిరిగిన కోరలతో తళతళలాడే కుండ లాలతో ఉన్న ఆ కుంభకర్ణుడి శిరస్సు పయికి ఎగిరింది. రాత్రిపూట ఆకాశ ములో ఉదయించిన పునర్వసు నక్షత్రాల రెంటిమధ్యను చంద్రబింబము వలె కనిపించింది. అట్లా పయికి ఎగిరిన ఆ కుంభకర్ణుడి శిరస్సు లంకాపట్టణ చర్యా గృహాలనూ పురద్వారాలలోనూ ఎంతో ఎత్తున ఉన్న పట్టణ ప్రాకారాన్ని కొట్టుకొంటూ పోయి నేల కూలింది.

ఆ కుంభకర్ణుడి మొండెము ఎటు ఎగురుతుందో నన్న భయముతో పరుగెత్తుతూ ఉన్న కోట్లకొద్ది వానరులను నేల పడగొట్టింది. పర్వతాకారములో ఉన్న ఆ మొండెము అంతటా సముద్రములో పడ్డది. ఆ మొండెము బరువుకు అప్పుడు సముద్రములో ఉన్న గ్రాహాలూ మత్స్యాలూ సర్పాలూ అణగారి పోయినవి.

ఆ మహాబలవంతుడు కుంభకర్ణుడు హతము అయిపోగానే భూమి చలించింది. పర్వతాలు కదిలినవి. దేవతలు సంతోషాతిశయముతో కోలాహలధ్వనులు చేసినారు.

ఆకాశగతులు అయిన దేవర్షులూ మహర్షులూ పన్నగులూ దేవతలూ భూతగణాలూ యక్షులూ గంధర్వులూ గుహ్యకులూ గరుత్మంతులూ రాముడి పరాక్రమానికి అమితముగా సంతోషించినారు.

కుంభకర్ణుడు హతము అయిపోగానే రాక్షసరాజూ, బంధువులు అందరూ అమితముగా దుఃఖపడ్డారు. దేవాసురయుద్ధములో విష్ణుమూర్తిని చూచి అసురులు భయపడ్డట్టు ఈ వానర రాక్షసయుద్ధములో రాముణ్ణి చూచి రాక్షసులు భయపడిపోయినారు. పెద్ద పెట్టున కేకలు పెట్టుతూ ఏడ్చినారు. దేవాసురయుద్ధములో రాహువు నోటిలోనుంచి బయటపడి దేవలోకములో చీకటిని పోకొట్టిన సూర్యుడివలె ఈ వానరరాక్షసయుద్ధములో కుంభకర్ణుణ్ణి సంహారము చేసి వేసిన రాముడు ఈ భూమిమీద తేజరిల్లినాడు.

ఆ భీమబలుణ్ణి దగ్గరకు పోనలవికాని ఆ పరమ పరాక్రమవంతుణ్ణి రాముడు హతమార్చి వేయగానే వానరులు అందరి ముఖాలూ సంతోషముతో పద్మాలవలె వికసించినవి. వారు అందరూ అప్పుడు రాముణ్ణి పూజించినారు.

దేవసమూహాలను జయించిన మహాబలవంతుణ్ణి మహాయుద్ధాలు ఎన్నో అవలీలగా గెల్చిన ఆ పరమపరాక్రమవంతుణ్ణి కుంభకర్ణుణ్ణి యుద్ధములో చంపి వేసిన రాముడు వృత్రాసురుణ్ణి వధించిన దేవేంద్రుడివలె సంతోషపడ్డాడు.

## ౬౮

మహాపరాక్రమవంతుడు రాముడు కుంభకర్ణుణ్ణి చంపివేసినాడు అని చెప్పడానికి రాక్షసులు తమ ఏలిక దగ్గరకుపోయి "రాజా, కాలాంతకుడువంటి కుంభకర్ణుడు వానర సైన్యాలను పరుగులెత్తించినాడు. అనేకమంది వానర వీరులను భక్షించి వేసినాడు. ఒక కొంచెముసేపు వానరులను అందరినీ తాపము ఎత్తించినాడు. కాలకర్మమువల్ల కాలము చేసినాడు. గాని పరాక్రమానికి గురి

అయినాడు. ఆ పర్వతాకారుడి కంఠము తెగిపోయింది. ఎంతో నెత్తురు కారుతూ మొండెము సముద్రములో పడ్డది. బాహువులు తెగిపోయినవి. తొడలు తెగి పోయినవి. శిరస్సు భయంకరముగా లంకాపట్టణ ద్వారములో అడ్డముగా పడ్డది. రామబాణాలకు కుంభకర్ణుడు కార్చిచ్చుకు కాలి పోయిన చెట్టు వలెనూ ముద్ద అయి పోయిన కొండచిలువ వలెనూ వికృతముగా కనిపించినాడు" అని చెప్పినారు.

మహాబలవంతుడు కుంభకర్ణుడు యుద్ధములో చనిపోయనాడు అని చెప్పగానే రావణాసురుడు దుఃఖముతో తపించి పోయినాడు. మూర్ఛ పోయినాడు. నేలమీద పడిపోయినాడు.

దేవాంతకుడూ నరాంతకుడూ త్రిశిరుడూ అతికాయుడూ తన పినతండ్రి చనిపోయినాడు అని వినగానే పట్టరాని దుఃఖము వచ్చి ఆవురున ఏడ్చినారు.

మహోదరుడూ మహాపార్శ్వుడూ తమ తోబుట్టువును రాముడు చంపి వేసినాడు అని చెప్పగానే దుఃఖ సముద్రములో మునిగి పోయినారు.

రావణాసురుడు ఎంతో కష్టముమీద మూర్ఛ తేరుకొన్నాడు. కుంభకర్ణుడు చచ్చిపోయినందువల్ల దీనుడు అయిపోయి ఏడుస్తూ "అయ్యో, వీరుడా, నీవు శత్రువుల గర్వాన్ని అణిచి వేసినావు. నీవు మహాబలవంతుడవు. ఓ కుంభకర్ణుడా, నన్ను వదిలిపెట్టి దైవవశము వల్ల నీవు యమసదనానికి పోయినావు. మహా బలవంతుడా, నివు ఒంటరిగా పోయినావు. శత్రుసైన్యాలను తాపము ఎత్తించినావు. నా దుఃఖాన్నీ బంధువుల దుఃఖాన్నీ పోగొట్టకుండానే నన్ను వదిలిపెట్టి పోయినావు. నిన్ను అండగా చేసుకొన్నందువల్లనే నేను సురాసురలకు భయపడలేదు. నీవు నాకుడిభుజానివి. నీవు ఇప్పుడు లేకుండా పోయినావు. కాబట్టి నేనూ ఉన్నా లేనట్టేను."

నీవు దేవదానవుల గర్వాన్ని అణచివేసినావు. ప్రళయకాలాగ్ని వంటి వాడవు. రుద్రుడి వంటివాడవు. నాయనా, నిన్ను యుద్ధములో రాముడు ఎట్లా చంపివేయ కలిగినాడు. వజ్రాయుధము దెబ్బ నిన్ను ఏమీ చేయలేక పోయిందే అటువంటి నీవు ఎట్లా రామబాణార్తుడవు అయి నిద్రపోతున్నావు.

"తమ్ముడా, దేవగణాలు మహర్షులతో కూడా ఆకాశములో నిలుచుని యుద్ధములో నీవు చనిపోవడము చూచి "భలే - భలే" అని కేకలు వేసినారు. ఇప్పుడు వానరులు అందరూ సంతోషిస్తున్నారు. వాండ్లకు సందు దొరికింది ఇంతవరకూ చొరనలవి కాకుండాఉన్న ఈ లంకాపట్టణ ద్వారాల మీదికి ఇప్పుడే తప్పకుండా వాండ్లు అందరూ ఎక్కుతారు.

"తమ్ముడా, నాకు ఇక రాజ్యముతో పనిలేదు. సీతను ఇక నేను ఏమి చేసుకొంటాను. నీవులేకుండా జీవించి ఉండడము నాకు ఇష్టములేదు. నిన్ను చంపివేసిన రాముణ్ణి నేను యుద్ధములో వధించలేక పోయేట్లయితే బ్రతికిఉండడముకన్నా చచ్చిపోవడమే మంచిది. జీవించిఉండడము నిరర్థకము. తమ్ముడా, నేనూ నీవు ఉన్నచోటికే వస్తాను. నిన్ను వదిలిపెట్టి ఒక క్షణము అయినా బ్రతికి ఉండడము నాకు ఇష్టములేదు. తమ్ముడా, నేను ఇదివరకు దేవతలకు అపకారము చేసినాను. వారు ఇప్పుడు నన్ను చూచినవ్వుతారు. ఓ కుంభకర్ణుడా నీవు చనిపోయినావు. నేను ఇకను దేవేంద్రుణ్ణి ఎట్లా జయిస్తాను.

"ఆ పూజ్యుడు విభీషణుడు చెప్పిన మాటలు నేను నా అజ్ఞానమువల్ల వినలేదు. అతడు చెప్పినట్లు చేసి ఉన్నట్లయితే శుభములయ్యేవి. ప్రహస్తుడూ కుంభకర్ణుడూ దారుణముగా చనిపోయినారు. వారి చిత్రవధవిన్నప్పటి నుంచీ విభీషణుడు చెప్పిన మాటలు జ్ఞాపకము వస్తూఉన్నవి. నాకు సిగ్గు వేస్తూ ఉంది. విభీషణుడు ధార్మికుడు. అతణ్ణి నేను వెళ్ళగొట్టినాను తమ్ముణ్ణి వెళ్ళగొట్టడము కన్నా పాపకర్మము మరి ఒకటిలేదు. ఆ పాపకర్మ పరిపాకమే ఈ దుఃఖము" అనుకొంటూ ఆ పదిముఖాలవాడు రావణాసురుడు దేవేంద్రుణ్ణి ఎదిరించిన తన తమ్ముడు కుంభకర్ణుడు చచ్చిపోయినందుకు వ్యాకుల పడిపోయి దీనుడు అయి ఏడ్చినాడు. ఆ దుఃఖము భరించలేక మూర్ఛ పోయినాడు.

## ౬౯

శోకముతో తపించిపోతూ విలపిస్తూవున్న రావణాసురుణ్ణి త్రిశిరుడు చూచి "రాజా, నీవు చెప్పినట్టు మా పినతండ్రి కుంభకర్ణుడు మహా పరాక్రమవంతుడే, సందేహము లేదు. అయితే దైవవశమువల్ల హతుడు అయిపోయినాడు. నీవంటి పెద్దలు, అందులో నీవంటి ధైర్యవంతులు విలపించరు. ప్రభూ, నీవు ఒక్కడివే త్రిభువనాలను అయినా జయించివేయగలవు. అటువంటి నీవు ఇప్పుడు ఒక అల్పుడివలె ఎందుకు దుఃఖపడతావు. నీకు బ్రహ్మదేవుడు ఇచ్చిన శక్త్యాయుధమూ కవచమూ బాణమూ ధనుస్సూ మేఘ గంభీరధ్వనులు చేస్తూ వెయ్యి కంచరగాడిదలు లాగుకొనిపోయే రథమూ ఉన్నవి. రాజా, నీవు ఒకప్పుడు ఏ ఆయుధమూ లేకుండా దేవతలనూ దానవులనూ జయించినావు. ఇప్పుడు నీకు సమస్తాయుధాలూ ఉన్నవి ఆ రాముణ్ణి జయించడము నీకు ఒక లెక్కా.

"రాజా, నీవు యథేష్టముగా ఇక్కడనే ఉండు. నేను పోయి పోరాడుతాను. గరుత్మంతుడు పాములను పట్టుకొని చంపివేసేట్టు నేను నీ శత్రువులను

పట్టుకొని చంపివేస్తాను. దేవేంద్రుడు శంబరాసురుణ్ణి వధించినట్టూ విష్ణుదేవుడు నరకాసురుణ్ణి వధించినట్టూ యుద్ధములో నేను రాముణ్ణి వధించివేస్తాను" అని చెప్పినాడు.

ఈ విధముగా త్రిశిరుడు చెప్పినమాటలు రావణాసురుడు విన్నాడు. కాలము మూసించుకొని వస్తూ ఉన్నందువల్ల తాను పునర్జన్మము యెత్తినట్టుగా సంతోషముతో ఉప్పొంగిపోయినాడు.

అప్పుడు దేవాంతకుడూ నరాంతకుడూ అతికాయుడూ త్రిశిరుడి మాటలు విని "మేము యుద్ధము చేస్తాము" అంటే "మేము యుద్ధము చేస్తాము" అంటూ గర్జించినారు. రావణాసురుడి ఆ నలుగురు పుత్రులూ వీరులు. దేవేంద్రుడితో సరిసమానము అయిన పరాక్రమవంతులు. నలుగురూ మాయావిశారదులు. ఆకాశములోకి పోయి యుద్ధము చేస్తారు. నలుగురూ దేవతల దర్పాన్ని అణచి వేసినారు. పోరాటములో జయించ నలవికానివాండ్లు. మహాబలవంతులు అని ప్రసిద్ధి కెక్కినారు. ఆ నలుగురినీ. గంధర్వులూ కిన్నరులూ మహోరగులూ దేవతలూ ఏకము అయినప్పటికిన్నీ జయించలేరు. నలుగురూ ప్రజ్ఞావంతులు. బ్రహ్మాది దేవతలను మెప్పించి నలుగురూ వరాలు సంపాదించినారు. ఆ సూర్యసమాన వర్చస్కులతో శత్రువులను మర్దించివేసే ఆ నలుగురు పుత్రులతో రాక్షసరాజు రావణాసురుడు దానవుల గర్వము అణచి వేసిన దేవేంద్రుడి వలె తేజరిల్లినాడు.

రావణాసురుడు అప్పుడు ఆ నలుగురు పుత్రులనూ కౌగలించుకొన్నాడు. ఆభరణాలతో వారిని అలంకరించినాడు. ఆశీర్వదించినాడు. పోరాటానికి పొమ్మని ప్రోత్సాహము చేసినాడు. ఆ కుమారులను కాపాడడానికి తన తమ్ములను మహోదరుణ్ణి మహాపార్శ్వుణ్ణి వెంట యుద్ధభూమికి పొమ్మని చెప్పినాడు.

అప్పుడు ఆ మహాధైర్యవంతుడికి శత్రువులను గగ్గోలుపరిచే ఆ రావణాసురుడికి ఆ మహాకాయులు ప్రదక్షిణ నమస్కారాలు చేసి యుద్ధభూమికి ప్రయాణము అయినారు. శత్రువుల ఆయుధాల దెబ్బలు తమను బాధపెట్టకుండా ఉండడానికి వారు ఓషధులగంధము ఒంటికి పూసుకొన్నారు. కాలము ముగించుకొని వస్తూ ఉన్నందువల్ల ఆ మహాబలవంతులు ఆరుగురూ మహోత్సాహముతో యుద్ధభూమికి అంతట బయలుదేరినారు.

మహోదరుడు సుదర్శనము అనే నీలమేఘమువంటి ఐరావతజాతి ఏనుగును ఎక్కినాడు. సమస్తాభరణాలతోనూ అలంకరించిన ఆ మదపుటేనుగు మీద సమస్తాయుధాలతోనూ అమ్ముల పొదులతోనూ కూర్చున్న ఆ మహోదరుడు అస్తగిరి

మీద సూర్యుడివలె కనిపించినాడు. సమస్తాయుధాలతోనూ రథముమీద ధనుర్ధరుడు అయి కూర్చున్న త్రిశిరుడు పర్వతశిఖరముమీద ఇంద్రధనుస్సుతోనూ కొరవులతోనూ తేజరిల్లే మహామేఘమువలె కనిపించినాడు. మూడు తలల కిరీటము పెట్టుకొని రథముమీద కూర్చున్న ఆ త్రిశిరుడు మూడు బంగారు శిఖరాలతో ధగధగలాడే హిమవంతుడివలె తోచినాడు. మేటి విలుకాడూ మహాపరాక్రమవంతుడూ అయిన అతికాయుడు మంచి చక్రాలతోనూ గట్టి ఇరుసుతోనూ చక్కని నొగతోనూ ఉన్న రథము యెక్కి అమ్ముల పొదులతోనూ తళ తళ మెరుస్తూ ఉన్న ఈటెలతోనూ ఖడ్గాలతోనూ ఇనుప గుదియలతోనూ కూర్చున్నాడు. దేదీప్యమానము అయిన కిరీటముతోనూ బంగారు ఆభరణాలతోనూ ధగధగలాడుతూ ఆ రథముమీద కూర్చున్న అతికాయుడు మేరుపర్వతము వలె భాసించినాడు. ఆ మహాబలవంతుడు అతికాయుడు చుట్టూ ఉన్న పెద్దపులుల వంటి రాక్షస వీరులతో దేవతల మధ్యను దేవేంద్రుడివలె తేజరిల్లినాడు. బంగారు ఆభరణాలతోనూ మహాకాయముతోనూ అమిత వేగముతోనూ పోయే శ్వేతాశ్వముమీద నరాంతకుడు ఎక్కినాడు. ఉచ్చైఃశ్రవమువంటి ఆ శ్వేతాశ్వముమీద కొరవివంటి ఈటె పట్టుకొని కూర్చున్న నరాంతకుడు నెమలి వాహనముమీద శక్త్యాయుధము పట్టుకొనిపోయే కుమారస్వామివలె కనిపించినాడు. మహాకాయుడూ మహాపరాక్రమవంతుడూ అయిన మహాపార్శ్వుడు గదను పట్టుకొని యుద్ధభూమిలో గదాపాణి అయిన కుబేరుడివలె తోచినాడు. అప్రతిమాన సైన్యాలతో అమరావతీ పట్టణమునుంచి బయలుదేరిపోయే దేవతలవలె అప్రతిమాన సైన్యాలతో లంకాపట్టణమునుంచి ఆ రాక్షసవీరులు యుద్ధభూమికి బయలుదేరినారు. రాక్షసయోధులు ఉత్తమాయుధాలతో ఏనుగుల మీదనూ గుర్రాల మీదనూ మేఘగంభీరధ్వనులు చేస్తూ నడిచే రథాల మీదనూ బయలుదేరినారు. ఆ సూర్యవర్చస్కులు ఆ కిరీటకుండలధరులు రాక్షసరాజు నల్గురు కుమాళ్లూ ఆకాశములో గ్రహాలవలె తేజరిల్లినారు. ఆ రాకుమారులు పట్టుకొని పోతూ ఉన్న ఆయుధాలపంక్తి తళతళలాడుతూ శరత్కాలస్వచ్ఛాకాశములో హంసల పంక్తులవలె తోచినవి.

ఆ రాక్షసవీరులూ ఆ రాక్షసయోధులూ ఆ యుద్ధములో శత్రువులను జయించవలెను లేదా తాము చచ్చి అయినా పోవలెను అని మతిస్థిరము చేసుకొన్నారు. అట్లా యుద్ధము చేయవలెను అనే మదముతో మహోత్సాహముతో పోరాటానికి సాగిపోతూ ఉరుములు ఉరిమినట్టు భయంకరముగా సింహనాదాలు చేసినారు. శత్రువులను గురించి నిందావాక్యాలు పలుకుతూనూ ధనుస్సులు

మోగిస్తూనూ నడిచినారు. ఆ రాక్షసయోధుల అరుపులకూ వాండ్ల భుజాస్ఫాలన ధ్వనులకూ అప్పుడు భూమి చలించి పోతున్నట్టుగానూ వాండ్ల సింహనాదాలకు ఆకాశము పగిలి పోతున్నట్టుగానూ తోచింది. ఆ మహాబలవంతులు రాక్షస వీరులు అట్లా పరమసంతోషముతో లంకాపట్టణమునుంచి యుద్ధభూమికి పోయి నారు. అక్కడ మహావృక్షాలూ పర్వత శిఖరాలూ పట్టుకొని యుద్ధసన్నద్ధము అయి ఉన్న వానరసైన్యాన్ని రాక్షస వీరులు చూచినారు.

ఆ రాక్షససైన్యము గుర్రాలతోనూ ఏనుగులతోనూ రథాలతోనూ కిటకిట లాడుతూనూ ఆ గుర్రాలకూ ఏనుగులకూ రథాలకూ కట్టిన ఘంటల మోతలు మోగుతూనూ గజ్జల చప్పుళ్లు చేస్తూనూ రావడము వానరయోధులు అందరూ చూచినారు. ఏనుగులమీద ఉన్న రాక్షసయోధులు నీలమేఘాల వలెనూ ఆయు ధాలధరించిన రాక్షసయోధులు మంటలు మండుతూ ఉన్న అగ్ని హోత్రాల వలెనూ గ్రీష్మకాల సూర్యునివలెనూ కనిపించినారు. ఆ రాక్షససైన్యము అట్లా తమ మీదికి రావడము చూచి ఆ మహాబలవంతులు వానరయోధులు అందరూ తమ పరాక్రమము చూపించే అవకాశము వచ్చింది అని సంతోషపడ్డారు. పర్వత శిఖరాలు తీసుకొని సింహనాదాలు చేసినారు. రాక్షసయోధులను చూచి వానరయోధులు ఓర్వ లేక గర్జించ సాగినారు వానర సేనాసమూహాల భయంకర సింహనాదాలను వినీ వారి సంతోషాతిశయాన్ని చూచీ ఆ మహాబలవంతులు రాక్షసయోధులు సహించలేక మరింత భయంకరముగా సింహనాదాలు చేసి నారు. వానరసేనా నాయకులు పర్వతశిఖరాలు తీసుకొని మహాభయంకరము అయిన ఆ రాక్షససైన్యములో చొరపడ్డారు. పర్వతాకారులు అయిన ఆ వానర యోధులు పట్టుకొని పోయిన పర్వతశిఖరాలతో పెద్ద పెద్ద శిఖరాలు ఉన్న పర్వ తాలుగా కనిపించినారు. వృక్షాలూ శిలలూ ఆయుధాలుగా పోరాడే ఆ వానర యోధులు కోపముతో చెలరేగినారు. కొందరు వానరులు ఆకాశానికి ఎగిరి పోయినారు. కొందరు భూమి మీదనే ఆ రాక్షససైన్యాన్ని ఎదిరించినారు. లావాటి బోదెలతో ఉన్న వృక్షాలు పట్టుకొని ఆ రాక్షససైన్యములో తిరగ సాగినారు.

ఆ యుద్ధభూమిలో కిక్కిరిసి ఉన్న రాక్షసయోధులకున్నూ వానరయో ధులకున్నూ అప్పుడు భయంకరము అయిన పోరాటము ఆరంభము అయింది. రాక్షసవీరులు బాణాలతో అడ్డగిస్తూ ఉన్నప్పటికిన్నీ వానరులు భయంకరము అయిన పరాక్రమముతో అనుపమానముగా వృక్షాలూ పర్వతశిఖరాలూ వానగా రాక్షసయోధుల మీద కురిపించినారు. రాక్షసులూ వానరులూ

భయంకరముగా పోరాటము సాగిస్తూ సింహనాదాలు చేసినారు. వానరయోధులు కొందరు రాళ్ళతో రాక్షసయోధులను చితుక కొట్టినారు. కొందరు వానర యోధులు కవచాలతోనూ ఆభరణాలతోనూ ఉన్న రాక్షసులను కొట్టినారు. కొందరు వానరులు రథాల మీదనూ గుర్రాలమీదనూ ఏనుగుల మీదనూ ఉన్న రాక్షసులను కొట్టినారు. కొందరు పైకి ఎగిరి కిందఉన్న రాక్షసయోధులను కొట్టినారు. ఆ పోరాటములో రాక్షసులు పర్వతాల దెబ్బలకు పడి పోయినారు. కొందరు రాక్షసులు వానరుల పిడికిలి పోట్లకు కనుగుడ్లు బయటికి వెళ్లుకొని వచ్చి తిరుగుతూ నేల కూలినారు. కొందరు రాక్షసయోధులు అరిచినారు.

రాక్షసులున్నూ వానరులను బాణాలతో ఒళ్లు బద్దలు కొట్టినారు. శూలాలతో కొందరు వానరులను పొడిచివేసినారు. ఇనుపగుదియలతో కొందరు వానరులను పడకొట్టినారు. ఈటెలతో కొందరు వానరులను చంపివేసినారు. ఖడ్గాలతో కొందరు వానరులను తెగవేసినారు. శక్త్యాయుధాలతో కొందరు వానరులను సంహరించినారు.

పరస్పరజయైషిణులు అయి వానరులూ రాక్షసులూ పోరాడుతూ దేహాలు నెత్తురుతో తడిసిపోయి ఒకరి నొకరు నేలమీద పడ తోసుకొన్నారు. వానరులు కొట్టిన వృక్షాలతోనూ పర్వత శిఖరాలతోనూ రాక్షసులు ఉపయోగించిన ఖడ్గాద్యాయుధాలతోనూ అప్పుడు ఆ యుద్ధభూమి అంతా నిండి పోయింది. అచిరకాలములో ఆ యుద్ధభూమిలోనుంచి నెత్తురు వరదలు అయి పారింది. శత్రుసంహారము చేయవలెను అనుకొని యుద్ధమదముతో వచ్చిన రాక్షసులు అనేకమంది పర్వతాకారులు వానరులచేత చచ్చి నేలకూలి పగిలి పోయిన పర్వతాలవలె కనిపించినారు.

ఆ పోరాటములో వానరయోధులు రాక్షసయోధులను పడలాగినారు. అట్లా పడలాగుతూఉంటే రాక్షసయోధుల చేతులలోఉన్న శూలాద్యాయుధాలు విరిగిపోయినవి. ఆయుధాలు విరిగి పోయినప్పటికిన్నీ అనేకమంది అతిమునూ అయిపోతూ ఉన్నప్పటికిన్నీ రాక్షసయోధులు తమ కరచరణాద్యాయుధాలతో మహాద్భుతముగా పోరాటము సాగించినారు. ఆ రాక్షసయోధులు తమచేత చిక్కిన వానరయోధులను పట్టుకొని గిర గిర తిప్పుతూ తిప్పుతూ ఉన్నవారితో తక్కిన వానరయోధులను కొట్టి చంపివేసినారు. అదేవిధముగా వానరయోధులున్నూ రాక్షసయోధులను పట్టుకొని గిర గిర తిప్పి తిప్పుతూ ఉన్నవారితో తక్కిన రాక్షసయోధులను కొట్టి చంపివేసినారు. ఆ విధముగా వానరయోధు

లను వానరయోధుల చేతనూ రాక్షసయోధులను రాక్షసయోధుల చేతనూ చంపించినారు. రాక్షసయోధులు ఆ పోరాటములో వానరయోధుల చేతులలో ఉన్న పర్వతశిఖరాలనూ వృక్షాలనూ ఊడలాక్కొని వానరులను కొట్టి చంపివేసినారు. అదే విధముగా రాక్షసుల చేతులలో ఉన్న ఆయుధాలను వానరయోధులు ఊడలాక్కొని రాక్షసులను కొట్టి చంపివేసినారు. వానరులు రాక్షసులను రాళ్లతో కొట్టి వాళ్ల దేహాలు గాయాలు అయి పడిపోగానే సింహనాదాలు చేసినారు. అదేవిధముగా రాక్షసులు శూలాద్యాయుధాలతో వానరులను కొట్టి వాండ్ల దేహాలు గాయాలుఅయి పడిపోగానే సింహనాదాలు చేసినారు. ఆ పోరాటములో వానరులు కొట్టిన దెబ్బలకు రాక్షసుల కవచాలు తెగి కత్తివాట్లకు చెట్లనుంచి పాలుకారేట్టు దేహాలనుంచి నెత్తురు కారింది. ఆ పోరాటములో కొందరు వానరులు రథాలతో రథాలనూ ఏనుగులతో ఏనుగులనూ గుర్రాలతో గుర్రాలనూ అత్యద్భుతముగా కొట్టించినారు. వానరులు అందరూ పరమ సంతోషముతో కఠినశిలలూ పెద్ద పెద్ద చెట్లూ తీసుకొని కొట్టి రాక్షసయోధులను చంపి వేసినారు. ఆ యుద్ధము పరమ భయంకరముగానూ దొమ్మిగానూ జరిగింది.

రాక్షసులు కరుకు అయిన అర్ధచంద్రాకారపు బాణాలతోనూ పదును అయిన బల్లెములతోనూ ఇంకా వివిధాయుధాలతోనూ వానరులను కొట్టి చంపి వేసినారు. వానరులు తీసుకుని పోయిన చెట్లనూ పర్వతశిఖరాలనూ ముక్కలు ముక్కలు చేసి వేసినారు. ఆ యుద్ధ భూమిలో పగిలి పోయిన పర్వత శిఖరాలూ ముక్కలు ముక్కలు అయి పోయిన మహావృక్షాలూ చచ్చి పడి పోయిన రాక్షసుల కళేబరాలూ వానరుల కళేబరాలూ రాశులు రాశులుగా పడిపోయి నడవడానికి దారి లేకుండా పోయింది. ఆ మహాసత్త్వసంపన్నులు వానరులు అందరూ సంతోషముతోనూ గర్వముతోనూ నిర్భయముగా వానర చేష్టలు చేస్తూ రాక్షసుల చేతులలో నుంచి నానావిధాయుధాలూ ఊడలాక్కొని ఆ ఆయుధాలతోనే రాక్షసులను కొటి చంపి వేసినారు. అట్లా దొమ్మిగా సాగిన ఆ యుద్ధములో వానరులు అత్యుత్సాహముతో రాక్షసులను పడకొట్టుతూ ఉంటే పయిన ఆకాశములో ఉన్న మహర్షులూ దేవతలూ సంతోష ధ్వనులు చేసినారు.

అప్పుడు నరాంతకుడు పదును అయిన శక్త్యాయుధముతో వాయువేగముతో పోయే గుర్రము మీద బయలుదేరి వచ్చి మహాసముద్రములో చొరపడే మహామీనము వలె ఆ వానర సైన్యములో చొర పడ్డాడు. ఆ పరమపరాక్రమ

వంతుడు ఆ మహాధైర్యవంతుడు తళతళలాడుతూ ఉన్న ఈటెతో పొడిచి ఇట్టే ఏడు వందలమంది వానరులను చీల్చి వేసినాడు. క్షణకాలములో వానర వీరులను అందరినీ భయపెట్టినాడు. అప్పుడు ఆ వానరసైన్యములో గుర్రము మీద తిరుగుతూ ఉన్న మహాధైర్యవంతుణ్ణి ఆ నరాంతకుణ్ణి ఆకాశములోనుంచి దేవతలూ విద్యాధరులూ మహర్షులూ చూచినారు.

ఆ యుద్ధభూమి అంతటా మాంసముతోనూ రక్తముతోనూ బురద బురద అయి ఉండడమూ చచ్చిపడి ఉన్న పర్వతాకారులు అయిన వానరులు కిక్కిరిసి ఉండడమూ నరాంతకుడు చూచినాడు. చావగా మిగిలియున్న వానరవీరులు అందరూ పరాక్రమించే లోపలనే వారిని అందరినీ వెంబడించి తనచేతిలో ఈటెతో వారిని అందరినీ చీల్చివేసినాడు. మహారణ్యాన్ని కార్చిచ్చు మంటల వలె వానరసైన్యాన్ని నరాంతకుడు జ్వలిస్తూ ఉన్న తన ఈటెతో రూపుమాపి వేసినాడు. వానరులు వృక్షాలనూ పర్వతశిఖరాలనూ పెళ్ళగించే లోపలనె దేవేంద్రుడు వజ్రాయుధములతో పర్వతాలను పగులగొట్టేట్టు నరాంతకుడు తన ఈటెతో పర్వతాకారులు అయిన ఆ వానరులను విరగకొట్టినాడు. వానాకాలములో ఎడాపెడా కొట్టే గాలివలె ఆ మహాబలవంతుడు నరాంతకుడు ఆ యుద్ధభూమిలో అన్ని దిక్కులా వానరులను మర్దిస్తూ తిరిగినాడు. ఆ పరాక్రమవంతుడు పైకి యెగురుతూ ఉన్న వానరులనూ భూమిమీద ఉన్న వానరులనూ పారిపోతూ ఉన్న వానరులను పట్టుకొని కొట్టుతూ ఉంటే వానరవీరులు భయపడి పరుగెత్తి పారిపోలేక పోయినారు. అక్కడ నిలువలేక పోయినారు. కదలలేక పోయినారు. మెదలలేకపోయినారు.

ప్రళయకాల యముడివలెనూ గ్రీష్మకాల సూర్యుడివలెనూ తేజరిల్లుతూ ఉన్న ఒక్క ఈటెతో ఆ నరాంతకుడు వానరసైన్యాన్ని అంతా నేలమీద పడకొట్టినాడు. వజ్రాయుధము దెబ్బవంటి ఆ ఈటెదెబ్బను వానరులు ఓర్చుకో లేక పెద్దపెట్టున కేకలు పెట్టినారు. ఆ ఈటెదెబ్బకు పడిపోతూన్న వానరుల ఆకారాలు వజ్రాయుధము దెబ్బకు నేలకూలిన పర్వతాలవలె కనిపించినవి.

ఆ పోరాటము అట్లా జరుగుతూ ఉండగా అదివరకు కుంభకర్ణుడు పడ కొట్టిన వానరవీరులు మూర్ఛ తేరుకొని సుగ్రీవుడి దగ్గరకు పోయినారు. అప్పుడు సుగ్రీవుడున్నూ ఏ వైపున ఏమి జరుగుతూందోనని నాల్గువైపులా చూచినాడు నరాంతకుడి దెబ్బలకు ఓర్చుకోలేక భయపడి అన్నివైపులా పారిపోతున్న వానర యోధులు కనిపించినారు. గుర్రముమీద కూర్చొని చేతులో ఈటె పట్టుకొని వానరులను పరుగులెత్తిస్తూ ఉన్న నరాంతకుణ్ని చూచినాడు. అంతట మహా

తేజోవంతుడు అయిన ఆ వానరరాజు సుగ్రీవుడు దేవేంద్రుడితో సరిసమానము అయిన పరాక్రమవంతుణ్ని మహాబలవంతుణ్ని అంగదుణ్ని చూచి "నాయనా, అదుగో కనపడుతున్నాడు. గుఱ్ఱముమీద వస్తూఉన్నాడు. మన వానరసైన్యాన్ని మహా క్షోభ పెట్టినాడు. నీవు పో. ఆ రాక్షసుణ్ని సంహరించు. వెంటనే పో" అని చెప్పినాడు.

ఈ విధముగా సుగ్రీవుడు చెప్పగానే మేఘసమూహమువంటి ఆ వానర సైన్యములోనుంచి అంగదుడు ఆకాశానికి ఎగిరినాడు. మేఘసమూహాలలో నుంచి వెలువడిన సూర్యుడివలె తేజరిల్లినాడు. పర్వతసమూహమువంటి ఆకార ముతో నవరత్నఖచితముఅయిన బంగారు బాహుపురులతో తేజరిల్లుతూ ఉన్న ఆ అంగదుడు గైరికాది ధాతువులతో ధగధగలాడుతూ ఉన్న పర్వతమువలె కనిపించినాడు. ఆ అంగదుడు తన గోళ్లతోనూ కోరలతోనూ చేతులతోనూ కాళ్ళతోనూ పోరాడతలచుకొని ఏ ఆయుధమూ లేకుండా నరాంతకుణ్ణి ఎదు ర్కొని "ఓ రాక్షసుడా, నిలు నిలు. అల్పులతో పోరాడినందువల్ల నీకు ఏమి లాభము. వజ్రమువంటి నీ ఈటెతో చేతను అయితే నా వక్షఃస్థలాన కొట్టు. నా పేరు అంగదుడు. నేను యువరాజును" అని చెప్పినాడు.

ఆ మాటలు వినగానే నరాంతకుడు పళ్లతో తన పెదవి కొరు క్కున్నాడు. మహాసర్పము రేగి బుసలు కొట్టేట్టు నిట్టూర్పులు విడువ సాగి నాడు. కోపముతో అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు. తళతళలాడుతూ ఉన్న తన ఈటెను అంగదుడి ఎదురు రొమ్ముమీద విసరి వేసినాడు. వజ్రముతో సరి సమానము అయిన ఆ అంగదుడి వక్షఃస్థలముమీద ఆ ఈటె పడి విరిగి ముక్కలు ముక్కలు అయిపోయింది. గరుత్మంతుడు కొరికి వేసిన సర్పమువలె నేలమీద పడి పోయిన ఆ ఈటెను చూచి అంగదుడు సంతోషపడ్డాడు. అంతట నరాంతకుడి గుఱ్ఱము నెత్తిన అంగదుడు తన అరచేతితో చరిచినాడు. ఆ చరుపుకు పర్వ తాకారములో ఉన్న ఆ గుఱ్ఱము తల పగిలి దౌడలు లోపలికి పోయి కనుగుడ్లు బయటికి వెళ్లుకొని వచ్చి నాలుక చాచి నేలకూలింది.

ఆ మహా పరాక్రమవంతుడు నరాంతకుడు తన గుఱ్ఱము పడిపోయినందుకు క్రోధావేశపరవశుడు అయి పిడికిలి బిగించి చెయ్యి ఎత్తి అంగదుడి నెత్తిమీద కొట్టినాడు. ఆ పిడికిడి పోటుకు అంగదుడి తల చిట్లి వేడి వేడి నెత్తురు కారింది. ఆ తల మంటలు మండినట్లు అయిపోయింది. అంతట అంగదుడు మూర్ఛపోయి నాడు. కొంచెము సేపటికి తెప్పరిల్లినాడు. నరాంతకుడి బలానికి ఆశ్చర్యపోయి నాడు. అంతట ఆ ధైర్యవంతుడు అంగదుడు వజ్రమువలె కఠినమూ పర్వతశిఖ

రముపలె కఠినమూ అయిన తన పిడికిటితో నరాంతకుడి ఎదురు రొమ్ములమీద ఒక్క పోటు పొడిచినాడు. ఆ పిడికిటి పోటుకు నరాంతకుడి వక్షఃస్థలము ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది. అగ్నిజ్వాలలవలె దేహము అంతటా నెత్తురు వ్యాపించింది. వజ్రాయుధము దెబ్బకు పగిలిపోయిన పర్వతమువలె నరాంతకుడు నేల కూలినాడు. అంగదుడు ఆ నరాంతకుణ్ణి అట్లా పడకొట్టి చంపివేయగానే ఆ యుద్ధభూమిలో వానరయోధులూ ఆకాశములో దేవతలూ సంతోషాతిశయముతో మహాధ్వనులు చేసినారు.

ఎవరూ ఎదిరించలేని ఆ నరాంతకుణ్ణి అంగదుడు చంపివేసినందుకు రాముడు ఆశ్చర్య పోయినాడు. సంతోషపడ్డాడు. అంగదుణ్ణి మెచ్చుకొన్నాడు. అంగదుడు సంతోషముతో మళ్లీ యుద్ధసన్నద్ధుడు అయినాడు.

## ౭౦

నరాంతకుణ్ణి అంగదుడు చంపివేయడము చూచి దేవాంతకుడూ త్రిశిరుడూ మహోదరుడూ దుఃఖపడి పోయినారు. అంతట ఆ మహాబలవంతుడు మహోదరుడు మహామేఘము వంటి ఏనుగును ఎక్కిపోయి అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు. తన తోబుట్టువు చనిపోయినందుకు దుఃఖముతో తపించిపోతూ దేవాంతకుడు ధగధగ లాడుతూ ఉన్న ఇనుపగుదియతో పోయి అంగదుణ్ణి ఎదిరించినాడు. ఉత్తమాశ్వాలు పూంచిన రథముమీద త్రిశిరుడు బయలుదేరిపోయి అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు.

దేవతలదర్పాన్ని అణచివేసిన ఆ రాక్షసోత్తములు నల్గురూ తనను ఎదుర్కొనడము చూచి అంగదుడు ఒక మహావృక్షాన్ని పెళ్లగించి పట్టుకొన్నాడు. పూచిన పెద్ద పెద్ద కొమ్మలతో దేవేంద్రుడి వజ్రాయుధము వలె ధగధగ లాడుతూ ఉన్న ఆ మహావృక్షాన్ని అంగదుడు దేవాంతకుడిమీద విసరి వేసినాడు. అప్పుడు త్రిశిరుడు పాములవంటి బాణాలు వదిలి ఆ మహావృక్షాన్ని నరికి వేసినాడు. అదిచూచి అంగదుడు ఆకాశానికి ఎగిరి చెట్ల వాన రాళ్ల వాన కురిపించినాడు. అందుకు త్రిశిరుడు క్రుద్ధుడు అయిపోయి తన నిశితబాణాలతో ఆ వచ్చి పడుతూఉన్న చెట్లను అన్నిటినీ నరికివేసినాడు. ఆ త్రిశిరుడే కాకుండా దేవాంతకుడు తన ఇనుప గుదియతో ఆ వచ్చి పడుతూఉన్న చెట్లను అన్నిటినీ విరగకొట్టినాడు.

త్రిశిరుడు బాణాలు వదిలి అంగదుణ్ణి అడ్డగించినాడు. ఏనుగుమీదఉన్న మహోదరుడు అంగదుణ్ణి ఎదుర్కొన్నాడు. తోమరాయుధముతో అతడి వక్షః

స్థలాన కొట్టినాడు. దేవాంతకుడున్నూ క్రుద్ధుడు అయిపోయి అమితవేగముతో పోయి అంగదుణ్ణి తన ఇనుప గుదియతో ఎదుర్కొన్నాడు. అట్లా ముగ్గురు రాక్షసశ్రేష్ఠులు ఏకకాలాన తనను ఎదుర్కొన్నప్పటికిన్నీ ఆ మహా వర్చస్కుడు ఆ మహా ప్రతాపవంతుడు అంగదుడు ఏ మాత్రమూ జంకలేదు. ఆ అజయ్యుడు ఆ మహావేగుడు అంగదుడు అమితవేగముతో పయికి ఎగిరి మహోదరుడు ఎక్కివచ్చిన ఏనుగుతలను తన అరచేతితో చరచినాడు. ఆ దెబ్బకు ఆ ఏనుగు రెండు కన్నులూ ఊడి పడిపోయినవి. ఆ ఏనుగు ఘోరముగా అరిచింది. క్షణలేశములో అంగదుడు ఆ ఏనుగు రెండు దంతాలనూ పెకలించివేసినాడు. అంతట ఇట్టె ఆ దేవాంతకుణ్ణి కొట్టినాడు. ఆ దెబ్బకు దేవాంతకుడి అవయవాలు స్వాధీనము తప్పిపోయినవి. నోటిలోనుంచి లక్కరసమువంటి నెత్తురు కక్కుకొన్నాడు. గాలికి పెళ్లగిలిన చెట్టువలె నేలమీదికి ఒరిగినాడు. ఎంతో కష్టముమీద ఆ బలవంతుడు ఆ పరాక్రమవంతుడు దేవాంతకుడు తెప్పరిల్లినాడు. మెల్లగా లేచినాడు. భయంకరముఅయిన తన ఇనుప గుదియను గిరగిరతిప్పి అంగదుణ్ణి కొట్టినాడు. ఆ దెబ్బకు అంగదుడి మోకాళ్ళ పట్టు తప్పిపోయి కిందపడ్డాడు. మళ్ళీ మెల్లగా లేచినాడు.

అట్లా లేస్తూఉన్న అంగదుణ్ణిచూచి త్రిశిరుడు గురితప్పని భయంకర బాణాలను ఆ అంగదుడి లలాటానికి గురిచేసి వదిలినాడు. అంగదుణ్ణి ముగ్గురు రాక్షసశ్రేష్ఠులు కమ్ముకొని కొట్టుతూ ఉన్నారు అని తెలుసుకొని హనుమంతుడూ నీలుడూ అంగదుడి దగ్గరకు పోయినారు. నీలుడు ఒక పర్వత శిఖరాన్ని త్రిశిరుడి శిరస్సుమీద పడేట్టు విసరివేసినాడు. ఆ బుద్ధిమంతుడు త్రిశిరుడు తన వాడి వాడి బాణాలతో ఆ పర్వతశిఖరాన్ని ముక్కలు ముక్కలు చేసివేసినాడు. అట్లా ముక్కలు ముక్కలు అయిపోయిన రాళ్లు నిప్పులు చెరుగుతూ మంటలు మండుతూ నేలమీద రాలినవి. అదిచూచి సంతోషాతిశయముతో దేవాంతకుడు విజృంభించి తన ఇనుపగుదియతో హనుమంతుణ్ణి ఎదిరించినాడు. అట్లా తనను ఎదిరించిన దేవాంతకుణ్ణిచూచి హనుమంతుడు ఇట్టే పయికి ఎగిరి వజ్రమువంటి తన పిడికిటితో అతడి తలమీద కొట్టినాడు. రాక్షసులు అందరూ చలించిపోయేట్టు సింహనాదము చేసినాడు. ఆ పిడికిటి పోటుకు ఆ దేవాంతకుడి తల ముక్కలు చెక్కలు అయిపోయింది. పళ్ళూ కళ్ళూ బయటికి వెళ్లుకొని వచ్చినవి. నాలుక చాచినాడు. ఆ దేవాంతకుడి ప్రాణము పోయింది. తటాలున నేలమీద పడిపోయినాడు.

రాక్షసయోధులలో ముఖ్యుడూ దేవతలను ఎదిరించిన మహాబలవంతుడుగా అయిన దేవాంతకుడుఅట్లా పోరాటములో చచ్చిపడిపోగానే త్రిశిరుడు క్రుద్ధుడు

అయిపోయి మహోగ్రనిశితాగ్ర బాణాలను నీలుడి వక్షః స్థలాన వదిలినాడు. మందరపర్వతము వంటి ఏనుగమీద సూర్యసమానకాంతులతో తేజరిల్లుతూ ఉన్న మహోదరుడు అప్పుడు అక్కడికి పోయినాడు. ఆకాశములో ఇంద్రధనుస్సు వ్యాపించగానే మేఘాలు మెరుపులు మెరుస్తూ వాన కురిసేట్టుగా మహోదరుడు నీలుడి వక్షఃస్థలాన బాణవర్షము కురిపించినాడు. దేహముఅంతా గాయాలు అయి నీలుడు చేష్టలు తప్పి పోయినాడు, కొంచెము సేపటికి తేరుకొని వృక్షాలనూ పర్వతశిఖరాలనూ పెళ్లగించి వాటితో ఎగిరిపోయి అమితవేగముతో మహోదరుడి శిరము మీద కొట్టినాడు. వజ్రాయుధము దెబ్బకు పర్వతమువలె నీలుడి పర్వత శిఖరాల దెబ్బకు దేవాంతకుడు చచ్చి తన పెద్ద ఏనుగుతో కూడా నేలకూలినాడు.

ఆ పోరాటములో తన పినతండ్రి మహోదరు అట్లాపడి పోవడము చూచి త్రిశిరుడు క్రుద్ధుడు అయిపోయి వాడి వాడి బాణాలను హనుమంతుడి మీదనూ నీలుడి మీదనూ వదిలినాడు. అప్పుడు వాయుపుత్రుడు హనుమంతుడు కుపితుడు అయిపోయి ఒక పర్వత శిఖరాన్ని పెళ్ళగించి త్రిశిరుడి మీద విసరి వేసినాడు. ఆ పర్వత శిఖరము తనమీద పడకుండా త్రిశిరుడు తన వాడి వాడి బాణాలతో దానిని తునకలు తునకలుచేసి వేసినాడు. ఆ పర్వతశిఖరము అట్లా వ్యర్థము అయి పోవడము చూచి హనుమంతుడు త్రిశిరుడి శిరముమీద చెట్లవాన కురిపించినాడు ఆకాశము నుంచి అట్లా పడుతూ ఉన్న చెట్లను ఆ పరాక్రమవంతుడు త్రిశిరుడు తన నిశితబాణాలతో నరికి వేసి సింహనాదము చేసినాడు.

అంతట హనుమంతుడు క్రుద్ధుడు అయిపోయి పయికి ఎగిరి త్రిశిరుడి గుర్రాలనూ సింహము ఏనుగును తన గోళ్ళతో చీల్చి వేసేట్టు చీల్చి వేసినాడు. అప్పుడు త్రిశిరుడు కాళరాత్రి అనే ఆయుధముతో యముడు బయలుదేరేటట్టు శక్త్యాయుధము తీసుకొని హనుమంతుడిమీద విసరి వేసినాడు. ఆకాశములోనుంచి పడుతూఉన్న కొరవివలె అడ్డగించడానికి అలవికాకుండా పడపోతూఉన్న ఆ శక్త్యాయుధాన్ని హనుమంతుడు పట్టుకొని విరిచివేసి సింహనాదము చేసినాడు. భయంకరము అయిన ఆ శక్త్యాయుధాన్ని హనుమంతుడు విరిచివేయడము చూచి వానరయోధులు అందరూ సంతోషాతిశయముతో మేఘాలవలె గర్జించినారు. అప్పుడు ఆ రాక్షసోత్తముడు త్రిశిరుడు ఒక ఖడ్గము తీసికొని హనుమంతుడి విశాల వక్షఃస్థలముమీద కొట్టినాడు. ఆ కత్తివేటుకు హనుమంతుడు క్రుద్ధుడు అయిపోయి తన అరచేతితో త్రిశిరుడి వక్షఃస్థలాన కొట్టినాడు. ఆ దెబ్బకు ఆ మహా తేజోవంతుడు త్రిశిరుడు చేష్టలు తప్పిపోయినాడు. చేతిలో నుంచి ఖడ్గము జారిపడిపోయింది. నేలమీదపడి మూర్ఛపోయినాడు. కిందపడి

పోయిన ఆ త్రిశిరుడి ఖడ్గాన్ని హనుమంతుడు తీసుకొని రాక్షసులు అందరూ భయపడిపోయేట్లు సింహనాదము చేసినాడు. ఆ మహాఘోరాన్ని విని సహించ లేక త్రిశిరుడు లేచి తన పిడికిటితో హనుమంతుణ్ణి కొట్టినాడు. ఆ పిడికిటి పోటుకు హనుమంతుడికి పట్టరాని కోపము వచ్చింది. త్రిశిరుడి శిరాన్ని పట్టు కొన్నాడు. త్వష్ట పుత్రుడు అయిన విశ్వరూపుడి శిరస్సును దేవేంద్రుడు తెగవేసి నట్టు ధగధగలాడుతూ ఉన్న కిరీటకుండలాలుతో తేజరిల్లుతున్న త్రిశిరుడి శిర స్సును తీక్ష్ణము అయిన ఆ ఖడ్గముతో హనుమంతుడు తెగవేసినాడు. ఆకాశము నుంచి రాలుతూఉన్న నక్షత్రాలవలె పర్వతాకారములోఉన్న త్రిశిరుడి మూడు తలలూ మంటలు మండుతూఉన్న నిప్పులవంటి నేత్రాలతో నేలకూలి నవి. దేవేంద్రుణ్ణి ఎదిరించిన ఆ త్రిశిరుణ్ణి దేవేంద్రుడివంటి పరాక్రమవంతుడు హనుమంతుడు వధించివేయగానే వానరులు కోలాహల ధ్వనులు చేసినారు. భూమి కంపించింది. అంతట రాక్షసులు అందరూ అన్ని దిక్కులా పరుగులెత్తి నారు.

అట్లా త్రిశిరుణ్ణీ మహోదరుణ్ణీ ఎదిరించ నలవికాని నరాంతకుణ్ణీ దేవాంత కుణ్ణీచంపివేయడము మత్తుడు అనే మహాపార్శ్వుడు చూచినాడు. పరమకుపితుడు అయినాడు. మంటలు మండుతూఉన్న భయంకరము అయిన గదను తీసు కొన్నాడు. మాంసముతోనూ నెత్తురుతోనూ నెత్తురు నురుగులుతోనూ ఎర్రటి పూలదండలతోనూఉన్న ఆ ఇనుప గదను మహాపార్శ్వుడు తీసుకొన్నాడు. అతడు అదివరకు ఆ గదతో అనేక యుద్ధాలు గెలిచినాడు. ఆ గదనుచూచి అదివరకు ఐరావత మహాపద్మ సార్వభౌమాలు అనే దిగ్గజాలు భయపడిపోయి నవి. మహాపార్శ్వుడు ప్రళయకాలాగ్నివలె మండిపడుతూ ఆ గదతో వానరుల మీదికి పోయినాడు.

అప్పుడు ఋషభుడు అనే వానరుడు ఎగిరి ఆ మహాపార్శ్వుడి ఎదట నిలుచున్నాడు. అట్లా తన ఎట్టఎదటికివచ్చి నిలుచున్న ఆ పర్వతాకారుణ్ణి వాన రుణ్ణి చూచి మహాపార్శ్వుడు వజ్రతుల్యముఅయిన తన గదతో అతడి వక్షః స్థలముమీద కొట్టినాడు. ఆ దెబ్బకు ఋషభుడి రొమ్ములు గాయాలుఅయి ఎంతో నెత్తురు కారింది. ఋషభుడు మూర్ఛపోయినాడు. చాలాసేపటికి కాని తెలివిరాలేదు.

అప్పుడు ఆ మహాపార్శ్వుడి చేతిలో గదను లాగివేయడానికి ఋషభుడు ఎదురుగుండా పోయినాడు. మహాభయంకరముఅయిన ఆ గదను ఇట్టే మహా పార్శ్వుడి చేతిలోనుంచి ఊడలాగుకొన్నాడు. ఆ గదను గిరగిర తిప్పినాడు.

దానితోనే మహాపార్శ్వుణ్ణి కొట్టినాడు. ఆ దెబ్బకు ఆ రాక్షసుడి పళ్లూ కళ్లూ రాలి వజ్రాయుధము దెబ్బకు పర్వతమువలె నేలకూలినాడు. ఆ మహాపార్శ్వుడి ప్రాణముపోయి అట్లా నేలకూలగానే రాక్షససైన్యము అక్కడ నిలువకుండా పరుగెత్తింది.

రావణాసురుడి తమ్ముణ్ణి మహాపార్శ్వుణ్ణి చంపివేయగానే మహాసముద్రము వంటి ఆ రాక్షససైన్యము ఆయుధాలు వదిలిపెట్టి బ్రతికిఉంటే చాలును అను కొని మహాసముద్రము పొంగిపార్లేట్టు పరుగెత్తింది.

## ౭౧

ఒళ్లు గగురు పొడిచేట్టు దొమ్మిగా సాగిన ఆ పోరాటములో తమ రాక్షస సైన్యము అంతా నాశనము అయిపోవడమూ దేవేంద్రుడి వంటి పరాక్రమ వంతులు తన తోబుట్టువులనూ తన పినతండ్రులనూ శత్రువులు చంపివేయడమూ అతికాయుడు చూచినాడు.

ఆ పర్వతాకారుడు ఆ మహాపరాక్రమవంతుడు అతికాయుడు అదివరకు దేవతల దర్పాన్ని అణచి వేసినాడు. అతడు బ్రహ్మదేవుణ్ణి మెప్పించి అనేక వరాలు సంపాదించినాడు. అప్పుడు అతడు వెయ్యి సూర్యులవలె తేజరిల్లే రథము ఎక్కి వానరసైన్యము మీదికి పోయినాడు. ఆ అతికాయుడు కిరీటకుండ లాలతో తేజరిల్లుతూ అందరికీ వినిపించేట్టు తన పేరు చెప్పుకుంటూ తన మహా చ్ఛాపాన్ని మోగిస్తూ దిక్కులు పిక్కటిల్లి పోయేట్లు సింహనాదము చేసినాడు.

ఆ సింహనాదానికీ ఆ అల్లెతాటి మోతకూ వానరయోధులు అందరూ భయపడ్డారు. ఆ అతికాయుడి ఒడ్డూ పొడుగూ చూచి కుంభకర్ణుడు లేచి వచ్చి నాడు ఏమోను అనుకొన్నారు. భయముతో వానరయోధులు ఒకరిని ఒకరు పట్టుకొన్నారు. త్రివిక్రమావతారములో విష్ణుదేవుడి ఆకారమువంటి ఆ మహాదా కారాన్ని చూచి వానరయోధులు అటూ ఇటూ పరుగులెత్తినారు. ఆ అతి కాయుడు దగ్గరకు వచ్చినాడు. అప్పుడు వానరయోధులు అందరికీ ఏమి చేయ డానికీ తోచక నిర్విణ్ణులు అయిపోయినారు. లక్ష్మణుణ్ణికూడా వదిలిపెట్టి పరుగు లెత్తి రాముడి శరణు చొచ్చినారు.

ప్రళయకాల మేఘమువలె గర్జిస్తూ రథముమీద వస్తూ ఉన్న ఆ పర్వతా కారుణ్ణి ఆ ధనుర్ధరుణ్ణి అతికాయుణ్ణి రాముడు దూరమునుంచి చూచినాడు. ఆ మహాకాయుణ్ణి చూచే చూడటముతో ఆశ్చర్యపోయినాడు. అయితే వానరులకు ధైర్యము చెప్పినాడు. అంతట విభీషణుణ్ణి చూచి "ఓ రాక్షసోత్తమా, అడుగో,

చూడు. వెయ్యి గుర్రాలు పూంచిన విశాలరథముమీద ధనుర్ధరుడుఅయి సింహము వంటి కన్నులతో చూస్తూ వస్తూ ఉన్న ఆ పర్వతాకారుడు ఎవడు, భూతగణాలతో తేజరిల్లుతూ వచ్చే రుద్రుడివలె చుట్టూ ధగధగలాడుతూనూ తళతళలాడుతూనూ ఉన్న నిశితబాణాలతోనూ తోమరాలతోనూ వస్తూ ఉన్నాడు. మెరుపులు మెరుస్తూ కనిపించే మహామేఘము వలె తేజరిల్లు తున్నాడు. నాలుకలు చాచిన మృత్యుదేవతవలె శక్త్యాయుధముతో రథము మీద కనపడుతున్నాడు. వెనుకవైపున బంగారు మలామా చేసిన ధనుస్సులూ బంగారు అల్లెత్రాళ్లూ ఆ రథముమీద అన్నివైపులా కనపడుతూ ఉన్నవి. అవి ఆకాశములో ఇంద్రధనుస్సువలె ఆ రథముమీద భాసిస్తూ ఉన్నవి. సూర్యతేజ ముతో ధగధగలాడుతూ ఉన్న రథముమీద కూర్చుని ఈ యుద్ధభూమిని తేజరిల్లి చేస్తూ ఉన్న పెద్దపులివంటి ఈ రాక్షసుడు ఎవడు.

ఈ రథికుడి బాణాలు సూర్యకిరణాలవలె దశదిశాలా ప్రకాశిస్తూఉన్నవి. రథ ధ్వజము మీద మండల గ్రహాలను మింగి వేసే రాహుగ్రహము అమర్చిఉంది. మూడు వంపులతో ఉన్న వీడి విల్లు మ్రోగించినప్పుడు మేఘగర్జనమువలె విని పించింది. ఆ ధనుస్సు వెనక భాగాన చేసిన బంగారు అలంకారాలతో ఇంద్ర ధనుస్సు వలె తేజరిల్లుతూ ఉంది. రథానికి ఎత్తిన పతాకాలు ఎంతో శోభాయ మానముగా ఉన్నవి. నలుగురు సారథులు కూర్చుని తోలడానికి వీలుగా రథము పీట అమర్చి ఉంది. రథము మీద ఒకచోట పది ఒకచోట ఇరవై ఒకచోట ఎని మిది అమ్ములపొదులు వేళ్లాడుతూ ఉన్నవి. బంగారు అల్లెత్రాళ్లతో భయంక రము అయిన ధనుస్సులు రథము నిండా కనపడుతూ ఉన్నవి. నాలుగు చేతుల పిడులతోనూ పది చేతుల పొడుగునా ఉన్న ఖడ్గాలు ఈ రాక్షసుడి ఇరువైపులా శోభాయమానముగా కనపడుతున్నవి. మృత్యువు వంటి పెద్దనోటితో ఎర్రటి పూలదండలతో ఈ మహాపర్వతాకారుడు మేఘాలు కమ్ముకొన్న సూర్యుడి వలె తేజరిల్లుతూ ఉన్నాడు. ఎత్తు అయిన శిఖరాలతో కనపడే హిమవంతుడి వలె బంగారు బాహుపురులతో ఎత్తు అయిన భుజాలతో శోభిస్తూ ఉన్నాడు.

"ఓ మహాబాహూ, ఓ విభీషణుడా, వీడు ఎవడు. రెండు చెవులకూ తళ తళలాడుతూ ఉన్న కుండలాలతో మంగళకరము అయిన నేత్రాలతో వీడు పున ర్వసు నక్షత్రాల మధ్య చంద్రుడి వలె భాసిస్తూ ఉన్నాడు. వీడు ఎవడు. వీణ్ణి చూచి వానరయోధులు అందరూ భయార్తులు అయి దశదిశలా పరుగులెత్తినారు. ఓ విభీషణుడా, వీడు ఎవడో నాకు వివరము చెప్పు" అని ఆ అమిత తేజోవం తుడు రాముడు అడిగినాడు.

అంతట ఆ మహాపరాక్రమవంతుడు విభీషణుడు "రామా, వీడు రావణా సురుడి పుత్రుడు. యుద్ధములో తండ్రి అంతటి వాడు. మహాపరాక్రమవంతుడు. సర్వాస్త్రవేత్తలలోనూ శ్రేష్ఠుడు. పెద్దల సేవచేసినాడు. వేద విదుడు, అశ్విపుడు. రథికుడు, గజసాది, మేటి విలుకాడు. కత్తి యుద్ధములోనూ పాశాద్యాయుధాలు ఉపయోగించడములోనూ ఆరితేరినాడు. సామదానాది చతురుపాయాలూ తెలిసిన నీతిజ్ఞుడు. ఆలోచనలు చెప్పడములో అత్యంత సమర్థుడు. ధాన్యమాలిని వీడి తల్లి. వీడి పేరు అతికాయుడు. వీడి బాహుబలము నుంచే లంకాపట్టణము నిర్భయము గా ఉంది.

"ఈ అతికాయుడు ఆత్మధ్యానపరాయణుడు. తపస్సుచేసి బ్రహ్మదేవుణ్ణి మెప్పించి అనేక అస్త్రాలు సంపాదించినాడు. దేవతల చేత కానీ అసురుల చేత కానీ చావకుండా ఉండడానికోసము బ్రహ్మదేవుడు వీడికి ఇప్పుడు వీడు తొడుక్కొని ఉన్న దివ్యకవచాన్నీ సూర్యుడి వలె తేజరిల్లుతూ ఉన్న ఈ రథాన్నీ ఇచ్చినాడు. వీడు దేవదానవులను అనేకమార్లు జయించినాడు. యక్షులను వధించి రాక్షసులను రక్షించినాడు. వీడు తన బాణాలతో దేవేంద్రుడి వజ్రాయుధము స్తంభించి పోయేట్టు చేసినాడు. వరుణదేవుడి పాశాయుధాన్ని తెగవేసినాడు. వీడు రాక్షసవీరులలో శ్రేష్ఠుడు.

"ఓ పురుషోత్తమా, రామా, నీవు వీడి విషయములో వెంటనే తగిన ప్రయత్నము చేయవలెను. లేక పోయేట్లయితే వీడు తన బాణాలతో వానర సైన్యాన్ని నాశనము చేసి వేస్తాడు" అని చెప్పినాడు.

ఈ మాటలు విభీషణుడు చెప్పుతూ ఉండగానే అతికాయుడు వానర సైన్యములో చొరపడి ధనుష్టంకారము చేస్తూ పదే పదే సింహనాదము చేసినాడు. ఆ రథికుణ్ణి ఆ భయంకరాకారుణ్ణి అతికాయుణ్ణి అప్పుడు వానరవీరులలో ముఖ్యులు అయిన వారు ఎదిరించినారు. వారిలో కుముదుడూ ద్వివిదుడూ మైందుడూ నీలుడూ శరభుడూ ఏకకాలాన అ అతికాయుడిమీద పర్వతశిఖరాలూ మహావృక్షాలూ విసరి వేసినారు. అట్లా వానరవీరులు విసరి వేసిన ఆ పర్వత శిఖరాలనూ మహావృక్షాలనూ అప్పుడు ఆ అస్త్రవిదుడు అతికాయుడు తన బంగారు బాణాలు వదిలి నరికి వేసినాడు. ఆ బలవంతుడు ఆ భయంకరాకారుడు వానర వీరులకు ఎదురుగుండా పోయి వారిమీద ఉక్కుబాణాలు వదిలినాడు. ఆ బాణవర్షానికి వానరుల అవయవాలు తెగిపోయి వివశులు అయిపోయినారు. ఎదురు తిరిగి పోరాడ లేకపోయినారు. యౌవనదర్పములో ఉన్న సింహము కోపములో చెలరేగి మృగసమూహాలను గగ్గోలు పరిచేట్టు ఆ అతికాయుడు అప్పుడు వానర సేనాసమూహాలను చీకాకు పరిచినాడు.

అప్పుడు ఆ వానరసేనామధ్యములో ధనుస్తూణీరాలతో నిలుచుని ఏ ఒక్కడితోనూ పోరాడకుండానూ ఏ ఒక్కణ్ణీ చంపి వేయకుండానూ ఉన్న రాముణ్ణి చూచి అతికాయుడు గర్వముతో "నేను ధనుర్బాణాలతో పోరాటానికి వచ్చినాను. అల్పులతో నేను పోరాడను. యుద్ధము చేయవలెను. అనే ఉత్సాహము ఎవడికి అయినా ఉన్నట్లయితే వెంటనే ఇప్పుడే నాతో పోరాడటానికి రావలెను," అన్నాడు.

అతికాయుడు అన్న ఈ మాటలు విని లక్ష్మణుడు ఓర్వ లేకపోయినాడు. ఆ శత్రుహంతకు కోపము వచ్చింది. ఆ అతికాయుడికి ఎదురుగుండా పోయినాడు. చిరునవ్వు నవ్వుతూ ధనుస్సు పట్టుకొన్నాడు. క్రుద్ధుడు అయినాడు. అమ్ముల పొదిలోనుంచి బాణాన్ని తీసి వింటికి ఎక్కించినాడు. ఆ అతికాయుడి ఎట్ట ఎదట తన మహచ్చాపాన్ని మోగించినాడు. భయంకరము అయిన! ఆ జ్యానాదము ఈ భూమి మీదనూ పర్వతాల మీదనూ ఆకాశములోనూ సముద్రములోనూ దశదిశలానూ వ్యాపించింది. ఆ మహాధ్వనికి రాక్షసులు అందరూ భయపడి పోయినారు. ఆ బలవంతుడు ఆ మహాపరాక్రమవంతుడు అతికాయుడు ఆ ధనుష్టంకారానికి ఆశ్చర్య పోయినాడు. అంతట కుపితుడు అయిపోయి నిశితబాణాన్ని తీసి అట్లా తనమీదికి వస్తూ ఉన్న లక్ష్మణుడితో "ఓ లక్ష్మణుడా, నీవు పసివాడవు. ఎవడు ఎంత పరాక్రమవంతుడు అనే విచక్షణాజ్ఞానము నీకు లేదు. నాతో యుద్ధము చేయవలెను అనే కోరిక నీకు ఎందుకు పుట్టింది. నా బాహువులతో వదిలే బాణాల తీవ్రతను హిమవంతుడు ఓర్వలేడు. ఈ భూమి ఓర్వ లేదు. ఓ లక్ష్మణుడా, సుఖముగా నిద్ర పోతున్న కాలాగ్నిని ఎందుకు రగులు కొల్పుతావు. నీ చాపాన్ని వదిలి పెట్టి వెనకకు మళ్లి పో. నా మీదికి వచ్చి నీ ప్రాణాలు ఎందుకు పోగొట్టుకొంటావు. కాదు అనేట్లయితే నిలుచో నీ ప్రాణాలు తీసి వేస్తాను. నిన్ను ఇప్పుడే యమసదనానికి పంపించి వేస్తాను.

"ఇవిగో, చూడు, నా బాణాలు. వీటితో నా శత్రువులదర్పాన్ని అణచి వేసినాను. మేలిమి బంగారు అలంకారాలతో రుద్రదేవుడి త్రిశూలాలు వంటివి. ఇదిగో, చూడు—ఈ బాణము: సర్పము వంటిది. కుపిత సింహము మదపు టేనుగు నెత్తురును పీల్చి వేస్తుంది. అనే విధముగా నా ఈ బాణాలతో నీ నెత్తురును పీల్చివేస్తాను" అని చెప్పుతూ కుపితుడు అయిపోయి ఆ బాణాన్ని ధనుస్సులో ఎక్కించినాడు.

ఇట్లా అతిగర్వముతోనూ కోపముతోనూ అతికాయుడు అన్న మాటలు విని ఆ మహాబలవంతుడు ఆ కాంతిమంతుడు లక్ష్మణుడు కోపముతో "ఓ

దురాత్ముడా, నీవు మాటలు అన్నంతమాత్రాన అధికుడవు కాజాలవు. ఆత్మశ్లాఘనము శూరులు ఎవరూ చేయరు. నా చేతిలో విల్లూ అంబులూ ఉన్నవి. నీ బలము చూపించు. ఎందుకు నిన్ను నీవు పొగడుకొంటావు. పరాక్రమాన్ని చూపించేవాణ్ణే శూరుడు అంటారు. నీవు రథముమీద ఉన్నావు. నీ చుట్టూ సమస్తాయుధాలూ ఉన్నవి. నీ చేతిలో ధనుస్సు ఉంది. బాణాలతో కానీ అస్త్రాలతో కానీ నీ శౌర్యాన్ని చూపించు. ఓ అతికాయుడా, కాలపరిపాకము అయినప్పుడు గాలికి తాటిపండు తొడిమనుంచి ఊడి నేల రాలుతుంది. ఇప్పుడు నా బాణాలకు నీ శిరము ఊడి నేల కూలుతుంది. మేలిమి బంగారుతో అలంకరించిన నా బాణాలు నీ దేహములో చిల్లులుపొడిచి నీ నెత్తురును పీల్చివేస్తవి. నన్ను పిల్లవాడు అని తిరస్కరించవద్దు. పిల్లవాణ్ణి అయినా వృద్ధుణ్ణి అయినా పోరాటములో నేను యముడివంటివాడను అనుకో. మహావిష్ణువు పిల్లవాడుగా పోయి ముల్లోకాలనూ ఆక్రమించినాడు. గుర్తు తెచ్చుకో" అని అర్థవంతముగానూ యుక్తియుక్తముగానూ చెప్పినాడు.

లక్ష్మణుడు అన్నమాటలకు అతికాయుడికి పట్టరాని కోపము వచ్చింది. ఉత్తమోత్తమము అయిన బాణాన్ని తీసుకొన్నాడు. అప్పుడు ఆ యుద్ధము చూడటానికి విద్యాధరులూ భూతగణాలూ దేవతలూ దైత్యులూ మహర్షులూ గుహ్యకులూ ఆకాశములో చేరినారు. అతికాయుడు అంతట ఆ బాణాన్ని వింటికి ఎక్కించి లక్ష్మణుణ్ణి గురి చేసి అమితవేగముతో వదిలినాడు. ఆ బాణధ్వని ఆకాశము పగిలి నేల కూలుతున్నట్టుగా వినిపించింది. క్రూర సర్పము వలె వచ్చి తనమీద పడబోతూ ఉన్న ఆ నిశితబాణాన్ని లక్ష్మణుడు ఒక అర్ధచంద్రాకారపు బాణముతో నరికివేసినాడు. పామును రెండు ముక్కలుగా నరికినట్టు ఆ బాణాన్ని లక్ష్మణుడు నరికివేయడము చూచి అమిత కోపముతో అతికాయుడు అయిదు బాణాలను తీసి లక్ష్మణుడి మీద వదిలినాడు. ఆ అయిదింటినీ లక్ష్మణుడు తన తీక్ష్ణబాణాలతో ఛేదించివేసి భగ భగ మంటలు మండుతూ పోయే బాణాన్ని తీసి వింటికి ఎక్కించి అమితవేగముతో లాగి అతికాయుడిమీద వదిలినాడు. కణుపులు కనపడకుండా సూటిగాపోయే ఆ బాణము అప్పుడు ఆ అతికాయుడి లలాటాన గుచ్చుకొన్నది. ఆ భయంకరాకారుడి లలాటాన గుచ్చుకొన్న ఆ బాణము నెత్తురుతో తడిసి పర్వతములోనుంచి బయటికి వెళ్ళుకొని వచ్చిన మహాసర్పమువలె కనిపించింది. పూర్వము రుద్రదేవుడి బాణముదెబ్బకు త్రిపురగోపురము కంపించినట్టుగా లక్ష్మణుడి బాణము దెబ్బకు ఆ అతికాయుడు కంపించిపోయినాడు.

ఆ మహాబలవంతుడు అతికాయుడు తెప్పరిల్లి తనబలాన్నీ ఎదిరిబలాన్నీ విమర్శించి చూచి "ఓ లక్ష్మణుడా, నీవు చక్కగా బాణము వదిలినావు. నీవు నా విరోధివి. నిన్ను నేను మెచ్చుకొంటున్నాను" అని చెప్పి తలవంచి రెండు భుజాలూ అణచుకొని రథము మధ్యను కూర్చున్నాడు. అంతట ఆ రథాన్ని చిత్ర విచిత్రముగా తిప్పించి ఆ రాక్షసపుంగవుడు ఒక బాణాన్నీ ఆ తరువాత మూడు బాణాలనూ, ఆ తరువాత అయిదు బాణాలనూ, ఆ తరువాత ఏడు బాణాలనూ తీసి వింట సంధించి లక్ష్మణుడిమీద వదలినాడు. ఆ అతికాయుడి ధనస్సులో నుంచి వెలువడిన ఆ బాణాలు బంగారు పింజలతో సూర్యసమాన తేజముతో జ్వలిస్తూ ఆకాశములో వస్తూంటే లక్ష్మణుడు ఏమాత్రమూ చలించకుండా తన నిశితబాణాలు వదలి వాటిని దారిలోనే నరికివేసినాడు.

దేవేంద్రుణ్ని ఎదిరించిన ఆ అతికాయుడు తన బాణాలు అప్పుడు అట్లా ముక్కలు ముక్కలు అయిపోవడము చూచి కుపితుడు అయి మరియొక తీక్ష్ణ బాణాన్ని తీసి ధనుస్సుకు యెక్కించి లక్ష్మణుడి వక్షఃస్థలాన్ని గురిచేసి వదలినాడు. ఆ బాణము అమిత వేగముతో వచ్చి లక్ష్మణుడి వక్షస్థలాన గుచ్చుకొన్నది. మదపుటేనుగు మదజలమువలె లక్ష్మణుడి వక్షఃస్థలమునుంచి నెత్తురు కారింది. ఆ మహాసమర్థుడు లక్ష్మణుడు ఆ బాణాన్ని తన వక్షఃస్థలము నుంచి పెరికివేసి తీక్ష్ణబాణాన్ని తీసి అగ్నిదేవతాకము అయిన మంత్రముతో దానిని అభిమంత్రించి వింట సంధించినాడు. అది ఆ ధనుస్సులో జ్వలించ సాగింది.

అప్పుడు అతికాయుడు అది చూచి బంగారు పుంఖముతో మహాసర్పము వంటి బాణాన్ని తీసి సూర్యదేవతాకము అయిన మంత్రముతో దానిని అభిమంత్రించినాడు. అంతలో లక్ష్మణుడు తనవింట యముడి కాలదండమువలె జ్వలిస్తూన్న ఆ ఆగ్నేయాస్త్రాన్ని అతికాయుడిమీద వదిలినాడు. సూర్యాస్త్రముతో అభిమంత్రించిన తనబాణాన్ని అతికాయుడు అప్పుడు లక్ష్మణుడిమీద వదిలినాడు. ఆ రెండు బాణాలున్నూ ఆకాశములో మంటలు మండుతూ పోయి కోపముతో రేగిన పాములవలె ఒకదానితో నొకటి పోరాడటము మొదలుపెట్టినవి. ఒకదాన్ని ఒకటి దహించివేసింది. రెండూ భస్మము అయిపోయినవి.

అంతట ఆ అతికాయుడు పరమక్రుద్ధుడు అయిపోయి ఐషీకాస్త్రాన్ని వదిలినాడు. లక్ష్మణుడు ఐంద్రాస్త్రాన్ని వదిలినాడు. ఆ ఐషీకాస్త్రాన్ని ఐంద్రాస్త్రము కొట్టివేసింది. అది చూచి అతికాయుడు యమదేవతాకము అయిన మంత్రముతో అభిమంత్రించి బాణాన్ని ధనుస్సుకు యెక్కించి వదిలి

నాడు. ఆ యామ్యాస్త్రాన్ని లక్ష్మణుడు వాయవ్యాస్త్రముతో కొట్టివేసినాడు. అంతటితో వదలిపెట్టకుండా అతికాయుడిమీద లక్ష్మణుడు ఎడతెగకుండా బాణవర్షము కురిపించినాడు. ఆ బాణాలు అన్నీ పోయి వజ్రఖచితము అయిన అతికాయుడి దివ్యకవచానికి సుమ్ముకొని ములుకులు విరిగిపోయి నేలమీద పడ్డవి. తన బాణాలన్నీ అట్లా వ్యర్థము అయిపోవడము చూచి లక్ష్మణుడు వెయ్యి తీక్ష్ణ బాణాలను అతికాయుడి మీద వర్షము కురిపించినాడు. అభేద్యము అయిన కవచము తొడుగుకుని ఉన్నందువల్ల ఆ బాణాలు అతికాయుణ్ని ఏమీ చేయలేక పోయినవి. ఎంత బాణవర్షము కురిపించినా అతికాయుడు ఏ మాత్రమూ బాధపడలేదు. ఎంత ప్రయత్నము చేసినా ఆ పురుషశ్రేష్ఠుడు లక్ష్మణుడు అతికాయుణ్ని ఏమాత్రమూ నొప్పించలేక పోయినాడు.

అప్పుడు వాయుదేవుడు లక్ష్మణుణ్ణి చూచి "ఓలక్ష్మణుడా, ఈ అతికాయుడికి బ్రహ్మదేవుడు అభేద్యము అయిన కవచము ఇచ్చినాడు దానిని వీడు ఇప్పుడు తొడుగుకొని ఉన్నాడు. అందువల్ల నీవు ఇప్పుడు వీడిమీద బ్రహ్మాస్త్రము వదులు. వీడిని మరిఒకవిధముగా నీవు భేదించలేవు" అని చెప్పినాడు. అంతట లక్ష్మణుడు బ్రహ్మాస్త్రమంత్రముతో బాణాన్ని అభిమంత్రించినాడు. అమోఘము అయిన ఆ బ్రహ్మాస్త్రాన్ని అతికాయుడిమీద వదిలినాడు. లక్ష్మణుడి ధనుస్సులోనుంచి ఆ బ్రహ్మాస్త్రము వెలువడగానే భూమ్యాకాశాలూ దిక్కులూ సూర్యచంద్రాదిగ్రహాలు సంచలించినవి. చిత్రవిచిత్రము అయిన బంగారు పింజలతో భగభగ మంటలు మండుతూ యమదూతవలె తనమీదికి వస్తూఉన్న ఆ బ్రహ్మాస్త్రబాణాన్ని చూచి అతికాయుడు అనేకనిశిత బాణాలను దానిమీద వదిలినాడు. ఆబాణాలను అన్నిటినీ అమోఘము అయిన వేగముతో కొట్టివేస్తూ గరుత్మంతుడి వేగముతో ఆ బ్రహ్మాస్త్రము అతికాయుడి మీదికి పోయింది. భగభగ మంటలు మండుతూ యముడివలె భయంకరముగా కనపడుతూఉన్న ఆ బ్రహ్మాస్త్రబాణానికి అతికాయుడు భయపడకుండా శక్త్యాయుధాలతోనూ ఋష్టి అనే ఆయుధాలతోనూ గదలతోనూ శూలాయుధాలతోనూ హులాయుధాలతోనూ కొట్టినాడు. మంటలు మండుతూ ఉన్న ఆబాణము ఆ అద్భుతాకారపు ఆయుధాలను అన్నిటినీ లెక్కచేయకుండా కిరీటకుండలాలతో ధగధగ లాడుతూ ఉన్న అతికాయుడి శిరాన్ని ఉత్తరించి వేసింది. హిమవత్పర్వత శిఖరమువంటి ఆ అతికాయుడి శిరము తటాలున నేల కూలింది. అతడు పెట్టుకొన్న ఆభరణాలు అన్నీ ఎగిరి నేలమీద పడిపోయినవి.

అది చూచి రాక్షసయోధులు అందరూ దుఃఖాక్రాంతులు అయినారు. అప్పుడు వానరయోధులు కొట్టుతూ ఉన్న దెబ్బలు ఓర్చుకోలేక వికృత స్వరాలతో పెద్దపెట్టున అరుస్తూ ఏడుస్తూ చావగా మిగిలిన రాక్షసయోధులు ఆ యుద్ధభూమిని వదిలిపెట్టి లంకాపట్టణాభిముఖులు అయి పరుగులెత్తినారు.

ఆ భీమబలుణ్ణి ఆ దురాసదుణ్ణి అతికాయుణ్ణి లక్ష్మణుడు చంపివేయగానే సంతోషాతిశయముతో వానరవీరుల ముఖాలు కమలాలవలె వికసించినవి. వారు అందరూ లక్ష్మణుణ్ణి కొనియాడినారు.

## ౭౨

అతికాయుణ్ణి మహాపరాక్రమవంతుడు లక్ష్మణుడు చంపివేసిన సంగతి రావణాసురుడు విన్నాడు. భయపడిపోయినాడు. అంతట రాక్షసయోధులను అందరినీ చూచి "ఆయుధధారులలో ఉత్తముడూ గొప్ప ధానుష్కుడూ పరమ కోపనుడూ అయిన ధూమ్రాక్షుడు చనిపోయినాడు. అకంపనుడూ ప్రహస్తుడూ కుంభకర్ణుడూ చనిపోయినారు. వాండ్లు అందరూ పరమపరాక్రమవంతులు. మహాబలవంతులు. వాండ్లే కాకుండా ఎప్పుడూ యుద్ధము కాంక్షిస్తూ శత్రు సైన్యాలను నాశనము చేసివేసే రాక్షసయోధులూ ఎన్నడూ అపజయము ఎరగని రాక్షసవీరులూ ఎందరో చనిపోయినారు. మహాపరాక్రమవంతులూ మహాకాయులూ నానా శస్త్రాస్త్రవిదులూ అయిన రాక్షసవీరులను అందరినీ రాముడు చంపివేసినాడు. అతడు ఎటువంటి క్లిష్టకార్యాన్ని అయినా ఇట్టే చేసివేస్తాడు, అతడు రాక్షసులలో అనేకమంది మహాప్రభావులనూ శూరులనూ ఇట్టే చంపివేసినాడు.

ఆ అన్నతమ్ములను ఆ శూరులను రామలక్ష్మణులను నా పుత్రుడు ఇంద్రజిత్తు దివ్యబాణాలతో బంధించివేసినాడు. ఆ బలపరాక్రమవంతుడు అదివరకే ఆ బాణాలు వ్యర్థము అయిపోకుండా ఉండే వరము సంపాదించినాడు. ఆ బాణబంధము భయంకరము అయింది. ఆ బంధాన్ని దేవతలు కానీ మహాబలవంతులు అయిన అసురులు కానీ యక్షులు కానీ గంధర్వులు కానీ విడిపించుకోలేరు. అటువంటి శరబంధాన్ని ఆ అన్నతమ్ములు రామలక్ష్మణులు విడిపించుకొన్నారు. అది వారి ప్రభావమో మాయో ఔషధబలమో తెలియలేదు. నా ఆజ్ఞను శిరసా వహించి యుద్ధము చేయడానికి పోయిన రాక్షసవీరులను అందరినీ ఆ మహాబలవంతులు వానరవీరులు వధించివేసినారు. ఇప్పుడు ఆ రామలక్ష్మణులను సుగ్రీవవిభీషణులతో కూడా పోరాడి శిక్షించే వీరుడు ఎవడూ నాకు కనిపించ

డము లేదు. ఆహా, ఆ రాముడు ఎంతగొప్ప బలవంతుడు. అతడి పరాక్రమ ఎంత గొప్పది-అతణ్ణి ఎదుర్కొన్న ప్రతి రాక్షసుడూ చచ్చిపోయినాడు. ఆ మహావీరుడు నాశరహితుడు అయిన శ్రీమన్నారాయణమూర్తి అయిఉండవలెను అని తోస్తున్నది అతడి భయమునుంచి లంకాపట్టణములో అందరూ లోపలివాకిళ్లూ వెలుపలి వాకిళ్లూ మూసి వేసుకొంటున్నారు.

"ఓ రాక్షసులారా, ఏమాత్రమూ ఏమరుపాటు లేకుండా మీరు మిమ్మలను కాపాడుకొంటూ ఈ లంకాపట్టణాన్ని జాగ్రత్తగా కాపాడవలెను. నా ఆజ్ఞ లేకుండా సీతాదేవిని ఉంచిన అశోకవనములోకి ఎవరినీ పోనీయవద్దు. లోపలినుంచి ఎవరినీ వెలుపలికి రానీయవద్దు. ఎక్కడ ఎక్కడ సేనానివేశాలు ఉండవలెనో అక్కడ అక్కడ మీరు మీ మీ సైన్యాలలో ఉండవలెను. అంతే కాదు. మీరు మీ మీ సైన్యాలతో పదే పదే అన్నిదిక్కులా తిరిగి చూస్తూనూ ఉండవలెను.

"ఓ రాక్షసులారా, మీరు సాయంకాలమప్పుడూ ప్రాతఃకాలమప్పుడూ అర్ధరాత్రమప్పుడూ అన్ని వేళలానూ వానరుల ప్రయత్నాలను కనిపెట్టుతూ ఉండవలెను. మీరు వానరులను ఎప్పుడున్నూ తక్కువవారు అనుకోవద్దు. వాండ్లు యుద్ధసన్నద్ధులు అవుతూఉందీ వచ్చి పయిన పడబోయేదీ నిలచిఉండీ ఎప్పుడూ కనిపెట్టి చూస్తూఉండవలెను" అని చెప్పినాడు.

ఆ మహాబలవంతులు రాక్షసయోధులు అందరూ తమ ఏలిక ఆజ్ఞాపించి నట్టుగా సర్వమూ నిర్వహించ సాగినారు.

అప్పుడు రావణాసురుడు దుఃఖము అనే శల్యముతో బాధపడుతూ తన అంతఃపురములోకి పోయినాడు. ఒకవైపున కోపాగ్ని రగులుకొంటూ ఉంటే పుత్రశోకముతో తపించిపోతూ పదే పదే నిట్టూర్పులు విడిచినాడు.

## ౭౩

ఆ యుద్ధరంగములో చావకుండా మిగిలిన రాక్షసయోధులు మరికొందరు అంతఃపురములోకి పోయి తమ ఏలికతో అతికాయుడే కాకుండా దేవాంతకుడూ మొదలు అయినవారు చనిపోయిన సంగతి చెప్పినారు. అది విని రావణాసురుడు కన్నీళ్లు కార్చినాడు. మూర్ఛ పోయినాడు. కొంచెము సేపటికి తెప్పరిల్లినాడు. తమ్ములూ పుత్రులూ చనిపోయినందుకు చాలా సేపు ఆలోచించినాడు.

అట్లా శోకసముద్రములో మునిగిపోయి ఆలోచిస్తూ ఉన్న తన తండ్రిని రాక్షసరాజును అప్పుడు ఇంద్రజిత్తు వచ్చి చూచి "ఓ తండ్రీ, నీవు సర్వరాక్ష

సులకూ అధిపతివి. ఇంద్రజిత్తు జీవించి ఉండగా నీవు దుఃఖపడ వలసిన పని లేదు. ఇంద్రజిత్తు బాణాలు తగిలిన వాడు ఎవడు అయినప్పటికిన్నీ జీవించి ఉండడము ఉత్తది. రాజా, ఇప్పుడే నీవు చూస్తూ ఉండగానే నా బాణాలతో ఆ రామలక్ష్మణులను ఛేదించి వేస్తాను. వాండ్లను ముక్కలు ముక్కలు చేసి వేస్తాను. దేహము అంతటా నా బాణాలు గుచ్చుకొని వాండ్లు చచ్చి నేలకూలు తారు. నేను పురుషబలముతోనూ దైవబలముతోనూ ప్రతిజ్ఞ చేసి చెప్పతూ ఉన్నాను. వినవలసింది. అమోఘము అయిన బాణాలతో ఆ రామలక్ష్మణులను నేను సంహారము చేసివేస్తాను. పూర్వము బలిచక్రవర్తి యజ్ఞవాటికలో విష్ణు మూర్తి పరాక్రమాన్ని చూచినట్టు ఇప్పుడు ఇంద్రుడూ యముడూ విష్ణువూ వరు ణుడూ సాధ్యులూ అశ్వినీ దేవతలూ సూర్యచంద్రులూ అగ్నిహోత్రుడూ ఇంతింత అని చెప్ప నలవి కాని నా పరాక్రమాన్ని చూస్తారు" అని చెప్పినాడు.

అంతట ఆ మహాధైర్యవంతుడు ఇంద్రజిత్తు తన తండ్రి రావణాసురుడికి వీడ్కోలు చెప్పి వాయువేగముతో పోయే రథము ఎక్కినాడు. సూర్యుడి రథమువంటి ఆ రథముమీద యుద్ధభూమికి బయలుదేరినాడు. కంచరగాడిదలు పూంచిన ఆ రథము వెంట మహాబలవంతులు అయిన రాక్షసులు అప్పుడు పరమ సంతోషముతో ప్రయాణము అయినారు. దారిలో కొందరు ధానుష్కులు. కొందరు అశ్వికులు. కొందరు గజసాదులు ఆ రాక్షసయోధులు అందరూ ఈటెలూ ఇనుప గుదియలూ ఖడ్గాలూ గండ్రగొడ్డళ్లూ గదలూ మొదలు అయిన ఆయుధాలతో ఆ ఇంద్రజిత్తును వెంబడించినారు.

అప్పుడు శంఖాలు పూరించినారు. భేరీలు మోగించినారు. రాక్షసులు స్తోత్రపాఠాలు చెప్పినారు. శంఖమువలెనూ చంద్రబింబమువలెనూ తేజరిల్లుతూ ఉన్న తెల్లటి గొడుగుకింద కూర్చున్న ఇంద్రజిత్తునుంచి ఆ రథము పూర్ణ చంద్రుడు ఉదయించిన ఆకాశమువలె తేజరిల్లింది. ఆ ధానుష్కుడికి బంగారు పిడులు వేసిన చామరాలతో అప్పుడు వీచినారు. సూర్యుడువచ్చి ఆకాశాన్ని తేజరిల్ల చేసేట్టు సూర్యుడివంటి ఆ తేజోవంతుడు ఆ ఎదురులేని పరాక్రమ వంతుడు ఇంద్రజిత్తు యుద్ధానికి బయలుదేరి అప్పుడు లంకాపట్టణాన్ని తేజరిల్ల చేసినాడు. ఆ మహాతేజోవంతుడు ఆ అరిందముడు ఆ విధముగా యుద్ధభూమికి పోగానే తన రథము దివ్యరథము కావడానికి హోమము చేయ సంకల్పించు కొన్నాడు. ఆ రథము చుట్టూ రాక్షసులను కావలిఉంచినాడు. అగ్నిహోత్ర ప్రభలతో తేజరిల్లుతూఉన్న ఆ ఇంద్రజిత్తు అంతట శాస్త్రోక్తముగానూ మంత్రయుక్తముగానూ అగ్నిహోత్రములో హోమము చేయడము మొదలు

పెట్టినాడు. ముందుగా ఆ అగ్నిహోత్రాన్ని గంధపుష్పాదులతో పూజించి సంస్కరించిన హవిస్సులతోనూ వరిపేలాలతోనూ హోమము చేసినాడు. ఆయుధాలను దర్భలుగా పరిచినాడు. తాండ్రకొమ్మలను సమిథలుగా చేసినాడు. ఎర్రటి వస్త్రాలు కట్టుకొని నల్లని ఇనుపతెడ్డు తీసుకొని హోమము చేస్తూ అగ్నిహోత్రానికి అన్నివైపులా దర్భలనూ తోమరాయుధాలనూ పరిచినాడు. అంతట నల్లమేక గొంతు నులిపివేసి సమిథలతో ఒక్కసారిగా అగ్నిహోత్రాన్ని రగులు కొలిపినాడు. పొగలూ గిగలూ లేకుండా అగ్నిహోత్రము జయసూచకముగా పెద్ద పెద్ద మంటలతో లేచింది. జ్వాలలు చుట్టూ ప్రదక్షిణము చేస్తూ ఉంటే మేలిమి బంగారు ఆభరణాలు ధరించిన అగ్నిహోత్రుడు స్వయముగా లేచి వచ్చి ఆ ఇంద్రజిత్తు ఇచ్చిన హవిస్సును తీసుకొని అంతర్ధానము అయిపోయినాడు. అంతట ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర మంత్రాన్ని జపము చేసినాడు. తననూ తన ధనుస్సునూ ఆ యుద్ధభూమిలో తనకు సంబంధించిన సమస్తాన్నీ మంత్రపూతము చేసినాడు. అట్లా అగ్ని హోత్రములో హోమముచేసి ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రమంత్రాన్ని జపము చేయగానే నవగ్రహాలూ నక్షత్రాలూ ఆకాశమూ చలించిపోయినవి.

అగ్నిహోత్రుడివంటి ఆ తేజోవంతుడు దేవేంద్రుడివంటి ఆ పరాక్రమ వంతుడు ఇంత అంత అని చెప్పనలవికాని ఆ మంత్రవేత్త ఇంద్రజిత్తు ఆ విధ ముగా హోమాదులు ముగించి ధనుర్బాణఖడ్గరథాశ్వసారధిసహితముగా ఆకా శానికి ఎగిరి అంతర్ధానము అయిపోయినాడు. అప్పుడు రథాలతోనూ గుర్రాల తోనూ పతాకాలతోనూ రాక్షససైన్యము యుద్ధోత్సాహముతో సింహనాదాలు చేస్తూ నేలమీద నడిచింది. ఆ నిశాచరయోధులను అందరినీ ఇంద్రజిత్తు పయి నుంచి చూస్తూ "ఓ యోధులారా, మీరు మంచి ఉత్సాహముతో వానరవీరు లను అందరినీ చంపివేయవలెను" అని చెప్పినాడు. అంతట ఆరాక్షసయోధులు బంగారుతో అలంకరించిన చిత్రవిచిత్రము అయిన బాణాలతోనూ తోమరా యుధాలతోనూ అంకుశాలతోనూ జయించవలెను. అనే కాంక్షతో గర్జిస్తూ భయంకరాకారులు అయిన వానరయోధులను ఎదిరించినారు. బాణవర్షము కురి పించినారు.

ఆకాశములో ఉన్న ఇంద్రజిత్తు ఆ రాక్షసయోధులను పురికొల్ప సాగి నాడు. ఆ రాక్షసయోధులు వానరయోధులను గదలతోనూ ముసలాయుధాల తోనూ కొట్టి హింసపెట్టుతూ ఉంటే పయినుంచి ఇంద్రజిత్తు వాండ్లమీద కరుకుకొనల ఇనుప బాణాలు కురిపించసాగినాడు. అట్లా వానరులను పైనుంచీ

కిందనుంచీ హింసపెట్టుతూ ఉంటే వానరయోధులు వృక్షాలు ఆయుధాలుగా తీసుకొని ఆకాశానికి ఎగిరి రణకర్కశుడు అయిన ఇంద్రజిత్తుమీదికి పోయి నారు. అప్పుడు ఆ మహాబలవంతుడు ఆ మహాతేజోవంతుడు ఇంద్రజిత్తు కోప ముతో రేగి ఆ వానరయోధులను అంతరిక్షములోనే చించి చెండాడినాడు. రాక్షసులను బాగా సంతోషపెట్టడానికోసము ఒక్కొక్క బాణముతో అయిదుగురినీ ఏడుగురినీ తొమ్మిదిమందినీ వానరయోధులను ఛేదించివేసినాడు. జయించసలవికాని ఆ ఇంద్రజిత్తు అంతట సూర్యకిరణాలవలె కన్నులు మిరు మిట్లు కొలిపే బంగారు బాణాలను కిందఉన్న వానరయోధులమీద వదిలినాడు.

ఆ బాణాలకు దేహాలు ఛిన్నాభిన్నము అయి వానరయోధులు నేల కూలి నారు. ఆ పోరాటములో జయించకలము అనే ఆశ అప్పుడు వానరయోధులకు పోయింది. దేవాసురయుద్ధములో మహాసురులవలె వానరయోధులు నేల కూలి నారు. వారిలో మేటి వానర వీరులు లేచినారు. సూర్యకిరణాలవంటి బాణా లతో ఎదిరించ నలవి కాకుండా సూర్యుడివలె తేజరిల్లుతూ ఉన్న ఆ ఇంద్ర జిత్తు మీదికి ఆ మేటి వానర వీరులు శిలాయుధాలతోనూ వృక్షాయుధాలతోనూ పోయినారు. రామకార్యార్థము తమ ప్రాణాలమీద ఆశ వదులుకొని ఇంద్ర జిత్తును ఆ వానరవీరులు అన్ని సైపులా ముట్టడించి వృక్షాలూ శిలలూ పర్వత శిఖరాలూ వానగా కురిపించినారు. ఆ జయశీలి ఆ మహాసమర్థుడు తన మీదనూ తన రాక్షససైన్యము మీదనూ ఆ వృక్షాలూ శిలలూ పడకుండా బాణాలు వదిలి నాడు. అగ్నిహోత్రమువంటి బాణాలనూ మహాసర్పాలవంటి బాణాలనూ వదిలి ఇంద్రజిత్తు ఆ వానరసైన్యాన్ని భేదించినాడు.

అప్పుడు ఇంద్రజిత్తు పద్దెనిమిది కరుకు బాణాలను గంధమాదనుడిమీద వదిలినాడు. తొమ్మిది బాణాలను దూరాన ఉన్న నలుడిమీద వదిలినాడు. ఏడు బాణాలను మైందుడి మర్మస్థానాలను గురిచేసి వదిలినాడు. అయిదు బాణాలు గజుడి మీదనూ పది బాణాలు జాంబవంతుడి మీదనూ ముప్పయి బాణాలు నీలుడి మీదనూ వదిలినాడు. వర ప్రభావమువల్ల తీక్షణమూ భయంకరమూ అయిన బాణాలను వదిలి సుగ్రీవుణ్ణీ ఋషభుణ్ణీ అంగదుణ్ణీ ద్వివిదుణ్ణీ మూర్ఛ పోగొట్టినాడు.

అప్పుడు ఆ ఇంద్రజిత్తు ప్రళయకాలాగ్నిహోత్రమువలె రేగి తక్కిన మేటి వానరవీరులను హింసించినాడు. సూర్యకిరణాలవంటి అతి తీక్ష్ణము అయిన బాణాలను అమితవేగముతో లాగి వదలి పెట్టి వానరసైన్యాన్ని పడగొట్టి నాడు. అట్లా వందల కొద్దీ వేలకొద్దీ వదిలిన తన బాణాలకు వానరసైనికులు

దేహాలు గాయాలుఅయి నెత్తురు కారుతూ వ్యాకులపడిపోవడమూ మూర్ఛ పోవడమూ చూచి సంతోషపడ్డాడు. ఆ రాక్షసరాజపుత్రుడు ఇంద్రజిత్తు మళ్లీ దారుణముగా ఖడ్గాద్యాయుధాలనూ బాణాలనూ వానగా కురిపించి వానరసైన్యాన్ని మర్దించినాడు. అంతటితో తనివి తీరక తన సైన్యాన్ని వదిలి పెట్టి వానరసైన్యములో చొరబడి ఎవరికీ కనపడకుండా మాయము అయిపోయి పయినుంచి ప్రళయకాలమేఘము జలధారలను వర్షించేట్టు మహాభయంకర బాణ వర్షాన్ని ఆ వానరసైన్యముమీద కురిపించినాడు. ఇంద్రజిత్తు కురిపించిన ఆ బాణవర్షానికి వానరయోధులు భిన్నదేహులు అయి మాయామోహితులు అయి వికారస్వరాలతో కేకలు పెట్టుతూ దేవేంద్రుడి వజ్రాయుధము దెబ్బకు ముక్కలు ముక్కలు అయిపోయిన పర్వతాలవలె నేల కూలినారు. ఆ వానర యోధులు తమమీద వచ్చిపడుతూఉన్న తీక్ష్ణబాణాలను చూచినారే కాని మాయము అయిపోయిన ఇంద్రజిత్తును చూడలేదు. అంతట అతడు సూర్యకిర ణాలవంటి బాణాలు వదులుతూ దిక్కులు తెలియకుండా చేసివేసినాడు. అగ్ని జ్వాలలవంటి శూలాలనూ ఖడ్గాలనూ గండ్రగొడ్డళ్లనూ నిప్పులు రాలేట్టు గిర గిర తిప్పుతూ ఆ వానరసైన్యముమీద వేసినాడు. ఆ ఇంద్రజిత్తు వదిలిన అగ్ని హోత్రమువంటి ఆ తీక్ష్ణాయుధాల దెబ్బలకు ఆ వానరుల దేహాలనుంచి నెత్తురు వెల్లువలు అయి కారింది. వారు అందరూ విరగ పూసిన మోదుగుచెట్లవలె కని పించినారు. భిన్నదేహులు అయి ఒకరిమీద ఒకరు పడి వికృతస్వరాలతో కేకలు పెట్టుతూ కూలిపోయినారు. అప్పుడు వారిలో కొందరు తలలు పైకి ఎత్తి చూస్తూ ఉంటే బాణాలు వచ్చి వారి కళ్లలో పడ్డవి. అట్లా కన్నులు పోయి ఆ వానరయోధులు ఒకరిని ఒకరు పట్టుకొపోయి అందరూ నేలకూలినారు.

ఈవిధముగా వానరయూథపతులను అందరినీ గదాద్యాయుధాలతోనూ బంగారు బాణాలతోనూ పడకొట్టి ఆ ఇంద్రజిత్తు సూర్యకిరణాలవంటి తీక్ష్ణ బాణాలను తీసుకొని రామలక్ష్మణులను గురిచేసి వదిలినాడు. అట్లా తమమీద బాణవర్షము కురిపిస్తూఉంటే ఆ పరమాద్భుత ధైర్యవంతుడు రాముడు ఆ బాణ వర్షాన్ని లెక్కచేయకుండా ఏదో వానకురుస్తూ ఉన్నట్టుగా నిలుచుని లక్ష్మ ణుణ్ణిచూచి "తమ్ముడా, దేవేంద్రుణ్ణి జయించిన ఈ రాక్షసేంద్రుడు ఇంద్ర జిత్తు బ్రహ్మాస్త్రము అనుసంధించిన బాణాలతో భయంకరముఅయిన వానర సైన్యాన్ని పడకొట్టినాడు. ఇప్పుడు మనమీదకూడా బాణాలు వదులు తున్నాడు. ఈ మహాధైర్యవంతుడు ఇంద్రజిత్తు బ్రహ్మదేవుడి వరప్రభావము వల్ల అదృశ్యుడుఅయి ఆకాశమునుంచి బ్రహ్మాస్త్రాలను వదులుతున్నాడు. కాబట్టి వీణ్ణి ఇప్పుడు కొట్టడానికి వీలు లేదు.

"ఓ ధీమంతుడా, ఈ అస్త్రము ఛేదించ నలవికాని మహోత్కృష్టుడూ పూజ్యుడూ అయిన బ్రహ్మదేవుడిది అనుకొంటున్నాను. అందువల్ల నీవున్నూ నావలె నిశ్చలమనస్కుడవు అయి ఈ బాణపాతాన్ని ఓర్చుకో. ఇప్పుడు ఈ ఇంద్రజిత్తు బాణవర్షముతో దిక్కులు తెలియకుండా చేసి వేస్తున్నాడు. వానర రాజసైన్యము అంతా సేనానాయకులతో కూడా మూర్ఛపోయి ఉంది. మనము ఇప్పుడు కోపమూ యుద్ధోత్సాహమూ వదిలిపెట్టి యుద్ధము చేయకుండా మూర్ఛ పోయేట్లయితే జయలక్ష్మి తనను వరించింది అనుకొని సంతోషముతో ఇంద్ర జిత్తు తప్పకుండా లంకాపట్టణానికి పోతాడు" అని చెప్పినాడు.

అంతట రామలక్ష్మణులు ఇంద్రజిత్తు బాణాలకు మూర్ఛపోయినారు. అది చూచి ఇంద్రజిత్తు పరమసంతోషముతో ఆ యుద్ధభూమిలో సింహనాదము చేసినాడు.

ఆ విధముగా రామలక్ష్మణులూ వానరసైన్యమూ పడిపోయిన తరువాత ఇంద్రజిత్తు లంకాపట్టణానికి పోయినాడు.

## ౭౪

అప్పుడు ఆ యుద్ధభూమిలో రామలక్ష్మణులు మూర్ఛపోయినారు. వానర సైన్యము అంతా మూర్ఛపోయి ఉంది. సుగ్రీవుడూ నీలుడూ అంగదుడూ జాంబవంతుడూ కొంచెము అయినా స్మారకము లేకుండా పడి ఉన్నారు. అట్లా బాధపడుతూ ఉన్న ఆ వానరసైన్యాన్ని విభీషణుడు చూచినాడు. ఆ మహాబుద్ధిమంతుడు కొన ఊపిరితో ఉన్న వానరసేనానాయకులనూ వానర వీరు లనూ చూచి "ఓ వానరవీరులారా, మీరు భయపడవద్దు. రామలక్ష్మణులు వివ శులు అయిపోయినారు అని మీరు దుఃఖపడవద్దు. వారు బ్రహ్మదేవుణ్ణి గౌర వించడాని కోసము ఇంద్రజిత్తు వదిలిన బాణాలకు కట్టుపడిపోయినారు. బ్రహ్మ దేవుడు ఇంద్రజిత్తుకు అత్యమోఘ వేగముతో పోయే బ్రహ్మాస్త్రాన్ని ఇచ్చినాడు. బ్రహ్మదేవతాకము అయిన ఆ పరమాస్త్రాన్ని గౌరవించడానికోసము రామ లక్ష్మణులు యుద్ధభూమిలో పడిపోయినారు. అందువల్ల మీరు ఇప్పుడు దుఃఖ పడవలసిన అవసరము ఏమీ లేదు" అంటూ అప్రతిమానవాక్యాలతో ఓదార్చి నాడు.

ఆ బ్రహ్మాస్త్రాన్ని గౌరవించిన బుద్ధిమంతుడు హనుమంతుడు అప్పుడు ఆ విభీషణుడి మాటలు విని "ఓ రాక్షసోత్తముడా, బలవంతులు అయిన వానరులు అందరూ దెబ్బ తిన్నారు. ఈ వానరసైన్యములో ఇంకా ప్రాణాలతో ఉన్న వారిని అందరినీ మనము ఓదారుద్దాము" అని చెప్పినాడు.

అంతట ఆ రాత్రిసమయాన ఆ రాక్షసవీరుడు విభీషణుడూ ఆ వానర వీరుడు హనుమంతుడూ కాగడాలు పట్టుకొని ఒక్కసారిగా ఆ యుద్ధభూమి అంతటా తిరిగి చూచినారు. తోకలు తెగిపోయిన వారిని చేతులు తెగిపోయిన వారినీ తొడలు తెగిపోయినవారినీ కాళ్లూ వేళ్లూ తెగిపోయిన వారినీ కంఠాలు తెగిపోయిన వారినీ నెత్తురు కారుతూ నేలమీదపడి అటూ ఇటూ పొర్లాడుతూ ఉన్న పర్వతాకారులను వానరులనూ అంతటా చెల్లా చెదరుగా పడి ధగధగ లాడుతూ ఉన్న ఆయుధాలనూ చూచినారు. ఆ పోరాటములో దెబ్బతిని పడి పోయిన సుగ్రీవుణ్ణీ అంగదుణ్ణీ నీలుణ్ణీ శరభుణ్ణీ గంధమాదనుణ్ణీ గవాక్షుణ్ణీ సుషే ణుణ్ణీ వేగదర్శినీ ఆహుకుణ్ణీ మైందుణ్ణీ నలుణ్ణీ జ్యోతిర్ముఖుణ్ణీ ద్వివిదుణ్ణీ పనసుణ్ణీ ఇంకా తక్కిన వానరవీరులనూ చూచినారు. ఆనాటి సాయంకాలము ఇంద్ర జిత్తు వదిలిన బ్రహ్మాస్త్రానికి అరవై ఏడుకోట్ల మంది వానరయోధులు హతము అయిపోయినారు. భయంకరబాణాల దెబ్బలు తిని మహాసముద్ర ప్రవాహాలవలె పడివున్న ఆ వానరసైన్యాలలో అప్పుడు ఆ హనుమంతుడూ విభీషణుడూ జాంబవంతుడి కోసము వెతికినారు. వందలకొద్ది బాణాలు దేహము అంతటా గుచ్చుకొని మంటలు ఆరిపోతున్న అగ్నిహోత్రమువలె పడివున్న ఆ వయో వృద్ధుణ్ణి ఆ జ్ఞానవృద్ధుణ్ణి బ్రహ్మపుత్రుణ్ణి జాంబవంతుణ్ణి అక్కడ ఒక చోట విభీషణుడు చూచినాడు. ఆపరమపరాక్రమవంతుడి దగ్గరకుపోయి "ఓపూజ్యుడా, తీక్ష్ణబాణాల దెబ్బకు నీవు ప్రాణాలు కోలుపోలేదు కదా" అని విభీషణుడు అడిగినాడు.

అప్పుడు ఆ భల్లూకవీరుడు ఎంతో కష్టముమీద మాటలు కూడపలుకుతూ "ఓ రాక్షసోత్తమా, నీ కంఠస్వరాన్ని పట్టి నిన్ను నేను గుర్తు పట్టినాను. నేను తీక్ష్ణబాణాలు గుచ్చుకొని మహాబాధపడుతున్నాను. కన్నులు తెరవలేకుండా ఉన్నాను. ఓ విభీషణుడా, అంజనాదేవి కడుపు చల్లగా పుట్టిన ఆ వాయు పుత్రుడు హనుమంతుడు జీవించి ఉన్నాడా" అని అడిగినాడు.

"ఓ పూజ్యుడా, నీవు రామలక్ష్మణులను వదలిపెట్టి ఆ వాయుపుత్రుణ్ని గురించి అడుగుతున్నావు, కారణము ఏమిటి? ఓ ముసలివాడా నీకు ఆ హను మంతుడిమీద ఉన్న స్నేహము వానరరాజు సుగ్రీవుడి మీదకానీ యువరాజు అంగదుడి మీదకానీ రామప్రభువు మీదకానీ లేదు. ఎందువల్లను" అని విభీ షణుడు అడిగినాడు.

"ఓ రాక్షస శార్దూలమా, నేను ఆ మారుతినిగురించి ఎందుకు అడిగినానో చెప్పుతాను విను. ఆ వీరుడు హనుమంతుడు జీవించి ఉన్నట్లయితే హతము అయి

పోయిన వానరసైన్యము అంతా జీవించిఉన్నట్టే. ఆ హనుమంతుడు ఒక్కడూ చనిపోయి ఉన్నట్లయితే మనము అందరము జీవించి ఉన్నప్పటికిన్నీ చచ్చి పోయినట్లేను. నాయనా విభీషణుడా, ఏమంటే ఆ హనుమంతుడు వేగానికి వాయువుతో సరిసమానము అయినవాడు, పరాక్రమానికి అగ్నిహోత్రుడితో సరిసమానము అయినవాడు, అంగువల్ల అతడు జీవించిఉన్నట్లయితే అందరూ జీవిస్తారు అని నా ఆశ" అని జాంబవంతుడు చెప్పినాడు.

అప్పుడు హనుమంతుడు ఆ వృద్ధుడిదగ్గరకు పోయినాడు. నియమబద్ధముగా ఆ జాంబవంతుడి పాదాలు పట్టుకొని నమస్కారము చేసినాడు. ఆ భల్లూక రాజు అప్పుడు హనుమంతుడి కంఠస్వరము విని దేహమునిండా గుచ్చుకొన్న బాణాలవల్ల వ్యథపడుతూ ఉన్నప్పటికిన్నీ పునర్జన్మము ఎత్తినట్టు భావించి నాడు. ఆ మహాతేజోవంతుడు అంతట హనుమంతుడితో "ఓ వానర శార్దూలమా రా, నాయనా, నాదగ్గరకు రా, నీవు ఇప్పుడు వానరులను అందరినీ కాపాడ వలెను. పరాక్రమానికి నీకు చాలినవాడు మరిఒకడు ఎవడూ లేడు. ఈ వానరులకు అందరికీ నీవే ఆప్తుడవు, నీ పరాక్రమము చూపించవలసిన సమయము ఇప్పుడు వచ్చింది. నీవలె పరాక్రమించకలవాడు ఎవడూ లేడు. వానరవీరులనూ వారి సైన్యాలనూ భల్లూకవీరులనూ వారి సైన్యాలనూ నీవు కాపాడవలెను, రామ లక్ష్మణుల ప్రణాలు నయము చేయవలెను.

"ఓ హనుమంతుడా, నీవు ఇప్పుడు సముద్రముపైనుంచి బహుదూరము ప్రయాణముచేసి హిమత్పర్వతానికి పోవలెను. అక్కడ ఎంతోఎత్తున ఋషభము అనే కాంచన పర్వతశిఖరమూ కైలాపర్వత శిఖరమూ కనపడుతవి, ఆ పర్వత శిఖరాల మధ్యను ఓషధిపర్వతము ఉంది. అక్కడ సర్వౌషధులూ ధగధగ లాడుతూ కనపడతవి, ఆ పర్వతము సాటిలేని కాంతులతో తేజరిల్లుతూ ఉంటుంది.

"నాయనా, ఆ ఓషధిపర్వతము మీద నాలుగు ఓషధులు ఉన్నవి. అవి దేదీప్యమానముగా ప్రకాశిస్తూ దిశదిశలనూ తేజరిల్ల చేస్తూ కనపడుతవి. ఆ ఓష ధులలో సంజీవకరణి ఒకటి. దానివల్ల చచ్చిపోయినవారు బ్రతుకుతారు.విశల్య కరణి అనే మూలిక రెండవది. దానివల్ల ప్రణాలు నయము అయి పోతవి. సౌవర్ణకరణి మూడవ ఓషధి. దానివల్ల గాయాల మచ్చలూ వైవర్ణ్యమూ లేకుండా దేహము ఎప్పటి మాదిరిగా అవుతుంది. నాల్గవది సంధానకరణి. అది తెగిపోయిన అవయవాలను అతికిస్తుంది.

"ఓ వాయుపుత్రుడా, నీవు పోయి ఈ నాలుగు మూలికలనూ వెంటనే తీసుకొని రావలెను. చనిపోయిన వానరులను అందరినీ బ్రతికించవలెను. వాండ్లను అందరినీ స్వస్థచిత్తులను చేయవలెను" అని చెప్పినాడు.

ఇట్లా జాంబవంతుడు చెప్పింది విని హనుమంతుడు జలప్రవాహాలతో పెరిగిపోయే మహాసముద్రము వలె సంతోష బలాతిశయాలతో పెరిగిపోయి ఆ త్రికూట పర్వతాగ్రము మీదికి పోయినాడు. ఆ పర్వతోత్తమాన్ని మరి ఒక పర్వతమువలె హనుమంతుడు నలగ తొక్కినాడు. ఆ పర్వతాకారుని పాదఘట్టనలకు ఆ పర్వతము చితికి చితికిలపడి పోయింది. అది ఎప్పటివలె నిలవలేక పోయింది. ఆ పర్వతశిఖరాలు రాలి చెల్లా చెదరుగా పడిపోయినవి. ఆ పర్వతము మీద చెట్లు విరిగి నేల కూలినవి. ఎండు చెట్లు మంటలు మండినవి. ఆ హనుమంతుడి పాదఘట్టనలకు ఆ పర్వతము గజ గజ వణికిపోతూనూ రాళ్లు పగిలి చెల్లా చెదరుగా పడిపోతూనూ చెట్లు విరిగిపడిపోతూనూ ఉంటే వానర యోధులు అక్కడ నిలువలేక పోయినారు.

లంకాపట్టణద్వారాలు కదిలిపోతూనూ ఆ యాగృహాలూ గోపురాలూ పడిపోతూనూ రాక్షసులు అందరూ భయపడుతూనూ కలవర పడి పోతూనూ ఉంటే ఆ రాత్రి ఆ లంకాపట్టణము నాట్యమాడుతున్నటుగా కనిపించింది. ఆ మహాకాయుడి పాదఘట్టనలకు ఆ త్రికూటపర్వతమే కాకుండా భూమీ సముద్రమూ కంపించి పోయినవి.

అప్పుడు హనుమంతుడు అక్కడనుంచి (ఆ త్రికూటపర్వతముమీది నుంచి సమీపములోఉన్న) మలయపర్వతము మీదికి ఎగిరిపోయినాడు. మేరు మందరపర్వతాలవంటి ఆ మలయపర్వతము ఎన్నో సెలవిళ్లతోనూ నానావిధ వృక్షాలతోనూ లతలతోనూ జలాశయాలతో వికసిస్తూఉన్న కమలాలతోనూ అంతటా తిరుగుతూఉన్న వివిధ మృగాలతోనూ ఎన్నో గుహలతో నూ అరవై యోజనాల ఎత్తునఉంది. అక్కడ దేవతలూ అప్సరసలూ గంధర్వులు, విద్యాధరులు మహర్షులూ విహరిస్తూ ఉంటారు. మహా మేఘమువంటి ఆ వాయుపుత్రుడు హనుమంతుడు అక్కడ అప్పుడుఉన్న యక్ష గంధర్వకిన్నరులు అందరూ భయపడిపోయేట్టు తన కాయాన్ని పెంచి నాడు. పాదాలతో ఆ పర్వతాన్ని పడతొక్కుతూ భయంకరముఅయిన బడ బాముఖమువంటి తన నోరు తెరిచి రాక్షసులను భయపెట్టడానికి పెద్ద పెట్టున గర్జించినాడు. ఆ హనుమంతుడి అద్భుత గర్జనము లంకాపట్టణములోఉన్న

రాక్షసులు అందరూ అప్పుడు విన్నారు. వారికి భయము వేసింది. కదలలేకపోయినారు. మెదలలేకపోయినారు. నిశ్చేష్టులు అయిపోయినారు.

ఆ భయంకర పరాక్రముడు ఆ పరంతపుడు హనుమంతుడు అప్పుడు రాముడికి మనసా నమస్కారము చేసినాడు. రాముణ్ణి సంతోష పెట్టడానికి ఆ మహోత్కృష్ట కార్యము నిర్వహించ పూనుకొన్నాడు. అంతట ఆ చండ వేగుడు సర్పమువంటి తన తోకను పైకి ఎత్తినాడు. వీపు వంచినాడు. చెవులు కుంచించినాడు. బడబా ముఖమువంటి నోరు తెరిచినాడు. ఆకాశానికి ఎగిరినాడు. హనుమంతుడి బాహువుల వేగానికీ తొడల వేగానికీ అప్పుడు ఆ పర్వతము మీద వృక్షాలూ శిలలూ శైలాలూ మామూలు కోతులూ పైకి ఎగిరి కొంత దూరము ఆ హనుమంతుణ్ణి వెంబడించి సముద్రజలాలలో పడిపోయినవి. అప్పుడు ఆ హనుమంతుడు సర్పాలవంటి తన బాహువులను చాచి గరుత్మంతుడి పరాక్రమముతో దిక్కులను కలవర పెట్టుతూ హిమవత్పర్వతాన్ని ఉద్దేశించి ఉత్తర దిక్కుగా పోతూ అలలు చిమ్మిరేగుతూనూ పైకి వచ్చిన జలజంతువులు గిర్రున తిరుగుతూనూ ఉన్న మహాసముద్రాన్ని చూస్తూ విష్ణుమూర్తి చేతిలోనుంచి వదిలిన చక్రాయుధమువలె కనిపించినాడు. తన తండ్రి వాయుదేవుడివంటి వేగముతో పరాక్రమముతో ఆకాశమార్గాన విమాత్రమూ శ్రమపడకుండా పోతూ హనుమంతుడు మార్గమధ్యములో పర్వతాలనూ మహారణ్యాలనూ సరస్సులనూ నదులనూ చెరువులనూ పెద్ద పెద్ద పట్టణాలనూ సర్వసమృద్ధముగా ఉన్న జనపదాలనూ చూచినాడు. ఆ వానరశార్దూలము అట్లా వాయుదేవుడివలె మహత్తరము అయిన వేగముతో పోతూవుంటే దిక్కులు పిక్కటిల్లిపోయినవి. జాంబవంతుడు చెప్పిన మాటలు స్మరించుకుంటూ వాయువేగముతో పోతూ వున్న హనుమంతుడు హిమవత్పర్వతాన్ని చూచినాడు.

ఎన్నెన్నో సెలయేళ్లతోనూ ఎన్నెన్నో జలప్రవాహాలతోనూ ఎన్నెన్నో గుహలతోనూ తెల్లటి మేఘసమూహాలవంటి మనోహరముఅయిన శిఖరాలతోనూ వివిధ వృక్షాలతోనూ లతలతోనూ శోభాయమానముగా ఉండే ఆ హిమవత్పర్వతము మీదికి పోయినాడు. ఆ మహాపర్వత శృంగాలు ఎంతో ఎత్తు అయినవి. ఎంతో భయంకరము అయినవి. ఆ శిఖరాలమీదికి హనుమంతుడు పోయినాడు. దేవర్షిసమూహాలనూ వారు నివసించే మహా పుణ్యాశ్రమాలనూ చూచినాడు. ఆ హిమవత్పర్వతము మీదఉన్న బ్రహ్మకోశాన్నీ కైలాసాన్నీ దేవేంద్రుడి ఆశ్రమస్థానాన్నీ రుద్రదేవుడు విలాసార్థము బాణాలువదిలే స్థానాన్నీ

హయగ్రీవక్షేత్రాన్నీ ధగధగలాడుతూ ఉండే బ్రహ్మకపాలాన్నీ యమకింకరుల విశ్రమస్థానాన్నీ బ్రహ్మదేవుడు దేవేంద్రుడికి వజ్రాయుధము ఇచ్చిన స్థానాన్నీ సూర్యుడివలె తేజరిల్లే కుబేరస్థానాన్నీ సూర్యుని బంధనస్థానాన్నీ బ్రహ్మాసన స్థానాన్నీ శివధనుః స్థానాన్నీ భూమినుంచి పాతాళముపోయే రంధ్రస్థానాన్నీ ఉత్తమోత్తమము అయిన కైలాసపర్వతాన్నీ హిమవచ్ఛిలనూ ఋషభము అనే కాంచనపర్వతాన్నీ రాత్రిపూట సమస్తౌషధులతో జ్వలించే సర్వౌషధిపర్వతాన్నీ చూచినాడు. అగ్నిజ్వాలలవలె ధగధగలాడుతూ ఉన్న ఆ పర్వతాన్ని చూచి ఆశ్చర్యపోయినాడు. ఆ ఓషధి పర్వతముమీద అంతట మూలికల కోసము వెతకడము మొదలు పెట్టినాడు.

ఆ విధముగా దివ్యౌషధులకోసము వెతుకుతూ ఆ పర్వతముమీద అనేకవేల యోజనాలమేర తిరిగినాడు. ఆ పర్వతముమీద ఉన్న మహౌషధులు తమను అప్పుడు ఆ హనుమంతుడు ఎత్తుకొని పోతాడు అని తెలుసుకొని అవి అతనికి కనపడకుండా అంతర్ధానము అయిపోయినవి. అట్లా ఆ ఓషధులు అన్నీ కనబడకుండా పోయినందువల్ల అప్పుడు హనుమంతుడికి కోపము వచ్చింది. కోపముతో పెద్ద పెద్ద కేకలు పెట్టుతూ నిప్పులవలె కన్నులు ఎఱ్ఱచేసి ఆ పర్వతముతో "ఓ ఓషధిపర్వతమా, నీవు రాముడిమీద దయ లేకుండా ఉన్నావు. ఇదే—ఇట్లా ఓషధులను కనపడకుండా చేయడమే నీ నిశ్చయము అయినట్లయితే నా బాహుబలముతో నిన్ను పెళ్లగించి వేస్తాను. నిన్ను పిండి పిండి చేసి వెదచల్లుతాను. చూడు" అని చెప్పి శోభాయమానము అయిన నెత్తాలతోనూ మహావృక్షాలతోనూ మహాసర్పాలతోనూ బంగారము తోనూ వేలకొద్దీ గైరికధాతువులతోనూ చిన్న చిన్న శిఖరాలతోనూ ఉన్న ఆ పర్వతశిఖరాన్ని పట్టుకొని ఇట్టే పెళ్లగించి వేసినాడు. సురాసుర లోకాల వారు అందరూ భయపడిపోయేట్టు ఆ పెళ్లగించిన పర్వతాన్ని చేతిలో పట్టుకొని హనుమంతుడు ఆకాశానికి ఎగిరి గరుడోగ్రవేగముతో పోతూఉంటే దేవతలు అందరూ అతనిని స్తోత్రము చేసినారు.

సూర్యకాంతులతో తేజరిల్లుతూవున్న ఆ ఓషధిపర్వతాన్ని పట్టుకొని అంతరిక్షములో సూర్యుడి సమీపాన పోతూఉన్న సూర్యసమాన కాంతిమంతుడు ఆ హనుమంతుడు అప్పుడు రెండవ సూర్యుడివలె కనిపించినాడు. అట్లా ఆ పర్వతాన్ని పట్టుకొని ఆకాశములో పోతూఉన్న ఆ పర్వతాకారుడు వాయుపుత్రుడు హనుమంతుడు అప్పుడు వెయ్యి అంచులతోనూ అగ్నిజ్వాలల

తోనూ తేజరిల్లే చక్రాయుధము పట్టుకొని పోతూఉన్న మహావిష్ణువువలె తోచినాడు.

అప్పుడు అట్లా ఆ ఓషధిపర్వతముతో వస్తూఉన్న ఆ మారుతాత్మజుణ్ణి హనుమంతుణ్ణి చూచి వానరవీరులు సంతోషాతిశయముతో గర్జించినారు. ఆ ఓషధిపర్వతవాసన సోకినంత మాత్రానే లేచి గర్జిస్తూఉన్న వానరవీరులను చూచి హనుమంతుడు మహా గంభీరముగా ఉచ్చైఃస్వరముతో గర్జించినాడు. ఆ వానరుల గర్జాధ్వనులు విని లంకాపట్టణములో ఉన్న రాక్షసులు భయపడి వెర్రికేకలు పెట్టినారు. అప్పుడు ఆ మహానుభావుడు హనుమంతుడు ఓషధి పర్వతముతో ఆ త్రికూటపర్వతముమీద ఉన్న వానరసేనామధ్యములో దూకినాడు. వానరోత్తములకు శిరసా నమస్కారము చేసినాడు. విభీషణుణ్ణి కౌగలించుకొన్నాడు.

ఆ మహౌషధిగంధాన్ని అప్పుడు రామలక్ష్మణులు ఆఘ్రాణించినారు. వారి వ్రణాలు అన్నీ అప్పటికి అప్పుడు నయము అయిపోయి లేచినారు. ఆ మూలికల వాసన సోకిన తక్కిన వానరులున్నూ గాయాలు నయముఅయి లేచినారు. ఆ యుద్ధభూమిలో చచ్చిపడిఉన్న వానరయోధులు ఆ దివ్యౌషధి గంధము సోకగానే రాత్రి నిద్రపోయి తెల్లవారగానే లేచినట్టు వ్రణాలు అన్నీ నయముఅయి ఏ రోగమూ నొప్పీ లేకుండా హాయిగా లేచినారు.

ఆ లంకాపట్టణములో రాక్షసులకూ వానరులకూ యుద్ధము ఆరంభము అయింది మొదలు అంతవరకూ వానరుల చేతులలో చావ సిద్ధముఅయి పడిపోయిన రాక్షసులనూ చచ్చిపోయిన రాక్షసులనూ రావణాసురుడు తనకు లెక్క తెలియడానికో కాక ఇంతమంది రాక్షసులు చచ్చిపోయినారు అని ఇతరులకు లెక్క తెలియకుండా ఉండడానికో సముద్రములో పారతోయించినాడు. అందువల్ల వానరులమాదిరిగా చచ్చిపోయిన రాక్షసయోధులకు అందరికీ ఆ దివ్యౌషధగంధము సోకి బ్రతికే అవకాశము లేకుండాపోయింది.

అంతట ఆ వాయుపుత్రుడు హనుమంతుడు ఆ ఓషధిపర్వతాన్ని పట్టుకొనిపోయి హిమవత్పర్వతముమీద వదిలిపెట్టి వెంటనే తిరిగివచ్చి రాముణ్ణి కలుసుకొన్నాడు.

## ౭౫

ఆ మహాపరాక్రమవంతుడు వానరరాజు సుగ్రీవుడు ఇకను అంతట జరగ వలసిన పనినిగురించి రాముడికి విన్నవించి హనుమంతుణ్ణి చూచి "ఓ మారుతీ,

రావణాసురుడి కొడుకులు చచ్చిపోయినారు. ఆతడి తమ్ముడు కుంభకర్ణుడు చచ్చిపోయినాడు. ఆ దుఃఖమువల్ల అతడు ఇప్పుడు లేచివచ్చి యుద్ధము చేయలేడు. కాబట్టి మహాబలవంతులూ అమితవేగవంతులూ అయిన మన వానర వీరులు అందరూ ఇప్పుడు దివిటీలతోపోయి లంకాపట్టణాన్ని ముట్టడించవలెను" అని ఆజ్ఞాపించినాడు.

వానరవీరులు అందరూ సుగ్రీవాజ్ఞను శిరసావహించినారు. సూర్యాస్తమయము అయింది. చిమ్మచీకట్లు కమ్ముకొన్నవి. దివిటీలు తీసుకొని వానరవీరులు అందరూ లంకాభిముఖులు అయి నడిచినారు. అట్లా దివిటీలు పట్టుకొని వానర వీరులు అన్ని వైపులనుంచి తమ లంకాపట్టణముమీదికి రావడము కావలివాండ్లు చూచినారు భయపడిపోయినారు. అంతట ఆ వికారనేత్రులు అక్కడనుంచి లంకాపట్టణములోకి పరుగులెత్తి పారిపోయినారు.

అప్పుడు ఆ వానరవీరులు పరమ సంతోషముతో లంకాపట్టణద్వారాలకూ ప్రాకారముమీది బురుజులకూ రాజవీథిలో ప్రాసాదగృహాలకూ చిన్నచిన్న వీథులలో ఉన్న చిన్నచిన్న ఇండ్లకూ నిప్పు అంటించినారు. వానరులు వదిలిపెట్టిన ఆ అగ్నిహోత్రుడు అప్పుడు వందలకొద్దీ వేలకొద్దీ గృహాలను దహించివేయడము మొదలుపెట్టినాడు.

పర్వతాలు అంతటి ప్రాసాదగృహాలు తగులపడి ఇట్టే నేల కూలినవి. ఆ యా గృహాలలో అగరూ శ్రీచందనమూ తగులపడుతూ సుగంధధూపవాసనలు అంతటా గుబాళించినవి. ముత్యాలూ రత్నాలూ పగడాలూ తెల్లటి పట్టుబట్టలూ శోభాయమానము అయిన పట్టు చీరలూ గొఱె.వెంట్రుకల కంబళ్ళూ మేక వెంట్రుకల కంబళ్ళూ వివిధవికారాలతో చేసిన బంగారు ఆభరణాలూ ఆయుధాలూ ఆయా గృహాలలో కాలిపోయినవి. అవే కాదు. గుఱ్ఱాలకు పెట్టే లగాములూ మొదలు అయిన పనిముట్లూ ఆభరణాలూ ఏనుగుల కంఠాభరణాలూ నడుము కట్టు బంగారు మొకులూ రథోపకరణాలూ ఏనుగులకూ గుఱ్ఱాలకూ తొడిగే కవచాలూ యోధుల కవచాలూ ఖడ్గాలూ ధనుస్సులూ అల్లెతాళ్ళూ బాణాలూ తోమరాలూ అంకుశాలూ శక్త్యాయుధాలూ రకరకాల కంబళ్లూ చామరాలూ దాలుతోళ్లూ పులి తోళ్లూ పులి గోళ్ళూ కస్తూరి మొదలు అయిన సుగంధ ద్రవ్యాలూ దగ్ధము అయిపోయినవి.

ముత్యాలతోనూ రత్నాలతోనూ అలంకరించిన ప్రాసాదగృహాలూ స్వస్తికాది నానావిధాకారాలతో నిర్మించిన గృహాలూ అట్లా ఆ లంకాపట్టణములో అన్ని వైపులా నిప్పు అంటుకొని ఆ యా గృహాలలో ఉన్న రాక్షస

గృహస్థులతోనూ వారి వారి వివిధాయుధాలతోనూ భస్మము అయి పోయినవి. ఆయా ప్రాసాదగృహాలలోనూ ఇంకా ఇతర గృహాలలోనూ ఆ యా ప్రదేశాల లోనూ అప్పుడు బంగారు కవచాలు తొడుగుకొని ఉన్న వారూ సొగసు అయిన వస్త్రాలు ధరించి పూలదండలు వేసుకొని ఉన్న వారూ మద్యపానము చేసి కైపు ఎక్కి కన్నులు తేలిపోతూ అడుగులు తడపడుతూ తిరుగుతున్న వారూ తమ కాంతల కొంగులు పట్టుకొని ఉన్న వారూ శత్రువుల మీది కోపముతో గదలూ శూలాలూ కత్తులూ చూచుకొంటూ ఉన్న వారూ మాంసము తింటూ ఉన్న వారూ తాగుతూ ఉన్న వారూ మహోన్నతశయ్యల మీద తమ భార్య లతో కూడా పడుకొని నిద్ర పోతున్న వారూ ఆ మంటలకు భయపడి తమ బిడ్డ లను తీసుకొని దిక్కులు తెలియకుండా పరుగులెత్త పోయినవారూ అనేక లక్షలమంది లంకా నగరవాసులు తగుల పడిపోయినారు. మంటలు పదే పదే లేచినవి.

అప్పుడు ఆ లంకాపట్టణములో కాలిపోయిన గృహాలు సామాన్యమైనవి కావు. అవి అన్నీ గట్టివి. అమూల్యము అయినవి. అందము అయినవి. గంభీరము అయినవి. బంగారముతో చంద్రాకారముగానూ అర్ధ చంద్రాకారముగానూ పైన చంద్రశాలలతోనూ నిర్మించినవి. రత్నాలు పొదిగిన కిటికీలు. రత్నాల తోనూ పగడాలతోనూ చిత్ర విచిత్రముగా అలంకరించిన పాన్పులూ ఆసనాలూ మొదలు అయినవి అన్నీ ఉన్నవి. ఆ భవనాలు ఆకాశాన్ని అంటుతూన్నవి. ఆ గృహాలలో ఎప్పుడూ క్రౌంచపక్షులు కేకలు వేస్తూనూ నెమళ్లు నాట్యమాడు తూనూ వీణలు మోగుతూనూ స్త్రీల ఆభరణాల చప్పుళ్లు వినిపిస్తూనూ ఉంటవి. అటువంటి ఆ గృహాలు అన్నీ కాలిపోతూ మంటలు వెలుపలి వాకిళ్లకు వ్యాపిం చినవి. అట్లా తగులపడి పోతున్న ఆ గృహాలు అన్నీ తొలకరివానలు కురిసే టప్పుడు మెరుపులవలెనూ మేఘాలవలెనూ ఆరాత్రి కనిపించినవి.

దేవేంద్రుడి వజ్రాయుధము దెబ్బకు పగిలి చిందర వందరగా పడిపోయే పర్వతాలవలె ఆ మంటలకు ఆ గృహాలు భయంకరము అయిన చప్పుళ్ళతో పగిలి పడిపోయినవి. ఆ మంటలకు అప్పుడు పయిన విమానగృహాలలో పడుకొని నిద్ర పోతూ ఉన్న వరాంగనలు లేచి తమ ఆభరణాలను తీసి అవతల పారవేసి అటు ఇటూ పరుగులెత్త పొయి హాహాకారాలు చేసినారు. ఏమీ తోచక ఏడ్చినారు. అట్లా మంటలు మండుతూన్న ఆ విమానగృహాలు రాత్రిపూట ఓషధులతో తేజరిల్లే హిమవత్పర్వత శిఖరాలవలె దూరానికి కనిపించినవి. రాత్రిపూట మంటలు మండుతూ ఉన్న హార్మ్యాగ్ర భాగాలూ విరగపూసిన మోదుగుచెట్ల వలె తోచినవి.

అప్పుడు మావటివాండ్లు తమతమ ఏనుగుల కట్టుతాళ్లు వదిలించి వేసినారు. గుర్రపువాండ్లు తమతమ గుర్రాల కట్టుతాళ్లు తెంచివేసినారు. ప్రళయకాలంలో మహాసముద్రమధ్యాన గలిబిలిగా తిరిగే నక్రగ్రాహాలవలె ఆ ఏనుగులూ ఆ గుర్రాలూ అప్పుడు ఆ లంకాపట్టణములో దిక్కులు తెలియకుండా పరుగు లెత్తినవి.

అట్లా పరుగులెత్తుతూ ఉన్న గుర్రాలను చూచి ఏనుగులు భయపడి వెనకకు పరుగులెత్తినవి. వెనుకకు పరుగులెత్తుతూవున్న ఏనుగులను చూచి గుర్రాలు భయ పడి పరుగులెత్తినవి. అట్లా తగులపడిపోతూన్న ఆ లంకాపట్టణములో మంటలు మహాసముద్రములో ప్రతిఫలించి సముద్ర జలాలు రక్తవర్ణముతో కనిపించినవి.

ఒక్క ముహూర్తము సేపులో వానరులు నిప్పు ముట్టించిన లంకాపట్టణం ప్రళయకాలములో ఈ లోకమంతా దగ్ధము అయిపోతున్న భూమిమాదిరిగా కనిపించింది. పొగలు కమ్ముకొని మంటలు మండుతూ ఉంటే ఆ లంకాపట్టణ ములో ఆడవాండ్లు అరిచిన అరుపులూ పెడబొబ్బలూ పది యోజనాల దూరము వినిపించినవి. ఒళ్లు కాలి పరుగులెత్తి బయటకు వస్తూన్న రాక్షసులను అందరినీ వెంటనే వానరయోధులు ఎదిరించినారు.

అప్పుడు రామప్రభువు ఉత్తమోత్తమము అయిన ధనుస్సు తీసుకొని అల్లె త్రాడు మోగించినాడు.

ఆ ధనుష్టంకారము క్రుద్ధుడుఅయిన రుద్రదేవుడి వేదమయధనుష్టంకారము వలె వినిపించింది. ఆ మహాభయంకరధ్వనికి రాక్షసులు అందరూ దద్దిరిల్లిపోయి నారు. ఆ ధనుష్టంకార ధ్వనిలో రాక్షసుల అరుపులూ పెడబొబ్బలూ వానరుల కోలాహలధ్వనులూ వినిపించకుండా మునిగిపోయినవి. ఆ మహాధ్వని దశదిశలా మారుమోగింది. రాముడు అప్పుడు ఆ కార్ముకములోనుంచి బాణాన్ని వదిలి నాడు. ఆ బాణపాతానికి కైలాసశిఖరము అంతఎత్తునవున్న లంకాపురద్వారము తునాతునకలు అయి నేలకూలింది. అంతటితో వదిలిపెట్టకుండా రాముడు లంకాపట్టణముమీద బాణాలు వదలడము మొదలుపెట్టినాడు. అది చూచి విమానగృహాలలోనూ వివిధగృహాలలోనూ ఉన్న రాక్షసులు అందరూ యుద్ధ సన్నద్ధులు అయినారు. రాక్షసవీరులు యుద్ధసన్నద్ధులు అయి సింహనాదాలు చేస్తూ వస్తూఉంటే అది ప్రళయకాలరాత్రివలె పరమభయంకరముగా తోచింది.

మహాపరాక్రమవంతుడు వానరరాజు సుగ్రీవుడు వానరయోధులను అంద రినీ చూచి "ఓయోధులారా, మీరు ఇప్పుడు రావణాంతఃపురద్వారము దగ్గర

పోరాటము సాగించవలెను. ఆయా స్థలాలలో నిలవకుండా మీలో ఎవడు అయినా నాఆజ్ఞను మీర మీ రేట్లయితే రాజశాసనాన్ని ధిక్కరించిన నేరానికి తక్షణమే వాణ్ణి చంపివేయవలెను" అని ఆజ్ఞాపించినాడు. సుగ్రీవాజ్ఞను శిరసా వహించి వానరయోధులు అందరూ అప్పుడు రావణాంతఃపురద్వారాన్ని ముట్టడించినారు. అందుకు రావణాసురుడికి పెద్దకోపము వచ్చింది. ఒళ్లు విరుచుకొని సింహనాదము చేసినాడు. ఆ అరుపుకు దశదిశలూ కలవరపడిపోయినవి. ప్రళయకాల రుద్రుడివలె లేచినాడు. కుంభకర్ణుడి పుత్రులను కుంభుణ్ణి నికుంభుణ్ణి రాక్షసయోధులతో పోయి వానరులతో పోరాడవలసింది అని ఆజ్ఞాపించినాడు. ఆ కుంభనికుంభులతో యూపాక్షుడూ శోణితాక్షుడూ ప్రజంఘుడూ కంపనుడూ రావణాజ్ఞను శిరసావహించి బయలుదేరినారు. అప్పుడు ఆ మహా బలవంతులను అందరినీ చూచి రావణాసురుడు "ఓ వీరులారా, మీరు ఇక్కడ నుంచే సింహనాదాలు చేస్తూ పొండి. వానరులను జయించండి" అని ప్రోత్సహించినాడు.

ఆ రాక్షసవీరులు పదేపదే సింహనాదాలు చేస్తూ జ్వలిస్తూ ఉన్న ఆయుధాలతో బయలుదేరినారు. ఆ రాక్షసవీరులు ధరించిన ఆభరణాల కాంతులతోనూ వానరుల దివిటీల వెలుతురుతోనూ ఆ ప్రదేశము అప్పుడు ఆకాశము వరకూ కనిపించింది. అంతేకాకుండా అప్పుడు చంద్రోదయము అయింది. ఆ చంద్రుడి వెన్నెలా నక్షత్రకాంతులూ లంకాపట్టణము తగుల పడుతూ ఉన్న మంటలూ రాక్షసుల ఆభరణాల ధగధగలూ వానరుల దివిటీల వెలుతురూ ఏకముఅయి అన్నివైపులా కనిపించింది. పయికి లేస్తూ ఉన్న మంటలనుంచి అటు ఆకాశమునుంచి ఇటు పాతాళమువరకూ అంతా వెలుతురు అయిపోయింది. ఆ వెలుతురులో రాక్షససైన్యాలూ వానర సైన్యాలూ తేజరిల్లినవి. పతాకాలతోనూ ధ్వజాలతోనూ భయంకరము అయిన ఏనుగులతోనూ గుర్రాలతోనూ వివిధవేషాల పదాతులతోనూ కత్తీ గొడ్డలీ కలిసి ఉన్న ఆయుధాలూ ధగధగలాడుతూ ఉన్న శూలాలూ గదలూ తోమరాలూ జ్వలిస్తూ ఉన్న ప్రాసాలూ సానపెట్టిన గండ్రగొడ్డళ్లూ భయంకర బాణాలు ఎక్కుపెట్టిన కార్ముకాలూ తీసుకొని భుజాలకు బంగారు ఆభరణాలు పెట్టుకొని మెడలలో పూలదండలు వేసుకొని తమ తమ చేతులలో ఉన్న వివిధాయుధాలూ ఝుళిపిస్తూ భయంకరపరాక్రమములో పౌరుషముతో మహామేఘాలవలె సింహనాదాలు చేస్తూ రాక్షసవీరులు తమ తమ సైన్యాలతో వానరుల మీదికి నడిచినారు.

అట్లా వస్తూ ఉన్న ఆ మహాదారుణము అయిన రాక్షససైన్యాన్ని చూచి వానరసైన్యము యుద్ధోత్సాహముతో పెద్దపెట్టున గర్జించింది. మిడుతలు ఎగిరి అగ్నిహోత్రముమీదికి పోయేట్లు ఆ రాక్షససైన్యము అప్పుడు వానరసైన్యము మీదికి పోయింది. భుజాల రాపిడినుంచి సానపెట్టిన వజ్రాయుధమువలె తళతళ లాడుతూ ఉన్న పరిఘాయుధాలతోనూ వివిధాయుధాలతోనూ రాక్షస సైన్యము వానరసైనము మీదికి పోయింది. వానరులు యుద్ధోత్సాహముతో వృక్షాలూ పర్వతశిఖరాలూ తీసుకొని రాక్షసులను ఎదిరించినారు. పిడికిళ్లతో రాక్షసులను గుద్దినారు. పిచ్చి ఎత్తిన వాండ్లవలె ఎగిరి గంతులు వేసినారు. భయంకరాకారులు అయిన రాక్షసులు తమ మీదికి వచ్చిన వానరుల శిరస్సులను తీక్ష్ణముఅయిన ఖడ్గాలతో తటాలున తెగవేసినారు.

ఆ పోరాటములో వానరులు రాళ్లతో రాక్షసుల అవయవాలను చితుక కొట్టినారు. పిడికిటి పోట్లతో రాక్షసుల తలలు చితుకపొడిచినారు. కోరలతో రాక్షసుల చెవులు కొరికివేసినారు. అట్లా అయినప్పటికిన్నీ రాక్షసయోధులు వానరయోధులను అనేకమందిని చంపివేసినారు. మేటి వానరవీరులను రాక్షస వీరులు ఖడ్గాలతో ఎదుర్కొన్నారు. ఆ పోరాటములో ఒకణ్ణి ఒకడు కొట్టుతూ ఉంటే ఆ కొట్టుతూ ఉన్న వాణ్ణి మరి ఒకడు వచ్చి కొట్టినాడు ఒకణ్ణి ఒకడు పడతోస్తూ ఉంటే ఆ పడ తోస్తూ ఉన్న వాణ్ణి మరి ఒకడు వచ్చి పడతోసి నాడు. ఒకణ్ణి ఒకడు నిందిస్తూ ఉంటే ఆ నిందిస్తూ ఉన్న వాణ్ణి మరి ఒకడు వచ్చి కొరికినాడు. తనను కొట్టి చూడమని ఒకడూ ఇదుగో కొట్టుతున్నాను అని ఒకడూ నా ఎదట నిలచి చూడమని మరి ఒకడూ అంటూ ఆ పోరాట ములో రాక్షసులూ వానరులూ అన్యోన్యమూ తమ బలపరాక్రమాలను ప్రద ర్శించినారు. కట్టుకొన్న వస్త్రాలు జారిపోతూ తొడుగుకొన్న కవచాలు ఊడి పోతూ ఆయుధాలు చేతులలోనుంచి జారిపోతూ ఈటెలతోనూ అస్త్రాలతోనూ శూలాలతోనూ రాక్షసులు మహాభయంకరముగా పోరాడినారు. రాక్షసులు ఒక్కొక్క దెబ్బకు ఏడుగురు వానరులను పదిమంది వానరులను చంపివేసినారు. అదేవిధముగా వానరులున్నూ ఒక్కొక్క దెబ్బకు పదిమంది రాక్షసులను చంపి వేస్తూ పోరాటము సాగించినారు.

తల వెంట్రుకల ముడులు ఊడిపోయి కట్టుకొన్న వస్త్రాలు జారిపోయి తొడుగుకొన్న కవచాలు చిరిగిపోయి రథధ్వజాలు విరిగిపోయి పోరాటము సాగిస్తూ ఉన్న రాక్షసవీరులను వానరయోధులు అప్పుడు అన్నివైపులా ఎది రించినారు.

## ౨౬

ఏడా తెరపీ లేకుండా భయంకరముగా సాగుతూ ఉన్న ఆ పోరాటములో అనేక మంది వీరులు నాశనము అయిపోయినారు. యుద్ధోత్సాహముతో అంగదుడు అప్పుడు కంపనుడిమీదికి పోయినాడు. కంపనుడు అంగదుణ్ణి ఆహ్వానించి కోపముతో రేగి ఇట్టే తన గదతో కొట్టినాడు. అంగదుడికి ఆ దెబ్బ గాఢముగా తగిలింది, మూర్ఛ పోయినాడు. కొంచెముసేపటికి తేరుకొని ఆ మహా పరాక్రమవంతుడు ఒక పర్వతశిఖరాన్ని పెళ్ళగించి కంపనుడిమీద విసరివేసినాడు. ఆ దెబ్బకు కంపనుడు నేలకూలి చచ్చిపోయినాడు.

కంపనుడు హతము అయిపోవడము శోణితాక్షుడు చూచి తన రథాన్ని నిర్భయముగా అంగదుడి మీదికి తోలించి శరీరాన్ని దహించివేసే ప్రళయ కాలాగ్ని వంటి నిశితబాణాలను వదలడము మొదలుపెట్టినాడు. మంగలి కత్తుల వంటి బాణాలనూ అర్ధచంద్రాకారపు బాణాలనూ ఇనుప బాణాలనూ దూడ పళ్ళ వంటి బాణాలనూ కంకపక్షి రెక్కల వంటి మొనలు ఉన్న బాణాలనూ, రెండువైపులా చెవులువున్న బాణాలనూ అర్ధనారాచబాణాలనూ గన్నేరుఆకు వంటి బాణాలనూ శోణితాక్షుడు తన మీద వదులుతూ ఉంటే ఆ పరాక్రమ వంతుడు వాలి పుత్రుడు అంగదుడు ఆ బాణాలను లెక్క చేయకుండా తన బలము అంతా చూపించడానికి ఎగిరి ఆ శోణితాక్షుడిమీదికి పోయినాడు. ఆ శోణితాక్షుడి చేతిలో ఉన్న పెద్ద ధనుస్సునూ బాణాలనూ ఊడలాగి వాటిని విరిచివేసినాడు. అంతట ఆ రథాన్ని పగులకొట్టడము మొదలుపెట్టినాడు.

శోణితాక్షుడు అంతట కత్తీడాలూ తీసుకొని అనాలోచితముగా కోపముతో ఇట్టే ఆకాశానికి ఎగిరినాడు. ఆ బలవంతుడు అంగదుడున్నూ అమిత వేగముతో ఆకాశానికి ఎగిరి ఆ శోణితాక్షుడి చేతులో ఉన్న ఖడ్గాన్ని ఊడలాగుకొని సింహనాదము చేసినాడు. ఆ ఖడ్గముతోనే ఆశోణితాక్షుడి భుజ ఫలకము మీదినుంచి యజ్ఞోపవీతము మాదిరిగా అంగదుడు తెగవేసినాడు. ఆ మహా ఖడ్గాన్ని పట్టుకొని పదేపదే సింహనాదము చేస్తూ అంగదుడు తక్కిన రాక్షసుల మీదికి పరుగెత్తినాడు. శోణితాక్షుడు అప్పుడు ఒక ఇనుపగుదియ తీసుకొని అంగదుడి వెంటపడ్డాడు.

మహాబలవంతుడూ పరాక్రమవంతుడూ అయిన యూపాక్షుడు ప్రజంఘుణ్ణి వెంటపెట్టుకొని తన రథాన్ని ఆ సమయాన అంగదుడికి ఎదురుగుండా తోలించినాడు. ఆ విధముగా శోణితాక్షప్రజంఘుల మధ్యను పడిపోయిన అంగ

దుడు అప్పుడు విశాఖానక్షత్రాల రెంటి మధ్యనూ ఉన్న పూర్ణచంద్రుడివలె శోభించినాడు. అంగదుణ్ణి ఆ పోరాటములో కాపాడుతూ ఉన్న మైందద్వివిదులు అప్పుడు అంగదుడి సమీపానికిపోయి ఆ రాక్షసులను పరస్పరమూ మానస్తూ నిలుచున్నారు. ఆ భయంకరాకారులు ఆ మహాబలవంతులు రాక్షసవీరులు కత్తులూ డాళ్లూ గదలూ తీసుకొని యుద్ధసన్నద్ధులు అయి మహారోషముతో ఆ వానరోత్తములను ఎదుర్కొన్నారు. వానరవీరులు అంగదమైందద్వివిదులు ముగ్గురున్నూ రాక్షసవీరులు శోణితాక్షయూపాక్షప్రజంఘులు ముగ్గురున్నూ ఒళ్లు గగుర్పొట్టించేట్టుగా అప్పుడు పోరాటము సాగించినారు.

ఆ వానరవీరులు విసరి వేస్తూ ఉన్న మహావృక్షాలనూ శిలలనూ ప్రజంఘుడు తన ఖడ్గముతో నరికి వేసినాడు. ఆ మహావృక్షాలూ శిలలూ వచ్చి గుర్రాల మీదనూ రథాల మీదనూ పడకుండా యూపాక్షుడు తన బాణాలతో అడ్డగించినాడు. వాటిని దారిలోనే శోణితాక్షుడు తన గదతో విరగకొట్టినాడు. అప్పుడు ప్రజంఘుడు మర్మస్థానాలను తెగవేసే మహాఖడ్గముతో అమితవేగముగా అంగదుడిమీదికి పోయినాడు. అది చూచి అంగదుడు ఇనుమద్ది చెట్టుతో ఆ ప్రజంఘుణ్ణి కొట్టినాడు. ఆ బలవంతుడు అంతటితో ఊరక ఉండకుండా ప్రజంఘుడు ఖడ్గము పట్టుకొని ఉన్న భుజముమీద తన పిడికిటితో ఒక్క పోటు పొడిచినాడు. ఆ దెబ్బకు ప్రజంఘుడి చేతిలో ఉన్న ఖడ్గము జారి నేలమీద పడిపోయింది. నల్లకలువరేకువంటి తన ఖడ్గము నేలమీద పడిపోగానే ప్రజంఘుడు వజ్రసమానము అయిన తన పిడికిలితో అంగదుడి లలాటముమీద కొట్టినాడు. ఆ పిడికిటి పోటుకు అంగదుడు ఒక ముహూర్తము సేపు కదలలేక పోయినాడు: మెదకలేక పోయినాడు.

ఆ మహాతేజోవంతుడు వాలిపుత్రుడు అంగదుడు తేరుకొని నేలమీద ఉన్న ఖడ్గము తీసుకొని ప్రజంఘుడి శిరస్సును ఇట్టే తెగవేసినాడు. అట్లా తన పినతండ్రి కాయము నుంచి శిరము తెగి పడిపోవడము చూచి యూపాక్షుడు కన్నీళ్లు కారుస్తూ బాణాలు అన్నీ అయిపోయినందువల్ల తక్షణమే రథము దిగి ఒక ఖడ్గము తీసుకొని బయలుదేరినాడు. అట్లా వస్తూ ఉన్న ఆ యూపాక్షుణ్ణి చూచి ద్వివిదుడు క్రుద్ధుడు అయిపోయి ఇట్టే అతడి ఎదురు రొమ్ములమీద కొట్టి బలవంతముగా పట్టుకొన్నాడు. తన తమ్ముణ్ణి ద్వివిదుడు పట్టుకోవడము చూచి శోణితాక్షుడు తన గదతో ఆ ద్వివిదుణ్ణి కొట్టినాడు. ఆ దెబ్బకు ద్వివిదుడు చలించినాడు. అంతలో మళ్ళీ కొట్టడానికి శోణితాక్షుడు గద ఎత్తినాడు. ఆ ఎత్తిన గదను ద్వివిదుడు ఊడలాగుకొన్నాడు.

అప్పుడు యూపాక్షుడి వక్షఃస్థలాన వానర యూథపతి మైందుడు అరచేతితో చరిచినాడు. అంతట ఆ మహాబలవంతులు శోణితాక్షయూపాక్షులున్నూ మైందద్వివిదులున్నూ ఒకండ్లను ఒకండ్లు పట్టుకొంటూ కొట్టుకొన్నారు. శోణితాక్షుడి ముఖాన్ని ద్వివిదుడు తన గోళ్ళతో చీరివేసినాడు. అంతటితో వదిలిపెట్టకుండా ఆ శోణితాక్షుణ్ణి నేలమీదికి పడకొట్టి నలిపి ముద్దముద్దగా చేసి వేసినాడు. మైందుడు అప్పుడు ఆ యూపాక్షుణ్ణి రెండు చేతులతోనూ కొట్టి చంపివేసినాడు.

ఆ పోరాటములో రాక్షససైన్యము చాలాభాగము నశించింది. మహావీరులు చచ్చిపోయినారు. చావగా మిగిలిన రాక్షసయోధులు అప్పుడు కుంభకర్ణుడి కొడుకు కుంభుడి దగ్గరకు పరుగెత్తినారు. అట్లా అమితవేగముతో తన దగ్గరకు పరుగెత్తుకొని వచ్చిన ఆ రాక్షస సైన్యానికి అప్పుడు కుంభుడు ధైర్యం చెప్పినాడు. రాక్షస సైన్యములో ఎదురు లేని మహావీరులు అందరూ పడిపోవడము చూచి ఆ రాక్షస శ్రేష్ఠుడు ఆ ధానుష్కుడు కుంభుడు అంతట ధనుస్సు తీసుకొన్నాడు. దేహాన్ని చీల్చివేసే విషసర్పమువంటి బాణాన్ని ఆ ధనుస్సుకు ఎక్కించినాడు. ఇంద్రధనుస్సువలె ధగధగలాడుతూ ఉన్న ఆ వింటి అల్లెత్రాటిని తన చెవులవరకూ లాగి బంగారు పింజలతో మెరుపు మాదిరిగా మెరుస్తూ ఉన్న బాణాన్ని ద్వివిదుడిమీద వదిలినాడు. ఇట్టే వచ్చి పడ్డ ఆ బాణము దెబ్బకు పర్వతమువంటి ఆ వానరోత్తముడు ద్వివిదుడు పాదాలు తడపడిపోయి అవయవాలు స్వాధీనము తప్పిపోయి నేలమీద పడిపోయినాడు. తన తమ్ముడు అట్లా పడిపోవడము చూచి మైందుడు ఒక పెద్ద రాతి బండను తీసుకొని కుంభుడి మీద విసరి వేసినాడు. అది చూచి కుంభుడు బాణాలు వదిలి ఆ రాతిబండను ముక్కలు ముక్కలు చేసివేసినాడు. అంతట విషసర్పమువంటి మరి ఒక బాణాన్ని ఆ వింట సంధించి మైందుడిమీద వదిలినాడు. ఆ బాణము మైందుడి మర్మస్థానములో గుచ్చుకొంది. అతడు మూర్ఛపోయి నేలమీద పడ్డాడు. తన మేనమామలు మైందద్వివిదులు ఇద్దరూ అట్లా పడిపోవడము అంగదుడు చూచినాడు. అప్పుడు కార్ముకము ఎత్తుతూ ఉన్న కుంభుడిమీదికి పరుగెత్తినాడు. అట్లా తనమీదికి వస్తూఉన్న ఆ అంగదుడిమీద అప్పుడు కుంభుడు అయిదు ఇనుప బాణాలు వదిలినాడు. అంతట తృప్తిచెందక మరి మూడు కరుకు బాణాలనూ బంగారముతో అలంకరించిన ఇనుపబాణాలను మొక్కపోని వాటిని అంగదుడిమీద వదిలివాడు. అన్ని బాణాలు వచ్చి మీద పడుతూ ఉన్నప్పటికిన్నీ అంగదుడు ఏమాత్రమూ చలించకుండా ఉండడమే

కాకుండా ఆ కుంభుడి నెత్తిమీద రాళ్ళ వాన చెట్ల వాన కురిపించినాడు. ఆ కాంతిమంతుడు కుంభుడు అట్లా వచ్చిపడుతూ ఉన్న రాళ్లనూ చెట్లనూ తనబాణా లతో నరికి వేసినాడు. అంతట తనమీదికి వస్తూ ఉన్న అంగదుణ్ణి చూచి కుంభుడు ఏనుగును కొరవులతో అడ్డగించేట్టు ఆ అంగదుడి కనుబొమలమీద బాణాలను వదిలినాడు. నెత్తురు కారుతూ అంగదుడు కన్నులు తెరవలేక పోయినాడు. అప్పుడు అతడు కన్నులమీదికి కారుతూ ఉన్న నెత్తురును ఒక చేతితో తుడుచు కొంటూ రెండవచేతితో సమీపములో ఉన్న సాలవృక్షాన్ని పట్టుకొని రొమ్ముతో ఆ చెట్టుబోదెను కదిలిస్తూ కొంచెము వంగి ఏనుగువలె ఆచెట్టును విరిచి వేసినాడు. ఇంద్ర ధ్వజమువలెనూ మందర పర్వతమువలెనూ ఉన్న ఆ సాలవృక్షాన్ని వెంటనే కుంభుడిమీద విసరి వేసినాడు. అది చూచి కుంభుడు దేహాన్ని ఛేదించి వేసే ఏడు బాణాలను అంగదుడిమీద వదిలినాడు. ఆ బాణా లకు అంగదుడు అమితముగా బాధపడుతూ అరిచి మూర్ఛ పోయినాడు. ఆ దురాసదుడు అంగదుడు సముద్రములో పడ్డ వాడివలె అట్లా కొట్టుకులాడుతూ ఉంటే చూచి వానరయోధులు ఆసంగతి రాముడికి విన్నవించడానికి పోయి నారు.

అప్పుడు రాముడు జాంబవంతుడు మొదలుఅయిన వానర వీరులను పోయి అంగదుణ్ణి చూడవలసింది అని ఆజ్ఞాపించినాడు. రామాజ్ఞను శిరసావహించి పెద్ద పులులవంటి ఆ వానరవీరులు కుపితులు అయి కుంభుడిమీదికి పోయినారు. ఆ ధానుష్కుణ్ణి జాంబవంతుడూ సుషేణుడూ వేగదర్శి అనే ముగ్గురు వానర వీరులూ ఎదిరించినారు. జలప్రవాహాలను పర్వతాలతో అడ్డగించేటట్టు ఆ మహా బలవంతులను వానర వీరులను కుంభుడు తన బాణపరంపరలతో నిరోధించి నాడు. సముద్రము చెలియలికట్టను దాటి పోయినట్టు ఆ కుంభుడి బాణపథాన్ని దాటి ఆ వానరవీరులు ముందుకు పోలేకపోయినారు.

కుంభుడి బాణవర్షానికి వానరసైన్య సమూహాలు బాధపడడము సుగ్రీవుడు చూచినాడు. అంగదుణ్ణి దాటి ముందుకు పోయినాడు. పర్వతసానువులలో సంచ రిస్తూ ఉన్న మదపుటేనుగు మీదికి అమిత వేగముతో దూకే సింహము మాది రిగా కుంభుడి మీదికి సుగ్రీవుడు ఉరికినాడు. పెద్ద పెద్ద రాళ్లనూ ఇనుమద్ది చెట్లనూ చంద్ర చెట్లనూ ఇంకా ఎన్నో రకాల చెట్లనూ పెళ్ళగించి కుంభుడి మీద విసరి వేసినాడు. ఆకాశము అంతా ఆవరించి కురుస్తూ ఉన్న వాన మాది రిగా తన మీద పడపోతూ ఉన్న ఆ రాళ్లనూ ఆచెట్లనూ కుంభుడు తన బాణా లతో నరికి వేసినాడు. గురి తప్పని కుంభుడి బాణాలకు ముక్కలు ముక్కలు

అయి పోయిన ఆరాళ్లూ ఆ చెట్లూ శతఘ్నుల వలె నేలమీద తేజరిల్లినవి. తాను వానగా కురిపించిన ఆ వృక్షాలను అన్నిటినీ కుంభుడు నరికి వేసినందుకు ఆ కాంతిమంతుడు ఆ మహాబలవంతుడు సుగ్రీవుడు కించపడ లేదు. అమిత వేగముతో అప్పుడు ఆ కుంభుడు వదులుతూ ఉన్న బాణాలు తనను ఛేదించి బాధ పెట్టుతూ ఉన్నప్పటికిన్నీ ఓర్చుకొని సుగ్రీవుడు కుంభుడి రథము మీదికి ఇట్టే ఎగిరి పోయినాడు. అతడి చేతిలో ఉన్న ఇంద్ర ధనుస్సు వంటి ధనుస్సు పట్టుకొని విరిచి వేసినాడు. ఎవడికీ సాధ్యము కాని అటు వంటి పని చేసి సుగ్రీవుడు కుపితుడు అయి పోయినాడు. తన చేతిలో ధనుస్సు పోయినందువల్ల దంతాలు విరిగిపోయిన మదపుటేనుగు మాదిరిగా ఉన్న కుంభుణ్ణి చూచి "ఓ కుంభుడా, నీ పరాక్రమము నీ బాణవేగము వలె అద్భుతము అయింది. నీ ప్రభావము రావణాసురుడి ప్రభావము వలె అద్భుతముగా ఉంది. నీవు ప్రహ్లాదుడితోనూ బలి చక్రవర్తితోనూ కుబేరుడితోనూ వరుణ దేవుడితోనూ సరి సమానము అయిన వాడవు. బలపరాక్రమానికి నీవు ఒక్కడవే నీ తండ్రిని పోలి పుట్టినావు.

"ఓ మహాబాహూ, నీవు చాపహస్తుడవు అయిన అరిందముడవు. మనోవ్యథలు జితేంద్రియుణ్ణి ఏమీ చేయలేనట్టు దేవతలు నిన్ను అతిక్రమించలేరు. నీవు మహాబుద్ధిమంతుడవు. అయితే నీవు ఇప్పుడు నేను చూస్తూ ఉండగా యుద్ధములో పరాక్రమించవలెను.

"ఓ కుంభుడా, నీ పెత్తండ్రి వరప్రభావమువల్ల దేవదానవులను ఎదిరించి లోపరచుకొన్నాడు. నీ తండ్రి కుంభకర్ణుడు కేవలము తన పరాక్రమమువల్ల దేవదానవులను లోపరచుకొన్నాడు. నీవు ధనుస్సు పట్టడములో ఇంద్రజిత్తు అంతటివాడవు. పరాక్రమములో రావణాసురుడు అంతటివాడవు. బలపరాక్రమాలకు ఇప్పుడు ఈ లోకములో ఉన్న రాక్షసులలో నీ అంతటివాడు మరిఒకడు లేడు. నీవు అప్రతిమానకృత్యము చేసినావు. నీ అస్త్రకౌశలాన్ని చూపించినావు. భయంకరపరాక్రములు అయిన వానరవీరులను పడగొట్టినావు.

"ఓ వీరుడా, అనేకమందితో పోరాడి అలసిపోయినవాణ్ణి చంపివేసినాడు అనే అపఖ్యాతి నాకు వస్తుంది అనే భయమునుంచి ఇంతవరకూ నీతో పోరాడకుండా ఊరకఉన్నాను. నీవు చాలా పనిచేశావు. అలసిపోయినావు. కొంచెము సేపు అలుపు తీర్చుకో. ఆ తరువాత మనము పోరాడుదాము. మన పోరాటాన్ని సమస్తభూతాలూ చూస్తవి. శంబరాసురుణ్ణి దేవేంద్రుడివలె నిన్ను నేను చంపివేస్తాను" అని చెప్పినాడు.

ఇటువంటి అవమానపు మాటలతో సుగ్రీవుడు తనను గౌరవిస్తూ ఉంటే కుంభుడు నేతితో హోమము చేస్తూఉన్న అగ్నిహోత్రమువలె భగ్గన మండి

పోయినాడు. తక్షణము తన రెండు చేతులతోనూ సుగ్రీవుణ్ణి కుంభుడు పట్టు కొన్నాడు. అంతట కుంభుడూ సుగ్రీవుడూ మాటిమాటికీ నిట్టూర్పులు విడుస్తూ రెండు మదపుటేనుగులవలె ఒకరిని ఒకరు పట్టుకొని పెడ లాగుకొంటూ అలసి పోయి నోళ్ళలోనుంచి పొగలూ మంటలూ వదిలిపెట్టినారు. వాండ్ల పాదాల తొక్కిడికి ఈ భూమి అణగారిపోయింది. సముద్రము పెద్ద పెద్ద అలలతో లేచి గిరుగున తిరుగుతూ అల్లకల్లోలము అయిపోయింది. అప్పుడు సుగ్రీవుడు ఆ సము ద్రము అడుగు చూపించడానికో అన్నట్టు కుంభుణ్ణి ఎత్తి ఆ సముద్రములో పారవేసినాడు.

కుంభుడు పడగానే ఆ మహాసముద్రము వింధ్యమందర పర్వతాల అంత ఎత్తున పయికిలేచి అన్నివైపులా వ్యాపించింది. కుంభుడు అంతట ఆ సముద్ర ములో నుంచి పయికి ఎగిరివచ్చి తన పిడికిలి బిగించి వజ్రాయుధ వేగములో సుగ్రీవుడి ఎదురు రొమ్ములమీద పొడిచినాడు. ఆ పిడికిటి పోటుకు సుగ్రీవుడి ఎదురు రొమ్ములమీద చర్మము తెగి జల జల నెత్తురు కారిందే కాని ఎముక ఏది చెక్కు చెదరలేదు. అట్లా సుగ్రీవుడి వక్షఃస్థలముమీద కారుతూఉన్న నెత్తురు వజ్రాయుధము ఒరపిడికి మేరువు పర్వతమీద రేగిన జ్వాలవలె కనిపించింది.

కుంభుడు కొట్టిన దెబ్బకు ఆ మహాబలవంతుడు వానరపుంగవుడు సుగ్రీ వుడు కుపితుడు అయిపోయి వజ్రముతో సరి సమానము అయిన తన పిడికిలిబిగించి నాడు. సూర్యమండలము వలె సహస్రకిరణాలతో తేజరిల్లుతూఉన్న తన పిడి కిటితో సుగ్రీవుడు అప్పుడు కుంభుడి వక్షఃస్థలముమీద పొడిచినాడు. ఆ పిడికిటి పోటుకు అవయవాలు స్వాధీనము తప్పిపోయి కుంభుడు ఆరిపోయిన అగ్నిహో త్రమువలె అయి పోయినాడు. కాంతిమంతము అయిన అంగారకగ్రహము యాదృచ్ఛికముగా ఆకాశమునుంచి నేల రాలిపోయేట్టు నేల కూలినాడు. అట్లా చచ్చి పడిపోయిన ఆ కుంభుడి ఆకారము అప్పుడు రుద్రదేవుడు పడతోసిన సూర్యుడివలె కనిపించింది.

ఆ పోరాటములో సుగ్రీవుడు కుంభుణ్ణి చంపివేయగానే పర్వతాలతోనూ మహారణ్యాలతోనూ భూమి అంతా గజ గజ వణికింది, రాక్షసులు అందరూ భయపడి పోయినారు.

## ౭౭

సుగ్రీవుడి చేతిలో చచ్చిపోయిన తన అన్నను కుంభుణ్ణి నికుంభుడు చూచి నాడు. చూపులతో దహించివేసే వాడివలె సుగ్రీవుణ్ణి చూస్తూ భయంకరము

అయిన యమదండమువంటి పరిఘాయుధాన్ని అందుకొన్నాడు. అది రాక్షసులకు మంగళకరము అయిన ఆయుధము. హిమవత్పర్వతశిఖరమువంటి ఆ పరిఘాయుధము అదివరకు రాక్షసులకు అనేకమార్లు జయము సంపాదించి పెట్టింది. తాపటము చేసిన వజ్రాలతోనూ పగడాలతోనూ బంగారు కట్లతోనూ అయిదు వేళ్ల ముద్రలతో నూ అలంకారముగా కట్టిన పూలదండలతోనూ ఇంద్రధ్వజము వంటి ఆ పరిఘాయుధాన్ని ఆ భయంకరపరాక్రముడు పట్టుకొని గిరగిరతిప్పుతూ వికృతముగా నోరు తెరిచి సింహనాదము చేసినాడు.

వక్షఃస్థలముమీద ధగధగలాడుతూఉన్న పతకముతోనూ తళతళలాడుతూ ఉన్న బంగారు బాహుపురులతోనూ చిత్రవిచిత్ర కాంతులతో తేజరిల్లుతూ ఉన్న కుండలాలతోనూ మెడలో వేసుకున్న రంగురంగుల పూలదండలతోనూ చేతితో పట్టుకొన్న పరిఘాయుధముతోనూ నికుంభుడు అప్పుడు ఆకాశములో ఇంద్రధనుస్సుతోనూ మెరుపులు మెరుస్తూనూ ఉరుములు ఉరుముతూనూ ఉన్న మహామేఘమువలె కనిపించినాడు.

ఆ మహాకాయుడు నికుంభుడు అప్పుడు గిరగిర తిప్పుతూఉన్న పరిఘాయుధము కొన తగిలి సప్తవాయువుల సంధి ప్రదేశము బ్రద్దలు అయిపోయింది. ఆప్రదేశములో మహాధ్వనితో పొగలులేని అగ్నిహోత్రము ప్రజ్వరిల్లింది. అప్పుడు విటపావతి అనే కుబేరుడి అలకాపట్టణమూ గంధర్వభవనాలూ అమరావతీపట్టణమూ అశ్విన్యాది నక్షత్రాలూ సాధారణ నక్షత్రాలూ కుజాది గ్రహాలూ చంద్రుడూ ఆకాశమూ సమస్తలోకాలూ గిరగిర తిరుగుతున్నట్లు కనిపించినవి. ఆ పరిఘాయుధకాంతులనుంచీ ఆభరణాల కాంతులనుంచీ ప్రళయకాలాగ్నిహోత్రమువలె తేజరిల్లుతూఉన్న నికుంభుణ్ణి వానరవీరులు తేరిపారచూడలేకపోయినారు. ఆ నికుంభుణ్ణి చూచి అటు రాక్షసులూ ఇటు వానరులూ భయపడిపోయినారు. ఎవరు కదలకుండా మెదలకుండా ఉన్న ఆ సమయములో మహాబలవంతుడు హనుమంతుడు తన రొమ్ము విరిచి ఆ నికుంభుడి ఎట్టఎదటికిపోయి నిలుచునాన్నడు.

అప్పుడు నికుంభుడు ఇనుపగుదియలవంటి తన చేతులలో సూర్యప్రభలతో తేజరిల్లుతూఉన్న ఇనుప గుదియలతో ఆ హనుమంతుడి వక్షఃస్థలముమీద కొట్టినాడు. ఆ విశాలస్థిరవక్షఃస్థలానికి తగిలిన ఆ పరిఘాయుధము అప్పుడు ముక్కలు ముక్కలుగా పగిలిపోయింది. ఆ ముక్కలు అంతటా రేగి ఆకాశములో కొరవులవలె కనిపించినవి. ఆ పరిఘాయుధము దెబ్బకు హనుమంతుడు భూకంపసమయములో పర్వతమువలె ఒక్క క్షణము వణికి పోయినాడు.

అంతట ఆ మహాబలవంతుడు హనుమంతుడు తన బలముకొద్దీ పిడికిలి బిగించి వాయువేగముతో వాయుపరాక్రమముతో నికుంభుడి వక్షఃస్థలముమీద గుద్దినాడు. నికుంభుడి వక్షఃస్థలముమీది చర్మము చిరిగి పోయింది. నెత్తురు కారుతూ ఉన్న ఆ వక్షఃస్థలము మంటలు మండుతూ ఉన్నట్టు కనిపించింది. నికుంభుడు వణికిపోయినాడు. ఎట్లాగో నిబ్బరించుకొని ఆ మహాబలవంతుణ్ణి హనుమంతుణ్ణి తన రెండుచేతులా పట్టుకొని పయికి ఎత్తినాడు. అదిచూచి ఆ మహాబలవంతుడు హనుమంతుడు నికుంభుడికి చిక్కినాడు అనుకొని రాక్షసులు అందరూ సంతోషాతిశయముతో సింహనాదాలు చేసినారు. అట్లా తనను పైకి ఎత్తి మోసుకొని పోతూ ఉన్న నికుంభుణ్ణి హనుమంతుడు అప్పుడు వజ్రాయుధమువంటి తన పిడికిలితో ఒక్కపోటు పొడిచి ఆ రాక్షసుడి పట్టు వదిలించుకొన్నాడు. మారుతాత్మజుడు అంతట నేలమీద నిలుచుని చటుక్కున నికుంభుణ్ణి మళ్ళీ కొట్టినాడు. ఆ వీర్యవంతుడు హనుమంతుడు అంతట మంచి పూనికతో ఆ నికుంభుణ్ణి నేలమీదికి పడకొట్టి నలిపి చటుక్కున పయికి ఎగిరినాడు. ఆ నికుంభుడి వక్షఃస్థలము మీదికి దూకినాడు. అంతట తన రెండు చేతులా ఆ రాక్షసుడి గొంతు పట్టుకొన్నాడు. ఆ నికుంభుడు అందుకు భయంకరముగా అరుస్తూ ఉంటే మెడ విరగ తీసి వేసినాడు.

నికుంభుడి ప్రాణము పోగానే వానరయోధులు అందరూ సంతోషాతిశయముతో దిక్కులు మారుమోగి పోయేట్టు సింహనాదాలు చేసినారు.

## ౭౫

కుంభుడూ నికుంభుడూ చచ్చిపోయిన వృత్తాంతము రావణాసురుడు విన్నాడు. కోపముతో అగ్నిహోత్రము వలె మండిపోయినాడు. అంతట దుఃఖమూ కోపమూ మనస్సులో పెనవేసుకొని పోయినవి. ఖరుడి పుత్రుణ్ణి మకరాక్షుణ్ణి చూచినాడు. ఆ పెడల్పాటి కన్నులవాణ్ణి యుద్ధము చేయడానికి ప్రోత్సహిస్తూ "నాయనా, నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. సైన్యాన్ని తీసుకొని పో. ఆ రామలక్ష్మణులనూ వానరులనూ వధించు" అని రావణాసురుడు చెప్పినాడు. తాను శూరుడను అనుకొంటూ ఉండే ఆ అహంకారి మకరాక్షుడు తత్క్షణమే "మంచిది, మంచిది" అని చెప్పి దశగ్రీవుడికి నమస్కారమూ ప్రదక్షిణమూ చేసి తెల్లటి ఆ రాజభవనములో నుంచి బయటి వచ్చినాడు.

ఆ మకరాక్షుడు అంతట సేనాధ్యక్షుణ్ని చూచి "ఓ సేనాపతీ వెంటనే నాకు రథాన్ని తెప్పించు. త్వరగా సైన్యాన్ని పిలిపించు" అని ఆజ్ఞాపించి

నాడు. ఆ సేనాపతి అప్పటికి అప్పుడు సైన్యాన్నీ రథాన్నీ అక్కడికి రావించినాడు. ఆ రథానికి మకరాక్షుడు అప్పుడు ప్రదక్షిణము చేసినాడు. రాక్షసయోధులను అందరినీ చూచి "ఓ యోధులారా, మీరు అందరూ చక్కగా పోరాడవలెను. మన ఏలిక రాక్షసరాజు రావణాసురుడు రామలక్ష్మణులను చంపివేయవలసింది అని ఆజ్ఞాపించినాడు.

"ఓ నిశాచరులారా, నేను ఆ రామలక్ష్మణులనూ ఆ సుగ్రీవుణ్ణీ తక్కిన వానరవీరులనూ నా ఉత్తమోత్తమ బాణాలతో సంహారము చేసివేస్తాను. ఎండుకట్టెలను అగ్నిహోత్రముతో దహించివేసేట్టు ఆ వానర మహాసైన్యాన్ని శూలాలతో పొడిచి మీరు నాశనము చేసివేయవలెను" అని చెప్పి మకరాక్షుడు రథము ఎక్కినాడు. వెంటనే ఆ రథాన్ని యుద్ధభూమికి తోలవలసింది అని ఆజ్ఞాపించినాడు.

ఆ బలవంతుడు మకరాక్షుడు చెప్పిన మాటలు విని రాక్షసయోధులు అందరూ నానావిధాయుధాలతోనూ ఆ రథమువెంట బయలుదేరినారు. ఆ మహాకాయులు రాక్షసయోధులు తేనె రంగు కన్నులతో పెద్ద పెద్ద కోరలతో తలలు విరబోసుకొని మదపుటేనుగుల ఘీంకారాల వలె సింహనాదాలు చేస్తూ అన్ని వైపులా భేరీలు మ్రోగిస్తూ శంఖాలు పూరిస్తూ దిక్కులు మారుమ్రోగిపోయేట్టు భుజాలు చరుచుకొంటూ యుద్ధభూమికి నడువసాగినారు.

అప్పుడు ఆ మకరాక్షుడి రథసారథి చేతిలోనుంచి మునికోల జారిపడిపోయింది. ఆ రథధ్వజము హఠాత్తుగా నేలకూలింది. ఆ రథానికి కట్టిన గుర్రాలు నడుస్తూ నడుస్తూ అకారణముగా కాళ్లు తడపడి కన్నీళ్ళు కార్చినవి. గాలిదుమారము పరమ దారుణముగా లేచింది. రాక్షసవీరులు శకునాలను గురించి ఆలోచించను అయినా లేదు. రామలక్ష్మణులు ఉన్నచోటికి మకరాక్షుడివెంట ఆ రాక్షససైన్యము నడువసాగింది.

ఆదివరకు అనేకమార్లు యుద్ధాలలో గదల దెబ్బలూ కత్తిదెబ్బలూ తిన్న ఆ రాక్షసయోధులు మహా మేఘాలవలెనూ ఏనుగులవలెనూ ఎనుపోతులవలెనూ పోరాటానికి సాగిపోతూ "నేను ముందు" అంటే "నేను ముందు" అని తమ తమ యుద్ధచాతుర్యాన్ని గురించి చెప్పుకుంటూ సింహనాదాలు చేస్తూ యుద్ధభూమికి పోయినారు.

## ౭౯

అట్లా రాక్షససైన్యాలతో వస్తూ ఉన్న ఆ మకరాక్షుణ్ణి వానరయూథపతులు అందరూ చూచినారు. యుద్ధోత్సాహముతో ఎగిరి గంతులు వేసినారు. యుద్ధ సన్నద్ధులు అయి నిలుచున్నారు.

అప్పుడు దేవదానవ యుద్ధమువలె ఒళ్ళు గగుర్పొడిచేట్లు వానరులకూ రాక్షసులకూ యుద్ధము ఆరంభము అయింది. వానరయోధులు శిలలతోనూ వృక్షములతోనూ రాక్షసయోధులు కొందరు శూలాయుధాలతోనూ పరిఘాయుధాలతోను కొందరు శక్త్యాయుధాలతోనూ కుంతాయుధాలతోనూ గదలతోనూ తోమరాయుధాలతోనూ పట్టిసాలతోనూ భిండివాలాలతోనూ వజ్రాయుధాలతోనూ కొందరు రాక్షసులు పాశాయుధాలతోనూ, ముద్గరాలతోనూ దండాయుధాలతోనూ నిఖాతాయుధాలతోనూ పోరాటము సాగించినారు. వానరయోధులూ రాక్షసయోధులూ అప్పుడు ఆయా ఆయుధాలతో పోరాడుతూ ఒకండ్లను ఒకండ్లు చంపివేసుకొంటూ ఉంటే మకరాక్షుడు వానరసైన్యాలమీద బాణవర్షము కురిపించ సాగినాడు. ఆ రెండువిధాల దెబ్బలకు వానరయోధులు అందరూ భయభ్రాంతులు అయి పరుగులెత్త సాగినారు. అట్లా పరుగులెత్తి పారిపోతూ ఉన్న వానరయోధులను చూచి రాక్షసయోధులు అందరూ తాము జయించినట్లు భావించి సంతోషాతిశయముతో సింహాలవలె గర్జించసాగినారు.

అప్పుడు అట్లా పరుగులెత్తి పారిపోతూన్న వానరయోధులను అందరినీ చూచి రాముడు రాక్షసయోధులు ముందుకుసాగి రాకుండా బాణవర్షము కురిపించి అడగించినాడు. అది చూచి మకరాక్షుడు కోపముతో మండిపడుతూ "ఓ రామా, నిలు నిలు. నా ఎదట నిలు. నా తీక్ష్ణబాణాలతో నీ ప్రాణాలు తీసివేస్తాను. నీవూ నేనూ ద్వంద్వయుద్ధము చేద్దాము. నీవు అప్పుడు దండకారణ్యములో నా తండ్రిని చంపివేసిన కారణమునుంచి నిన్ను ఎట్టయెదుట చూస్తూన్న కొద్దీ నా కోపము హెచ్చు పెరిగి పోతూంది. ఆ మహారణ్యములో నీవు అప్పుడు నాకు అగపడలేదు. అందువల్ల ఇప్పుడు నిన్ను చూస్తూంటే నా ఒళ్ళు అంతా మండిపోతూ ఉంది.

"ఓ రామా, నీవు ఇప్పుడు దైవవశము వల్ల నా ఎదట పడ్డావు. ఆకలితో బాధపడే సింహము మృగము కోసము కనిపెట్టుకొని ఉండేట్టు నేను ఇంత కాలమూ నీ కోసము కనిపెట్టుకొని ఉన్నాను. నా తీవ్రబాణాలు నిన్ను ఇప్పుడే ప్రేతరాజు దేశానికి తీసుకొని పోతవి. నీవు పోయి నీవు చంపివేసిన వీరులను కలసుకొంటావు. రామా, ఎన్నో మాటలు ఎందుకు, అస్త్రయుద్ధము కానీ గదాయుద్ధము కానీ బాహుయుద్ధము కానీ నీవు ఏది అభ్యసించినావో ఆ విధముగా యుద్ధము చేదాము. యుద్ధరంగములో నిన్నూ నన్నూ సకల లోకాల వారూ చూడవలెను. నా మాట విను. పోరాటానికి రా" అన్నాడు.

ఈ విధముగా మకరాక్షుడు అన్న మాటలకు రాముడు నవ్వుతూ "ఓ రాక్షసుడా, ఎందుకు వృథాగా మాట్లాడుతావు. చేతకాని మాటలు ఎందుకు

పేలడము. పోరాడి జయించవలెను. కాని మాటలతో జయించడము ఉత్తది' ఓ పాపీ, ఇప్పుడే నీ మాంసాన్ని కాకులూ గద్దలూ తీక్ష్ణము అయిన ముక్కుల తోనూ గోళ్ళతోనూ గీరుకొని తింటవి. నక్కలు కరుకు కోరలతో నీ మాంసాన్ని తనివి తీర తింటవి" అని చెప్పినాడు.

ఇట్లా చెప్పే చెప్పడముతో రాముడి మీద మకరాక్షుడు వరుసగా బాణాలు వదలడము మొదలు పెట్టినాడు. ఆ బాణాలను అన్నిటినీ రాముడు శరవర్షము కురిపించి నరికి వేసినాడు. అప్పుడు ఆ రణరంగములో మకరాక్షుడూ రాముడూ తమ తమ పరాక్రమాన్ని ప్రదర్శిస్తూ పరమ భయంకరముగా పోరాటము సాగించినారు. మకరాక్షుడు వదిలిన వేలకు వేలు బంగారు పింజల బాణాలు ముక్కలు ముక్కలు అయి నేల అంతటా పడి పోయినవి. వారి ధనుష్టంకారధ్వనులు అప్పుడు ఆకాశములో ఉరుములు ఉరిమినట్టుగా విని పించినవి.

ఆ అద్భుత పోరాటాన్ని చూడటానికి దేవదానవగంధర్వ మహోరగులు అందరూ అప్పుడు అక్కడికి బయలుదేరి వచ్చి ఆకాశములో నిలుచున్నారు. ఆ పోరాటములో ఒకరికి ఒక గాయము అయితే ఉత్తరక్షణాన రెండవ వారికి రెండు గాయాలు అయినవి. రాముడు వదిలిన బాణాలను మకరాక్షుడూ మకరాక్షుడు వదిలిన బాణాలను రాముడూ తమ తమ బాణాలతో నరికి వేసినారు. అట్లా ముక్కలు ముక్కలు అయి పడ్డ బాణాల వల్ల అప్పుడు ఆ యుద్ధ భూమిలో దిక్కులూ విదిక్కులూ కనిపించకుండా పోయినవి.

అంతట ఆ మహాబాహువు రాముడు మహోగ్రుడు అయిపోయి రాక్షసుడు పట్టుకొని ఉన్న వింటిని తనబాణముతో విరగకొట్టినాడు. వెంటనే మరి ఎనిమిది బాణాలు వదిలి ఆ మకరాక్షుడి రథసారథిని పడకొట్టినాడు. ఇంకా కొన్ని బాణాలు వదిలి ఆ రథానికి పూంచిన గుర్రాలనూ ఆ రథాన్నీ పడకొట్టి నాడు. విరథుడు అయిపోయిన మకరాక్షుడు నేలమీదికి వచ్చినాడు. సర్వ ప్రాణికోటీ భయపడిపోయే యుగాంతాగ్ని ప్రభలతో తేజరిల్లుతూ ఉన్న శూలాన్ని తీసుకొని గిరగిర తిప్పి రాముడిమీద విసరి వేసినాడు.

అగ్నిజ్వాలలతో అట్లా అంతరిక్షములో వస్తూ ఉన్న ఆ శూలాయుధాన్ని గురిచేసి రాముడు బాణాలు వదిలినాడు. ఆ బాణాలు తగిలి ఆ శూలాయుధము ఆకాశములోనే ముక్కలు ముక్కలు అయిపోయింది. ఆ ముక్కలు కొరవుల వలె నేలమీదపడ్డవి. అప్పుడు ఆకాశములో నిలుచుని అదిఅంతా చూస్తూ ఉన్న వారు అందరూ "భలే భలే" అని కేకలు వేసినారు.

అప్పుడు మకరాక్షుడు పిడికిలి బిగించి చెయ్యి ఎత్తి రాముణ్ణి చూచి "నిలు నిలు" అని కేకలు పెట్టినాడు. అట్లా అరుస్తూ వస్తూ ఉన్న ఆ మకరాక్షుణ్ణి చూచి రాముడు నవ్వుతూ తన శరాసనములో ఆగ్నేయాస్త్రాన్ని సంధించి అతనిమీద వదిలినాడు. ఆ ఆగ్నేయాస్త్రానికి ఆ మకరాక్షుడి గుండెలు పగిలి నేలమీదపడి ప్రాణాలు వదిలి పెట్టినాడు.

రాక్షసయోధులు మకరాక్షుడు పడిపోవడము చూచినారు. అప్పుడు తమ మీదవచ్చి పడుతూ ఉన్న బాణాలకు ఓర్పులేక పోయినారు లంకాపట్టణము లోకి పరుగులెత్తినారు.

వజ్రాయుధము దెబ్బకు పర్వతము పగిలి పడిపోయేటట్టు రాముబాణానికి మకరాక్షుడు పడిపోవడము చూచి దేవతలు అందరూ సంతోషించినారు.

## ౨౦

రాముడు మకరాక్షుణ్ణి చంపివేసినాడు అని ఆ జయశీలి రావణాసురుడు విన్నాడు. అతనికి మహా తీవ్రము అయిన కోపము వచ్చింది. పళ్లు పటపట కొరికినాడు. ఇకను అప్పుడు ఏమి చేయవలసింది ఆలోచించినాడు. తన కుమారుణ్ణి ఇంద్రజిత్తును చూచి "నాయనా, నీవు పరమపరాక్రమవంతుడవు, నీవు అన్ని విధాలా అమిత బలవంతుడవు, నీవు పోయి యుద్ధరంగములో అందరికీ కనపడుతూనో కనపడకుండానో పోరాటము సాగించి ఆ రామలక్ష్మణులను చంపి వేయవలెను. దేవేంద్రుడు అంతటి వాణ్ణి నీవు పోరాటములో జయించినావు. నీ పరాక్రమము అప్రతిమానము. నీవు యుద్ధరంగములోకి పోతే చాలును. ఆ మానవులు నిన్ను చూస్తూనే చచ్చిపోతారు. నీవు జయిస్తావు" అని రావణాసురుడు చెప్పినాడు.

ఈ విధముగా రావణుడు చెప్పిన మాటలు విని ఇంద్రజిత్తు యజ్ఞవాటికకు పోయినాడు. యథావిధిగా అభిచార హోమము చేసినాడు. అగ్నిహోత్రాన్ని వేల్చి దేవదానవ రాక్షసులను అందరినీ సంతృప్తి పరిచినాడు. అప్పుడు అక్కడికి కంటికి కనపడకుండా అంతర్ధానము అయి పోయే రథము వచ్చింది. నాల్గు గుర్రాలు కట్టిన ఆ రథము నిండా తీక్ష్ణబాణాలూ ఎక్కు పెట్టిన పెద్ద ధనుస్సూ ఉన్నవి. బంగారు మలామా చేసిన ఆ రథము వెలుపలి భాగాన జింకలూ చంద్రబింబమూ చంద్రవంకా మొదలు అయిన చిత్తరువులు అలంకారముగా చిత్రించి ఉన్నవి. బంగారుకట్లు వేసిన ఆ రథధ్వజము తాటపము చేసిన వైడూర్యమణుల వల్ల మంటలు మండుతూ ఉన్న అగ్నిహోత్రము మాదిరిగా ఉంది. సూర్య

కాంతులతో తేజరిల్లే ఆ రథము ఉండడము వల్లనూ బ్రహ్మాస్త్రము ఉండడము వల్లనూ ఆ మహాబలవంతుడు ఇంద్రజిత్తు ఎవరికీ ఎదిరించ నలవి కాని వాడు అయి పోయినాడు.

ఆ యుద్ధశీలి ఇంద్రజిత్తు నిర్‌ృతీ దేవతాకము అయిన మంత్రాలతో హోమము పూర్తి చేయగానే ఎవరి కంటికీ కనపడకుండా అంతర్ధానమయి పోయే ఆ రథము ఎక్కి లంకాపట్టణములోనుంచి వెలుపలికి పోయినాడు. రాక్షసయోధులను అందరినీ చూచి "ఓ యోధులారా, కపట పరివ్రాజక వేషాలతో అడవిలో తిరిగిన ఆ రామలక్ష్మణులను నేను ఇప్పుడే వధించి వేస్తాను. ఆ తరువాత ఈ భూమి మీద వానరులు అనే వాండ్లు లేకుండా చేసి వేస్తాను. నాకు జయము తప్పదు. నేను జయించి నా తండ్రిని రాక్షసరాజును రావణాసురుణ్ణి సంతోష పెట్టుతాను" అని చెప్పినాడు.

అంతట ఆభయంకరుడు ఇంద్రజిత్తు ఆ రథముమీద తీక్ష్ణబాణాలతోనూ ఎక్కుపెట్టిన పెద్దధనుస్సుతోనూ యుద్ధరంగానికి పోయి వానరసేనా మధ్యములో ధనుర్ధరులు అయి మూడుతలల పాములవలె కనపడుతూ బాణాలు వదులుతూఉన్న రామలక్ష్మణులను చూచినాడు. అంతట తన ధనుస్సును సజ్యము చేసి వానలు కురిపించే పర్జన్యుడివలె ఎడతెగకుండా బాణవర్షము కురిపిస్తూ తన రథముతో కూడా ఆ ఇంద్రజిత్తు అంతర్ధానము అయి ఆకాశానికి పోయినాడు. అక్కడ విప్రదేశములో ఉండి ఎవరికీ కనిపించకుండా రామలక్ష్మణులమీద నిశితబాణాలను వదిలినాడు.

ఇంద్రజిత్తు వదిలిన ఆబాణాలు అమితవేగముతో వచ్చి మీదపడుతూ ఉంటే రామలక్ష్మణులు తమ ధనుస్సులలో దివ్యములయిన బాణాలను ఎక్కుపెట్టి పయికి వదిలినారు. సూర్యసమానము అయిన ఆ బాణాలూ ఆ అస్త్రాలూ ఆకాశాన్ని కప్పివేసినవే కాని ఇంద్రజిత్తుకు తగలలేదు. అప్పుడు ఆ కాంతిమంతుడు ఇంద్రజిత్తు పొగలతో చీకట్లు కమ్ముకొని ఆకాశము కనపడకుండానూ పొగమంచు కమ్ముకుని దిక్కులు కనపడకుండానూ చేసివేసినాడు. అంతేకాదు. తన ధనుష్టంకారధ్వని కానీ రథచక్రాల ధ్వనికానీ గుర్రాల గిట్టల చప్పుళ్లు కానీ వినపడకుండానూ తన ఆకారము కనపడకుండానూ ఆకాశములో తిరుగుతూ మబ్బులు కమ్ముకొన్నందువల్ల చిమ్మచీకట్లు అయిపోయి వాన కురిసేటట్టు అద్భుతముగా బాణవర్షము కురిపించినాడు. వరప్రసాదమువల్ల సూర్యసమానములయిన తీక్ష్ణబాణాలు వదిలి రామలక్ష్మణుల అవయవాలను అన్నిటినీ నొప్పించినాడు. ధారాపాతముగా కురుస్తూఉన్న వర్షానికి పర్వతాలవలె అచల

ముగా నిలుచున్న ఆ రామలక్ష్మణులు బంగారుపింజలు వేసిన నిశితబాణాలను పయికి వదిలినారు. కంకపక్షి రెక్కలతో ఉన్న ఆ బాణాలు పక్షులవలె రివ్వున ఆకాశములోకిపోయి ఇంద్రజిత్తు దేహానికి గుచ్చుకొని నెత్తురుతో తడిసి నేల మీద పడిపోయినవి.

ఆ పురుషోత్తములు రామలక్ష్మణులు తమమీద వచ్చి పడుతూ ఉన్న బాణసమూహాలనుంచి బాధపడుతూ ఉన్నప్పటికీన్నీ ఆబాణాలను ఎన్నిటినో భల్లాయుధాలతో నరికివేసినారు. ఆ బాణాలు ఎక్కడనుంచి వచ్చిపడుతూ ఉందీ కనిపెట్టి అక్కడికి ఉత్తమోత్తమములయిన అస్త్రాలను రామలక్ష్మణులు వదిలినారు. అప్పుడు ఆ అతిరథుడు ఇంద్రజిత్తు రామలక్ష్మణులు వదులుతూ ఉన్న బాణాలను తప్పించుకుంటూ తన రథముమీద ఆకాశములో అన్ని వైపులా తిరుగుతూ అమితవేగముతో పోయే నిశితబాణాలను ఆ అన్నతమ్ముల మీద వదిలినాడు. ఆకాశాన మేఘాలు కమ్ముకొన్నప్పుడు సూర్యసంచారము తెలియనట్టు ఆ ఇంద్రజిత్తు అప్పుడు ఎక్కడ తిరుగుతూ ఉందీ కానీ అతడి ఆకారముకానీ అతడి ధనుర్బాణాలుకానీ మరి ఏదికానీ పయిన ఆకాశములో కనిపించలేదు.

ఆ ఇంద్రజిత్తు వదలిన బాణాలకు అప్పుడు వానరులు వందల కొద్ది ప్రాణాలు కోలుపోయి నేల కూలినారు. లక్ష్మణుడు క్రుద్ధుడు అయిపోయి రాక్షసులను అందరినీ సంహారము చేసి వేయడానికి బ్రహ్మాస్త్రాన్ని వదల తలచుకొన్నట్టు రాముడితో చెప్పినాడు. ఆ శుభలక్షణుణ్ణి లక్ష్మణుణ్ణి చూచి రాముడు "తమ్ముడా, ఒక్కడి కోసము ఈ పృథివి మీద ఉన్న రాక్షసులను అందరినీ సంహారము చేసి వేయడము అన్యాయము. ఏమంటే యుద్ధము చేయకుండా ఉన్న వారినీ యుద్ధము చేయడానికి భయపడి దాక్కొన్న వారినీ చేతులెత్తి నమస్కారము చేస్తున్న వారినీ శరణాగతులనూ పరుగెత్తిపారి పోతున్న వారినీ మద్యపానము మత్తులో ఉన్న వారినీ చంపి వేయకూడదు.

"తమ్ముడా, నీవు మహా బలవంతుడవు. ఇంద్రజిత్తును ఒక్కణ్ణే చంపి వేసే ప్రయత్నము చేదాము. మహావేగముతో పోయే క్రూరవిషసర్పాల వంటి అస్త్రాలను వదులుదాము. కంటికే కనపడేట్లయితే ఈ మాయలమారి వాణ్ణి ఈ నీచుణ్ణి రథముతో కూడా కనపడకుండా తిరుగుతూ ఉన్న ఈ ఇంద్రజిత్తును పట్టుకొని వానర సేనానాయకులే తమ బలముతో చంపివేస్తారు. నేను ఇప్పుడు వీడి మీద ఒక దివ్యాస్త్రాన్ని వదలవలెను అనుకొంటున్నాను. వీడు భూవివరములోకి పోయినా స్వర్గాది ఊర్ధ్వలోకాలకు పోయినా ఆకాశములోకి

పోయినా ఇంకా ఎక్కడికి పోయి దాక్కున్నా నా దివ్యాస్త్రము వీణ్ణి వదలి పెట్టదు. దగ్ధము చేసివేస్తుంది. ప్రాణాలు కోలుపోయి వీడు నేల కూలుతాడు" అని చెప్పినాడు.

ఈ విధముగా చెప్పి వానరవీరుల మధ్యను ఉన్న ఆ బుద్ధిమంతుడు ఆ మహాధైర్యవంతుడు రఘువీరుడు రాముడు అంతట ఆ క్రూరకర్ముణ్ణి ఆ భయంకరుణ్ణి ఇంద్రజిత్తును సంహారము చేసి వేయ సంకల్పించుకొని ధనుష్టంకారము చేసినాడు.

౮౧

ఆ మహాత్ముడు రాముడు అప్పుడు ఏమి చేయపోతున్నది ఇంద్రజిత్తు కనిపెట్టినాడు. వెంటనే ఆ యుద్ధభూమిలో నుంచి లంకాపట్టణానికి వెళ్ళిపోయినాడు. మహాబలవంతులను కుంభకర్ణాది రాక్షసవీరులను రాముడు సంహారము చేసి వేయడము పదే పదే తలుపుకువచ్చి క్రోధతామ్రాక్షుడు అయినాడు. ఆలోచించినాడు. మళ్ళీ లంకాపట్టణములో నుంచి బయలుదేరినాడు. ఆ శూరుడు ఆమహాద్యుతిమంతుడు ఆమహాపరాక్రమవంతుడు పౌలస్త్యమహర్షి వంశములో పుట్టిన ఆ దేవకంటకుడు ఇంద్రజిత్తు అప్పుడు రాక్షససేనలను వెంట పెట్టుకొని యుద్ధసన్నద్ధులు అయివున్న రామలక్ష్మణులకు దూరముగా ఉన్న లంకాపట్టణ పశ్చిమద్వారములోనుంచి బయటికి పోయినాడు. వానరులూ రామలక్ష్మణులూ దుఃఖపరవశులు అయిపోయి ఏ యుద్ధప్రయత్నమూ చేయకుండా ఉండడానికి అంతట ఒక మాయాసీతను చేసి తన రథము మీద కూర్చుండ పెట్టికొన్నాడు. అట్లా తన రథము మీద కూర్చుండ పెట్టుకొన్న ఆ మాయ సీతను రాక్షస మహాసైన్యము మధ్యను చంపి వేసి వానరులను అందరినీ మోసము చేయడానికి ఆ రథాన్ని వానర సైన్యాభిముఖముగా తోలించినాడు.

అట్లా లంకా పట్టణము నుంచి మళ్ళీ తమకు ఎదురుగుండా వస్తూ ఉన్న ఇంద్రజిత్తును వానరవీరులు అందరూ చూచినారు. పరమక్రుద్ధులు అయిపోయి రాళ్ళూ చెట్లూ చేతులలో పట్టుకొని ఆ ఇంద్రజిత్తును ఎదిరించడానికి సంసిద్ధము అయినారు. అప్పుడు ఒక మహాపర్వత శిఖరాన్ని చేతిలో పట్టుకొని హనుమంతుడు ఆ వానరసైన్యము ముందు ఇంద్రజిత్తు రథాన్ని చూచినాడు. పెనవేసుకొని పోయిన తలవెంట్రుకలు అన్నీ ఒకే ఒక జడ అయిపోయి ఉపవాసాదులతో దేహము అంతా కృశించిపోయి విడువకుండా కట్టుకొని ఉన్నందువల్ల చీరమాసిపోయి దేహసంస్కారాదులు లేనందువల్ల దేహము అంతా దుమ్ముకొట్టు

కొనిపోయి దీనురాలు అయిపోయిన కృశాంగిని రాముడి ప్రియురాలిని సీతా దేవిని ఆ ఇంద్రజిత్తు రథముమీద చూచినాడు. ఒక ముహూర్తము సేపు ఆమె వంక హనుమంతుడు చూచినాడు. అచిరకాలము కిందటనే ఆ జనకాత్మజను సీతాదేవిని అతడు చూచినాడు. ఆమె సీతాదేవేను అనుకొన్నాడు.

ఆ మైథిలిని ముమ్మ కొట్టుకొని ఉన్న ఆ దీనురాలిని ఆ సీతాదేవిని ఇంద్రజిత్తు రథము మీద చూచే చూడటముతో హనుమంతుడికి పట్టరాని దుఃఖము వచ్చింది. ముఖము అంతా కన్నీళ్లు కమ్ముకొని పోయినవి. ఆ శోకార్తను ఆ నిరానందను ఆ దీనురాలిని సీతాదేవిని ఎందుకు ఇంద్రజిత్తు ఆ రథముమీద తెచ్చినాడా అని ఆలోచించినాడు. వెంట ఉన్న వానరవీరులను అందరినీ అడిగినాడు. ఆ వానరసైన్యాన్ని అంతటా వెంట పెట్టుకొని ఆ రథానికి ఎదురుగుండా పరుగెత్తినాడు.

అప్పుడు అట్లా తన మీదికి వస్తూ ఉన్న హనుమంతుణ్ణి వానరమహాసైన్యాన్ని చూచి ఇంద్రజిత్తు ఒరలో నుంచి కత్తిదూసి రెండో చేతితో ఆ సీతాదేవి జుట్టుపట్టుకొన్నాడు. రథముమీద ఉన్న ఆ సీతాదేవి "రామా రామా" అని అరుస్తూ ఉంటే హనుమంతుడు మొదలు అయినవారు అందరూ చూస్తూ ఉండగా కొట్టినాడు. అట్లా ఆ సీతాదేవి శిరోజాలను ఇంద్రజిత్తు పట్టుకొంటే ఆ మారుతాత్మజుడికి హనుమంతుడికి ఏడుపు వచ్చింది. ఆ స్థితిలో ఏమి చేయడానికీ అతడికి తోచలేదు.

ఆ సర్వాంగసుందరిని రాముడి ప్రియభార్యను పట్టమహిషిని సీతాదేవిని చూచి ఆమె దురవస్థకు కోపమువచ్చి హనుమంతుడు అతిపరుషముగా ఇంద్రజిత్తుతో "ఓ దురాత్ముడా, నీది బ్రహర్షులవంశము. అయితే నీవు రాక్షసస్త్రీకి పుట్టినావు. అందువల్ల నీకు ఇటువంటి దుర్బుద్ధి పుట్టింది. ఛీ ఛీ నీవు ఏమి చేస్తున్నదీ నీకు తెలియడము లేదు. సీతాదేవి తల వెంట్రుకలు పట్టుకొన్నావు. ఓరి, దురాచారుడా, ఓరి క్రూరుడా, నీవు పాపిష్ఠిపనికి పరమపరాక్రమవంతుడవు. ఓరి దుష్టుడా, దుర్మార్గుడా, నీవు దుర్జనులు చేసే పని చేస్తున్నావు. నీవు నిర్దయుండవు, నీకు సిగ్గులేదు. రాజ్యము పోయింది. ఇల్లూ వాకిలీ వదిలి పెట్టింది. రాముడి చేతిలోనుంచి జారిపోయింది. ఈ సీతాదేవి నీకు ఏమి అపరాధము చేసింది. ఈమెను ఎందుకు చంపివేయ తలచుకొన్నావు. నీవు ఈ సీతాదేవిని చంపివేసేట్లయితే నీవు బ్రతికి ఉండడము ఉత్తది. ఎవడు అయినా సరే నిన్ను వెంటనే చంపివేయవలెను. నీవు ఇప్పుడు నా చేతిలో చిక్కినావు. నీవు ఏ లోకానికి పోయినా నిన్ను నేను వదిలిపెట్టను. నీవు ఇక్కడ చచ్చిన తరువాత

నీ యాతనాశరీరము స్త్రీహత్య చేసినవారు పోయే లోకానికి పోతుంది" అని చెప్పుతూ హనుమంతుడు సాయుధులు అయిన వానరయోధులను వెంట పెట్టుకొని ఆ ఇంద్రజిత్తును ఎదిరించ పోయినాడు.

అప్పుడు ఆ మహావీర్యవంతము అయిన వానరసైన్యాన్ని రాక్షస సైన్యము భయంకరవేగముతో అడ్డగించింది. ఇంద్రజిత్తు ఆ వానర వాహినిమీద వేలకొద్దీ బాణాలు వదిలి క్షోభపెట్టి ఆ వానర వీరుణ్ణి హనుమంతుణ్ని చూచి "ఓరీ, నీవూ సుగ్రీవుడూ ఆ రాముడూ ఇక్కడికి ఎవరి నిమిత్తము వచ్చినారో ఆ వైదేహిని సీతాదేవిని ఇప్పుడే నీ ఎట్టఎదట నీవు చూస్తూవుండగా చంపివేస్తాను. ఓ వానరుడా, సీతను చంపివేసిన తరువాత రామలక్ష్మణులనూ నిన్నూ సుగ్రీవుణ్ని ఆ పరమ దుర్జనుణ్ని విభీషణుణ్ని చంపివేస్తాను. స్త్రీలను చంపివేయకూడదు అని నీవు చెప్పినావు. శత్రువులను దుఃఖపెట్టటమే నా కర్తవ్యము. అందుకు నేను ఏ పని అయినా చేసివేస్తాను" అని చెప్పుతూ పదును అయిన ఖడ్గముతో సీతాదేవిని తెగవేసినాడు. యజ్ఞోపవీతధారణమార్గముగా తెగిపోయిన ఆ దీనురాలు ఆ ప్రియదర్శిని ఆ పృథుశ్రోణి సీతాదేవి నేలమీద పడిపోయింది.

ఇంద్రజిత్తు అట్లా సీతను స్వయముగా చంపివేసి హనుమంతుణ్ణి చూచి "ఓరీ, నేను రాముడి ప్రియభార్యను చంపివేసినాను. చూడు. మీరు పడ్డ శ్రమ అంతా వృథా అయిపోయింది" అని చెప్పి సంతోషముతో రథములో కూర్చుని వికృతముగా నోరు తెరిచి పెద్దపెట్టున సింహనాదము చేసినాడు. చొరపడడానికి అలవికాని రాక్షససేనామధ్యములో ఉన్న ఇంద్రజిత్తు చేసిన సింహనాదము విని వానరయోధులు విషణ్ణులు అయిపోయినారు. వెంటనే వెనకకు మళ్లినారు.

## ౮౨

దేవేంద్రుడు వదిలే పిడుగువంటి మహాభయంకరధ్వని వలె ఇంద్రజిత్తు అప్పుడు సింహనాదము చేసినాడు. ఆ మహాభయంకరధ్వనికి వానరయోధులు అందరూ భయపడి పారిపోవడానికి దశదిశలూ చూడసాగినారు. విషణ్ణముఖాలతో ఎవరిదారిన వారు పరుగెత్తిపోతున్న ఆ వానరయోధులను అందరినీ హనుమంతుడు చూచి "ఓ వానరవీరులారా, మీ యుద్ధోత్సాహము ఏమి అయిపోయింది. ఎందుకు విషణ్ణముఖాలతో పరుగులెత్తుతారు. మీ శౌర్యము ఎక్కడికి పోయింది. మీరు భయపడవద్దు. పారిపోవద్దు. యుద్ధరంగములో

నేను ముందు ఉంటాను. మీరు అందరూ నా వెనక ఉండెండి. మనము పోరాడుదాము. సత్కులములో పుట్టిన శూరులు వెన్ను ఇచ్చి పారిపోరు" అని చెప్పినాడు.

ఈ విధముగా హనుమంతుడు చెప్పిన మాటలు విని వానరవీరులు అందరూ మహోత్సాహముతో పర్వత శిఖరాలూ మహావృక్షాలూ తీసుకొని ఆ హనుమంతుడి చుట్టూ చేరి సింహనాదాలు చేసినారు. అంతట ఆ మహాబలవంతుడి వెంట బయలుదేరి రాక్షస సైన్యాలకు ఎదురుగుండా పోయినారు. అన్ని వైపులా మంటలు మండుతూ ఉన్న అగ్నిహోత్రము మాదిరిగా చుట్టూ ఉన్న వానర వీరులతో హనుమంతుడు విజృంభించి ఆ రాక్షస సైన్యాన్ని నాశనము చేసి వేయ సాగినాడు. చుట్టూ ఉన్న వానరసైన్యాలతో హనుమంతుడు అప్పుడు ప్రళయకాలయముడి వలె రాక్షసులను సంహారము చేసి వేసినాడు.

ఆ మహాబలవంతుడికి హనుమంతుడికి అప్పుడు (ఇంద్రజిత్తు సీతాదేవిని చంపి వేసినందుకు) పట్టరాని దుఃఖము వచ్చింది. కోపముతో చెలరేగి పెద్ద రాతి బండను తీసుకొని ఇంద్రజిత్తు రథము మీద విసరివేసినాడు. అట్లా వచ్చి పడబోతున్న ఆ రాతిబండను ఆ రథసారథి అప్పుడు చూచినాడు. ఎటు తోలితే అటు పోయే ఆ గుర్రాలను ఆ రథసారథి ఇట్టే పక్కకు తోలి ఆ రాతి బండ రథము మీద పడకుండా తప్పించినాడు. అందువల్ల ఆ రాతిబండ ఆ రథము మీద కానీ ఆ రథము మీద కూర్చుని ఉన్న ఇంద్రజిత్తు మీద కానీ సారథి మీద కానీ పడకుండా కిందపడ్డది. నేల బద్దలు అయి పోయింది. ఆ రాతి బండ కింద పడి అనేకమంది రాక్షసయోధులు చితికిపోయినారు. అప్పుడు వానరయోధులు సింహనాదాలూ చేస్తూ వందల కొద్దీ ఇంద్రజిత్తు మీదికి పరుగెత్తినారు. ఆ మహాబలవంతులు ఆ భయంకర పరాక్రములు వానరయోధులు మహావృక్షాలనూ పర్వతశిఖరాలనూ అప్పుడు ఇంద్రజిత్తు మీద విసరి వేసినారు. వృక్షశైలమహావర్షము కురిపించి వానరయోధులు శత్రువులతో పోరాడుతూ వివిధ స్వరాలతో కేకలు పెట్టినారు. అట్లా తమ బలము కొద్దీ ఆ మహాబలవంతులు వానరయోధులు వృక్షాలతోనూ పర్వతాలతోనూ కొట్టుతూ ఉంటే ఆ దెబ్బలకు భయంకరాకారులు అయిన రాక్షసయోధులు అనేకమంది ఆ యుద్ధములో కింద పడి పొర్లాడి చచ్చిపోయినారు. తన సైన్యము వానరయోధుల దెబ్బకు పడిపోవడము చూచి ఇంద్రజిత్తు మహోగ్రుడు అయిపోయి ధనుస్సు తీసుకొని వానరసైన్యాలకు ఎదురుగుండా వచ్చినాడు. తన సైన్యాలను చుట్టూ ఉంచుకొని వానర సైన్యాల మీద అప్పుడు

పదును అయిన ఇనుపబాణాలను వదలడము మొదలు పెట్టినాడు. అతడి అనుచరులు అప్పుడు తమ పరాక్రమము కొద్దీ శూలాలతోనూ ఖడ్గాలతోనూ కూటముద్గరాలతోనూ పట్టిసాలతోనూ పిడుగులు అనే ఆయుధాలతోనూ వానరయోధులను కొట్టినారు. ఆ భయంకర కర్ములను రాక్షసులను అప్పుడు ఆ మహాబలవంతుడు హనుమంతుడు ఎదుర్కొన్నాడు. కొమ్మలతోనూ బోదెలతోనూ ఉన్న పెద్దచెట్లను తీసుకొని పర్వత శిఖరాలను పెకలించి రాక్షసయోధులను కొట్టి హనుమంతుడు ఆ శత్రుసైన్యాలు తన సైన్యాలమీద పడకుండా అడ్డగించినాడు. అంతట వానరవీరులను అందరినీ చూచి "ఓ వీరులారా, రాక్షససైన్యాన్ని మనము సాధించ నవసరములేదు. మనము సీతాదేవిని సాధించడానికి వచ్చినాము కానీ, ఈ రాక్షససైన్యాన్ని సాధించడాని కోసము రాలేదు. కాబట్టి మనము వెనకకు మళ్లిదాము. రాముణ్ణి సంతోష పెట్టడానికి ప్రాణాల మీద ఆశ వదులుకొని ఎవరికోసము పోరాడినామో ఆ సీతాదేవిని ఇంద్రజిత్తు చంపివేయడము చూచినాము. ఈ వృత్తాంతము మనము రాముడికీ సుగ్రీవుడికీ తెలియ చెప్పుదాము. ఆ తరువాత వారు ఏమి చేయమంటే అది చేదాము" అని చెప్పి వానరయోధులను రాక్షస సైన్యాల మీదికి పోకుండా ఆపివేసినాడు.

అంతట ఆ హనుమంతుడు ఆ వానర సైన్యాన్ని నిర్భయముగా వెనకకు మళ్లించినాడు. వానరసైన్యాలు మెల్ల మెల్లగా హనుమంతుడి వెంట బయలుదేరి రాముడు ఉన్న చోటికి పోవడము ఆ దుష్టాత్ముడు ఇంద్రజిత్తు చూచినాడు. సంతోష పడ్డాడు. అంతట హోమము చేయడము కోసము చైత్యములో ఉన్న నికుంభిలా దేవతాలయానికి ప్రయాణము అయి పోయినాడు.

ఆ నికుంభిలా దేవతాలయములో ఉన్న అగ్నిహోత్రములో ఇంద్రజిత్తు అప్పుడు హోమము చేయడము మొదలు పెట్టినాడు. యథావిధిగా మాంసముతోనూ నెత్తురుతోనూ హోమము చేస్తూ ఉంటే అగ్నిహోత్రము భగ భగ మంటలు మండించి. ఆ రక్తహోమానికి అగ్నిహోత్రుడు తృప్తిపడి తీవ్రముగా జ్వలిస్తూ సంధ్యాకాల సూర్యుడివలె తేజరిల్లినాడు.

ఆగమవిధులు అన్నీ తెలిసిన ఆ ఇంద్రజిత్తు రాక్షసులు జయించడానికి హవిర్భాగాన్ని హోమము చేస్తూ ఉంటే అక్కడ రాక్షససమూహములో విధినిషేధాలు తెలిసిన రాక్షసపండితులు విధిలోపము రానీయకుండా చుట్టూ చూస్తూ నిలుచున్నారు.

## ౭౩

వానర రాక్షస సంగ్రామఘోషము రాముడు విన్నాడు. జాంబవంతుణ్ణి పిలిచి "ఓ సౌమ్యుడా, ఆయుధాలధ్వని భయంకరముగానూ విశేషముగానూ వినబడుతున్నది. హనుమంతుడు ఏదో అసాధ్యము అయిన మహాత్కార్యాన్ని చేస్తూ ఉండి ఉండవలెను. ఓ భల్లూకరాజా! నీవు నీ సైన్యాన్ని వెంట పెట్టుకొని ఇప్పుడే పోయి యుద్ధముచేస్తూ ఉన్న ఆ వానరవీరుడికి హనుమంతుడికి సహాయపడు" అని చెప్పినాడు.

అంతట ఆ భల్లూకరాజు జాంబవంతుడు తన సైన్యాన్ని వెంటపెట్టుకొని హనుమంతుడు ఉన్న పశ్చిమద్వారము దగ్గరకు ప్రయాణము అయినాడు. అంత వరకూ పోరాడి అలసిపోయి నిట్టూర్పులు విడుస్తూ ఉన్న వానరయోధులను వెంట పెట్టుకొని వస్తూఉన్న హనుమంతుణ్ణి ఆ దారిలో జాంబవంతుడు చూచి నాడు. హనుమంతుడున్నూ యుద్ధము చేయడానికోసము వస్తూఉన్న నీల మేఘాల వంటి ఆ భయంకర భల్లూకవీరులనూ జాంబవంతుణ్ణి చూచినాడు. వారినికూడా వెనకకు మళ్లించి ఆ మహాయశుడు హనుమంతుడు అమితవేగ ముతో రాముడి దగ్గరకు పోయి దుఃఖపడుతూ "ప్రభూ, మేము అందరమూ యుద్ధము చేస్తూఉన్నాము. యుద్ధభూమిలో మా ఎట్టఎదట మేము అందరమూ చూస్తూఉండగా ఇంద్రజిత్తు ఏడుస్తూఉన్న సీతాదేవిని చంపివేసినాడు.

"ఓ అరిందమా! సీతాదేవిని ఇంద్రజిత్తు తనరథముమీద తీసుకొని రావ డము చూచినాను. నేను విషణ్ణుడి అయి పోయినాను. నా మనస్సు క్షోభ పడ్డది. నాకు అప్పుడు ఏమి చేయడానికీ తోచలేదు. జరిగింది మీకు విన్నవించ డానికి వచ్చినాను." అని కన్నీళ్లు కారుస్తూ చెప్పినాడు.

రాముడు ఆ హనుమంతుడు చెప్పింది అంతా విన్నాడు. వింటూ నే శోక ముతో మూర్ఛపోయినాడు. వేరునరికిన చెట్టువలె నేలమీదపడిపోయినాడు. ఆ దేవసమానుడు రాముడు నేలమీదపడిపోవడము చూచి వానరవీరులు అందరూ అన్నివైపులనుంచీ అక్కడికి పరుగెత్తుకొని వచ్చినారు. నేలమీద పడిపోయి నప్పటికిన్నీ దరిచేర నలవికాకుండా జ్వలించే అగ్నిహోత్రము వలె దివ్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న ఆ రాముడిమీద కమలాల సుగంధమూ కలువపూల సుగంధమూ గుబాళిస్తూ ఉన్న చల్లటి నీళ్లు తెచ్చి చల్లినారు.

అట్లా అస్వస్థుడు అయి పోయిన ఆ రాముణ్ణి లక్ష్మణుడు తన రెండు చేతులా కౌగలించుకొని దుఃఖపడుతూ యుక్తియుక్తముగా "ఓ పూజ్యుడా,

నీవు ధర్మమార్గము అవలంబించినావు. జితేంద్రియుడవు. అయితే ధర్మము నిరర్థకము అయి పోయింది. నీవు అవలంబించిన ధర్మము నీ దుఃఖాలను పోగొట్ట లేక పోయింది. ఇంతేకూ స్థావరజంగమాలవలె ధర్మాధర్మాలు ప్రత్యక్షముగా కనపడటము లేదు. అందువల్ల ధర్మాధర్మాలు లేవు అనిపిస్తున్నది. స్థావర పదార్థాలూ జంగమపదార్థాలూ కన్నులకు కనపడుతూ ఉన్నవి. అందువల్ల అవి ఉన్నవి అనుకొంటున్నాము. అట్లా ధర్మాధర్మాలు కన్నులకు కనపడటము లేదు. నీ వంటి పరమధార్మికుడికి ఇంత ఆపద వచ్చింది. ధర్మమే ఉన్నట్లయితే నీకు ఇటువంటి విపత్తు వచ్చి ఉండకూడదు. ధర్మాధర్మాలు అనేవే ఉన్న ట్లయితే రావణాసురుడు అనుసరించిన అధర్మపద్ధతికి అతడు నరకబాధలు అనుభవిస్తూ ఉండవలెను. అటువంటిది ధర్మమార్గము అవలంబించిన నీవు దుఃఖాల పాలు అయి పోయినావు. అధర్మమార్గము అవలంబించిన రావణా సురుడు ఏ దుఃఖమూ లేకుండా సుఖముగా ఉన్నాడు.

"ధర్మము అభ్యుదయఫలాన్నీ అధర్మము కష్టఫలాన్నీ ఇస్తుంది అని శాస్త్రాలలో చెప్పి ఉంది కాని ప్రత్యక్షములో పరస్పరవిరుద్ధముగా కనపడు తున్నది. ధర్మము ధర్మఫలాన్నీ అంటే సుఖఫలాన్ని ఇవ్వవలెను. అధర్మము అధర్మఫలాన్ని అంటే కష్టఫలాన్ని ఇవ్వవలెను. కాబట్టి అధర్మము అనుష్ఠించే వారికి అధర్మఫలము అయిన కష్టము తప్పకుండా సంభవించవలెను. అదేవిధముగా ధర్మము అనుష్ఠించే వారికి ధర్మఫలము అయిన సుఖము తప్పకుండా సంభవించ వలెను. అధర్మము ఆచరించిన వారికి ఇష్టసిద్ధిన్నీ ధర్మము ఆచరించిన వారికి కష్టసిద్ధిన్నీ అయింది. అందువల్ల ధర్మాధర్మాలు ఉన్నవి అనుకొన్నా వాటిని అనుష్ఠించడము వ్యర్థము.

రామా, పాపకర్ములు అధర్మముచేత బాధ పడేట్టయితే చంపివేయడము అనే కర్మ అధర్మము. ఆ అధర్మము కాస్తా జరిగి పోయింది. జరిగి పోయిన ఆ అధర్మము ఎవరిని బాధ పెట్టుతున్నది. ఎవడో చేసిన అధర్మము నిన్ను బాధ పెట్టుతున్నది. నీవు చేసిన ధర్మము మరి ఒకండ్లను సుఖ పెట్టుతున్నది. ఒక వేళ ఒకరిని ఒకరు చంపివేయడము దైవికము అనేట్లయితే. ఆ పాపకర్మము దైవానిది కాని ఆ చేసినవాడిది కాదు. అదేవిధముగా పుణ్యకర్మము కూడా దైవానిదే అవుతుంది కాని ఆ చేసిన వాడిది కాదు. అందువల్ల దైవికము అని తోసివేయడానికిన్నీ వీలు లేదు.

"ఓ పరంతపా, ధర్మము ఇటువంటి ఇటువంటి లక్షణాలతో ఉంటుంది. అని ఊహించటానికి అయినా అలవి కాకుండా ఉంది. అందువల్ల

అది లేనివానివంటిదే. ధర్మమే ఉన్నట్లయితే నీవు ఇటువంటి కష్టాలపాలు కావలసినవాడవు కాదు. కనుక ధర్మము లేనేలేదు అనిపిస్తూ ఉంది. ధర్మానికి సామర్థ్యము లేదు. బలము లేదు. అది పురుషప్రయత్నాన్ని ఆశ్రయించుకొని బ్రతుకుతూ ఉంది. కాబట్టి ధర్మాన్ని ఆశ్రయించడము కన్నా ధర్మానికి ఆశ్రయము అయిన పురుషప్రయత్నాన్ని ఆశ్రయించడము మంచిది. కార్యసాధనవిషయములో పురుషప్రయత్నానికి ధర్మము ప్రధానము కాదు. కాబట్టి ధర్మాన్ని వదిలిపెట్టి పురుషప్రయత్నమే చేయవలెను.

"ఓ అరిందమా, సత్యము చెప్పడము ధర్మము కదా, మన తండ్రి నిర్దయుడు అయి అసత్యము ఆడితే నీవు ఆయనను ఎందుకు బంధించివేయలేదు. ధర్మమే అనుష్ఠించవలసి ఉన్నట్లయితే దేవేంద్రుడు విశ్వరూపుడు అనే మునిని చంపి వేయకుండా యజ్ఞము మాత్రము చేసి ఉండేవాడు. అధర్మము అనుష్ఠించవలసి ఉన్నట్లయితే ఆ విశ్వరూపుడు అనే మునినిమాత్రము చంపివేసి యజ్ఞము చేయకుండా ఉండే వాడు. అందువల్ల సమయాసమయాలను పట్టి ధర్మాధర్మాలను రెంటినీ అనుష్ఠించవలెను. కేవల ధర్మము కానీ కేవల అధర్మము కాని అనుష్ఠించేట్లయితే కర్తకు చెరుపు అవుతుంది. కనుక ధర్మాధర్మకార్యాలను ఆ యా కాలాలకు తగినట్టు అనుసరించవలెను.

అన్నా, ధర్మము అధర్మము అనే నియమము లేకుండా అవసరము అయిన పని చేయడమే ధర్మము. రాజ్యము వస్తూవుంటే నీవు వదులుకొన్నావు. ఆ విధముగా ధర్మానికి మూలము అయిన అర్థాన్ని వదిలిపెట్టినావు. మూలచ్ఛేదము అయిపోయినందువల్ల నీకు ధర్మము ఎక్కడిది. కొండలలో నుంచి చిన్న చిన్న వీర్లుగా బయలుదేరి మహానదులు అయి లోకానికి ఉపయోగించేట్టు రాజ్యము సంపాదించి ప్రజలు ఇచ్చే పన్నులు మొదలు అయిన వాటిని వృద్ధి చేసుకొన్నట్లయితే యజ్ఞాదిసర్వక్రియలూ చేయడానికి వీలు అయ్యేది. నీవు అట్లా చేయలేదు. అర్థాన్ని వదిలి పెట్టినావు. అర్థము లేని వాడు తేజోహీనుడు. అర్థము లేని వాడి సమస్తపనులూ ఎండాకాలములో ఏటి నీళ్ళవలె రోజు రోజుకూ ఎండిపోతవి. అర్థాన్ని త్యజించినవాడు సమస్తసుఖాలు అనుభవించవలెను అనుకొనేట్లయితే పాపకృత్యాలు చేయవలసి వస్తుంది. అర్థాన్ని త్యజించడమువల్ల ధర్మము లోపము అయిపోవడమే కాకుండా దోషము కూడా సంభవిస్తుంది.

"రామా, ఈలోకములో అర్థవంతుడికి అందరూ మిత్రులు అవుతారు. అర్థవంతుడికి అందరూ బంధువులు అవుతారు. అర్థవంతుడే మొగవాడు. వాడే

పండితుడు. వాడే మహాపరాక్రమవంతుడూ బుద్ధిమంతుడూ గుణవంతుడూ మహాభాగుడూ అవుతాడు. అర్థము వదులుకొంటే అన్నీ చిక్కులే అవుతవి. రామా, నీవు అప్పుడు రాజ్యము వదులుకున్నావే-ఎందుకు అప్పుడు నీకు అటువంటి బుద్ధి పుట్టింది. అర్థవంతుడికి ధర్మకామాలు లభ్యములవుతవి. సమస్తమూ అనుకూలముగా ఉంటుంది. అర్థహీనుడు ఎంత ప్రయత్నము చేసినా విలాభమూ పొందలేడు. రామా, సంతోషమూ కామమూ దర్పమూ ధర్మమూ కోపమూ శమమూ దమమూ సర్వమూ అర్థవంతుడిలో శోభిస్తవి. అర్థాన్ని అలక్ష్యము చేసి కేవలము ధర్మాన్ని అనుష్ఠించేవాడికి ఇహలోకసౌఖ్యము అంతా నాశనము అయిపోతుంది.

ఓ వీరుడా. నీవు అర్థానికి కారణముఅయినరాజ్యాన్ని వదులుకున్నావు. పితృవాక్య పరిపాలనము ధర్మము అనుకొన్నావు. అడవులకు వచ్చినావు. నీ ప్రాణముకన్నా నీకు ప్రియము అయిన నీ ఇల్లాలిని రాక్షసులు అపహరించడము జరిగింది. ఇప్పుడు నీకు ఈ గొప్పవిపత్తు వచ్చింది. నీవు ఇక లేవవలెను. నేను నా శౌర్యముతో నీదుఃఖాన్ని పోగొట్టుతాను.

"ఓ నరశార్దూలమా, నీవు మహాబాహువు. దృఢవ్రతుడవు. ఎందువల్లనో నీప్రభావము నీవు తెలుసుకోలేకుండా ఉన్నావు. నీవు ఆజ్ఞాపించు. ఆ రాక్షసరాజును రావణాసురుణ్ణి గుర్రాలతోనూ ఏనుగులతోనూ రథాలతోనూ ఉన్న వాడి సైన్యాన్నీ లంకాపట్టణాన్ని నాబాణాలతో ఈక్షణమే ధ్వంసము చేసివేస్తాను" అని చెప్పినాడు.

## ౮౮

ఆ భ్రాతృవత్సలుడు లక్ష్మణుడు అట్లా రాముణ్ణి ఓదారుస్తూ ఉన్నాడు. విభీషణుడు సేనాసమూహాలను ఆయాస్థానాలలో ఉంచి ఏనుగులను వెంటపెట్టుకొనిపోయే మదపుటేనుగువలె ఆయుధధారులు అయిన కాటుకరాసులవంటి తన నలుగురు మంత్రులనూ వెంటపెట్టుకొని బయలుదేరి అప్పుడు రాముడు ఉన్నచోటికి వచ్చినాడు. కన్నీళ్లు కారుస్తూఉన్న వానరవీరులనూ దుఃఖపరవశుడు అయి ఉన్న మహాబలవంతుణ్ణి లక్ష్మణుణ్ణీ ఆలక్ష్మణుడి ఒడిలో ఒళ్లు తెలియకుండా పడిఉన్న రాముణ్ణీ చూచినాడు. దిగులుపడిపోయినాడు. తన దుఃఖాన్ని పయికి తెలియనీయకుండా "ఇది ఏమిటి" అని విభీషణుడు ప్రశ్నించినాడు.

లక్ష్మణుడు కన్నీళ్లు కారుస్తూ సుగ్రీవుణ్ణీ తక్కిన వానర వీరులనూ చూస్తూ విభీషణుడితో మందము మందముగా "ఓ సౌమ్యుడా, హనుమంతుడు

తన ఎట్టఎదట ఇంద్రజిత్తు సీతాదేవిని కొట్టి చంపివేసినాడు అని వచ్చి చెప్పినాడు. అది వినీవినడముతో రాముడు ఒళ్లు ఎరగకుండా పడిపోయినాడు" అని ఇంకా ఏమో చెప్పుకుపోతూ ఉంటే విభీషణుడు ఆ లక్ష్మణుణ్ణి చెప్ప నీయకుండా రాముణ్ణిచూచి "ప్రభూ, సముద్రము ఎండిపోయింది" అని చెప్పితే ఎంత నిజమో హనుమంతుడు చెప్పింది అంత నిజము. సీతాదేవిని ఇంద్రజిత్తు చంపివేయడము ఉత్తది.

"ఓ రామా, నేను మా అన్నకు మేలు చేయవలెను అనుకొని సీతాదేవిని వదిలి పెట్టమని ఎన్నిసార్లో ప్రార్థించినాను. వాడు నా మాట పెడ చెవిని పెట్టి నాడు. అంతే కాదు. సామదానభేదదండోపాయాలవల్ల కానీ మరి ఏ ఇతర మాయోపాయాలవల్ల కానీ ఆ సీతాదేవిని చూడడానికి అయినా ఎవరికీ అలవి కాకుండా మాఅన్న కట్టు దిట్టాలు చేసి వేసినాడు. సీతాదేవి కోసము మాఅన్న రావణుడు సమస్తమూ చివరకు ప్రాణాన్ని అయినా వదులుకోడానికి సిద్ధముగా ఉన్నాడు. అందువల్ల ఇంద్రజిత్తు సీతాదేవిని చంపి వేయడము మాయ. వానరవీరులను మోసము చేసి తాను నికుంభిలా దేవతాలయములో హోమము చేయడానికి ఇంద్రజిత్తు వెళ్ళిపోయినాడు. వాడా హోమము పూర్తి చేసుకొని వచ్చేట్లయితే దేవేంద్రుడితో కూడా దేవతలు అందరూ వచ్చినా వాణ్ణి యుద్ధరంగములో ఎదిరించలేరు సీతాదేవిని చంపివేసేట్లయితే వానరులు భ్రమపడి పోయి యుద్ధము చాలించి పోతారు అని వాడు ఆలోచించి మాయ సీతను కల్పించి చంపి వేసి ఉంటాడు. తన యజ్ఞము నిర్విఘ్నముగా చేసుకో వచ్చును అని అట్లా చేసినాడు.

"ఓ రామప్రభూ, వాడు ఆ యజ్ఞము ముగించేలోపలనే మనము మన సైన్యాలతో ఆ నికుంభిలా దేవతాలయానికి పోవలెను. నీవు దుఃఖపడ నవసరము లేదు. నీవు దుఃఖపడవద్దు. నీవు దుఃఖపడు తున్నందువల్ల ఈ వానరసైన్యము అంతా దుఃఖపడుతూ ఉంది.

"ఓ రామా, నీవు స్వస్థచిత్తముతో ఇక్కడనే ఉండు. మా తోనూ, ఈ వానర సైన్యాధిపతులతోనూ, లక్ష్మణుణ్ణి పంపించు. ఈ నరశార్దూలము తన తీక్ష్ణబాణాలు వదిలి ఆ ఇంద్రజిత్తు యజ్ఞకర్మను ధ్వంసము చేసివేస్తాడు. ఆ తరువాత, వాణ్ణి సంహారముచేసి వేయుకలుగుతాడు. పక్షి ఈకలు కట్టిన ఈ లక్ష్మణుడి బాణాలు అమితవేగముతో క్రూరపక్షులవలె పోయి, ఇంద్రజిత్తు నెత్తురు త్రాగివేస్తవి. ఓ మహాబాహూ, వజ్రధరుడు వజ్రాయుధాన్ని పంపిం చేట్లు ఈ శుభలక్షణుణ్ణి లక్ష్మణుణ్ణి మా వెంట పంపించు."

"ఓ ప్రభూ, శత్రుసంహారానికి ఇది అదను. ఇప్పుడు కాలవిలంబనము ఎంతమాత్రమూ పనికిరాదు. తలపడినప్పుడు తారకాసురాసురులను సంహారము చేయమని దేవేంద్రుడు కుమారస్వామిని ఆజ్ఞాపించినట్లు, ఇంద్రజిత్తును సంహారము చేసివేయమని నీవు నీ తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి ఆజ్ఞాపించు."

"ఓ రామప్రభూ, ఆ ఇంద్రజిత్తు చేస్తున్న హోమము సమాప్తము అయ్యేట్లయితే వాడు సురాసురులకు సైతము అదృశ్యుడైపోయి పోరాటము సాగిస్తాడు. అప్పుడు దేవతలకు సైతము ప్రాణసంశయము అవుతుంది" అని చెప్పినాడు.

## ౮౫

విభీషణుడు చెప్పింది దుఃఖముతో కుంగిపోయిన రాముడు విన్నాడే కాని స్పష్టముగా అర్థము చేసుకోలేదు ఆ పరపురంజయుడు రాముడు అంతట కోలుకొని ఆ వానరవీరుల సమక్షములో విభీషణుణ్ణి చూచి "ఓ విభీషణుడా, నీవు చెప్పింది నాకు సరిగా బోధపడలేదు. మళ్ళీ చెప్పు. నీ అభిప్రాయము ఏమిటో తెలుసుకొంటాను" అన్నాడు.

ఆ వాక్యవిశారదుడు విభీషణుడు "ప్రభూ, నీవు ఆజ్ఞాపించినట్టు సేనా సన్నివేశాలను ఏర్పాటు చేసి నాలుగు పక్కలా ఉంచినాను. యథాన్యాయముగా యూథపతులను నియమించినాను. నిన్ను చూడవలెను అనుకొని ఇక్కడికి వచ్చినాను.

"ఓ మహాయశా, నా విన్నపము ఆలకించు నీవు అకారణముగా దుఃఖపడుతున్నావు. అందువల్ల అందరూ దుఃఖపడుతున్నారు. నీవు దుఃఖపడ నక్కరలేదు. జరిగింది అంతా మాయ, నీవు ఇప్పుడు ఇట్లా సంతాపపడుతూ ఉండేట్లయితే శత్రువులు మరింత సంతోషిస్తారు. నీవు సంతాపపడవద్దు. ఉత్సాహముతో ఉండు. సంతోషముతో ఉండు.

ఓ రామప్రభూ, నీవు రాక్షసులను అందరినీ సంహారము చేసి సీతాదేవిని తీసుకొని పోతలచుకొన్నట్లయితే నేను చెప్పేది వినవలెను. నేను నీ మేలు కోరి చెప్పుతున్నాను. ఈ లక్ష్మణుణ్ణి వానరమహాసైన్యముతో ఇప్పుడు పంపించు. ఇతడు నికుంభిలాదేవతాలయానికి పోయి పోరాడి ఆ ఇంద్రజిత్తును సంహారము చేసి వేస్తాడు. ఈ జయశీలి ఈ మేటి విలుకాడు లక్ష్మణుడు మండలాకారముగా తన వింటిని వంచి వదిలిపెట్టే విషసర్పాలవంటి బాణాలను ఆ ఇంద్రజిత్తు నిలవలేడు. వాడు చచ్చిపోతాడు.

"వాడు ఆ ఇంద్రజిత్తు ఇదివరకు తపస్సు చేసి బ్రహ్మదేవుణ్ణి మెప్పించి బ్రహ్మశిరము అనే అస్త్రాన్ని కోరుకొన్నట్టు పోయే నాలుగు గుర్రాల రథాన్నీ సంపాదించినాడు. వాడు ఇప్పుడు రాక్షససైన్యాన్ని వెంటపెట్టుకొని నికుంభిలా దేవతాలయానికి యజ్ఞకర్మ చెయడానికి పోయినాడు. అక్కడ వాడు ఆ యజ్ఞకర్మను పూర్తిచేసి వచ్చేట్లయితే వాణ్ణి ఎవరూ జయించలేరు వాడు మనలను అందరినీ సంహారము చేసి వేయ కలుగుతాడు. నికుంభిలా దేవతాలయములో ఇంద్రజిత్తు హోమము పూర్తిచేసే లోపల ఎవడు వాణ్ణి అడ్డగిస్తాడో వాడి చేతలోనే ఆ ఇంద్రజిత్తు చచ్చిపోతాడు అని బ్రహ్మదేవుడు చెప్పినాడు.

"ప్రభూ, నికుంభిలా హోమాన్ని విఘ్నము చేసేవాడి చేతిలో ఆ ధీమంతుడు ఇంద్రజిత్తు చచ్చిపోవలెను, అని బ్రహ్మదేవుడు ఇదివరకే విధించినాడు. కాబట్టి ఇప్పుడు ఆ ఇంద్రజిత్తును వధించి వేయడానికి నీవు లక్ష్మణుణ్ణి పంపించు. లక్ష్మణుడు వాణ్ణి వధించి వేస్తాడు. ఇంద్రజిత్తు చచ్చిపోయిన ఉత్తరక్షణాన రావణాసురుడు బంధుమిత్రులతో చచ్చి పోయినాడు అనే అనుకో" అని చెప్పినాడు.

విభీషణుడు చెప్పిన ఈ మాటలకు రాముడు "ఓ మిత్రుడా, ఆ భయంకరుడి మాయలు నేనూ ఎరుగుదును. వాడు బ్రహ్మాస్త్రవిదుడు అనీ ధనుర్విద్యా విశారదుడు అనీ మహామాయావి అనీ నాకు తెలుసును. అందువల్లనే వాడు పోరాటములో దేవతలను సహితము మోసము చేయ గలిగినాడు. వాడు రథముమీద అంతరిక్షములో తిరుగుతూ మేఘాలు కమ్ముకొన్న సూర్యుడివలె కనపడకుండా పోతాడు" అని చెప్పి లక్ష్మణుడివంక చూచి "తమ్ముడా నీవు సుగ్రీవుణ్ణీ హనుమంతుణ్ణీ జాంబవంతుణ్ణీ తక్కిన వానర యూథపతులనూ వారి వారి వానరసైన్యాలనూ భల్లూక సైన్యాలనూ వెంటపెట్టుకుని పో. సర్వమూ తెలిసిన ఈ విభీషణుడు తన నలుగురు మంత్రులతో నీవెంట ఉంటారు. నీవు మాయాబల విశారదుణ్ణి ఇంద్రజిత్తును వధించు" అని చెప్పినాడు

అంతట ఆ అత్యద్భుత పరాక్రమవంతుడు లక్ష్మణుడు కవచము తొడుగుకొని బంగారు కార్ముకమూ బాణాలూ ఖడ్గమూ తీసుకొని సంతోషముగా యుద్ధ సన్నద్ధుడు అయి రాముడి పాదాలకు నమస్కారము చేసి "ప్రభూ, నా ధనుస్సు నుండి వెలువడే బాణాలు ఆ భయంకరరాక్షసుడి శరీరాన్ని ఛేదించి వాణ్ణి వధించి తామరకొలనులలోకి పోయే హంసలవలె పోయి లంకాపట్టణము అంతటా వ్యాపిస్తవి." అని చెప్పినాడు.

ఆ ద్యుతిమంతుడు అట్లా చెప్పి రాముడికి ప్రదక్షిణము చేసి ఆయన పాదాలకు నమస్కారము చేసి ఆయన మంగళాశీర్వాదము పొంది నికుంభిలా చైత్యా

నికి ప్రయాణము అయినాడు. అనేక వేలమంది వానరయోధులను వెంటపెట్టుకుని హనుమంతుడూ భల్లూక సేనలను వెంటపెట్టుకుని జాంబవంతుడూ వానర మహాసైన్యాలను వెంటపెట్టుకొని అంగద సుగ్రీవులూ తన నలుగురు మంత్రులనూ వెంటపెట్టుకొని విభీషణుడూ అప్పుడు లక్ష్మణుని వెంట నడిచారు. దూరాన వ్యూహాలుగా ఉన్న రాక్షససైన్యాన్ని ఆ లక్ష్మణుడు చూచినాడు. బ్రహ్మదేవుడు విధించినట్లు ఆ ఇంద్రజిత్తును వధించివేయడానికి నికుంభిలా ప్రదేశానికి ఆ లక్ష్మణుడు అమిత వేగముతో నడిచినాడు. అక్కడికి పోయి ధనుస్సు సజ్యము చేసినాడు. అప్పుడు ఆ మహాపరాక్రమవంతుడి ప్రక్కను అంగదుడూ హనుమంతుడూ విభీషణుడూ నిలచినారు. వివిధాయుధాల తళతళలతోనూ కిటకిటలాడుతూ ఉన్న మహారథ ధ్వజాల ధగధగలతోనూ చుట్టూ మహాభయంకరమూ అప్రమేయమూ అయిన రాక్షససైన్యముతోనూ ఆ నికుంభిలా దేవతాలయము అంధకారంలోవలె ఎక్కడ ఉందీ లక్ష్మణుడికి కనిపించలేదు.

౮౬

అప్పుడు విభీషణుడు లక్ష్మణుడితో "ఓ శూరుడా, నల్లని మేఘాలవలె కనపడుతూ ఉన్న ఆ రాక్షససైన్యముమీద ఇప్పుడే మన వానరసైన్యాలు వృక్షాలూ మొదలుఅయిన ఆయుధాలతో పడవలెను. వానరవీరులు రాక్షససైన్యాలమీద పడగానే నీవు నీ బాణాలతో ఆ రాక్షససైన్యాన్ని భేదించివేసే నీ ప్రయత్నము నీవు చేయవలెను, రాక్షససైన్యము ఛిన్నాభిన్నము అయిపోగానే నీకు ఇంద్రజిత్తు కనపడతాడు. నీవు అప్పుడు దేవేంద్రుడు వదిలే పిడుగులవంటి బాణాలను ఆ రాక్షసుడిమీద వదలవలెను. నికుంభిలా యజ్ఞకర్మ సమాప్తముచేసే లోపలనే పరుగెత్తిపోయి నీవు ఇంద్రజిత్తును ఎదిరించవలెను. సర్వలోకాలనూ దుఃఖపెట్టుతూఉన్న ఆ దుష్టాత్ముణ్ణి మాయలుచేయడమే పరమధర్మముగా పెట్టుకొన్న ఆ క్రూరకర్ముణ్ణి ఇంద్రజిత్తును నీవు చూచేమాడటముతో కొట్టవలెను" అని కార్యసాధనోపాయము చెప్పినాడు.

అప్పటికి అప్పుడు వానరయోధులూ భల్లూకయోధులూ మహావృక్షాలతోనూ పర్వతశిఖరాలతోనూ ఆ రాక్షససైన్యముమీదపడ్డారు. చేతులకు అందిన ఆ రాక్షసయోధులను ఆ వానరభల్లూకయోధులు తమ గోళ్లతోనూ కోరలతోనూ చీల్చివేసినారు. అంతట ఆ శుభలక్షణుడు లక్ష్మణుడు ఆ రాక్షససైన్యముమీద బాణవర్షము కురిపించడము మొదలుపెట్టినాడు. అదిచూచి రాక్షసవీరులు తీక్ష్ణబాణాలను వానరసైన్యాలమీద వదిలినారు. రాక్షసయోధులు ఖడ్గాలతోనూ శక్త్యాయుధాలతోనూ తోమరాయుధాలతోనూ వానర

సైన్యాలను కొట్టసాగినారు. పోరాటము దొమ్మిగా సాగింది. ఆ యుద్ధఘోషము అప్పుడు లంకాపట్టణము అంతటా వినిపించింది. ఆ పోరాటములో రాక్షసులు వదలిన బాణాలూ వివిధాయుధాలూ వానరవీరులు విసరివేసిన మహావృక్షాలూ పర్వతశిఖరాలూ కుప్పలు తిప్పలుగా ఆకాశము అంతఎత్తున పడ్డవి. వికృతాకారులు అయిన రాక్షసులు వివిధాయుధాలతో తమ బాహుబలముకొద్దీ మహాభయంకరముగా పోరాడేనారు అకేవిధముగా వానరయోధులు మహావృక్షాలతోనూ పర్వత శిఖరాలతోనూ పోరాడుతూ అనేక వేలమంది రాక్షస యోధులను ఘోరముగా కొట్టి చంపివేసినారు మహాకాయులూ మహాబలవంతులూ అయిన భల్లూక వానరయోధులు ఆ విధముగా రాక్షసయోధులను చంపివేస్తూ ఉంటే రాక్షసవీరులకు అందరికీ మహాభయము వేసింది. తన సైన్యాన్ని భల్లూక వానరయోధులు నాశనము చేసివేస్తున్నారు అని వినగానే ఆ దుర్మార్గుడు ఇంద్రజిత్తు యజ్ఞకర్మను పూర్తి చేయకుండానే లేచినాడు. చుట్టూ పడ్డ చెట్లవల్లనూ పర్వతశిఖరాలవల్లనూ చిమ్మచీకట్లు కమ్మినట్లుగా ఉండడము చూచి ఇంద్రజిత్తు మహాకోపముతో అనుచరులను వెంటపెట్టుకొని వెలుపలికి వచ్చినాడు. అక్కడ అదివరకే ఆయుధాలతో సిద్ధముగా ఉన్న నాలుగు గుర్రాల రథము యెక్కినాడు. భయంకర మేఘమువంటి ఆ ఇంద్రజిత్తు ముఖమూ కన్నులూ కోపముతో ఎర్రపడిపోయినవి. భయంకర కార్ముకాన్ని తీసుకొని సర్వనాశనము చేసివేసే యముడివలె ఆ రథముమీద తేజరిల్లుతూ ఉన్న ఇంద్రజిత్తును చూచి రాక్షసయోధులు అందరూ సింహనాదము చేసినారు. అంతట లక్ష్మణుడితో పోరాడటానికి ఆ రాక్షససైన్యము భయంకర వేగముతో ఇంద్రజిత్తును వెంబడించింది.

అప్పుడు పర్వతాకారుడు హనుమంతుడు విజృంభించి ప్రళయకాలాగ్ని వలె మహావృక్షాలతో ఆ రాక్షససైన్యముమీద పడి అప్పటికి అప్పుడు అనేక వేలమంది రాక్షసయోధులను చంపివేసినాడు. అప్పుడు వేలకువేలు రాక్షస యోధులు కొత్తగా వచ్చి ఆ వాయుపుత్రుణ్ని హనుమంతుణ్ని అన్ని వైపులా కమ్ముకున్నారు. తీక్ష్ణశూలాయుధాలు పట్టుకొని వచ్చినవారు శూలాయుధాలతోనూ ఖడ్గాలు పట్టుకొని వచ్చినవారు ఖడ్గాలతోనూ ఈటెలు పట్టుకొని వచ్చినవారు ఈటెలతోనూ అడ్డకత్తులు పట్టుకొనివచ్చినవారు అడ్డకత్తులతోనూ ఇనుపగుదియలు పట్టుకొని వచ్చినవారు ఇనుపగుదియలతోనూ గదలు పట్టుకొని వచ్చినవారు గదలతోనూ తక్కిన రాక్షసయోధులు తళతళ మెరిసే చక్రాయుధాలతోనూ వందలకొద్దీ శతఘ్నులతోనూ భయంకరము అయిన గండ్రగొడ్డళ్లతోనూ విడిచి వాటు ఇనుపగుదియలతోనూ అన్నివైపులా హనుమంతుణ్ని

ఎదిరించినారు. కొందరు వజ్రముతో సమానము అయిన తమ తమ పిడికిళ్లతో పొడిచినారు. వజ్రాయుధమువంటి తమ తమ అరచేతులతో కొందరు కొట్టినారు. అంతమంది అన్ని వైపులా అన్ని ఆయుధాలతో కొట్టూ ఉన్నప్పటికిన్నీ హనుమంతుడు కొంచెము అయినా చలించలేదు. మరింత క్రుద్ధుడు అయిపోయి అంతమందితోనూ మహాభయంకరముగా పోరాడసాగినాడు.

ఆ మహాయుద్ధములో ఎంతోమంది రాక్షసులను వధించివేస్తూ ఉన్న ఆ పర్వతాకారుణ్ణి హనుమంతుణ్ణి ఇంద్రజిత్తు చూచినాడు. తన సారథితో "ఈ హనుమంతుణ్ణి ఉపేక్షించడానికి వీలు లేదు. వీణ్ణి ఉపేక్షించేట్లయితే ఈ రాక్షసయోధులను అందరినీ వీడు ఈహనుమంతుడు ఒక్కడే సంహారముచేసి వేస్తాడు. ఆ హనుమంతుడి వైపు రథాన్ని తోలు" అని ఇంద్రజిత్తు చెప్పినాడు. రథాన్ని సారథి అప్పుడు హనుమంతుడి మీదికి తోలినాడు. అంతట ఆ దుర్ధర్షుడు ఇంద్రజిత్తు బాణాలనూ ఖడ్గాలనూ పట్టిసాలనూ గండ్రగొడ్డళ్లనూ హనుమంతుడిమీద కురిపించినాడు. ఆ భయంకరాయుధాలను అన్నిటినీ హనుమంతుడు తన చేతులతో పట్టుకొని అవతల పారవేసి మహాకోపముతో "ఓ రావణాసురుడి కొడుకా, నేను వాయుపుత్రుణ్ణి హనుమంతుణ్ణి నీవు శూరుడవు అనుకొని నామీదికి వచ్చినావు, నాతో పోరాడి ప్రాణాలతో పోయినవాడు ఎవడూ లేడు" అని చెప్పినాడు.

అప్పుడు అది విభీషణుడు చూచి లక్ష్మణుణ్ణి పిలిచి "ఓ లక్ష్మణుడా ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి చంపివేయవలెను అని ధనుర్ధరుడు అయినాడు. తాను దేవేంద్రుణ్ణి జయించినాను అనే గర్వముతో ఆ హనుమంతుణ్ణి చంపివేయవలెను అని వాడు అనుకొంటున్నాడు. నీకు ఇది అదను. వాయనా, శత్రువులను అసమానముగా భేదించివేసే బాణాలను తీసుకో. ఆయువు పట్లలోపడి ప్రాణాలు తీసివేసే బాణాలు వదిలి నీవు ఇంద్రజిత్తును వధించు" అని చెప్పినాడు.

శత్రుభీషణుడు విభీషణుడు ఇట్లా చెప్పింది ఆ మహాపరాక్రమవంతుడు లక్ష్మణుడు విన్నాడు. అప్పుడు హనుమంతుడితో యుద్ధము చేయడానికి నిలుచుని సింహనాదము చేస్తూ ఉన్న భీమబలుణ్ణి పర్వతాకారుణ్ణి ఇంద్రజిత్తును లక్ష్మణుడు చూచినాడు.

## ౮౭

అంతట ధనుర్ధరుడు అయిన లక్ష్మణుణ్ణి సంతోషముగా విభీషణుడు వెంట పెట్టుకొని సమీపములో ఉన్న ఒక వనములోకి తీసుకొని పోయి ఇంద్రజిత్తు హోమము చేస్తూ ఉన్న ప్రదేశాన్ని చూపించినాడు. అక్కడ నీలమేఘము

వంటి భయంకరము అయిన మఱ్ఱి చెట్టును లక్ష్మణుడు చూచినాడు. అప్పుడు విభీషణుడు "లక్ష్మణా, ఆ బలవంతుడు ఇంద్రజిత్తు ఆ మఱ్ఱిచెట్టు దగ్గర భూత బలి ఇచ్చి యుద్ధానికి బయలుదేరుతాడు. అంతట వాడు సమస్త భూతకోటికీ అదృశ్యుడు అయి పోయి తీక్ష్ణబాణాలు వదిలి శత్రువులను బంధించి వేస్తాడు. వాడు ఆ మఱ్ఱిచెట్టు దగ్గరకు వచ్చేటట్లయితే వాణ్ణి జయించడము అశక్యము. అందువల్ల వాడు మళ్ళీ ఆ మఱ్ఱిచెట్టు దగ్గరకు వచ్చే లోపలనే నీవు వాడి రథాన్ని సారథినీ గుఱ్ఱాలనూ నీ తీక్ష్ణబాణాలతో నాశనము చేసి వేయవలెను. అని చెప్పినాడు.

"అట్లాగేను" అని చెప్పి లక్ష్మణుడు తన విచిత్రము అయిన ధనుస్సును మోగిస్తూ అక్కడ నిలుచున్నాడు. అగ్నిహోత్రము వలె ధగధగలాడుతూ ఉన్న రథము మీద కవచము తొడుగుకొన్న ఆ ధనుర్ధరుడు ఆ బలవంతుడు ఇంద్రజిత్తు అప్పుడు అక్కడ ప్రత్యక్షము అయినాడు. పౌలస్త్యమహర్షివంశములో పుట్టిన ఆ అపరాజితుణ్ణి ఇంద్రజిత్తును ఆ మహాపరాక్రమవంతుడు లక్ష్మణుడు చూచి "ఓ రాక్షసుడా, నీవు మాయము అయి పోకుండా నాతో పోరాడు. నిన్ను నేను యుద్ధానికి ఆహ్వానిస్తున్నాను." అని చెప్పినాడు.

ఆ మతిమంతుడు ఇంద్రజిత్తు అప్పుడు అక్కడ లక్ష్మణుడి వెంట ఉన్న విభీషణుణ్ణి చూచి పరుషముగా "ఓ రాక్షసుడా, నీవు ఈ లంకాపట్టణములో పుట్టి పెరిగినావు. నా తండ్రికి నీవు సాక్షాత్తూ తమ్ముడవు, నాకు పినతండ్రివి. నేను నీ పిల్లవాణ్ణి, నీవు నాకు ఎందుకు ద్రోహము తలపెట్టినావు. ఓ దుర్మతీ, నీకు బంధుత్వము లేదు. నీకు స్నేహము లేదు. నీకు జాతి లేదు. సోదరభావము లేదు. నీకు కులాభిమానము లేదు. నీవు ధర్మదూషణుడవు.

"ఓ దుర్బుద్ధీ, నీవు స్వజనాన్ని వదిలిపెట్టి పరులకు భృత్యుడవు అయి పోయినావు. అందువల్ల నిన్ను చూస్తే దుఃఖము వస్తూవుంది. సత్పురుషులు నిందించే పని చేసినావు. నీబుద్ధి బుగ్గిఅయిపోయింది. స్వజనసంవాసము ఎక్కడ నీచపరాశ్రయము ఎక్కడ. ఈ రెండింటి తారతమ్యమూ నీకు తెలియలేదు. పరులు గుణవంతులు అయినప్పటికిన్నీ స్వజనులు గుణవంతులు కాకపోయినప్పటికిన్నీ స్వజనులతో ఉండడమే శ్రేయస్కరము. ఎంత గుణవంతుడు అయినప్పటికిన్నీ పరుడు పరుడే. స్వజనాన్ని వదిలిపెట్టి శత్రువులను ఆశ్రయించిన వాడి, చేతనే వాడి వాళ్ళను నాశనము చేసివేయడానికి శత్రువులు ఉపయోగించుకొంటారు. ఆ తరువాత వాణ్ణికూడా నాశనము చేసివేస్తారు. అది లోకధర్మము.

"ఓ నిశాచరుడా, నీవు రావణుడి తమ్ముడవు. నీవు నిర్దయుడవు అయి నా హోమము చెడగొట్టించడానికి ఈ లక్ష్మణుణ్ణి తీసుకొని వచ్చినావు. ఇది నీవు చేయవలసిన పని కాదు" అని చెప్పినాడు.

ఇంద్రజిత్తు అన్న ఈ మాటలకు "ఓరి దురాత్ముడా, నాకేమీ ఎరుగని వాడివలె ఎందుకు పేలుతావు. నేను నీ పినతండ్రిని అనే గౌరవమువల్లను అయినా నీవు నాతో పరుషముగా మాట్లాడకూడదు. నేను క్రూరకర్ములు అయిన రాక్షసుల వంశములో పుట్టినప్పటికిన్ని నాశీలము రాక్షససంబంధము అయింది కాదు. గుణము ప్రధానము కాని కులము కాదు. నేను క్రూరకర్ములకు ఒడికట్టను. అధర్మము ఒప్పను. తన శీలము వేరు అయినప్పటికిన్ని మా అన్నను రావణుణ్ణి నేను మన్నించినాను. కాని వాడు తప్పుచేసి అది నేను తెలియచెప్పితే నన్ను ఎందుకు నిరసించినాడు. ధర్మాన్ని జారవిడిచి పాపకార్యము చేయ నిశ్చయించుకొన్న వాణ్ణి చేతికి చుట్టుకొన్న పామును వదిలించుకొన్నట్టు వదిలించుకోవలెను. ధర్మలోపము చేసిన వాణ్ణి వదిలి పెట్టితేనే సుఖపడటానికి వీలు అవుతుంది. పరద్రవ్యాపహరణమూ పరదారాపరిగ్రహము జీవహింస దురాచారమూ వీటికి పాల్పడేవాణ్ణి తగులపడిపోతున్న ఇంటిని వదిలిపెట్టి పోయేట్టు వదిలిపెట్టి పోవలెను. పరధనహరణమూ పరదారా పరిగ్రహమూ స్నేహితులను నమ్మకపోవడమూ ఎంతటి వాణ్ణి అయినా నాశనము చేసి వేస్తవి. మహర్షులను ఘోరముగా చంపివేయడమూ సమస్త దేవతలతోనూ కలహించడము గర్వమూ కోపమూ బద్ధవైరమూ ఇతరుల మేలు ఓర్వకపోవడమూ - ఈ దోషాలు జీవితాన్నీ ఐశ్వర్యాన్నీ నాశనము చేసి వేస్తవి. ఈ దోషగుణాలు అన్నీ మేఘాలు పర్వతాన్ని ఆవరించినట్టు మీ తండ్రి అయిన మా అన్నను ఆవరించినవి. అందువల్లనే నేను మా అన్నను వదిలిపెట్టినాను. ఇకను ఈ లంకాపట్టణము ఉండదు. నీవు ఉండవు. నీ తండ్రి ఉండడు.

"ఓ రాక్షసుడా. నీవు గర్విష్ఠివి. దుష్టబుద్ధివి నీవు ఏమీ తెలియని మూర్ఖుడవు. నీవు కాలపాశబద్ధుడవు కాబోతున్నావు. ఇంకా ఏమేమి నన్ను అనవలెను అనుకొంటున్నావో అవి అన్నీ అను. వింటాను. నీకు మృత్యుసమయము సంప్రాప్తము కాబోతున్నది. నీవు ఇక నికుంభిలా దేవాలయానికి పోయేది లేదు. రామలక్ష్మణులను తిరస్కరించిన నీవు ఇక బ్రతికి ఉండడము తత్తది. యుద్ధరంగములో ఈ లక్ష్మణుడితో పోరాడి చచ్చి యమలోకానికి పోతావు. అక్కడ యమదూతలు ఆజ్ఞాపించే పనులు అన్నీ చేస్తూ ఉండు. ఇప్పుడు నీ బలము అంతా చూపించు. సర్వాయుధాలూ వ్యయపెట్టు. లక్ష్మ

ణుడు వదిలే బాణాలకు నీవూ నీ సైన్యమూ బ్రతికి ఉండడము ఉత్తది" అని చెప్పినాడు.



అన్ని వైపులా చక్కగా అలంకరించిన నల్లటి నాల్గు గుర్రాల రథము మీద కూర్చున్న యముడి వంటి ఆ ఇంద్రజిత్తు విభీషణుడి మాటలకు ఒళ్లు ఎరగని కోపము వచ్చి పొడుగాటి ఖడ్గాన్ని ఎత్తినాడు. విభీషణుడికి ఎదురుగుండా ఆ రథము మీద పోయినాడు. ఆ బలవంతుడు ఇంద్రజిత్తు అప్పుడు అక్కడ హనుమంతుడి మూపున ఉదయపర్వతము మీద ఉదయించిన సూర్యుడి వలె తేజరిల్లుతూ ఉన్న శత్రుసంహారకుణ్ణి లక్ష్మణుణ్ణి చూచినాడు. విభీషణుణ్ణి తిట్టినాడు. ఖడ్గాన్ని వదిలిపెట్టి పెద్ద పొడుగాటి వింటిని తీసుకొన్నాడు. ఆ విల్లు దృఢము అయింది. తీవ్రము అయింది. భయంకరము అయిన ఆ ధనుస్సు పట్టుకొని శత్రువులను సంహరించి వేసే బాణాల కోసము వెతికినాడు.

అంతట ఆ లక్ష్మణుణ్ణీ విభీషణుణ్ణీ వానరులనూ చూచి వేగిరపాటుతో "ఇదిగో నా పరాక్రమము చూపిస్తాను. ఆకాశము నుంచి ఎడతెగకుండా కురిసే వర్షము వలె ఈ యుద్ధభూమిలో ఇప్పుడు నా కార్ముకములోనుంచి కురిపించే బాణవర్షాన్ని తప్పించుకోండి అగ్నిహోత్రము దూది బుంగలను వలె నా ధనుస్సులో నుంచి వెలువడే బాణాలు మీ దేహాలను దహించివేస్తవి. శూలాయుధాలూ శక్త్యాయుధాలూ దండాయుధాలూ తీక్ష్ణబాణాలూ మిమ్ములను చీల్చి వేసి యమసదనానికి తీసుకొని పోతవి. నేను కురిపించే బాణావర్షానికి నిలవ కలవాడు ఎవడు.

"ఓ లక్ష్మణుడా, నేను ఇదివరకు రాత్రియుద్ధములో వజ్రాయుధము వంటి బాణాలనూ పిడుగులు వంటి బాణాలనూ మీ అన్నతమ్ముల మీద వదిలినాను. మీరు అప్పుడు మీ వెంట ఉన్న వారితో కూడా ఒళ్లు తెలియకుండా నేల మీదపడి పోయినారు. అది నీకు జ్ఞాపకము ఉందో లేదో – కాక యమసదనానికి పోవలెను అనుకొంటున్నావు ఏమో. కుపితవిషసర్పము వంటి నాతో పోరాటానికి నిలుచున్నావు" అని ఇంద్రజిత్తు చెప్పినాడు.

ఇటా చెప్పిన ఇంద్రజిత్తును చూచి లక్ష్మణుడు "ఓ రాక్షసుడా, నీవు చేయలేని పనులను చేసేటట్టు చెప్పుతున్నావు. కార్యసిద్ధికోసము ప్రయత్నము చేసే వాడు ఎవడూ ఇట్లా నీ వలె మాట్లాడడు: ఓ దుర్మతీ, నీవే కాదు. మరి ఎవడూ నన్ను జయించ లేడు. నీవు జయిస్తాను అని చెప్పుతూ జయించినట్టే

సంతోష పడుతున్నావు. ఆనాడు రాత్రి నీవు అంతర్ధానము అయి పోయి మనుష్యులను కొట్టినావు దొంగలు చేసే పని నీవు చేసినావు. వీరులు ఎవరూ అట్లా చేయరు. ఓ రాక్షసుడా, నేను ఇప్పుడు నీ బాణపథములోనే ఉన్నాను. ఆ నీ పరాక్రమము ఇప్పుడు చూపించు, నోటిమాటలతో ప్రయోజనములేదు” అని చెప్పినాడు.

ఇట్లా లక్ష్మణుడు చెప్పుతూ ఉండగానే ఆ మహాబలవంతుడు ఇంద్రజిత్తు భయంకరము అయిన తన ధనుస్సును సారించి కఠినబాణాలను లక్ష్మణుడి మీద వదిలినాడు. ఆ బాణాలు విషసర్పాల వలె బుసలు కొట్టుతూ అమిత వేగముతో పోయి లక్ష్మణుడి మీద పడ్డవి. ఆ వేగవంతుడు ఇంద్రజిత్తు అంతటితో వదిలి పెట్టకుండా మహా వేగముగా పోయే మరి కొన్ని బాణాలను మళ్ళీ లక్ష్మణుడి మీద వదిలినాడు. దేహము అంతటా బాణాలు గుచ్చుకొని నెత్తుటితో తడిసి ఆ కాంతిమంతుడు లక్ష్మణుడు అప్పుడు పొగలు లేని అగ్నిహోత్రము వలె తేజరిల్లినాడు.

ఇంద్రజిత్తు అంతట సంతోషముతో పెద్ద పెట్టున సింహనాదము చేసి లక్ష్మణుణ్ణి చూచి “ఓ లక్ష్మణుడా, ఇక రెక్కలు కట్టిన తీక్ష్ణబాణాలు నా వింటిలో నుంచి బయలుదేరి వస్తవి అవి నీ ప్రాణాలు తీసి వేస్తవి నీ దేహాన్ని డేగలూ గద్దలూ నక్కలూ తింటవి. ఓ దుష్టుడా. ఓ క్షత్రియాధముడా, ఓ రామభక్తుడా, నిన్ను నేను చంపి వేయడము ఆ పగను గుర్తుకి రాముడికి తెలుస్తుంది నీ ప్రాణము పోగానే నీ శిరస్సును నేను ఎత్తుకొని పోతాను నీ చేతిలో విల్లు కింద పడి నీ కవచము చిరిగి పోయి నేల మీద పడి ఉండే నీ మొండాన్ని నీ అన్న రాముడు చూస్తాడు” అని వెగటుమాటలతో చెప్పుతూ ఉంటే లక్ష్మణుడు యుక్తియుక్తముగానూ మహార్థముగానూ “ఓ రాక్షసుడా, మాటల బింకము వదలి పెట్టు నీవు క్రూరకర్ముడవే నాకు తెలుసు. మాటలు కాదు పనిచేసి చూపించు. ఊరక ఎందుకు నిన్ను నీవు పొగడు కొంటావు నేను నీ మాటలు నమ్మేట్టు పని చేసి చూపించు” అని చెప్పుతూ మహావేగముతో పోయే తీక్ష్ణబాణాలను అయిదింటిని తన వింటికి ఎక్కించి అల్లెత్రాటిని తన చెవిదాకా లాగి ఇంద్రజిత్తు వక్షఃస్థలాన్ని గురి చేసి వదిలినాడు. చక్కని రెక్కలతో ఉన్న పాములవంటి ఆ బాణాలు మంటలు మండుతూ పోయి ఇంద్రజిత్తు వక్షఃస్థలముమీద పడి సూర్యకిరణాలవలె శోభించినవి. లక్ష్మణుడు వదిలిన ఆ బాణాల దెబ్బకు ఇంద్రజిత్తు కుపితుడు అయిపోయి మూడు బాణాలను లక్ష్మణుడిమీద వదలినాడు

అప్పుడు ఆ రాక్షసశ్రేష్ఠుడు ఇంద్రజిత్తూ మానవశ్రేష్ఠుడు లక్ష్మణుడూ పరస్పరజయేచ్ఛతో పరమ భయంకరముగానూ దొమ్మిగానూ పోరాటము సాగించినారు. వారు ఉభయులూ మహాబలసంపన్నులు. పరమ పరాక్రమవంతులు, సర్వశస్త్రాస్త్రకోవిదులు జయించ నలవికాని శూరులు. అసమాన తేజోవంతులు ఆ వీరులు ఉభయులూ ఆకాశములో గ్రహాలవలె అప్పుడు పోరాటము సాగించినారు.

దేవేంద్రుడూ వృత్రాసురుడూ వలె పోరాడినారు. ఆ మహాపరాక్రమవంతులు ఉభయులూ పోరాడుతున్న రెండు సింహాలవలె కనిపించినారు. ఆ మానవోత్తముడు లక్ష్మణుడూ ఆ రాక్షసోత్తముడు ఇంద్రజిత్తూ సంతోషముగా ఒకరిమీద ఒకరు ఎన్నో బాణాలను వదులుకొన్నారు. మహామేఘాలవలె ఉభయులూ బాణవర్షము కురిపించినారు.

భయంకరము అయిన ధనస్సులూ బాణాలూ ఖడ్గాలూ మొదలు అయినవి ధరించిన ఆ మహాబలవంతులు ఆ యుద్ధకోవిదులు ఇంద్రజిల్లక్ష్మణులు ఒకరికన్నా ఒకరు విజృంభించి ఆ మహాయుద్ధములో అనేకమార్లు శంబరాసుర దేవేంద్రులు వలె కొట్టుకొన్నారు.

## ౮౬

అంతట ఆ శత్రుసంహారకుడు లక్ష్మణుడు పాము బుసలవలె నిట్టూర్పులు విడుస్తూ తన వింట బాణాన్ని సంధించి ఇంద్రజిత్తుమీద వదలడానికి అల్లెత్రాటిని మోగించినాడు. ఆ ధనుష్టంకారధ్వని వింటూ ఉండగా ఇంద్రజిత్తు ముఖము వివర్ణము అయిపోవడము విభీషణుడు చూచి లక్ష్మణుడితో "ఓ మహాబాహూ, ఇప్పుడు ఇంద్రజిత్తు ముఖము వెల వెల పోవడమూ మొదలు అయిన అపశకునాలను చూస్తూ ఉంటే వీడు నీ చేతిలో ఇప్పుడే చచ్చిపోతాడు అని తోస్తూ ఉంది. సందేహము లేదు నీవు తొందరపడు" అని చెప్పినాడు.

లక్ష్మణుడు అంతట అగ్నిహోత్రశిఖల వంటివీన్నీ తీక్ష్ణ విషసర్పాల వంటివన్నీ బాణాలను వింట సంధించి ఇంద్రజిత్తుమీద వదిలినాడు. అవి దేవేంద్రుడి వజ్రాయుధమువలె పోయి ఇంద్రజిత్తుమీద పడ్డవి. ఆ బాణాల దెబ్బకు అతడి సర్వేంద్రియాలూ కంపించిపోయినవి. ఒక ముహూర్తము సేపటి వరకూ తేరుకోలేక పోయినాడు. తేరుకోగానే ఎదుట ఉన్న వీరుణ్ణి లక్ష్మణుణ్ణి చూచినాడు. కోపముతో కన్నులు ఎఱ్ఱచేసి ఏడు బాణాలను లక్ష్మణుడి మీదనూ మరి పదిబాణాలను హనుమంతుడిమీదనూ వదిలినాడు. అంతట

ఆ మహాపరాక్రమవంతుడు ఇంద్రజిత్తు రెట్టింపు కోపముతో విభీషణుణ్ణి గురి చేసి మూడు బాణాలు వదలినాడు. ఇంద్రజిత్తు వదలిన ఆ బాణాలను ఏ మాత్రమూ లక్ష్యపెట్టకుండా లక్ష్మణుడు నవ్వుతూ "ఓ రాక్షసుడా, నీ బాణాలు కొంచెము అయినా పని చేయలేవు" అని చెప్పుతూ భయంకరము అయిన బాణాలను ఇంద్రజిత్తుమీద వదిలి పెట్టి "ఓ నిశాచరుడా, యుద్ధము చేసే శూరులు నీవు వదిలినటువంటి చౌకబారు బాణాలు వదలరు. నీ బాణాలు నన్ను కొంచెము అయినా బాధ పెట్టలేవు. నేను హాయిగా ఉన్నాను. జయము కాంక్షించే శూరులు ఇట్లా నీవలె పోరాడరు" అని చెప్పుతూ బాణవర్షము కురిపించినాడు.

అప్పుడు ఆ బాణాల దెబ్బకు ఇంద్రజిత్తు హేమభూషితకవచము తునకలు తునకలు అయిపోయింది. ఆకాశమునుంచి నక్షత్రాలవలె ఆ రథము సమీపాన నేలమీద ఆ కవచము తునకలు రాలినవి. బాణాలు గుచ్చుకొని అతని దేహము అంతటా గాయాలు అయినవి. అట్లా ఒంటినిండా గాయాలు అయినప్పటికిన్నీ ఆ ఇంద్రజిత్తు పర్వతమువలె అచలముగా నిలుచుని లక్ష్మణుణ్ణి గురి చేసి వెయ్యి బాణాలు వదలినాడు ఆ భయంకరపరాక్రముడి బాణాలకు లక్ష్మణుడి కవచము ముక్కలు ముక్కలు అయిపోయింది అంతటితో ఒకరు చేసిన దానికి ఒకరు బదులు చేసినట్లు అయిపోయింది బాణాలు గుచ్చుకొని ఉభయుల దేహాలూ గాయాలు అయినవి ఉభయులూ నెత్తురుతో తడిసిపోయినారు ఉభయులూ నిట్టూర్పులు విడుస్తూ పదే పదే వొమ్మిగ్గా పోరాటము సాగించినారు.

ఆ మహాపరాక్రమవంతులు ఆ రణకర్మవిశారదులు ఆ శూరులు ఇంద్రజిల్లక్ష్మణులు ఎంతోసేపు ఒకరిమీద ఒకరు బాణాలు వదులు కొన్నారు. కవచాలు తెగిపోయినప్పటికిన్నీ వారి వారి దేహాలనుంచి నెత్తురు కొండవాగుల వలె పారుతూ ఉన్నప్పటికిన్నీ ఒకరిని ఒకరు జయించవలెను అనే ప్రయత్నము మానుకోకుండా పోరాడసాగినారు. ఆకాశములో ఉరుములు ఉరుముతూ సంతతధారలు వర్షించే మేఘాలవలె మహా భయంకరధ్వనులతో ఒకరిపయిన ఒకరు బాణవర్షము కురిపించుకొన్నారు అప్పుడు ఎంత పొద్దుపోయిందీ ఆ వీరులకు ఉభయులకూ తెలియలేదు. వారికి విసుగెత్తలేదు వారు అలసిపోలేదు. తమ తమ అస్త్రవిద్యానైపుణ్యము చూపించుకొంటూ వివిధాకారాలతో ఉన్న బాణాలు వదులుకొంటూ ఆకాశము కనపడకుండా పోయేట్లు చేసినారు. ఆ ఉభయులూ వదలిన బాణాలలో ఒక్కటి అయినా వ్యర్థము అయిపోలేదు అద్భుతముగా అమితవేగముతో ఒకరి మీద ఒకరు

బాణాలు వేసుకొంటూ భయంకరముగా దొమ్మిగా పోరాడినారు. వారి వారి జ్యాస్వనలు వేరే వేరే పిడుగుల వలె వినిపించినవి. అందుకు ఉభయ పక్షాల యోధులూ భయభ్రాంతులు అయిపోయినారు. ఆకాశములో మేఘగర్జనల వలె వారు పోరాడుతూ గర్జించినారు. బంగారు పింజల బాణాలు గుచ్చుకొన్న గాయాలలో నుంచి నెత్తురు ఏరులు అయి పారింది. ఆ బంగారు పింజల బాణాలు ఆ వీరుల దేహాలలో దూరపడి నెత్తురుతో తడిసి వెలుపలికి వచ్చి నేలమీద పడి పోయినవి. కొన్ని బాణాలు తీక్ష్ణాయుధాలతో కలిసి ఆకాశానికి పోయి చేరినవి. మరికొన్ని బాణాలు తక్కిన బాణాలను విరగకొట్టినవి.

ఆ యుద్ధము భయంకరముగా జరిగినది ఆ వీరులు ఉభయులూ వదిలిన బాణాల రాసులు యజ్ఞములో ప్రజ్వలిస్తూ ఉన్న గార్హపత్యమూ ఆహవనీయమూ అనే రెండు అగ్నిహోత్రాలతో చేరిన కుశరాసుల వలె కనిపించినవి దేహమునిండా గాయాలు అయిన ఆ మహాభాగ్యవంతులు ఉభయులూ ఆకులు అన్నీ రాలిపోయి పూలు మాత్రమే పూసి ఉన్న బూరుగు చెట్ల వలెనూ మోదుగ చెట్ల వలెనూ కనిపించినారు.

ఒకరిని ఒకరు వధించి వేయవలెను అనుకొని ఆ ఇంద్రజిల్లక్ష్మణులు ఉభయులూ పదే పదే భయంకరముగానూ దొమ్మిగానూ పోరాడినారు. లక్ష్మణుడు ఇంద్రజిత్తునూ ఇంద్రజిత్తు లక్ష్మణుణ్ణి ఎన్నిసార్లు ఎన్నివిధాల కొట్టినా వారిలో ఏ ఒక్కరికీ అలుపు రాలేదు. దేహాలలో గట్టిగా దిగపడి పోయిన బాణాలతో ఉన్న ఆ బలవంతులు ఆ మహాపరాక్రమవంతులు ఉభయులూ చెట్లు మొలిచిన రెండు పర్వతాల వలె కనిపించినారు అవయవాలు అన్నీ నెత్తురుతో తడిసి పోయినందువల్ల వారు ఉభయులూ ప్రజ్వలిస్తూ వున్న రెండు అగ్నిహోత్రాల వలె కనిపించినారు.

మహాపరాక్రమవంతుడు అయిన విభీషణుడు లక్ష్మణుని అలుపు పోగొట్టడానికీ మేలు చేయడానికీ అప్పుడు ఆ యుద్ధరంగములోకి వచ్చి నిలుచున్నాడు.

## ౯౦

ఆ యుద్ధభూమిలో ఒకరిని ఒకరు వధించి వేయవలెను అనుకొని మదపు ఏనుగలవలె పోరాడుతూ ఉన్న లక్ష్మణుణ్ణి ఇంద్రజిత్తును విభీషణుడు చూచినాడు అంతట ఆ బలవంతుడు ఆ శూరుడు రావణాసురుడి తమ్ముడు యుద్ధరంగములోకి పోయి నిలుచున్నాడు తన మహాచాపము తీసుకొని టంకారము

చేసినాడు. కరకుకొనలతో ఉన్న గొప్ప గొప్ప బాణాలను రాక్షసులమీద వదిలినాడు. ఆ బాణాలు అగ్నిహోత్రములవలె మంటలు మండుతూ పోయి ఆ రాక్షససైన్యము మీద అన్నివైపులా పడ్డవి. పిడుగులుపడి పర్వతాలు పగిలి పోయేటట్టు ఆ బాణాలుపడి రాక్షసులు అనేకమంది ఛిన్నాభిన్నము అయి కూలిపోయినారు. విభీషణుడు అట్లా బాణాలు వదులుతూ ఉంటే అతనివలె గూడా అనుచరులున్నూ అప్పుడు శూలాలతోనూ ఖడ్గాలతోనూ పట్టిసాలతోనూ పోరాటము సాగించి రాక్షసవరులను చెండించినారు.

మదపుటేనుగుగున్నల మధ్య ఉన్న పెద్ద మదపుటేనుగువలె తన అనుచరుల మధ్యను ఉన్న విభీషణుడు ఎప్పుడు ఏది చేయవలెనో తెలిసినవాడు కనుక రాక్షసులతో యుద్ధము చేయడానికి ఎప్పుడూ సంతోషపడే వానరులను అప్పుడు పురికొల్ప పిలుచుకొని వానరవీరులను చూచి "ఓ వీరులారా, ఇప్పుడు రాక్షసరాజు రావణాసురుడి సైన్యములో మిగిలిఉన్న వీరుడు ఈ ఇంద్రజిత్తు ఒక్కడే. ఇప్పుడు వీడు ఒక్కడే ఆ రావణాసురుడికి గతి. మీరు ఎందుకు ఊరక నిలుచున్నారు. ఈ రణరంగములో ఈ పాపిష్ఠివాడు చచ్చిపోయేట్లయితే రావణాసురుడి మిగతా బలము అంతా చచ్చిపోయినట్లే. ఇకను అప్పుడు రావణాసురుడు ఒక్కడే మిగులుతాడు. మహావీరుణ్ణి ప్రహస్తుణ్ణి మీరు చంపివేసినారు. మహాబలవంతుడు అయిన నికుంభుణ్ణి మీరు చంపివేసినారు. కుంభకర్ణుడు అంతటివాడు హతుడు అయిపోయినాడు. కుంభుడూ ధూమ్రాక్షుడూ జంబుమాలీ మహామాలీ తీక్ష్ణవేగుడూ అశనిప్రభుడూ సుప్తఘ్నుడూ యజ్ఞకోపుడూ వజ్రదంష్ట్రుడూ సంహ్రాదీ వికటుడూ నిఘ్నుడూ తపనుడూ దముడూ ప్రఘసుడూ ప్రజంఘుడూ జంఘుడూ చచ్చిపోయినారు. వారే కాదు. దుర్ధర్షుడుఅయిన అగ్నికేతువూ పరాక్రమవంతుడుఅయిన రశ్మికేతువూ విద్యుజ్జిహ్వుడూ ద్విజిహ్వుడూ సూర్యశత్రువూ అకంపనుడూ సుపార్శ్వుడూ చక్రమాలీ కంపనుడూ దేవాంతకనరాంతకులూ చచ్చిపోయినారు.

"ఓ వానరులారా, మీరు ఇంకా ఎంతో మంది రాక్షసయోధులను సంహారము చేసివేసినారు. చేతులతో సముద్రాన్ని దాటివచ్చిన మీకు ఈ ఇంద్రజిత్తు సైన్యాన్ని సంహరించడము గోష్పదము దాటి పోవడము వంటిది. బలదర్పితులైన రాక్షసవీరులను అందరినీ మీరు సంహారము చేసివేసినారు ఇక జయించవలసినది వీణ్ణి ఒక్కణ్ణే. వీడు, ఈ ఇంద్రజిత్తు, నా అన్న కొడుకు అన్న కొడుకును చంపివేయడము మంచిపని కాదు. కాని రామకార్యార్థము ఏమాత్రమూ దయతలచకుండా వీణ్ణి నేను చంపివేయగలను. అయితే వీణ్ణి

చంపివేయవలెను అని నేను అనుకొన్నప్పుడెల్లా నా కన్నులనిండా నీళ్లు కమ్ముకొని నన్ను అడ్డగిస్తున్నవి. లక్ష్మణుడు ఎట్లాగూ వీణ్ని సంహారము చేసివేస్తాడు. ఇప్పుడు మీరు అందరూ ఏకమై ఈ ఇంద్రజిత్తు చుట్టూ ఉన్న సైన్యాన్ని నాశనము చేసివేయండి" అని చెప్పినాడు.

ఇట్లా ఆ యశస్వి, విభీషణుడు చెప్పగానే వానర వీరులు అందరూ తోకలు ఝాడించినారు. మేఘాలను చూచిన నెమళ్లవలె మాటిమాటికి కోలాహలస్వనములు చేసినారు. అంతట జాంబవంతుడు తన భల్లూక సైన్యాలనూ వానరసైన్యాలనూ వెంటపెట్టుకొని పోయి రాక్షససైన్యాన్ని ఎదిరించినాడు. అప్పుడు వానరయోధులూ భల్లూకయోధులూ చెట్లతోనూ రాళ్లతోనూ రాక్షసయోధులను కొట్టినారు. గోళ్లతో రాక్షసయోధులను చీల్చివేసినారు. కోరలతో కొరికివేసినారు. మహాబలవంతులు అయిన రాక్షసవీరులు అప్పుడు వివిధాయుధాలతోనూ భల్లూకనాథుణ్ని జాంబవంతుణ్ని ఎదిరించినారు. అప్పుడు రాక్షసవీరులు ఆ జాంబవంతుడి మీద బాణాలు వదిలినారు. తక్కిన రాక్షసయోధులు కరకు గొడ్డళ్లతోనూ అడ్డకత్తులతోనూ యష్టులతోనూ చిల్లకోలలతోనూ వానరయోధుల మీద పడ్డారు. క్రుద్ధులు అయిన దేవాసురులవలె అప్పుడు వానర రాక్షసయోధులు భయంకరముగానూ దొమ్మిగానూ యుద్ధము చేసినారు. మహాపరాక్రమవంతుడు హనుమంతుడు అప్పుడు తన మూపుమీదనుంచి లక్ష్మణుణ్ణి దింపి మహాక్రుద్ధుడు అయిపోయి ఒక సాలవృక్షాన్ని పెళగించి పట్టుకొని వేలకువేల రాక్షసయోధులతో పరమభయంకరముగా పోరాడి పడకొట్టినాడు.

అప్పుడు ఇంద్రజిత్తు తనతో దొమ్మిగా పోరాడుతూ ఉన్న తన పినతండ్రి విభీషణుణ్ని వదిలిపెట్టి మళ్లీ లక్ష్మణుడి మీదికి పరుగెత్తినాడు. అప్పుడు ఆ వీరులు ఉభయులూ ఒకరిమీద ఒకరు బాణవర్షము కురిపించుకొన్నారు. ఆ మహాబలవంతులు ఆ మహావేగవంతులు వర్షాకాలములో మేఘాలు ఆవరించిన సూర్యచంద్రులవలె బాణాలు కమ్ముకొన్నందువల్ల ఆ వీరులు ఒకరికి ఒకరు కనిపించకుండా పోరాడినారు. అప్పుడు ఆ పోరాటములో ఇంద్రజితు కాని లక్ష్మణుడు కానీ వింటిని ఎట్లా పట్టుకొన్నదీ అమ్ముల పొదిలో నుంచి బాణాలు ఎట్లా తీసిందీ ఆ తీసిన బాణాలను ఎట్లా వింటికి ఎక్కించిందీ ఎవరికీ కనపడలేదు. ఎక్కుపెట్టడమూ, గురి చూడడమూ, చెవి వరకూ నారి లాగడమూ మొదలైనవి ఎప్పుడు చేసిందీ ఎవరి కన్నులకూ కనపడ లేదు. కానీ వారి వారి ధనస్సులలో నుంచి వెలువడిన బాణాలు ఆకాశాన్ని కమ్ముకొన్నందువల్ల కింద నేల మీద ఏ వస్తువూ కనిపించకుండా పోవడము మాత్రము అందరికీ తెలుసు.

ఇంద్రజిత్తు లక్ష్మణుడి మీదికీ లక్ష్మణుడు ఇంద్రజిత్తు మీదికీ పోయి మహోగ్రముగా కొట్టుకొంటూ ఉంటే ఎవరిని ఎవరు జయిస్తారో ఎవరూ నిర్ణయించ లేక పోయినారు. వారు ఉభయులూ వదలిన బాణాలు ఆకాశము అంతటా సందు లేకుండా కప్పుకొని చీకటి అయిపోయింది. దిక్కులూ విదిక్కులూ తెలియకుండా వారు వదలిన బాణాలతో నిండి పోయినవి. సూర్యుడు అస్తమిస్తే చీకట్లు కమ్ముకొన్నట్టుగా అయి పోయింది అప్పుడు నెత్తురు నదులవలె ప్రవహించింది. మాంసము తినే క్రూరజంతువులూ భయంకరమైన పక్షులూ ఘోరముగా అరిచినవి. గాలి వీచడము ఆగి పోయింది అగ్నిహోత్రము జ్వలించడము మాని వేసింది "యుద్ధము లేకుండా సమస్తలోకాలూ సుఖముగా ఉండవలెను" అని అప్పుడు మహర్షులు ఆశీర్వదించినారు. ఆ యుద్ధము చూడడానికి అక్కడికి వచ్చిన గంధర్వులూ చారణులూ ఆ ఘోర సంగ్రామము చూచి పారిపోయినారు.

ఆ రాక్షససింహుడు ఇంద్రజిత్తు రథానికి బంగారు ఆభరణాలతో పూన్చిన నాలుగు నల్లటి గుర్రాలను గురిచేసి లక్ష్మణుడు అప్పుడు నాలుగు బాణాలు వదలినాడు చక్కని రెక్కలతో తెల్లగా తళతళలాడుతూ ఉన్న కత్తివాయి అమ్మును తీసి వింటి కెక్కించి చెవిదాకా లాగి దేవేంద్రుడు వదిలే పిడుగువంటి జ్యాతలనాదముతో ఇంద్రజిత్తు రథసారథిమీద వదలినాడు. అప్పుడు పిడుగువంటి ఆ బాణము ఆ రథాన్ని చిత్రవిచిత్రగతులతో తోలుతూ ఉన్న ఆ రథసారథి కంఠాన్ని దేహమునుంచి ఉత్తరించి వేసింది. రథసారథి అట్లా హతుడై పోగానే ఆ మహాపరాక్రమవంతుడు ఇంద్రజిత్తు స్వయముగా రథసారథ్యము చేసుకొంటూ మళ్ళీ ధనస్సు అందుకొన్నాడు ఆ ఇంద్రజిత్తు అత్యద్భుత సామర్థ్యానికి ఆశ్చర్యపోతూ అతని చేతులు రథసారథ్యము చేస్తూ ఉండడము చూచి లక్ష్మణుడు ఆ రథానికి పూన్చిన గుర్రాలమీద నిశితబాణాలను వదలినాడు ఇంద్రజిత్తు ధనస్సు అందుకోగానే లక్ష్మణుడు ఆ గుర్రాలమీద మళ్ళీ బాణాలు వదలినాడు తన లోపాన్ని లక్ష్యపెట్టకుండా నిర్భయముగా రథము మీద తిరుగుతూ ఉన్న ఇంద్రజిత్తుమీద లక్ష్మణుడు అప్పుడు అమిత వేగముతో బాణవర్షము కురిపించినాడు. ఆ పోరాటములో తన సారథి చచ్చిపోవడమూ తానే రథము తోలుకొంటూ ఉండడమూ చూచి లక్ష్మణుడు బాణవర్షము కురిపించినందుకు ఇంద్రజిత్తుకు యుద్ధగర్వము వదలిపోయింది. విషణ్ణుడు అయిపోయినాడు.

వానరవీరులు అందరూ ఇంద్రజిత్తు విషణ్ణవదనము చూచి పరమసంతోషముతో లక్ష్మణుణ్ణి కొనియాడినారు అప్పుడు ప్రమాథీ, శరభుడూ, రభసుడూ,

గంధమాదనుడూ అనే నలుగురు వానరవీరులు పరాక్రమించినారు. ఆ భయంకర పరాక్రములు నలుగురు వానరవీరులూ ఎగిరిపోయి ఇంద్రజిత్తు రథానికి కట్టిన నాలుగు గుర్రాలమీదనూ పడ్డారు. పర్వతాలవంటి ఆ నలుగురు వానరవీరులు వచ్చి పైన పడడముతో ఆ నాలుగు గుర్రాలు నోళ్లు తెరచి నెత్తురు కక్కినవి. అవి వాళ్ళ తాకిడికి తట్టుకోలేక ప్రాణాలు వదలి నేలకూలినవి. ఆ గుర్రాలను చంపివేయడముతో తృప్తిచెందక ఆ నలుగురు వానరవీరులు ఆ ఇంద్రజిత్తు మహారథాన్ని విరుగగొట్టి అమిత వేగముతో ఎగిరిపోయి లక్ష్మణుడి ప్రక్కను నిలుచున్నారు.

సారథీ, గుర్రాలూ చచ్చిపోవడముతో ఇంద్రజిత్తు రథము మీదినుంచి కిందికి దిగి బాణవర్షము కురిపిస్తూన్న లక్ష్మణుడికి ఎదురుగుండా పరుగెత్తినాడు. బాణాలు వదలుతూ ఉన్న తనమీదికి అట్లా పదాతిఅయి పరుగెత్తుకొని వస్తూ ఉన్న ఆ ఇంద్రజిత్తుమీద దేవేంద్రుడివంటి ఆ పరమ పరాక్రమవంతుడు లక్ష్మణుడు నిశిత బాణాలను సూటిగా వదలి నిలుచుండ బెట్టినాడు.

౫౧

ఆ మహాపరాక్రమవంతుడు ఇంద్రజిత్తు విరథుడు అయిపోయి నేలమీద నిలుచున్నాడు. మహోగ్రుడు అయి పరాక్రమముతో జ్వలించినాడు. అప్పుడు ఆ ధనుర్ధరులు ఇంద్రజిత్తూ, లక్ష్మణుడూ, ఒకరిని ఒకరు జయించవలెను అని అనుకొన్నారు. మహారణ్యములో మదపుటేనుగులవలె అంతట ఆ వీరులు ఒకరిని ఒకరు ఎదుర్కొన్నారు. అప్పుడు తమ తమ నాయకులతో పాటు అటు రాక్షసయోధులూ ఇటు వానరయోధులూ కలియపడి పోరాటము సాగించినారు అన్ని వైపులా అన్యోన్యమూ చంపి వేసుకోవడమూ మొదలు పెట్టినారు.

అప్పుడు ఇంద్రజిత్తు తన రాక్షసయోధులను అందరినీ చూచి పొగిడి సంతోషపెటి "ఓ రాక్షసవీరులారా, ఇప్పుడు దిక్కులన్నీ చీకట్లు అలముకొన్నవి. ఈ యుద్ధభూమిలో ఇపుడు తనవారు ఎవ్వరో పరాయివారు ఎవ్వరో ఎవరికీ తెలియడములేదు. ఇప్పుడు మీరు అందరూ వానరయోధులను మభ్యపెట్టవలెను అందుకు మీరుఅందరూ ధైర్యముతో పోరాటము సాగించవలెను మీరు భయంకరముగా పోరాటము సాగిస్తూ ఉంటే నేను ఇటే లంకాపట్టణానికి పోయి మరిఒక రథముమీద తిరిగివచ్చి యుద్ధము చేస్తాను. నేను లంకాపట్టణము పోవడము వానరులకు ఎవరికీ తెలియనీయకుండా ఉండేట్లు మీరు పోరాటము సాగించవలెను ఏ మాత్రము తెలిసినా ఆ దురాత్ములు నాకు అడ్డము తగులుతారు. అందువల్ల మీరు ఎట్లా పోరాటం సాగిస్తే వాళ్లు నాకు అడ్డము రాకుండ

యుంటారో అట్లా మీరు వానర యోధులతో పోరాడుతూ ఉండవలెను అని చెప్పినాడు.

అంతట అశ్రుముఖుడైన ఇంద్రజిత్తు వానరవీరులను సన్నద్ధపెట్టి రథము కోసము లంకాపట్టణానికి పోయినాడు అక్కడ బంగారు రథానికి ఉత్తమాశ్వాలను పూన్చి చక్కగా అలంకరించినారు. ఆ రథమునిండా వందల కొద్ది ఈటెలూ ఖడ్గాలూ విండ్లూ మొదలైన ఆయుధాలు అమర్చినారు. అశ్వహృదయము తెలిసి రథికుడికి మేలయ్యేట్లు పోనిచ్చే వారధి ఆరథము తోలడానికి కూర్చున్నాడు మనోజ్ఞమైన ఆ మహారథము మీద ఆ మహాపరాక్రమవంతుడు ఆ జయశీలి ఇంద్రజిత్తు ఎక్కినాడు అంతట రాక్షసగణాలను వెంట పెట్టుకొని అమితవేగముతో లంకాపట్టణమునుంచి బయలుదేరి లక్ష్మణ విభీషణుల మీదికి పోయినాడు.

యుద్ధభూమిలో ఉన్నట్టే ఉండి తమకు ఎవరికీ ఏమాత్రమూ తెలియకుండా లంకాపట్టణానికిపోయి అంత తొందరగా రథము ఎక్కి వచ్చిన ఆ ఇంద్రజిత్తును చూచి లక్ష్మణుడూ విభీషణుడూ వానరవీరులూ ఆశ్చర్యపోయినారు. ఆ ఇంద్రజిత్తు లాఘవానికి వారు అందరూ చకితులు అయిపోయినారు.

అంతట ఇంద్రజిత్తు బాణవర్షము కురిపిస్తూ వందలకొద్దీ వేలకొద్దీ వానర యోధులను పడకొట్టినాడు అతడు తన ధనుస్సును మండలముగా వంచి రెప్పపాటులో బాణాలు వదిలి ఎంతో మంది వానరవీరులను వధించి వేసినాడు. ఆ బాణపాతానికి ఓర్చుకోలేక ఆ భీమపరాక్రములు వానరవీరులు అప్పుడు కష్టకాలములో దేవతలు బ్రహ్మదేవుడి దగ్గరికి పోయేట్లు లక్ష్మణుడి దగ్గరికిపోయి అతని శరణుచొచ్చినారు

అప్పుడు లక్ష్మణుడు కోపముతో మండిపడుతూ తన హస్తలాఘవాన్ని చూపించటానికి ఒకే ఒక బాణము వదిలి ఇంద్రజిత్తు కార్ముకాన్ని నరికి వేసినాడు అప్పుడు ఇంద్రజిత్తు ఇంకొక ధనస్సు తీసుకొని ఎక్కు పెట్టుతూ ఉంటే, లక్ష్మణుడు చూచి ఆ వింటినికూడా మూడు బాణాలు వదిలి విరుగకొట్టినాడు అంతటితో వదిలి పెట్టకుండా ఆ ఇంద్రజిత్తు వక్షస్థలాన్ని గురిచేసి విషసర్పాలవంటి అయిదు బాణాలను వదిలినాడు ఆ అయిదు బాణాలూ ధనస్సులు పోగొట్టుకొన్న ఇంద్రజిత్తు కాయాన్ని భేదించుకొనిపోయి ఎర్రటి పాములవలె నేలమీద పడ్డవి. ఇంద్రజిత్తు తొడుగుకొని ఉన్న కవచము తెగిపోయింది. నోట నెత్తురు కక్కినాడు. కానీ వెంటనే గట్టి అల్లెత్రాడుతో బల

విచిత్రమైన గొప్ప ధనస్సు తీసుకొని దేవేంద్రుడు వర్షము కురిపించేటట్టుగా అమిత వేగముతో లక్ష్మణుడిమీద బాణవర్షము కురిపించినాడు అందుకు ఆ అరిందముడు లక్ష్మణుడు కలవరపడకుండా ఎదిరించ నలవికాని ఆ బాణవర్షాన్ని తన బాణాలతో నివారించినాడు. అంతట ఆ మహాపరాక్రమవంతుడు లక్ష్మణుడు ఏ మాత్రమూ సంభ్రమ పడకుండా, ఇంద్రజిత్తుమీద బాణాలు వదులుతూ తన పరాక్రమాన్ని అద్భుతముగా చూపించినాడు. అప్పుడు లక్ష్మణుడు క్రుద్ధుడైపోయి ఒక్కొక్క రాక్షసవీరుణ్ణి మూడేసి బాణాలతో పడకొట్టి తన బాణప్రయోగలాఘవాన్ని ప్రదర్శిస్తూ ఇంద్రజిత్తుమీద అనేక బాణాలు వదలినాడు. ఆ శత్రుహంత ఇంద్రజిత్తు శత్రువు చేతిలో అటూ దెబ్బ తింటూ వెంటనే ధనస్సు తీసుకొని లక్ష్మణుడిమీద ఎన్నో బాణాలు వదలినాడు. ఆ ఇంద్రజిత్తు వదలిన బాణాలన్నీ తన మీద వచ్చి పడేలోపలనే లక్ష్మణుడు తన తీక్ష్ణబాణాలతో వాటిని అన్నిటినీ దారిలోనే విరుగగొట్టినాడు ఆ ధర్మాత్ముడు ఆ రథికోత్తముడు లక్ష్మణుడు అంతట ఆ ఇంద్రజిత్తు రథసారథిమీద కణుపులు వంగిన కత్తివాయి అమ్ము వదలినాడు. ఆ అమ్ము పోయి ఆ రథసారథిని పడకొట్టింది. వాడు చచ్చి నేల కూలినాడు సారథి పడిపోయినప్పటికిన్నీ ఆ రథానికి కట్టిన గుర్రాలు కలవరపడిపోకుండా ఆ రథాన్ని మండలాకారముగా తిప్పుతూ శత్రుబాణాలను తప్పించ సాగినవి అందుకు లక్ష్మణుడు ఆశ్చర్యపోయినాడు ఉత్తరక్షణాన కోపపరవశుడు అయి ఆ రణరంగములో అందరూ హడలి పొయ్యేట్లు ఆ గుర్రాలను గురిచేసి బాణాలు వదలినాడు ఇంద్రజిత్తు అది సహించలేక తక్షణమే లక్ష్మణుడిమీద పది బాణాలు వదలినాడు విషసర్పాలవంటి ఆ వజ్రతుల్య బాణాలు లక్ష్మణుడి కాంచనకవచానికి తాకి కింద పడిపోయినవి. లక్ష్మణుడు తొడుగుకొని ఉన్న ఆ కాంచనకవచము అభేద్యము అని ఇంద్రజిత్తు తెలుసుకొన్నాడు. వెంటనే లక్ష్మణుడి లలాటాన్ని గురిచేసి మంచి బంగారు పింజలతో ఉన్న మూడు బాణాలను వదలినాడు. ఆ మూడు బాణాలు నొసటను గుచ్చుకొని అప్పుడు లక్ష్మణుడు ఆ యుద్ధభూమిలో మూడు శిఖరాల పర్వతమువలె శోభించినాడు.

ఇంద్రజిత్తు వదలిన బాణాలు గుచ్చుకొని బాధపడుతూ ఉన్నప్పటికిన్నీ లక్ష్మణుడు తన వింటి అల్లెత్రాటిని ఆకర్ణాంతములాగి, కుండలాలతో ధగధగలాడుతూ ఉన్న ఇంద్రజిత్తుమీద అయిదు బాణాలు వదలినాడు అప్పుడు ఆ శూరులు ఆ భయంకరపరాక్రములు ఆ మహాబలధనుర్ధరులు లక్ష్మణ ఇంద్రజిత్తులు వివిధబాణాలతోనూ ఒకరిని ఒకరు కొట్టుకొన్నారు ఉభయుల దేహాలూ నెత్తురుతో తడిసిపోయి విరుగపూచిన మోదుగ చెట్లవలె కన్పించి

వారు ధనుర్ధరులు ఉభయులూ జయించవలెను అని సంకల్పించుకొన్నారు. ఒకరిని ఒకరు ఎదిరించుకొని సమస్త అవయవాలలోనూ భయంకరము అయిన బాణాలు వదులుకొన్నారు.

అంతట ఇంద్రజిత్తు కోపముతో చెలరేగి ఆ యుద్ధభూమిలో ఉన్న విభీషణుని ముఖాన మూడు ఇనుప బాణాలు నాటినాడు. అంతటితో తృప్తి చెందక వానరయూథపతులు ఒక్కొక్కరిమీద ఒక్కొక్క బాణము వదిలి నొప్పించినాడు.

అప్పుడు ఆ మహాపరాక్రమవంతునికి విభీషణునికి మహా కోపము వచ్చింది. తన గద తీసుకొని ఆ దురాత్ముని రథానికి కట్టిన గుర్రాలను కొట్టినాడు. ఆ గద దెబ్బలకు ఆ గుర్రాలు చచ్చిపోయినవి. గుర్రాలు పడిపోగానే ఆ మహాపరాక్రమంతుడు ఇంద్రజిత్తు ఆ రథము దిగినాడు. రథశక్తిని తీసుకొని పిన తండ్రిమీద విసిరి వేసినాడు. విభీషణునిమీద వచ్చి పడబోతూ ఉన్న ఆ రథశక్తిని లక్ష్మణుడు చూచినాడు. తక్షణమే దాన్ని గురిచేసి తీక్షణ బాణాలు వదిలినాడు. ఆ రథశక్తి ముక్కలు ముక్కలు అయి నేల కూలింది. విభీషణునికి కోపము వచ్చింది. గట్టి ధనస్సు తీసుకొన్నాడు. ఇంద్రజిత్తు వక్షస్థలాన్ని గురిచూచి వజ్రమువంటి అయిదు బాణాలు వదిలినాడు. బంగారు పింజలతో ఉన్న ఆ బాణాలు గురి తప్పకుండా సూటిగాపోయి ఇంద్రజిత్తు కాయాన్ని భేదించి నెత్తుటితో తడిసి ఎర్రని పాములవలె బైటికి వచ్చినవి. ఆ ఇంద్రజిత్తుకు అప్పుడు కోపము వచ్చింది. తన పినతండ్రిని కొట్టి చంపివేయవలెను అనుకొన్నాడు. యముడు తనకు ఇచ్చిన బాణాన్ని తీసుకొని వింటిని ఎక్కించినాడు. ఆ మహాబాణాన్ని ఇంద్రజిత్తు ఎక్కు పెట్టడము లక్ష్మణుడు చూచినాడు. అంతట ఆ మహాతేజోవంతుడు లక్ష్మణుడు దేవేంద్రునితో కూడా సురాసురులు ఎవ్వరూ తట్టుకోలేని బాణాన్ని తీసుకొన్నాడు. ఆ బాణాన్ని జయించినవారు కానీ ఎదిరించినవారు కానీ ఇదివరకు ఎవ్వరూ లేరు. మహా ధైర్యవంతుడు కుబేరుడు స్వయముగా ఆ బాణాన్ని లక్ష్మణునికి ఇచ్చినాడు. ఆ బాణాన్ని తన ధనుస్సులో సంధించినాడు. అంతట అటు ఇంద్రజిత్తు యముడు ఇచ్చిన బాణాన్నీ ఇటు లక్ష్మణుడు కుబేరుడు ఇచ్చిన బాణాన్నీ తమ తమ ధనస్సులలో సంధించినారు. ఇనుప గుదియలవంటి తమ తమ బాహువులతో తమ తమ చెవుల వరకూ అల్లెత్రాళ్ళను లాగినారు. ఆ అల్లెత్రాళ్లు మ్రోగినవి. ఆ మ్రోతలు క్రౌంచ పక్షుల కేకలవలె వినిపించినవి. అప్పుడు ఆ బాణాలు రెండూ కాంతి అతిశయ

ముతో మంటలు మండుతూ ఉన్నట్లు కనిపించినవి ఆ ఉభయుల ధనస్సులలో నుంచి వెలువడిన ఆ రెండు బాణాల ధగధగలవల్ల అప్పుడు ఆకాశము భాసించింది. ఆ రెండు బాణాలూ ఒకదానిముఖము ఒకదానికి తాకింది. ఘోరాకారములో ఉన్న ఆ బాణాలు రెండూ ఒకదాన్ని ఒకటి ఒరుసుకొన్నవి. పొగలు రాజుకొంటూ పెద్దపెద్ద మంటలు రగులుకొంటూ నిప్పుల రవ్వలు రేగినవి అంతరిక్షములో ఆ రెండు బాణాలూ చిత్రవిచిత్రముగా తిరుగుతూ పోరాడి నేలమీద పడిపోయినవి.

ఆ వీరులు లక్ష్మణేంద్రజిత్తులు ఉభయులూ తమ తమ బాణాలు దెబ్బతిని పడిపోవడము చూచి సిగ్గుపడ్డారు ఉత్తరక్షణాన ఉభయులకూ కోపము పుట్టుకొని వచ్చింది. వెంటనే లక్ష్మణుడు వారుణాస్త్రము తీసినాడు. దేవేంద్రుడు అంతటి వాణ్ణి జయించిన ఇంద్రజిత్తు అది చూచినాడు. రుద్ర దేవతాకము అయిన అస్త్రాన్ని వదలి ఆ వారుణాస్త్రాన్ని పరమాద్భుతముగా పడకొట్టినాడు. అంతటి ఆ జయశీలి ఇంద్రజిత్తు ఈ లోకాన్ని అంతా సంహారము చేసివేయడానికో ఏమోను అన్నట్లు దేదీప్యమానము అయిన ఆగ్నేయాస్త్రాన్ని తనవింట సంధించినాడు. అదిచూచి లక్ష్మణుడు చటుక్కున సౌరాస్త్రాన్ని వదలి ఆ ఆగ్నేయాస్త్రాన్ని అడ్డగించినాడు తన ఆగ్నేయాస్త్రాన్ని అడగించడము చూచి. ఇంద్రజిత్తు కోపపరవశుడు అయిపోయి, శత్రువులను అందరినీ ఒక్కసారిగా నాశనముచేయ సంకల్పించుకొని ఆసురాస్త్రాన్ని వదలినాడు. ఆ ఆసురాస్త్ర ప్రభావమువల్ల అప్పుడు ఇంద్రజిత్తు ధనస్సులోనుంచి ధగధగలాడుతూ బాణాలూ ముద్గరాలూ, శూలాలూ, గదలూ. ఖడ్గాలూ, గండ్రగొడ్డళ్ళూ బయలుదేరినవి ఆ ఆసురాస్త్రాన్ని అదివరకు సర్వభూతకోటీ అడ్డగించలేకపోయింది అది సమస్త శత్రువులను నాశనముచేసివేస్తుంది అది లక్ష్మణుడు చూచినాడు మహేశ్వరాస్త్రాన్ని వదలి అన్ని ఆయుధాలతో వెలువడిన ఆ ఆసురాస్త్రాన్ని పడకొట్టినాడు.

అంతట లక్ష్మణుడూ ఇంద్రజిత్తూ దొమ్మిగా పోరాటము సాగించినారు ఆ పోరాటము అసదృశముగానూ, అద్భుతముగానూ సాగింది ఆకాశములో ఉన్న భూతాలు అన్నీ అప్పుడు లక్ష్మణుడిచుట్టూ మూగినవి. అటూ ఆ వీరులు పోరాడుతూ ఉంటే మహాభైరవస్వనాలతో ఇటు వానరయోధులూ, అటు రాక్షసయోధులూ, భయంకరము అయిన యుద్ధము చేసినారు అప్పుడు సమస్త భూతకోటీ అక్కడ ఆకాశములో సమావేశము అయింది దేవేంద్రుడి వెంట

దేవతలూ, పితృదేవతలూ, గంధర్వులూ, గరుడులూ, ఉరగులూ, పరమర్షులూ, వచ్చి ఆకాశములో నిల్చొని ఆ యుద్ధములో లక్ష్మణుణ్ని కాపాడినారు.

అప్పుడు లక్ష్మణుడు తాకితే తగలబడిపోయే బాణాన్ని వింట సంధించినాడు బంగారముతో చేసిన ఆ బాణము చక్కని రెక్కలతో సుందరముగా ఎంతో అందము అయినది. అది తగిలితే చచ్చిపోకతప్పదు. దానిని అదివరకు ఎవరూ ఎదిరించి ఎరగరు ఎవరూ ఓర్చుకొని ఎరగరు. అది మహా భయంకరము అయింది. ఆ బాణాన్ని అదివరకు దేవసమూహాలు అన్నీ పూజించినవి మహా తేజోవంతుడూ, దేవతల ప్రభువూ, పచ్చని గుర్రాలమీద పోయే దేవేంద్రుడు ఆ బాణాన్ని దేవదానవుల యుద్ధములో దానవుల మీద వదిలినాడు. ఆ బాణముతో దానవులను జయించినాడు ఆ బాణము అదివరకు అపజయము అనేది ఎరగదు ఆ బాణాన్ని అప్పుడు లక్ష్మణుడు ఐంద్రాస్త్రముతో అభిమంత్రించినాడు దుర్ధర్షము అయిన తన శరాసనాన్ని వంచినాడు ఆ మహావీరుడు లక్ష్మణుడు సమస్తలోకాలనూ సంహారము చేసి వేసే ప్రళయకాల యముడి వలె ఆ బాణాన్ని తన చెవివరకూ లాగినాడు. ఆ కాంతిమంతుడు అంతట కార్యసాధనము కోసము ఆ బాణము వంక చూచి "ఓ బాణమా, దశరథమహారాజు జ్యేష్ఠపుత్రుడు రాముడు ధర్మాత్ముడూ, సత్యసంధుడూ ఎదిరించనలవికాని పరాక్రమవంతుడూ అయినట్లయితే నీవు ఈ ఇంద్రజిత్తును వధించు" అని చెప్పినాడు. అంతట ఆ పరవీరహంత ఆ కాంతిమంతుడు లక్ష్మణుడు ఐంద్రాస్త్రముతో అభిమంత్రించిన ఆ బాణాన్ని వదిలినాడు అది గురితప్పకుండా సూటిగా పోయింది శిరస్త్రాణము (తలకు దెబ్బ తగలకుండా ఉండడానికి పెట్టుకొన్న ఇనుప గొలుసుల టోపీ) తోనూ ధగ ధగలాడే కుండలాలతోనూ ఉన్న ఇంద్రజిత్తు శిరస్సును ఆ బాణము ఖండించింది అంతట అతని కాయాన్ని నేల మీదకి పడకొట్టింది బంగారము వలె కాంతిమంతము అయిన ఆ ఇంద్రజిత్తు శిరస్సు దేహమునుంచి తెగి, నెత్తుటితో తడిసి నేలమీద కనిపించింది ఇంద్రజిత్తు అట్లా హతుడు అయి తలకు పెట్టుకొన్న శిరస్త్రాణముతోనూ దేహానికి తొడుగుకొన్న కవచముతోనూ చేతితో పట్టుకొన్న శరాసనముతోనూ నేల కూలినాడు వృత్రాసురుడు హతుడు అయినప్పుడు దేవతల వలె అప్పుడు విభీషణుడూ వానరవీరులూ సింహనాదాలు చేసినారు ఆకాశములో దేవతలూ మహర్షులూ గంధర్వులూ సంతోషధ్వనులు చేసినారు.

అప్పుడు వానరయోధులు ఘోరముగా చంపివేస్తూంటే రాక్షసయోధులు తెలివితప్పి ముద్గరాలూ, శూలాలూ, గండ్రగొడ్డళ్లూ, మొదలైన ఆయుధాలు

వదలి పెట్టి కొందరు లంకాపట్టణానికి అభిముఖముగా పరుగెత్తినారు. వానర యోధులు తరుముతూ ఉంటే కొందరు రాక్షసయోధులు దశదిశలా పరుగులెత్తినారు కొందరు సముద్రములో పడిపోయినారు కొందరు కొండలలోకి పరుగెత్తుకొనిపోయి దాక్కొన్నారు. ఒక్క రాక్షసుడు అయినా అక్కడ నిలవలేదు. అందరూ పరుగులెత్తి పారిపోయినారు. సూర్యాస్తమయము అయిపోగానే సూర్యకిరణాలు కనపడకుండా పోయేట్లు, ఇంద్రజిత్తు పడిపోగానే, రాక్షసయోధులు అందరూ అయిపులేకుండా పారిపోయినారు.

నేలమీదపడ్డ ఇంద్రజిత్తు మొండెము అప్పుడు కొంచెముసేపు కొట్టుకలాడ. కిరణాలు మాసిపోయిన సూర్యుడివలెనూ ఆరిపోయిన అగ్నిహోత్రము వలెనూ కనిపించింది ఆ ఇంద్రజిత్తు చావుతో లోకములో పీడలు అన్ని వదలిపోయి, కీడులన్నీ తొలగిపోయి, ఈ ప్రపంచము అంతా ప్రశాంతముగా కనిపించింది సమస్తదేవతలూ, దేవేంద్రుడూ, అందుకు సంతోషించినారు. సంతోషాతిశయముతో దేవతలూ, ఆకాశములో మ్రోగించిన దుందుభుల చప్పుడూ, గంధర్వులూ అప్సరసలూ పాడిన మనోహరధ్వనులూ వినిపించినవి. అంతట దేవతలు పూలవాన కురిపించినారు. దేవతలు అందరూ లక్ష్మణుణ్ణి ప్రశంసించినారు దశదిశలూ నిర్మలముగా కనిపించినవి.

సర్వలోకాలనూ భయపెట్టిన ఆ ఇంద్రజిత్తు చచ్చిపోగానే. దేవతలూ, గంధర్వులూ, దానవులూ, అక్కడికి వచ్చినారు. లక్ష్మణుణ్ణి చూచి "ఇక మహర్షులకు భయము వదలిపోయింది" అని చెప్పి మెచ్చుకొని వెళ్ళిపోయినారు.

అప్పుడు వానరయూథపతులు అందరూ అసమానబలవంతుడు అయిన ఇంద్రజిత్తును చంపివేసిన లక్ష్మణుణ్ణి చూచి సంతోషాతిశయముతో కొనియాడినారు విభీషణుడూ, హనుమంతుడూ, భల్లూకరాజు జాంబవంతుడూ, లక్ష్మణుణ్ణి అభినందించినారు ఆ వానరులు అందరూ పట్టరాని సంతోషముతో సింహనాదాలు చేసినారు అరిచినారు. ఎగిరి గంతులు వేసినారు గర్జించినారు. లక్ష్మణుడి చుట్టూ మూగినారు. మళ్ళీ సంతోషముతో, తమ తమ వాలాలతో శిలలూ మొదలైనవాటిని పగలకొట్టినారు చెట్లను పీకి వేసినారు "లక్ష్మణుడు జయించినాడు జయించినాడు" అని ఆకాశము పగిలిపోయేట్లు కేకలు వేసినారు అంతటా ఇంకా సంతోషము పట్టలేక ఆ వానరయోధులు ఒకరిని ఒకరు కౌగలించుకొన్నారు వివిధ విధాలా లక్ష్మణుణ్ణి ప్రశంసించినారు

ఇంద్రజిత్తు చచ్చిపోయినట్లు దేవలోకములో ఉన్న దేవతలు చారణులు చెపితే తెలుసుకొన్నారు సంతోషముతో ఆ యుద్ధభూమికి వచ్చినారు ఎవరికీ

అలవికాని ఆ ఇంద్రజిత్తుతో పోరాడి, జయించిన లక్ష్మణుణ్ణి చూచి, మరింత సంతోషపడ్డారు.

## ౯౨

ఒళ్ళంతా నెత్తురుతో తడిసిపోయిన ఆ శుభలక్షణుడు లక్ష్మణుడు ఆ పోరాటములో ఇంద్రజిత్తును సంహారము చేసివేసిన సంగతివల్ల సంతుష్టుడు అయినాడు. అంతట ఆ మహాతేజోవంతుడు లక్ష్మణుడు, జాంబవంతుడూ, హనుమంతుడూ మొదలయిన వానర వీరులనూ తక్కిన వానరయోధులను అందరినీ వెంట పెట్టుకొని పోరాటములో డస్సిపోయినందువల్ల హనుమంతుణ్ణీ విభీషణుణ్ణీ ఊతముగా పట్టుకొని, రాముడూ, సుగ్రీవుడూ ఉన్న చోటికి నడిచిపోయినాడు. రాముడికి నమస్కారము చేసినాడు దేవేంద్రుడి దగ్గర బృహస్పతివలె అన్నగారి దగ్గర నిలుచొని సంతోషాతిశయముతో మాటలు తడబడుతూ భయంకరము అయిన ఇంద్రజిత్తు వధను గురించి లక్ష్మణుడు విన్నవించినాడు అప్పుడు విభీషణుడు సంతోషముతో ఆ మహాధైర్యవంతుడు లక్ష్మణుడు ఇంద్రజిత్తు శిరస్సును ఎట్లా తెగవేసింది మొదలు అయినవి వివరముగా చెప్పినాడు.

అప్పుడు ఆ మహాత్ముడు రాముడు పాటిలేని సంతోషముతో "తమ్ముడా భళే పని చేసినావు నీవు చేసిన పనికి నాకు సంతోషముగా ఉంది చక్కని పని చేసినావు ఇంద్రజిత్తు చచ్చిపోయినాడు కనుక మనము జయించినట్లే" అంటూ ఆ పరమ పరాక్రమవంతుడు రాముడు జయలక్ష్మిని చేపట్టి లజ్జపడుతూ ఉన్న లక్ష్మణుడి శిరము ఆఘ్రాణించి స్నేహాతిశయముతో బలవంతముగా తన ఒళ్ళో కూర్చుండ పెట్టుకొని గట్టిగా కౌగలించుకొన్నాడు. తన తమ్ముడివంక పదే పదే చూచినాడు గాయాలతో బాధపడుతూ నిట్టూర్పులు విడుస్తూ ఉన్న తన తమ్ముడి శిరస్సును మళ్ళీ ఆఘ్రాణించినాడు. అతని ఒళ్ళంతా తడుముతూ ఆ గాయాలు శమించటానికి త్వరపడుతూ ఆ తమ్ముడిబాధకు తానూ దుఃఖతాపముతో నిట్టూర్పులు విడుస్తూ, తమ్ముణ్ణి మంచిమాటలతో ఓదారుస్తూ "నాయనా, నీవు దుష్కరకార్యము చేసినావు పరమ కళ్యాణము అయిన పని చేసినావు కొడుకు పోయినాడు కనుక రావణాసురుడు ఇప్పుడు చచ్చిపోయినట్లే. ఆ దురాత్ముడు ఇంద్రజిత్తు హతుడు అయిపోయినాడు కనుక నేను జయించినట్లే ఆ ఇంద్రజిత్తే రావణాసురుడికి పరమాధారము వాడే వాడికి కుడిభుజము నీవు దైవవశమువల్ల ఆ క్రూరుడి కుడిభుజాన్ని తెగవేసినావు. పోరాటములో ఈ విభీషణుడూ, హనుమంతుడూ నీకు గొప్ప సాయము చేసి

నాడు. నాయనా, లక్ష్మణా, మూడు అహోరాత్రములు పోరాడి, ఎట్లాగో ఆ ఇంద్రజిత్తును చంపివేసినావు.

నేటితో నాశత్రువులు అందరూ నశించిపోయినట్టే. పుత్రుడు చనిపోయినాడు అని వినగానే రావణాసురుడు మహాసైన్యముతో బయలుదేరి వస్తాడు. పుత్రశోకముతో తపించిపోయే ఆ దుర్మార్గుణ్ణి రావణాసురుణ్ణి వాడి మహాసైన్యముతోకూడా నేను ఇట్టే సంహారము చేసి వేస్తాను.

“లక్ష్మణా, నీవు ఇంద్రజిత్తును సంహారము చేసివేసినావు నేను సీతాదేవినీ ఈ భూమినీ సంపాదించడము ఇకను అట్టే కష్టముఅయిన పనికాదు.” అని రాముడు చెప్పినాడు.

అంతట రాముడు సుషేణుణ్ణి పిలిచి “ఓ వైద్యశాస్త్రవిశారదుడా, నీవు వానరయోధపతులలో మిత్రవత్సలుడవు. ఇప్పుడు ఈ విభీషణునికీ ఈ లక్ష్మణునికీ బాణాలు గుచ్చుకొని గాయాలు అయినవి బాధపడుతూ ఉన్నారు నీవు ఇప్పుడు వీరి గాయాలు నయము చేయవలెను ఓమిత్రుడా, వీరి నేకాదు వానరవీరులలోనూ భల్లూకవీరులలోనూ ఎవరు ఎవరు బాణాలు గుచ్చుకొని గాయాలు అయి బాధపడుతూ ఉన్నారో వారిని అందరిని చూడు. వారికి అందరికీ చికిత్స చేసి వారికి అందరికీ స్వాస్థ్యము చేకూర్చేబాధ్యత నీది” అని చెప్పినాడు

అంతట ఆ వానరయూథపతి సుషేణుడు రామాజ్ఞను శిరసా వహించి ఒక పరమౌషధిని లక్ష్మణునికి వాసన చూపించినాడు ఆ వనమూలికను వాసన చూచే మాత్రముతో లక్ష్మణుని ఒంటిలో దిగబడిపోయిన బాణాల ముక్కలు అన్నీ రాలిపోయినవి బాధఅంతా నివారణఅయింది గాయాలు అన్నీ ఇట్టే మానిపోయినవి ఆ తరువాత విభీషణునికీ ఆతడి మిత్రులకూ వానరవీరులకూ భల్లూకవీరులకూ సుషేణుడు చికిత్స చేసినాడు క్షణలేశములో వారి దేహవ్యథ సమసిపోయింది అప్పుడు లక్ష్మణుడూ విభీషణుడూ వానర భల్లూకవీరులూ ఏ బాధా ఏనొప్పి లేకుండా హాయిగా లేవడము చూచి రాముడూ వానరరాజు సుగ్రీవుడూ భల్లూకరాజు జాంబవంతుడూ ఎంతో సంతోషపడ్డారు

దేవేంద్రుణ్ణి జయించిన ఇంద్రజిత్తును సంహారము చేయడము అనే దుష్కరకార్యము చేసినందుకు లక్ష్మణుణ్ణి రాముడు ఎంతో మెచ్చుకొన్నాడు అందుకు వానరయూథపతులు అందరూ ఎంతో సంతోషించినారు.

## ౯౩

ఇంద్రజిత్తు చచ్చిపోయినాడు అని రావణాసురుడి సచివులు విన్నారు. పోయి చూచి యథార్థమేను అని తెలుసుకొన్నారు. దుఃఖపడ్డారు. అంతట దశగ్రీవుడి దగ్గరికి పోయి దుఃఖపడుతూ "మహారాజా, మేము అందరమూ జీవించే ఉన్నాము. ఆ మహాద్యుతిమంతుణ్ణి, నీ పుత్రుణ్ణి, ఇంద్రజిత్తును విభీషణుడి సహాయముతో లక్ష్మణుడు చంపివేసినాడు. దేవేంద్రుణ్ణి జయించిన శూరుడూ నీ కుమారుడూ యుద్ధాలలో అపరాజితుడూ అయిన ఇంద్రజిత్తు లక్ష్మణుడితో పోరాడినాడు. అమోఘము అయిన బాణాలు వదిలి అతనిని తాపము ఎత్తించినాడు. తాను శూరులుపోయే ఉత్తమలోకానికి పోయినాడు" అని చెప్పినారు.

ఇంద్రజిత్తు యుద్ధములో చచ్చిపోయినాడు అన్న భయంకరమూ దారుణమూ ఘోరమూ అయిన వార్త విని వివశముతో రావణాసురుడు మూర్ఛపోయినాడు. చాలా సేపటికి మూర్ఛ తేరుకొన్నాడు. పుత్రశోకముతో చెప్పనలవి కాని బాధపడ్డాడు. వ్యాకులపడిపోయినాడు, దీనుడు అయిపోయినాడు, ఏడ్చినాడు.

"అయ్యో, నీవు రాక్షససైన్యాలకు అన్నిటికీ ముఖ్యుడవు. నాయనా నీవు మహారథుడవే! దేవేంద్రుణ్ణి జయించినావే! లక్ష్మణుడిచేతిలో నీవు ఎట్లా చిక్కినావు. నాయనా, నీకు కోపమువస్తే కాలస్వరూపుడూ అంతకస్వరూపుడూ అయిన యముణ్ణి నీ బాణాలతో ఛేదించివేయకలవే. మందరపర్వత శిఖరాన్ని నీ బాణాలతో పడకొట్టకలవే. పోరాటములో లక్ష్మణుడు నీకు ఏపాటివాడు అయ్యో.

"ఓ మహాబాహూ, నీవు ఇప్పుడు కాలధర్మముచేత వైవస్వతరాజును పోయి చేరినావు. అందువల్ల అతడు నాకు ఇప్పుడు పూజ్యుడు అయినాడు. ఆ యమధర్మరాజు దగ్గరికిపోవడానికి మంచి మంచి యోధులకు, యోధులకే కాదు; దేవతలకున్నూ ఇదే (ఈ యుద్ధమే—) తరణోపాయము. తన స్వామి కార్యార్థము యుద్ధములో హతము అయిపోయినవాడు స్వర్గానికి పోతాడు. అందువల్ల నీకోసము నేను దుఃఖపడను. ఇకను ఇప్పుడు దేవతలూ దిక్పాలకులూ పరమపురుషులూ, ఇంద్రజిత్తు హతుడు అయిపోయినాడు అని వింటారు. నిర్భయముగా సుఖముగా వారు అందరూ నిద్రపోతారు. ఒక ఇంద్రజిత్తులేని కారణమునుంచి నానావిధ కాననసహితము అయిన ఈ పృథ్వి అంతా— ఈ పృథ్వే కాదు— ముల్లోకాలూ శూన్యముగా కనపడుతూ ఉన్నవి. గిరి

సముద్రంలో నావలు తేలుతూ కొట్టుకు పోయే అడవి ఏనుగులవలె ఇప్పుడు అంతఃపుర స్త్రీలు రాక్షసకన్యలు ఏడ్పు పెడబొబ్బలు పెడుతారు.

ఇప్పుడు పరంతపా, నీవు నీ యువరాజ్యాన్ని ఈ లంకాపట్టణాన్ని, రాక్షసులనూ, నీ తల్లిని నీ తండ్రిని నీ భార్యనూ వదిలి పెట్టి ఎక్కడికి పోయినావు. ఓ వీరుడా, నేను చనిపోతే నా ప్రేతకర్మ నీవు చేయవలెను. అటువంటిది నీవు పితృక్రియలు చేసే వేసినావు. సుగ్రీవుడూ రామలక్ష్మణులూ నా మనశ్శల్యాలు. ఆ మనశ్శల్యాలను పెకలించి వేయకుండానే నన్ను వదిలి పెట్టి నీవు ఎక్కడికి పోయినావు" అంటూ రావణాసురుడు ఏడ్చినాడు. బాధ పడి పోయినాడు. ఆ రాక్షసరాజుకు రావణాసురుడికి పుత్రవ్యసనము నుంచి అప్పుడు భరించ నలవికాని కోపము వచ్చింది. సహజముగా తీక్ష్ణకిరణాలతో తేజరిల్లే సూర్యుడు వేసంగిలో మరింత తీక్ష్ణకిరణాలతో ప్రజ్వరిల్లుతాడు. అదేవిధముగా అసలే కోపిష్ఠివాడు అయిన రావణాసురుడు అప్పుడు పుత్రశోకముతో మరింత కుపితుడు అయినాడు. అతని కనుబొమలు ముడి పడి పోయినవి. అప్పుడు ఆ కనుబొమలు ప్రళయకాలాన మహాసముద్రములో అలలతో పైకిలేచిన మొసళ్లవలె కనిపించినవి. కోపముతో అతడు అప్పుడు ఆవలించినాడు. వృత్రాసురుడి నోటిలోనుంచి వెలువడినట్లు ఆ ఆవలించిన రావణాసురుడి నోటిలోనుంచి అప్పుడు పొగలూ మంటలూ నిప్పులూ వెలువడి నవి. పుత్రవధ మూలంచి ఆ శూరుడికి తాపము ఎత్తింది. కోపపరవశుడు అయి నాడు. మనసా ఆలోచించినాడు. వైదేహిని వధించి వేయవలెను అనుకొన్నాడు.

రావణాసురుడి కన్నులు సహజముగా ఎర్రటివి. అప్పుడు కోపాగ్నితో మంటలు మండుతూ ఆ నేత్రాలు మహాభయంకరముగా కనుపించినవి. నేత్రాలే కావు. జన్మతః అతనిది భయంకరము అయిన రూపము. ఆ కోపాగ్ని దేహము అంతటా వ్యాపించడముచేత అతడు అప్పుడు ప్రళయకాలరుద్రుడి వలె దురాసదుడు అయినాడు. జ్వలిస్తున్న దీపములో నుంచి మండుతూ రాలే నూనె బొట్లవలె అప్పుడు ఆ క్రుద్ధుడి నేత్రాలలో నుంచి నెత్తుటిబొట్లు రాలినవి. పళ్లు కొరికినాడు. అది రాక్షసులు త్రిప్పే నూనె గానుగ ధ్వనివలె వినిపించింది. ప్రళయకాలాగ్ని వలె క్రుద్ధుడు అయి పోయినాడు. ఆ రావణాసురుడు అప్పుడు ఏయే దిక్కులు చూచినాడో ఆయా దిక్కులలో ఉన్న రాక్షసులు అందరూ భయపడి పోయినారు. కలవరపడి పోయినారు. భయముతోనూ కలవర పాటుతోనూ స్తంభాల చాటున పోయినారు. చరాచరవస్తువులను అన్నిటినీ

ప్రళయకాలాన కబళించివేయడానికి చూచే యముడు వలె కనబడుతూ అప్పుడు పటపటలా చూస్తూ ఉన్న ఆ రావణాసురుడి దగ్గరకు ఎవరూ పోలేక పోయినారు.

రాక్షసుల మధ్యన ఉన్న ఆ పరమదుష్టుడు అప్పుడు యుద్ధము ఆపివేయ తలచుకొని "ఓ రాక్షససమూహములారా, నేను అనేక వేల సంవత్సరాలు అసాధ్యము అయిన తపస్సు చేసినాను. నేను తపస్సు చేసినప్పుడల్లా బ్రహ్మదేవుణ్ణి మెప్పించినాను. నా తపోబలమువల్లనూ బ్రహ్మ అనుగ్రహమువల్లనూ నాకు దేవతలనుంచికానీ అసురులనుంచికానీ ఎన్నడూ ఏ భయమూ లేదు. నాకు బ్రహ్మదేవుడు సూర్యకాంతులతో తేజరిల్లే కవచాన్ని ఇచ్చినాడు. దేవాసుర యుద్ధములో వజ్రాయుధముతో కొట్టినా నా కవచము చెక్కు చెదరలేదు. నేను ఆ కవచము తొడుగుకొని యుద్ధానికి రథముమీద పోయినట్లయితే నన్ను ఎవరు ఎదిరించ కలరు. సాక్షాత్తూ దేవేంద్రుడు అయినప్పటికీ నన్ను ఎదిరించలేడు. బ్రహ్మదేవుడు నన్ను అనుగ్రహించి దేవాసురయుద్ధమప్పుడు నాకు ఒక మహా చాపాన్ని దానితోపాటు ఒక బాణాన్నీ ఇచ్చినాడు. ఆ మహాధనస్సుతో ఇప్పుడు రామలక్ష్మణులను సంహరించి వేస్తాను, ఆ కార్యకాన్ని మంగళధ్వనులతో తీసుకొనిరండి" అని చెప్పినాడు. అట్లా చెప్పినాడే కానీ ఆ కోపపరవశుడు పుత్రుణ్ణి చంపివేసినందుకు సంతాపపడుతూ ఉన్న ఆ శూరుడు ఆలోచించి ఆలోచించి సీతాదేవిని చంపి వేయడానికి నిశ్చయించుకొన్నాడు.

అంతట ఆ భయంకరతామ్రాక్షుడు రావణుడు ఇంద్రజిత్తు కోసము దుఃఖపడుతూ ఏడుస్తూ ఎట్ట ఎదుట ఉన్న తన రాక్షససచివులు అందరివంక చూస్తూ "ఓ సచివులారా, నా పిల్లవాడు వానరులను వంచన చేయడానికి మాయాశక్తితో ఒక స్త్రీని చేసి అదే సీతాదేవి అని చెప్పి చంపి వేసినాడు. నేను ఇప్పుడు అది యథార్థము చేసి వేస్తాను. అది వాడికి ఇష్టము. ఆ క్షత్రియాధముడిమీద ఇంకా అనురాగముతో ఉన్న ఆ సీతను ఇప్పుడే నాశనము చేసి వేస్తాను," అని చెప్పి ఖడ్గము తీసుకొన్నాడు. పుత్రశోకముతో మనస్సు అంతా వ్యాకులపడిపోయిన ఆ రావణాసురుడు అప్పుడు సచివులనూ తన భార్యలనూ వెంటపెట్టుకొని మైథిలి ఉన్నచోటికి బయలుదేరినాడు. అలంకారముగా పూలదండలు కట్టిన ఆ ఖడ్గాన్ని ఒరవలోనుంచి దూసినాడు. నిర్మలాకాశమువలె తేజరిల్లుతూ ఉన్న ఆ ఖడ్గాన్ని ఎత్తి పట్టుకొని పోతూ ఉన్న ఆ క్రుద్ధుణ్ణి రావణాసురుణ్ణి లంకా పట్టణములో ఉన్న రాక్షసులు అందరూ చూచి అతడు జయిస్తాడు అనే సంతోషాతిశయముతో సింహనాదాలు చేస్తూ ఒకరిని ఒకరు కౌగలించుకొని "ఇప్పుడు

ఈ మన రాజును ఈ భయంకరాకారుణ్ణి చూచి రామలక్ష్మణులు భయపడి పోతారు. ఈయనకి ఇదివరకు కోపము వచ్చి లోకపాలకులు అయిన ఇంద్రయమ వరుణకుబేరులను నలుగురిని జయించినాడు. వారినే కాదు. ఇంకా ఎంతోమంది శత్రువులను పోరాటములో పడకొట్టినాడు. ముల్లోకాలలో ఉన్న ఉత్తమోత్తమ వస్తువులను అన్నిటినీ తెచ్చుకొని అనుభవిస్తూ ఉన్నాడు. పరాక్రమానికీ బలానికీ మన రాజుతో సరిసమానము అయినవాడు మరి ఒకడు ఈ భూలోకములో లేడు" అని చెప్పుకొన్నారు.

రావణాసురుడు అశోకవనములోకి పోయినాడు. ఒళ్ళు ఎరగని కోపముతో సీతాదేవిమీదికి పరుగెత్తినాడు. తన మేలుకోరకే స్నేహితులు "వద్దు" అని ఎంత అర్థించినా ఆగకుండా ఆకాశములో అంగారకుడు కోపముతో రోహిణీదేవిమీదికి పోయేట్లు రావణాసురుడు సీతాదేవిమీదికి పోయినాడు. అట్లా ఖడ్గము పట్టుకొని పరుగెత్తుకొని వస్తూఉన్న ఆ క్రుద్ధుణ్ణి రావణాసురుణ్ణి రాక్షసాంగనల కాపలాలోఉన్న ఆ మహాపతివ్రత మైథిలి చూచింది. వెంటఉన్న స్నేహితులు ఎంత నివారిస్తూ ఉన్నప్పటికిన్నీ ఖడ్గము ఎత్తిపట్టుకొని ఆ కుపితుడు తనమీదికి రావడముచూచి ఆ జనకాత్మజ దిగులుపడిపోయింది దుఃఖపరవశ అయిపోయింది. ఏడుస్తూ మనస్సులో "ఈ రావణాసురుడు పరమక్రుద్ధుడు అయి పరుగెత్తుకొని వస్తూఉన్నాడు. నా నాథుడు జీవించి ఉండగానే ఈ దుర్మతి నన్ను అనాథనువలె చంపివేస్తాడు కాబోలు. వీడు ఇదివరకు ఎన్నోసార్లు నన్ను తనకు భార్యను కమ్మనీ, నన్ను తనతో క్రీడించమనీ యాచించినాడు. ప్రోత్సహించినాడు. నేను నా పాతివ్రత్యము మంచి గట్టిగా తిరస్కరించినాను. నేను ఒప్పుకోనందువల్ల వీడు నిరాశ చేసుకొన్నాడు. ఇప్పుడు వీడు ఒళ్ళు ఎరుగని కోపములో ఉన్నాడు. నన్ను చంపివేస్తాడు కాబోలు. నాకోసము వీడు ఈ దుష్టుడు ఆ పురుషోత్తములను రామలక్ష్మణులను చంపివేసినాడేమో! అయ్యో, నానుంచి వారు చచ్చిపోయినారేమో! ఛీ-ఛీ- నేను బ్రతికిఉండడము ఎందుకు.

"ఒకవేళ ఈ క్రూరుడు రామలక్ష్మణులతో పోరాడలేక పుత్రశోకము భరించలేక నన్ను! చంపివేయ తలచినాడేమో. వీడు ఎటువంటి పాపకృత్యాలకు అయినా వెనుతీయడు. ఇంతకూ నేను మూఢురాలను. ఆ హనుమంతుడు చెప్పినట్లు నేను చేయలేదు. అప్పుడు ఆ హనుమంతుడి వీపుమీద కూర్చుని పోయి ఉన్నట్లయితే ఎప్పుడో నా పెనిమిటిని కలుసుకొని సుఖముగా ఉండేదాన్ని. నాకు ఈ దుఃఖము వచ్చేది కాదు.

“ఆ రామప్రభువు యుద్ధములో హతుడు అయిపోయినాడు అని కౌసల్యా దేవి వింటుంది. ఆ ఏకపుత్ర గుండె పగిలి చచ్చిపోతుంది. తప్పదు. ఆ పూజ్యుని ప్రతిభ, బాల్యమూ, యౌవనమూ, ధర్మబుద్ధి, తలచుకొని తలచుకొని ఏడుస్తుంది. ఆ మహాత్మునికి శ్రాద్ధము పెట్టుతుంది. ఈ ప్రపంచమువిడిచి అరణ్యాన్ని వనులు కొంటుంది. దుఃఖముతో మూర్ఛపోతుంది. తెప్పరిల్లిన తరువాత అగ్నిహోత్రములోనో జలప్రవాహములోనో పడి ప్రాణాలు వదులుతుంది. అంతే. కాని మందరనుంచి ఆ కౌసల్యాదేవికి ఈ ఆపదా, ఇంత దుఃఖమూ వచ్చిపడ్డవి. ఆ పాపిష్ఠిరాలు ఆ దుష్టురాలు మందర తగులపడి పోవలెను” అనుకొంటూ ఏడ్చింది.

ఈ విధముగా ఏడుస్తూ చంద్రుడు లేనప్పుడు అంగారకగ్రహావేశము అయిపోయిన రోహిణివలె దీనురాలు అయిపోయిన ఆ మైథిలినిచూచి బుద్ధిమంతుడూ పవిత్రుడూ మేధావీ, రావణాసురుడి అమాత్యుడూ అయిన సుపార్శ్వుడనే సచివుడు, తక్కిన సచివులు ఎంతచెప్పినా వినకుండా సీతాదేవిమీదికి పోతూ ఉన్న రావణాసురుణ్ణిచూచి “ఓ దశగ్రీవుడా, నీవు మహా గొప్పవంశములో పుట్టినావు. కుబేరుడికి సాక్షాత్తూ తమ్ముడవు. ఇప్పుడు ధర్మాన్ని ఎందుకు వదిలిపెట్టుతావు. కోపమునుంచి ఎందుకు ఈ వైదేహిని చంపుతావు. సమస్త రాక్షసులకూ నీవు రాజువు. వీరుడవు. వేదవిద్యావ్రతస్నాతుడవు. స్వకర్మ నిరతుడవు. నీవు ఎందుకు స్త్రీవధము తలపెట్టినావు.

“ఓ రాజా, ఈ రూపయౌవన సంపన్న మైథిలి నీ వశము అయ్యే పద్ధతి చూడు. మాతో కూడా నీ ఈ కోపాన్ని ఆ రాముడి మీద చూపించు. ఈ నాడు కృష్ణపక్ష చతుర్దశి. నీవు యుద్ధసన్నద్ధుడవు అయి రాక్షసులను వెంట పెట్టుకొని బయలుదేరు. రేపు అమావాస్య. యుద్ధములో జయించు. నీవు శూరుడవు బుద్ధిమంతుడవు. మహారథుడవు. మంచి రథము మీద పో. ఆ రాముణ్ణి ఈ ఖడ్గముతో చంపు. తిరిగి వచ్చి ఈ సీతను చేపట్టు” అని చెప్పినాడు.

ఇట్లా ధర్మసహితముగా స్నేహితుడు చెప్పిన మాటను ఆ దురాత్ముడు ఆ పరమ పరాక్రమవంతుడు రావణాసురుడు విన్నాడు. వెనకకు మళ్ళినాడు. అంతట స్నేహితులను వెంట పెట్టుకొని సభామంటపానికి పోయినాడు.

## ౯౨

రావణాసురుడి గర్వము ఉడిగిపోయింది. పరమదుఃఖముతో సభామంటపములో సింహాసనము మీద కూర్చున్నాడు. కుపితుడు అయి సింహము వలె

నిట్టూర్పులు విడుస్తూ ప్రతిశోకముతో కుంగి పోయి, ఆ మహాబలవంతుడు రావణాసురుడు చేతులు జోడించి తన సేనాధ్యక్షులను అందరినీ చూచి "మీరు అందరూ ఇప్పుడు మిగిలి ఉన్న గజసాదులతోనూ అశ్వికులతోనూ రథికుల తోనూ పదాతులతోనూ యుద్ధము చేయడానికి బయలుదేరి పోండి. ఒక్క రాముడి మీదికే మీరు పోండి. వాడి చుట్టూ మూగండి. వర్షకాలమేఘాల వలె వాడి మీద మీరు బాణవర్షము కురిపించండి. వివిధాయుధాలూ ప్రయోగించండి. వాణ్ణి చంపి వేసే ప్రయత్నము చేయండి. ఒకవేళ మీరు చంపి వేయక పోయినా ఇబ్బంది లేదు. మీ తీక్ష్ణబాణాలకు వాడి దేహము అంతా తూట్లు పడి పోతుంది. వాడు బలహీనుడు అయి పోతాడు. వాణ్ణి నేను రేపు చంపి వేస్తాను. సమస్తలోకాల వాళ్ళూ చూస్తారు" అని చెప్పినాడు.

రావణాసురుడి ఆజ్ఞను శిరసావహించి అప్పటికి అప్పుడు ఆ రాక్షస వీరులు వివిధ సైన్యాలతోనూ బయలుదేరినారు. ప్రాణాలు తీసి వేసే ఇనుప గుదియలతోనూ అష్టకత్తులతోనూ ఖడ్గాలతోనూ గండ్రగొడ్డళ్ళతోనూ బాణాల తోనూ రాక్షసయోధులు పోయి వానరసైన్యము మీద పడ్డారు. వానర వీరులు అప్పుడు వృక్షాలూ శిలలూ రాక్షసయోధుల మీద విసరి వేసినారు. సూర్యోదయ సమయాన ఆ మహాయుద్ధము రాక్షసులకూ వానరులకూ జరిగింది. ఆ యుద్ధము మహాభయంకరముగానూ దొమ్మిగానూ సాగింది. చిత్ర విచిత్రము అయిన గదలతోనూ ఈటెలతోనూ గండ్రగొడ్డళ్ళతోనూ రాక్షసులు పోరాటము సాగించినారు. ఆ పోరాటములో పైకి రేగిన దుమ్ము అంతా వీరులు అయి పారిన నెత్తురునుంచి అణిగిపోయింది. ఏనుగలూ రథాలూ గట్లుగానూ తెగిపోయిన గుర్రాలు పెద్దపెద్ద చేపలుగానూ రథధ్వజాలు చెట్లుగానూ శవాలు తెప్పకొయ్యలుగానూ రక్తము ప్రవాహాలుగానూ ప్రవహించింది. ఆ రక్తప్రవాహాలలో వానరులు తడిసి పోతూ పదే పదే పైకి ఎగిరి రాక్షసుల రథాలనూ విరుగ కొట్టినారు. గుర్రాలను పడ కొట్టినారు. వివిధాయుధాలనూ విరిచి వేసినారు. రాక్షసుల తల వెంట్రుకలను పట్టుకొని కిందికి పడలాగినారు. రాక్షసుల ముక్కులనూ చెవులనూ ముఖాలనూ తమ కరకు గోళ్లతో గీరినారు. కోరలతో కొరికి వేసినారు. పండ్లు పండిన చెట్టుమీదికి వందలకొద్దీ పక్షులు ఎగిరి పోయేటట్టు ఒక్కొక్క రాక్షసుడి మీదికి వందల కొద్దీ వానరులు ఎగిరి పోయినారు. చుట్టూ మూగి కొట్టినారు. అప్పుడు రాక్షసులు విజృంభించి భయంకరాకారులు అయిన ఆ వానరులను పెద్ద పెద్ద గదలతోనూ ఈటెల తోనూ ఖడ్గాలతోనూ గండ్రగొడ్డళ్ళతోనూ కొట్టి చంపి వేయ సాగినారు. ఆ పర్వతాకారుల రాక్షసులను అప్పుడు వానరులు తట్టుకొన లేక పోయినారు.

ఆయా ఆయుధాలతో కొట్టి చంపి వేస్తూ ఉంటే వానరమహాసైన్యము అప్పుడు రాముని శరణు చొచ్చింది.

అంతట ఆ సర్వలోకశరణ్యుడు ఆ మహాతేజోవంతుడు ఆ అమిత పరాక్రమవంతుడు ధనస్సు తీసుకొని ఇట్టే రాక్షససైన్యములో చొరపడి బాణవర్షము కురిపించటము మొదలు పెట్టినాడు. ఆ మహాభయంకరుడు రాముడు ఆ రాక్షససైన్యములోకి వాయ్యే వేగముతో బాణాగ్ని కురిపిస్తూ సమస్తమూ దహించి వేస్తూ ఉంటే గ్రీష్మఋతువులో మార్యుడి దగ్గరికి మేఘాలు పోలేనట్లు రాక్షసులు ఆ రాముణ్ని సమీపించ లేకపోయినారు. ఎవరూ చేయలేని మహాభయంకరము అయిన పనులు జరగడము చూచినారు. కాని రాక్షసులు రాముణ్ణి చూడలేదు. పెద్దగాలి వీచినప్పుడు వనములో చెట్లు పడిపోవడము కనబడుతుంది. కాని గాలి మాత్రము కంటికి కనపడదు. అదే విధముగా ఆ పోరాటములో రాక్షసుల మహాసైన్యాలు చెల్లాచెదరు అయిపోవటమూ మహారథాలు విరిగి పడిపోవటమూ కనిపించిందే కాని రాముడు మాత్రము రాక్షసులకు కనిపించలేదు. ఆ రామబాణాలకు ఒక వైపున సైన్యము ఛిన్నాభిన్నము అయిపోవడమూ ఇంకొక వైపున సైన్యము తగులపడిపోవడమూ మరిఒక వైపున మహారథాలు కూలిపోవడమూ అందరూ బాణాలు గుచ్చుకొని బాధపడడమూ అగుపించింది. కాని అంత వేగముతో అన్ని బాణాలు వదులుతూ ఉన్న రాముడు మాత్రము ఎవరికీ అగుపించలేదు. శబ్దస్పర్శరూపరసగంధాదులను తన దేహేంద్రియాలు అనుభవిస్తూ ఉన్నప్పటికిన్నీ ఆ శబ్దాదులు అనుభవించటానికి కారణభూతము అయిన పరమాత్మ ఆ దేహి కంటికి కనబడనట్లు దెబ్బలు తింటూ బాధపడుతూ ఉన్న రాక్షసులకు ఆ దెబ్బలకూ ఆ బాధలకూ కారణభూతుడు అయిన రాముడు మాత్రము కనిపించలేదు.

"ఇదుగో వీడు ఏనుగులను పడకొట్టుతున్నాడు. ఇదుగో, వీడు మహారథాలను పగలకొట్టుతున్నాడు. ఇదుగో, వీడు తీక్ష్ణబాణాలతో పదాతులనూ అశ్వికులనూ పడకొట్టుతున్నాడు" అని రాక్షసులు అందరూ కేకలు వేస్తూ తమ కంటికి అగుపించిన రాక్షసుణ్ణి ప్రతివాణ్ణీ రాముడు అనుకొని రాక్షసులు అందరూ కుపితులు అయిపోయి రాక్షసులలో రాక్షసులు కొట్టుకొన్నారు. అట్లా గాంధర్వాస్త్రప్రభావముతో వ్యామోహపెట్టి ఆ శత్రుసైన్యాన్ని దహించివేస్తూ ఉంటే రాముణ్ణి వాళ్లు చూడలేకపోయినారు. ఆ పోరాటంలో అప్పుడు రాక్షసులకు అనేక వేలమంది రాములు ఉన్నట్లుగా తోచింది. ఉత్తరక్షణములో రాముడు ఒక్కడే అన్నట్టుగా తోచింది. అలాతచక్రమువలె మండే

లాకారముగా తిప్పుతూ ఉన్న రాముడి బంగారు వింటికొనను చూచినారే కాని రాముణ్ణి మాత్రము ఆ రాక్షసులు చూడలేదు. తన శరీరమే నాభిగానూ బలమే జ్వాలలు గానూ బాణాలే ఆకులుగానూ కార్ముకమే అంచుగానూ జ్యాతలధ్వని జ్వాలల మహాఘోషముగానూ పరాక్రమమే అక్షప్రదేశముగానూ శరీరకాంతే వెలుతురుగానూ దివ్యాస్త్రాలే ధారగానూ యుద్ధములో చంపివేస్తూ ఉన్న ఆ రామచక్రము రాక్షసులకు అప్పుడు కాలచక్రమువలె కనిపించింది. వాయువేగముతో పోయే రథాలను ఏడు కోట్ల ఇరవైతొమ్మిది లక్షలనూ బలవంతమయిన మదపుటేనుగలను పదమూడు కోట్ల పన్నెండు లక్షల ఇరవై వేలనూ అశ్వికులను అశ్వాలతో కూడా పది కోట్ల ఇరవై లక్షల అరవై వేలనూ పదాతులను నూటనలభై అయిదుకోట్ల ఎనభైలక్షలనూ అగ్ని శిఖలవంటి బాణాలు వదలి రాముడు మూడు ముప్పావు గడియలలో సంహారము చేసివేసినాడు. ఆ చతురంగ బలాలలో ఉన్న రాక్షసులు అందరూ కామరూపులు. ఏనుగలూ గుర్రాలూ చచ్చిపోయి, ధ్వజాలు రథాలూ విరిగిపోయి చావగా మిగిలిన రాక్షసులు యుద్ధోత్సాహము ఉడిగిపోయి లంకా పట్టణానికి పరుగెత్తినారు.

చచ్చి పడిపోయిన ఏనుగలతోనూ, గుర్రాలు మొదలైన వాటితోనూ అప్పుడు ఆ యుద్ధభూమి క్రుద్ధుడు అయిన రుద్రదేవుడి క్రీడాభూమివలె కనిపించినది. ఆ ధర్మాత్ముడు రాముడు అప్పుడు తన ప్రక్కన ఉన్న సుగ్రీవుణ్ణీ, విభీషణుణ్ణీ, హనుమంతుణ్ణీ, జాంబవంతుణ్ణీ, మైందద్వివిదులనూ తక్కిన వానరవీరులనూ చూచి "మిత్రులారా, ఈ దివ్యాస్త్రబలము ఆ త్రిలోచనుడికీ నాకూ తప్ప మరి ఎవరికీ లేదు" అన్నాడు.

దేవేంద్రుడితో సరిసమానము అయిన ఆ మహాపరాక్రమవంతుణ్ణి రాక్షస సైన్యాలను సంహారము చేసివేయడానికి అన్ని అస్త్రశస్త్రాలు ప్రయోగించి అలసిపోని ఆ మహాబలవంతుణ్ణి రాముణ్ణి అప్పుడు దేవతలు అందరూ ప్రశంసించినారు.

## ౯౪

రావణాసురుడు పంపించిన ఆ చతురంగబలాలూ వేలకువేలు గుర్రపు రౌతులూ గుర్రాలూ వేలకువేలు అగ్నిహోత్ర కాంతులతో ధగధగలాడే మహారథాలూ రథికులూ, తళతళలాడే గదలూ ఇనుప గుదియలూ తీసుకొని పోరాడే శూరులూ కామరూపులూ అయిన యోధులు అందరూ రాముడు వదిలిన తప్త కాంచన బాణాలకు గురిఅయిపోయినారు. అని లంకాపట్టణములో అందరికీ

తెలిసింది. చావగా మిగిలినవారు రావణుని రాక్షసాంగనలు చూచినారు. వారు చెప్పింది విన్నారు. అప్పుడు రాక్షసాంగనలు అందరూ ఏకమై ఏడ్చినారు. మొగుళ్ళు పోయినవాళ్ళూ పుత్రులు పోయినవాళ్ళూ, తోబుట్టువులు మొదలైన ఆప్తబంధువులు పోయినవాళ్ళూ చేరి దుఃఖార్తలు అయి పెద్దపెట్టున ఏడ్చినారు.

"ఈ శూర్పణఖ ముసలిది. వేళ్ళాడే పొట్టతో ఈ ముసలిది అడవిలోకి ఎట్లా పోయింది. మూర్తీభవించిన మన్మథుడివంటి ఆ సుకుమారుణ్ణి ఆ మహాబలవంతుణ్ణి ఆ సర్వభూతహితుణ్ణి రాముణ్ణి ఎట్లా చూచింది. సమస్త లోకాలవారూ అసహ్యించుకునే ఈ కురూపి ఆ రాముణ్ణి కామించిందా. ఎంత చిత్రముగా ఉంది. ఏ ఒక్క సుగుణమూ లేని ఈ దుర్ముఖి ఈ రాక్షసి ఆ సమస్త సద్గుణవంతుణ్ణి ఆ మహాతేజోవంతుణ్ణి ఆ సుముఖుణ్ణి రాముణ్ణి ఎట్లా వలచింది. ఒళ్ళంతా ముడతలు పడిపోయిన ఈ ముసలిది తలవెంట్రుకలు అన్నీ తెల్లగా నెరసిపోయిన ఈ ముసలిది శూర్పణఖ అందరూ ఎగతాళి చేసే పని చేసింది. చేయరానిపని చేసింది. సమస్తలోకాలవారూ నిందించేపని చేసింది. ఇది అంతా మన దౌర్భాగ్యవశమువల్ల జరిగింది. ఈ అయోగ్యురాలు ఖరదూషణాదులనూ సమస్తరాక్షసులనూ నాశనముచేసివేయడానికి ఆ మహానుభావుణ్ణి రాముణ్ణి తిరస్కరించింది. ఈ ముసలిదానినుంచి రావణాసురుడు రాముడితో మహావైరము పెట్టుకొన్నాడు. తన చావుకోసము సీతను తెచ్చుకొన్నాడు. రాముడితో బద్ధవైరము వచ్చింది. ఇంతచేసినా ఆ జనకాత్మజ సీతాదేవి రావణాసురుడికి స్వాధీనము కానేలేదు.

ఈ సీతను కాంక్షించిన విరాధుణ్ణి రాముడు ఒక్కడే హతమార్చినాడు. రాక్షసులు అందరూ రాముడిచేతుల్లో నాశనముఅయిపోతారు అనడానికి ఆ ఒక్క నిదర్శనము చాలు. జనస్థానములో భయంకరకర్ములు అయిన రాక్షసులను పధ్నాలుగువేలమందిని అగ్నిశిఖలవంటి బాణాలతో రాముడు సంహారము చేసివేసినాడు. సూర్యసమానము అయిన బాణాలు వదిలి ఖరుణ్ణీ, దూషణుణ్ణీ, త్రిశిరుణ్ణీ, ఒక్క రాముడు చంపివేసినాడు. ఆ నిదర్శనము చాలు. కోపముతో పెద్దపెట్టున కేకలు వేస్తూ యోజనము దూరమువరకూ బాహువులు చాచి సమస్తజంతువులనూ పట్టుకొని వాటి నెత్తురు త్రాగి మాంసముతినే కబంధుణ్ణి రాముడు రూపుమాపినాడు. ఆ నిదర్శనము చాలు. మేరువు పర్వతముతో సరిసమానము అయినవాడూ మహాబలవంతుడూ దేవేంద్రుడి కొడుకూ అయిన వాలిని ఒక్క బాణముతో రాముడు కొట్టివేసినాడు. ఆ నిదర్శనము చాలు. గర్వము ఉడిగి, భగ్నమనోరథుడు అయిపోయి ఋశ్యమూకపర్వతముమీద నివాసము పెట్టుకొన్న సుగ్రీవుడికి కిష్కింధారాజ్యము ఒప్పగించినాడు. ఆ నిదర్శనము చాలు.

సర్వస్వహితము అయిన మాట విభీషణుడు చెప్పినాడు. అట్లా చేసి ఉన్నట్లయితే రాక్షసులకు అందరికీ మేలు అయ్యేది. ఎంతో బాగుండేది. ఒళ్లు తెలియక రావణాసురుడు అట్లా చేయలేదు. ఆ మాటే రుచించలేదు. కుబేరుడు అంతవాడికి తమ్ముడుగా పుట్టినాడు. ఏమి ప్రయోజనము? పైగా తమ్ముడు విభీషణుడు చెప్పినాడు. వినలేదు. ఆ విభీషణుడు చెప్పినట్లు చేసిఉన్నట్లయితే ఈ లంకాపట్టణము ఇప్పుడు ఇట్లా వల్లకాడు అయిపోయి ఉండేదికాదు. ఇంతమంది ఆడవాళ్లు దుఃఖార్తలు అయిపోయేవాళ్లు కారు. మహాబలవంతుడు అయిన కుంభకర్ణుణ్ణి ఆ రాముడు చంపివేసినాడు. ఎదిరించను అలవి కాని అతికాయుణ్ణి అందులో తన ప్రియపుత్రుణ్ణి ఇంద్రజిత్తును ఆ లక్ష్మణుడు చంపి వేసినాడు. ఇంకా ఈ రావణాసురుడికి తెలియకుండా ఉంది.

"అయ్యో, నా కొడుకు చచ్చిపోయినాడు. అయ్యో, నా తోబుట్టువు చచ్చిపోయినాడు. అయ్యో, నా పెనిమిటి చచ్చిపోయినాడు" అని చెప్పుకొంటూ ఇంటింటా రాక్షసాంగనలు ఏడ్చినారు.

ఆ మహాశూరుడు రాముడు యుద్ధములో అన్ని ఏనుగులనూ అన్ని గుర్రాలనూ అన్ని రథాలనూ నాశనము చేసి వేసినాడు. లక్షలకొద్దీ పదాతులను సంహారము చేసివేసినాడు. వాడు రుద్రుడో విష్ణుమూర్తో దేవేంద్రుడో అయి ఉంటాడు. కాని సామాన్యమానవుడు కాదు. కాక ఆ యముడే ఈ రామరూపముతో వచ్చి రాక్షసులను అందరినీ సంహారము చేసి వేస్తున్నాడేమో? మహావీరులు అయిన మా వాళ్లు అందరూ నాశనము అయిపోయినారు మేము జీవించవలెను అనే ఆశ మాకు లేదు. ఈ భయానికి అంతము కనపడడము లేదు. అనాథలము అయిపోయినాము" అంటూ ఏడ్చినారు.

దశగ్రీవుడికి యుద్ధము అంటే భయము లేదు. ఎన్నడో మహావరము సంపాదించినాడు. రాముడివల్ల ఇంత మహాఘోరము జరిగింది అని కాని మనము ఇంత భయపడుతున్నాము అని కానీ తెలుసుకో లేకుండా ఉన్నాడు. యుద్ధములో రాముడు ఎదుర్కొన్న వారిని దేవతలు రక్షించ లేరు. గంధర్వులు రక్షించలేరు. పిశాచాలు రక్షించలేవు. రాక్షసుల సంగతి తెలియనే తెలిసింది. పోరాటానికి బయలుదేరినప్పుడు అట్లా దుశ్శకునాలు కనపడుతూనే వచ్చినవి. రాముడు రావణాసురుణ్ణి సంహారించి వేస్తాడు అని ఆ దుశ్శకునాలు ఎప్పటికి అప్పుడు సూచిస్తూనే వచ్చినవి.

పూర్వము బ్రహ్మదేవుడు రావణాసురుడి తపస్సుకు మెచ్చుకొన్నాడు. దేవదానవ రాక్షసులవల్ల చావురాకుండా ఉండే వరము ఇచ్చినాడు. అయితే అప్పుడు రావణాసురుడు మనుష్యులను గురించి అడగనూలేదు. బ్రహ్మదేవుడు రావణాసురుడికి మానవులవల్ల చావులేకుండా ఉండే వరము ఇవ్వనూ లేదు. రావణాసురుడు అప్పుడు అడగనందువల్ల ఇప్పుడు రావణాసురుడికీ రాక్షసులకూ మానవుడివల్ల ప్రాణాంతకము అయిన భయమువచ్చి పడ్డది. ఇప్పుడు ఈ ఘోరము జరుగుతున్నది.

అప్పుడు బ్రహ్మదేవుడు ఇచ్చిన వరమునుంచి రావణాసురుడు మరింత బలవంతుడు అయి పెట్టిన బాధలు దేవతలు భరించలేక పోయినారు. అత్యుగ్రము అయిన తపస్సు చేసినారు. అందుకు ఆ మహాత్ముడు బ్రహ్మదేవుడు సంతోషించి అదిమొదలు ముల్లోకాలలోనూ దానవులూ రాక్షసులూ దేవతలను బాధ పెట్టరు అనీ భయముతో సంచరిస్తారు అనీ చెప్పినాడు. ఆమాత్రముతో దేవతలు తృప్తిచెందక దేవేంద్రుడి వెంట బయలుదేరి త్రిపురాసురులను సంహారము చేసిన శివుడి దగ్గరికి పోయినారు. ఆ వృషభధ్వజుణ్ణి ప్రార్థించినారు. అందుకు ఆ మహాదేవుడు ప్రసన్నుడు అయి దేవతలను చూచి "ఓ దేవతలారా, రాక్షసులు అందరూ నాశనము అయి పోవడానికి ఒక స్త్రీ జన్మిస్తుంది. ఆమె నుంచి మీరు అందరూ స్వస్థముగా ఉంటారు" అని చెప్పినాడు. ఆ దేవతల కోసము సమస్త రాక్షసులనూ నాశనము చేసి వేయడానికి ఈ సీత వచ్చింది. మునుపు ఆకలినుంచి దానవులు అందరూ చచ్చిపోయినారు. ఇప్పుడు ఈ సీతనుంచి రావణాసురుడితో కూడా మనము అందరమూ చచ్చిపోతాము. ఆ దుర్వినీతుడు ఆ దుర్మతి రావణాసురుడు చేసిన దుష్కార్యానికి మనము అందరమూ ఘోర దుఃఖము అనుభవించవలసి వచ్చింది. నాశనము అయిపోవలసి వచ్చింది. ప్రళయ కాలములో యముడి చేతిలో పడేట్టు ఇప్పుడు మనము అందరమూ రాముడి చేతిలో పడ్డాము. మనలను కాపాడేవాడు ఎవడూ ఇప్పుడు ఈ లోకములో కన పడడము లేదు. మనము కార్చిచ్చు మంటలు కమ్ముకొన్న కారడవిలో ఆడ ఏనుగలవలె అయి పోయినాము. ఈ ఆపత్కాలములో మనలను రక్షించేవాడు ఎవడూ లేడు. ఆ మహాబుద్ధిమంతుడు విభీషణుడు సమయానుకూలముగా ప్రవర్తించినాడు. ఎవడివల్ల భయమో ఆ రాముడికే శరణాగతుడు అయినాడు" అంటూ ఆ రాక్షసాంగనలు అందరూ భయార్తలు అయి, బాహువులు చాచి, పరస్పరమూ కౌగలించుకొని భయంకరముగా ఏడ్చినారు.

## ౯౭

లంకాపట్టణములో ఇంటింటా రాక్షసాంగనలు పెద్దపెట్టున ఏడ్వడము రావణాసురుడికి వినిపించింది. ఆ భయంకరాకారుడు పెద్ద పెద్ద నిట్టూర్పులు విడుస్తూ ఒక ముహూర్తముసేపు ఆలోచించినాడు. మహోగ్రుడు అయిపోయినాడు. పండ్లతో తన పెదవి కొరుక్కొన్నాడు. కోపావేశపరవశుడు అయి కన్నులు ఎర్రచేసినాడు. ఒళ్లుఎరుగని కోపముతో ప్రళయకాలాగ్నివలె తేజరిల్లినాడు. అప్పుడు ఆ రావణాసురుణ్ణి అతని అనుచరులే తేరిపార చూడలేకపోయినారు. అతడు అప్పుడు తన సమీపములో ఉన్న రాక్షసులను కన్నులతో కాల్చివేసేటట్టుచూస్తూ మాటలు తడబడుతూ మహోదరుణ్ణీ మహాపార్శ్వుణ్ణీ విరూపాక్షుణ్ణీ ఉద్దేశించి "నేను ఆజ్ఞాపిస్తున్నాను. సైన్యాలు వెంటనే బయలుదేరి పోవలెను అని రాక్షసవీరులతో చెప్పండి" అన్నాడు. ఆ మాటలకు వారు భయపడ్డారు. రాజాజ్ఞను శిరసావహించి రాజకార్యాలలో ఏమరుపాటు ఎరగని రాక్షసులను యుద్ధానికి ప్రేరేపించినారు. అప్పుడు ఆ ఘోరాకారులు అందరూ "అట్లాగేను" అన్నారు. రావణాసురుడి ఆశీర్వాదముతో యుద్ధాభిముఖులు అయినారు. అంతట ఆ నిశాచరులు అందరూ యథాన్యాయముగా తమ ఏలికను గౌరవించినారు. అతడు జయించవలెను అని ఆశీర్వదించినారు. అక్కడ నిలుచున్నారు.

ఒళ్లు ఎరగని కోపములో ఉన్న ఆ రావణాసురుడు అప్పుడు మహోదరుణ్ణీ మహాపార్శ్వుణ్ణీ విరూపాక్షుణ్ణీ చూచి నవ్వుతూ "ఓ వీరులారా, ఈ వేళ నేను నా ధనస్సులోనుంచి ప్రళయకాలాదిత్యుడువంటి బాణాలు వదులుతాను. రామలక్ష్మణులను యమసదనానికి పంపించివేస్తాను. ఖరుణ్ణీ కుంభకర్ణుణ్ణీ ప్రహస్తుణ్ణీ ఇంద్రజిత్తునూ సంహారము చేసివేసిన ఆ శత్రువును చంపివేయడమే ప్రతీకారము. నేను వదిలే బాణాలు మేఘాలవలె కమ్ముకొని అంతరిక్షమూ దిక్కులూ నదులూ సముద్రమూ కనపడకుండా పోతవి. వానర యూథాలనూ యూథపతులనూ ప్రత్యేకము ప్రత్యేకముగా సంహారము చేసివేస్తాను. వాయువు వలె సంచరించే రథము మీద ధనస్సు అనే సముద్రములోనుంచి బాణాలు అనే అలలు పైకి లేచి వానర సైన్యాన్ని ముంచివేస్తవి. కొంచెము వికసించిన పద్మము వంటి ముఖాలతోనూ పద్మకింజల్కాల వంటి దేహచ్ఛాయతోనూ కనుపించే వానరయూథ తటాకాలను నేను ఏనుగవలె ధ్వంసము చేసివేస్తాను. నేటి యుద్ధములో నా బాణాలు ముఖాలలో గుచ్చుకొని వానరయూథపతులు పడిపోయి తూండ్లతో కూడా

పద్మాలవలె ఈ భూమిమీద అలంకారముగా అగుపిస్తారు. నేను వదిలే ఒక్కొక్క బాణానికి వృక్షాలను తీసుకొని ప్రచండముగా పోరాడే వానర యోధులు ఒక్కొక్క వందమంది చొప్పున నేలకూలుతారు. భర్త పోయి నాడనీ భ్రాత పోయినాడనీ పుత్రుడు పోయినాడనీ ఏడుస్తూ ఉన్న రాక్షసాంగనల కన్నీళ్లు నేడు నేను శత్రువులను వధించివేయడముతో తుడుచుకొని పోతవి. నా బాణాలతో నేడు వానరులను అందరినీ ఛేదించి ప్రాణాలు పోగొట్టి పడపెట్టి నేల కనపడకుండా చేసివేస్తాను. నేడు నా బాణాలకు చచ్చి పడి పోయే శత్రువుల మాంసము నక్కలూ గద్దలూ తనివితీర తింటవి. తృప్తి చెందుతవి.

"ఓ వీరులారా, వెంటనే నా రథము అలంకరించండి. ధనస్సు తీసుకొని రండి. ఇంకా మిగిలిఉన్న రాక్షసులు అందరూ నా వెంట బయలుదేరండి" అని చెప్పినాడు. అంతట మహాపార్శ్వుడు అక్కడ ఉన్న సేనాధ్యక్షులను చూచి "సేనలను వెంటనే తీసుకొని రావలసింది" అని ఆజ్ఞాపించినాడు. ఆ మహా బలవంతులు సేనాధ్యక్షులు అంతట ఇంటింటికీ పోయి ఆ యా రాక్షసులను అందరినీ యుద్ధానికి పురికొల్పుతూ లంకాపట్టణము అంతా తిరిగినారు.

అప్పుడు ఒక ముహూర్తము సేపటిలో ఖడ్గాలూ పట్టిసాలూ శూలాలూ గదలూ ముసలాయుధాలూ హలాయుధాలూ కరుకు అంచుల శక్త్యాయుధాలూ గొప్ప గొప్ప కూటముద్గరాలూ నిర్మలము అయిన చక్రాయుధాలూ వాడి వాడి గండ్రగొడ్డళ్లూ భిండివాలాలూ శతఘ్నులూ ఇంకా వివిధ ఆయుధాలూ చేతులలో పట్టుకొని భయంకరముగా గర్జిస్తూ భయంకరము అయిన ముఖాలతో భయంకరాకారులు అయిన రాక్షసయోధులు యుద్ధసన్నద్ధులు అయి వచ్చినారు. అప్పుడు సేనాధ్యక్షుడు అక్కడికి ఎనిమిది గుర్రాలు కట్టిన రథాన్ని సారథిచేత తోలించుకొని వచ్చినాడు. దేదీప్యమానముగా తేజరిల్లుతూ ఉన్న ఆ రథముమీద అప్పుడు ఆ భయంకరాకారుడు రావణాసురుడు ఎక్కినాడు. ఆరథము వెంట రాక్షసయోధులు బయలుదేరినారు. తన బలాతిశయముతో రావణాసురుడు ఈ భూమిని చీల్చి వేస్తున్నట్టుగా వడి వడిగా రథముమీద సాగి పోయినాడు. ఆ రావణాసురుడి ఆజ్ఞను శిరసా వహించి ఎదిరించను అలవికాని మహాపార్శ్వుడూ మహోదరుడూ విరూపాక్షుడూ అతని వెంట రథాలమీద బయలుదేరినారు. వారు అందరూ సంతోషాతిశయముతో ఈ భూమిని బ్రద్దలు చేయటానికి పోయేటట్లు పెడబొబ్బలు పెట్టుతూ జయము కాంక్షిస్తూ ముందుకు సాగిపోయినారు.

రాక్షసయోధగణాలను వెంట పెట్టుకొని ధనస్సు పైకి ఎత్తి పట్టుకొని ప్రళయకాల మప్పుడు సమస్తప్రాణికోటినీ నాశనము చేసివేసే యముడివలె తేజరిల్లుతూ ఉన్న ఆ మహారథుడు (తననూ తన సారథినీ రథాన్నీ, రథ ధ్వజాన్ని కాపాడుకొంటూ పదికొండువేలమంది విలుకాండ్రతో ఒంటరిగా పోరాడే) రావణాసురుడు జవనాశ్వాలు పూన్చిన తన రథాన్ని రామలక్ష్మ ణులు ఉన్న ఉత్తరద్వారము దగ్గరకు అప్పుడు తోలించినాడు.

ఆ సమయాన సూర్యుడికాంతులు మాసిపోయినవి. దిశలన్నీ చీకట్లు కమ్ముకొన్నవి. భయంకరము అయిన పక్షులు అమంగళముగా అరిచినవి. భూమి కంపించినట్లుగా తోచింది. నెత్తురు వాన కురిసింది. గుర్రాల కాళ్లు జారినవి. రథధ్వజాగ్రము మీద గద్ద వాలింది. నక్కలు భయంకరముగా అరిచినవి. అప్పుడు రావణాసురుడి ఎడమకన్నూ ఎడమ భుజమూ అదరినవి. అతని ముఖము వివర్ణము అయి పోయింది. డగ్గుత్తిక పడ్డది. అప్పుడు యుద్ధానికి పోతూ ఉన్న రావణాసురుడికి చావును సూచించే ఈ దుర్నిమిత్తాలు అన్నీ ఎట్టఎదుట తోచి నవి. అంతేకాదు. అప్పుడు అంతరిక్షమునుంచి ఒక కొరవి పిడుగు పడ్డంత ధ్వనితో కింద పడ్డది. కాకులూ గద్దలూ ఏకమై ఎదురుగుండావచ్చి అమంగళ ముగా అరిచినవి. కాలము మూగించుకొని వస్తూ ఉన్నందువల్లనూ వధార్హి అయిన రావణాసురుడు ఈ అపశకునాలను ఆలోచించను అయినా ఆలోచించకుండా యుద్ధభూమికి పోయినాడు.

రావణాసురుడి రథఘోషాన్ని వానరులు విన్నారు. మహాదాకారులు అయిన రాక్షసయోధులను చూచినారు. అంతట వానర సైన్యము యుద్ధ సన్నద్ధము అయి నిలుచున్నది. అప్పుడు ఆ వానరసైన్యాలను రాక్షససైన్యాలూ, రాక్షససైన్యాలను వానరసైన్యాలూ, అన్యోన్యమూ యుద్ధానికి ఆహ్వానించు కొన్నవి. ఉభయపక్షాలవారూ జయకాంక్షతో దొమ్మిగా యుద్ధము ఆరం భించివారు.

అప్పుడు దశగ్రీవుడు ఉగ్రుడు అయిపోయి వానరసైన్యాలమీద బంగారు పింజల బాణాలు వదిలినాడు. ఆ బాణాలకు ఆ వానరసైన్యములో కొందరి తలలు తెగి పడిపోయినవి. గుండెకాయలు బద్దలు అయి కొందరు పడిపోయి నారు. చెవులు తెగి కొందరు పడి పోయినారు. ప్రక్కలు విరిగి కొందరు పడి పోయినారు. కన్నులు పోయి కొందరు పడిపోయినారు. ఉచ్ఛ్వాసనిశ్వాసలు లేకుండా కొందరు పడిపోయినారు.

రావణాసురుడు కోపముతో కనుగ్రుడ్లు తిప్పుతూ ఆ యుద్ధభూమిలో రథముమీద ఏ ఏ వైపులకు పోతే ఆయా వైపుల వానరులు అతని బాణాల తీవ్రతను ఓర్చుకోలేక పోయినారు.

౯౭

రావణాసురుడు వదిలిన బాణాలకు ఆ విధముగా వానరుల దేహాలు కత్తిరించుకొని పోయినవి. అప్పుడు ఆ యుద్ధభూమి అంతా వానరకళేబరాలతో నిండి చల్లినట్లు కనిపించినది. మంటలు మండే అగ్నిహోత్రాన్ని మిడుతల వలె రావణాసురుడు ఒక్కడు వదిలిన బాణపాతానికి అంతమంది వానరులూ ఓర్చుకోలేక పోయినారు. చుట్టూ కమ్ముకొన్న మంటల వేడికి ఏనుగుల వలె రావణాసురుడి నిశితబాణాగ్నికి తట్టుకోలేక వానరులు కేకలు పెట్టుతూ పరుగు లెత్తినారు. మహామేఘాలను ప్రచండవాయువు వలె వానరసైన్యాలను రావణాసురుడు తన బాణాలతో పారతోలినాడు. ఆ రాక్షసరాజు రావణాసురుడు వానరసేనాసమూహాలను అట్లా రూపుమాపి అంతట అమితవేగముతో రాముడి మీదికి పరుగెత్తినాడు.

ఆ పోరాటములో వానరులు పరాజితులు అయి పరుగులెత్తి పారి పోవడము సుగ్రీవుడు చూచినాడు. అందరూ ఆశ్చర్యపడి పోయేటట్లు తాను ఆ రాక్షసయోధులతో పోరాడవలెను అనుకొన్నాడు. తనతో సరి సమానము అయిన సుషేణుడికి వానరసేనా సమూహాలను ఒప్పగించినాడు. అంతట సుగ్రీవుడు ఒక మహావృక్షాన్ని ఆయుధముగా తీసుకొని రాక్షససైన్యాన్ని ఎదిరించినాడు. వానరయూథపతులు అందరూ స్వయముగా మహాశైలాలనూ వివిధవృక్షాలనూ తీసుకొని పోయి ఆ సుగ్రీవుడికి అందివ్వడానికి అతని పక్కలనూ వెనుకనూ నిలుచున్నారు. ఆ మహాకాయుడు సుగ్రీవుడు మహా భయంకరముగా గర్జిస్తూ రాక్షససైన్యములో చొరబడి వివిధ రాక్షసయోధులనూ వధించి మేటి రాక్షసవీరుల మీదికి పోయినాడు. యుగాంతకాలాన వాయువువలె సుగ్రీవుడు పెద్ద ఎత్తున పెరిగిన చెట్లను తీసుకొని మహాకాయులు అయిన రాక్షసులను పడకొట్టినాడు. అడవిలో పక్షిసమూహాల మీద రాళ్లవాన కురిపించే మహామేఘమువలె ఆ రాక్షససైన్యాల మీద సుగ్రీవుడు శిలావర్షము కురిపించినాడు. ఆ వానరరాజు కురిపించిన రాళ్లవానకు రాక్షసులు తలలు పగిలిపోయి దేహాలు తెగిపోయి వజ్రాయుధము దెబ్బకు చిందరవందర అయిపోయిన పర్వతాలవలె నేల కూలినారు. చావగా మిగిలిన రాక్షసులు ఆ హింసను భరించలేక అరుస్తూ అన్ని వైపులా పరుగెత్తినారు.

అది విరూపాక్షుడు చూచినాడు. ఎదిరించ నలవికాని ఆ ధానుష్కుడు తన శౌర్యం చాటించుకొంటూ రథముమీది నుంచి సమీపములో ఉన్న ఏనుగ మూపురము మీదికి ఎగిరి దూకి నిలుచొని మహాభయంకరముగా సింహనాదము చేస్తూ మహాఘోరము అయిన బాణాలను సుగ్రీవుడిమీద వదిలి బెదరిపోతూ ఉన్న రాక్షసులకు ధైర్యము వచ్చేటట్టు చేసినాడు. రాక్షసయోధులను ఉత్సాహపరిచినాడు. వాళ్లు పరుగెత్తి పారిపోకుండా నిలపడేటట్టు చేసినాడు.

ఆ విరూపాక్షుడు వేసిన నిశితబాణాలు సుగ్రీవుడికి గుచ్చుకొన్నవి. అప్పుడు ఆ విరూపాక్షుణ్ణి చంపివేయడానికి సంకల్పించుకొన్నాడు. కోపముతో చెలరేగి ఒక మహావృక్షాన్ని పైకిఎత్తి పట్టుకొని విరూపాక్షుడికి ఎదురుగుండా పరుగెత్తిపోయి అతడు ఎక్కిన ఏనుగను తన చేతితో పట్టుకొన్న చెట్టుతో బాదినాడు. ఆ దెబ్బకు ఆ ఏనుగు ఒక ధనుస్సు అంతదూరము వెనుకకు పడి అరిచింది. ప్రాణము వదిలింది. అప్పుడు ఆ వీరుడు విరూపాక్షుడు దెబ్బ తిన్న ఆ ఏనుగు మీది నుంచి ఇట్టె దూకినాడు. ఎదురుగుండా స్థిమితముగా నిలుచొని ఉన్న శత్రువును సుగ్రీవుణ్ణి ఎదిరించడానికి ఎద్దుతోలు వేసిన డాలునూ ఖడ్గాన్నీ తీసుకొన్నాడు. దగ్గరకు పోబోయినాడు. సుగ్రీవుడు అప్పుడు పెద్ద మేఘము అంతటి రాతిబండను అందుకొని విరూపాక్షుడిమీద విసరి వేసినాడు. ఆ రాతిబండ తనమీద పడకుండా ఆ పరాక్రమవంతుడు విరూపాక్షుడు ఇట్టె పక్కకు తప్పుకొని చేతులోఉన్న ఖడ్గముతో సుగ్రీవుణ్ణి కొట్టినాడు. ఆ బలవంతుడి ఖడ్గప్రహారణానికి సుగ్రీవుడు చేష్టలు తప్పి పోయినాడు. ఒక ముహూర్తము సేపటిలో తేరుకొన్నాడు, ఎగిరి విరూపాక్షుడి ఎదురు రొమ్ముమీద తన పిడికిటితో ఒక్క పోటు పొడిచినాడు. ఆ పిడికిటి పోటుకు విరూపాక్షుడు మహోగ్రుడు అయిపోయి ఖడ్గముతో సుగ్రీవుడి కవచాన్ని తెగవేసినాడు. ఆ దెబ్బకు సుగ్రీవుడి కాళ్లు తడపడి కిందపడి ఇట్టె పైకిలేచి పిడుగులు పడుతూ ఉన్నట్టు సింహనాదము చేస్తూ ఆ విరూపాక్షుణ్ణి అరచేతితో కొట్టినాడు. ఆ సుగ్రీవుడి దెబ్బను అప్పుడు ఆ విరూపాక్షుడు నిపుణముగా తప్పించుకొని తన పిడికిటితో సుగ్రీవుడి వక్షస్థలముమీద కొట్టినాడు. సుగ్రీవుడు అంతట విరూపాక్షుడి కణతలమీద తన అరచేతితో కొట్టినాడు. దేవేంద్రుడి వజ్రాయుధము దెబ్బవంటి దెబ్బ కణతలమీద తగలగానే విరూపాక్షుడి ముక్కులలో నుంచి నెత్తురు జలజల కారింది. నోటిలో నుంచి నెత్తురు కక్కినాడు. కొండలలోనుంచి ప్రవహించే సెలయేటివలె నోటిలోనుంచి ముక్కులలోనుంచి నెత్తురు కారింది. ఆ నెత్తురుతో ఒళ్లు అంతా తడిసిపోయి విరూపాక్షుడు నేల కూలినాడు. నురుగులతో

నెత్తురు కారుతూ కనుగుడ్లు తిప్పుతూ మరింత వికృతనేత్రాలతో చూస్తూ ఎగిరిపడుతూ పక్కలకు పొర్లుతూ దేహము అంతా నెత్తురుతో తడిసిపోయి జాలి పుట్టేటట్టు అరుస్తూఉన్న విరూపాక్షుణ్ణి వానరవీరులు అందరూ చూచినారు.

అప్పుడు ఆ రణరంగములో వానర రాక్షస సేనలు రెండున్నూ ఎదుర్కొని చెలియలి కట్టలను పొంగిపొర్లిన రెండు మహాసముద్రాల వలె భయంకరము అయిన మహాఘోషము చేసినవి. ఆ మహాబలవంతుణ్ణి విరూపాక్షుణ్ణి వానరరాజు సుగ్రీవుడు చంపివేయడము చూచి వానరసైన్యాలు సంతోషాతిశయముతోనూ రాక్షససైన్యాలు తమ వీరుడు చచ్చిపోయినాడు అనే దుఃఖము నుంచి వచ్చిన కోపాతిశయముతోనూ ఉప్పొంగిన గంగాప్రవాహము వలె పోరాడడానికి ఒకరిమీదికి ఒకరు పోయినారు.

## ౫౮

ఆ వానరరాక్షస సైన్యాలు అట్లా పరస్పరమూ పోరాడుతూ ఎండాకాలములో తటాకోదకాల వలె తగ్గిపోయినవి. విరూపాక్షుణ్ణి చంపివేయడమూ తన సైన్యము క్షీణించిపోవడమూ చూచి రావణాసురుడు రెండింతలు కుపితుడు అయినాడు. అది దైవవిపర్యయము అనుకొని దుఃఖపడ్డాడు. తన సమీపములో ఉన్న మహోదరుణ్ణి చూచి "ఓ మహోదరుడా, నా జయాశ ఈ కాలానికి నీమీద ఆధారపడి ఉంది. ఓ మహాబాహూ, నీవు ఇప్పుడు శత్రువులను సంహరించవలెను. నీ పరాక్రమము చూపించవలెను. నీవు నా అన్నము తింటున్నందుకు నా ఋణము తీర్చుకొనే అవకాశము నీకు ఇప్పుడు వచ్చింది. చక్కగా యుద్ధముచేసి నీవు నాకు ప్రత్యుపకారము చేయవలెను" అని రావణాసురుడు చెప్పినాడు.

"అట్లాగేను అని చెప్పి మహోదరుడు వానరసైన్యముమీదికి పోయినాడు. భయంకరము అయిన వానరసైన్యములో చొరబడ్డారు. పెద్ద పెద్ద రాళ్లతో రాక్షసులను కొట్టి చంపివేస్తూ ఉన్న వానరులమీద ఆ మహాబలవంతుడు మహోదరుడు బంగారుబాణాలు వదలి వారి కాళ్లనూ చేతులనూ తొడలనూ తెగవేసినాడు. అప్పుడు మహోదరుణ్ణి చూచి రాక్షసయోధులు ధైర్యము తెచ్చుకొని విజృంభించి వానరయోధులను కొట్టసాగినారు. ఆ రాక్షసుల దెబ్బలకు ఓర్చుకోలేక వానరయోధులు కొందరు అటూ ఇటూ పరుగులెత్తినారు. కొందరు పోయి సుగ్రీవుణ్ణి ఆశ్రయించినారు.

అప్పుడు ఆ మహాపరాక్రమవంతుడు సుగ్రీవుడు మహోదరుణ్ణి చంపి వేయవలెనని అనుకొని పెద్ద పర్వతమంత రాతిబండను తీసుకొని విసరి వేసినాడు. తనమీద వచ్చి పడబోతూ ఉన్న అంత పెద్ద రాతిబండను చూచి మహోదరుడు కలవరపడకుండా చటుక్కున బాణాలు వదిలినాడు. ఆ బాణాలు తగిలి ఆ రాతిబండ ముక్కలు ముక్కలు అయిపోయింది అవి గద్దల గుంపులవలె నేలమీద పడ్డవి. ఆ రాతిబండ అట్లా అయిపోవడము చూచి సుగ్రీవుడు ఒక సాలవృక్షాన్ని పెళ్లగించి ఆ మహోదరుడి మీద విసరి వేసినాడు. ఆ శూరుడు ఆ మహావృక్షాన్ని కూడా తన బాణాలతో ముక్కలు ముక్కలుగా నరికి వేసినాడు. ఆ వృక్షమున్నూ వ్యర్థము అయిపోవడము చూచి సుగ్రీవుడు కుపితుడు అయిపోయినాడు. అక్కడ నేల మీద పడి ఉన్న ఒక పరిఘాయుధాన్ని చూచినాడు తళతళ లాడుతున్న ఆ పరిఘాయుధాన్ని తీసుకొని గిర గిర త్రిప్పి తన బలాన్ని అంతా చూపించడానికి ఆ పరిఘాయుధాగ్రముతో మహోదరుడి రథానికి కట్టిన గుర్రాలను కొట్టినాడు. ఆ గుర్రాలు చచ్చి పడిపోయినవి. ఆ రథము మీది నుంచి ఆ మహాబలవంతుడు క్రిందికి దూకి ఒక గద తీసుకొని సుగ్రీవుణ్ణి ఎదిరించినాడు.

ఆ ఎద్దుల వంటి ఆ వీరులు ఒకరు పరిఘాయుధముతోనూ ఒకరు గదాయుధముతోనూ మెరుపులు మెరుస్తూ ఉన్న మేఘాలవలె గర్జిస్తూ ఒకరిని ఒకరు ఎదుర్కొన్నారు. కిరణాలతో తేజరిల్లే సూర్యుడివలె తళతళ లాడుతూ ఉన్న గదను మహోదరుడు సుగ్రీవుడి మీద విసరి వేసినాడు. మహోదరుడు విసరి వేసిన ఆ గదాయుధము తనమీదపడకుండా సుగ్రీవుడు తనచేతిలో ఉన్న పరిఘాయుధాన్ని దాని మీదికి విసరి వేసినాడు. ఆ గదాయుధమూ పరిఘాయుధమూ అంతరిక్షములో ఒక దానితో ఒకటి కొట్టుకొని విరిగి నేలమీద పడి పోయినవి.

అప్పుడు ఆ తేజోవంతుడు సుగ్రీవుడు అక్కడనే నేల మీద పడి ఉన్న మరి ఒక ముసలాయుధాన్ని చూచినాడు. ఇనుముతో చేసి బంగారముతో అలంకరించిన ఆ భయంకర ముసలాయుధాన్ని లేవనెత్తి మహోదరుడి మీద విసరి వేసినాడు. మహోదరుడు అప్పటికి అప్పుడు మరి ఒక గదను అందుకొని ఆ ముసలాయుధము మీద విసరి వేసినాడు. ఆ రెండూ కూడా విరిగి నేలమీద పడిపోయినవి. తమ తమ ఆయుధాలు విరిగి పోగానే ఆ తేజోబలవంతులు ఉభయులూ అగ్నిహోత్రాల వలె జ్వలిస్తూ ఒకరితో ఒకరు కలియబడి పిడికిళ్ళతో పొడుచుకొన్నారు. పదే పదే పెడబొబ్బలు పెడుతూ ఒకరిని ఒకరు అరచేతులతో బాదుకొన్నారు. ఉభయులూ నేలమీద పడ్డారు.

పరాజయము ఎరుగని ఆ వీరులు ఇద్దరున్నూ వెంటనే లేచినారు. మళ్ళీ ఒకరిని ఒకరు కొట్టుకొన్నారు. అంతట ఒకరిని ఒకరు పైకి లేవనెత్తి విసరి వేసుకొన్నారు. ఆ పరంతపులు ఉభయులూ బాహుయుద్ధము చేసి అలసిపోయినారు. అప్పుడు ఆ మహా వేగవంతుడు మహోదరుడు అక్కడ దగ్గరలో నేలమీద పడివున్న ఒక ఖడ్గాన్ని ఎద్దు తోలుతో చేసిన ఒక డాలునూ తీసుకొన్నాడు. ఆ మహోదరుడి కన్నా మరింత వేగవంతుడు అయిన సుగ్రీవుడు అదేవిధముగా అక్కడ నేలమీద పడి ఉన్న మరి ఒక మహాఖడ్గాన్నీ డాలునూ తీసుకున్నాడు. ఆ ఆయుధధారులు ఇద్దరూ సంతోషముగా ఖడ్గాలు ఎత్తి పట్టుకున్నారు. అట్లా ఖడ్గాలు పట్టుకొని ఆ వీరులు ఉభయులున్నూ ప్రదక్షిణముగానూ అప్రదక్షిణముగానూ మండలముగానూ ఒకరి చుట్టూ ఒకరు తిరుగుతూ ఒకరిని ఒకరు జయించే ప్రయత్నము చేసినారు. ఆ శూరుడు ఆ వేగవంతుడు ఆ పరాక్రమగర్వి మతిహీనుడు మహోదరుడు తన ఖడ్గముతో సుగ్రీవుణ్ణి పొడవబోయి గురి తప్పి అతని చేతిలో ఉన్న డాలును పొడిచినాడు. ఆ డాలులో నాటుకొని పోయిన ఖడ్గాన్ని వెనకకు లాగుకోబోతూ ఉండగా శిరస్త్రాణముతోనూ చెవులకు పెట్టుకున్న కుండలాలతోనూ ధగ ధగ లాడుతూ ఉన్న మహోదరుడి శిరస్సును సుగ్రీవుడు తన మహాఖడ్గముతో తెగ వేసినాడు. తల తెగి పోయి ఇట్టే మహోదరుడు నేల కూలినాడు. అది చూచి రావణాసురుడి సైన్యము అక్కడ నిలవ లేకపోయింది. సైనికులు అన్ని వైపులా పరుగు లెత్తినారు.

సుగ్రీవుడు మహోదరుణ్ణి చంపి వేసిన సంతోషాతిశయముతో వానరులు అందరితోనూ చేరి సింహనాదము చేసినాడు. దశగ్రీవుడికి కోపము వచ్చింది. రాముడు సంతోషముతో తేజరిల్లినాడు. మనోవ్యాకులముతో రాక్షసవీరుల ముఖాలు వెల వెల పోయినవి. భయపడ్డారు. చెదిరి పోయి పరుగులెత్తినారు.

మహా పర్వతంలో ఒక భాగాన్ని పడకొట్టినట్టు సూర్యపుత్రుడు ఎదిరించనలవి కాని ఆ సుగ్రీవుడు మహోదరుణ్ణి నేల పడకొట్టి సూర్యుడు తన తేజముతో విరాజిల్లేటట్టు జయలక్ష్మితో తేజరిల్లినాడు.

ఆ యుద్ధములో మహోదరుణ్ణి జయించిన ఆ మహాపరాక్రమవంతుణ్ణి సుగ్రీవుణ్ణి చూచి ఆకాశములో ఉన్న సురయక్షసిద్ధసమూహాలూ భూమి మీద ఉన్న ప్రాణికోటులూ మెచ్చుకొన్నవి.

## ౫౫

మహోదరుడు సుగ్రీవుడిచేతిలో హతుడుఅయిపోవడము మహాపార్శ్వుడు చూచినాడు. ఆ మహాబలవంతుడికి కోపము వచ్చింది. కన్నులు కెంపులవలె ఎర్రపడి పోయినవి. అంతట అంగదుడి భయంకర వానరసైన్యము మీద ఆ మహాపార్శ్వుడు బాణాలు వదిలినాడు. గాలి తాకిడికి తొడిమనుంచి పండ్లు రాలిపోయినట్లు ఆ బాణాల తాకిడికి మేటి వానరవీరుల శరీరాలనుంచి తలలు తెగి నేలరాలినవి. అప్పుడు ఆ మహాపార్శ్వుడి బాణాల తాకిడికి కొందరు వానరుల బాహువులు తెగిపోయినవి కొందరు వానరుల మూపులు విరిగి పోయినవి. కొందరు వానరుల పక్కలు చీలిపోయినవి. ఆ మహాపార్శ్వుడి బాణ వర్షానికి వానరయోధులు అందరూ యమయాతన పడ్డారు. దుఃఖముతో యుద్ధ భూమిలో విముఖులు అయినారు. అట్లా బాధపడుతూ భయపడి పోయిన తన సైన్యాన్ని అప్పుడు అంగదుడు చూచినాడు. ఆ మహాబాహువు అంతట పర్వ సమయములో మహాసముద్రమువలె చెలరేగినాడు. సూర్య కిరణాలవలె కన్నులు మిరుమిట్లు గొలిపే బంగారుకట్లు వేసిన పరిఘాయుధాన్ని తీసుకొని మహాపార్శ్వుడిమీద విసరి వేసినాడు. ఆ పరిఘాయుధము దెబ్బకు ఆ రాక్షసుడు దిమ్మరపోయినాడు. తెలివి తప్పి సారథితో కూడా రథముమీద నుంచి కింద పడ్డాడు.

కాటుక కొండ వంటి మహాబలవంతుడూ మహాపరాక్రమవంతుడూ అయిన గవాక్షుడు కుపితుడు అయి పోయి మహామేఘము వంటి నల్లటి భల్లూకసైన్యములో నుంచి బైటికి వచ్చి పర్వతశిఖరము వంటి ఒక పెద్ద రాతిబండను తీసుకొని మహాపార్శ్వుడి గుర్రాలను కొట్టి చంపి వేసినాడు. ఆ రథాన్ని నుగ్గు నుగ్గు చేసినాడు. మహాపార్శ్వుడు ఒక ముహూర్తము సేపటికి తేరుకొన్నాడు అంతట గవాక్షుడి మీద అనేక బాణాలు వదిలినాడు. భల్లూకరాజు జాంబవంతుడి వక్షస్థలము మీద మూడు బాణాలను వదిలినాడు. బాణాలు గుచ్చుకొని బాధపడుతూ ఉన్న గవాక్షుణ్ణి జాంబవంతుణ్ణి చూచి అంగదుడు పరమకుపితుడు అయి పోయి పరమభయంకరము అయిన పరిఘాయుధాన్ని తీసుకొన్నాడు. బంగారు కట్లతో సూర్యకిరణాలవలె తేజరిల్లుతూ ఉన్న ఆ పరిఘాయుధాన్ని తన రెండు చేతులతోనూ పట్టుకొని బలము కొద్దీ గిర గిరా తిప్పి దూరాన ఉన్న మహాపార్శ్వుడి మీద విసరి వేసినాడు. అట్లా ఆ బలవంతుడు అంగదుడు విసరి వేసిన ఆ పరిఘాయుధము రివ్వున పోయి మహాపార్శ్వుడు చేతిలో పట్టుకొని ఉన్న ధనుర్బాణాలను విరగ కొట్టి అంతటితో ఆగకుండా ఆ రాక్షసుడి

కిరీటాన్ని పడకొట్టింది. అంతట అమిత వేగముతో ఆ మహాపార్శ్వుడి మీదికి అంగదుడు పరుగెత్తుకొనిపోయి కుండలాలు పెట్టుకొని ఉన్న అతని గూబ గుయ్యిమనేటట్టు తన అరచేతితో కొట్టినాడు. అప్పుడు మహాపార్శ్వుడు క్రుద్ధుడు అయిపోయి మహావేగముతో ఒక పెద్ద గండ్రగొడ్డలిని అందుకొన్నాడు. ప్రతిరోజూ నూనె పూయడము నుంచి కిలుము ఎక్కకుండా నిర్మలముగానూ పలుగురాయివలె గట్టిగా చెక్కుచెదరకుండానూ ఉన్న గండ్రగొడ్డలిని తన కుడిచేతితో పట్టుకొని మహాపార్శ్వుడు అంగదుడి ఎడమ మెడకొంకులు తెగవేయబోయినాడు. ఆ గండ్రగొడ్డలి దెబ్బ తగలకుండా అప్పుడు అంగదుడు ఇట్టే తప్పించుకొని వజ్రాయుధము వంటి తన పిడికిటితో మహాపార్శ్వుడి వీపుమీద ఒక గుద్దు గుద్దినాడు. ఆయువుపట్లు తెలిసిన ఆ అంగదుడు అంతట చటుక్కున ఎదురుగుండాపోయి ఆ రాక్షసుడి గుండెకాయమీద తన పిడికిటితో ఒక్కపోటు పొడిచినాడు. ఆ పిడికిటి పోటుకు మహాపార్శ్వుడి గుండెకాయ పగిలి పడిపోయినాడు. అట్లా చచ్చి పడిపోయిన మహాపార్శ్వుణ్ణి చూచి రాక్షస సైన్యము కలవరపడి కంపించిపోయింది.

అప్పుడు వానరయోధులు సంతోషాతిశయముతో లంకాపురద్వారాలూ కోటబురుజులూ పట్టణము అంతానూ పగిలిపోయేటట్లు సింహనాదాలు చేసినారు. ఆ వానరయోధులతో పాటు ఆకాశములో ఉన్న దేవేంద్రుడూ దేవతలూ మహాధ్వనులు చేసినారు.

దేవేంద్రుడితో కూడా ఆకాశములో దేవతలూ భూమిమీద వానరయోధులూ చేసిన మహాధ్వనికి ఆ దేవేంద్ర శత్రువు రావణాసురుడు మహాక్రుద్ధుడు అయిపోయినాడు. మళ్ళీ యుద్ధము చేయడానికి ఆ వానరసైన్యాలకు ఎదురుకుండాపోయి నిలుచున్నాడు.

## ౧౦౦

మహాబలవంతులూ పరమపరాక్రమవంతులు అయిన విరూపాక్ష మహోదర మహాపార్శ్వులు పడిపోవడము చూచి రావణాసురుడు పరమకుపితుడు అయినాడు. అంతట సారథిని చూచి రథము తోలమని చెప్పుతూ "సూతుడా, ఇప్పుడే నేను రామలక్ష్మణులను చంపివేయవలెను. వానరులు నా అమాత్యులను చంపివేసినారు. లంకాపట్టణాన్ని ముట్టడించినారు. నేను ఇప్పుడు అందరి దుఃఖమూ పోగొట్టవలెను. రాముడు అనే వృక్షానికి సుగ్రీవుడూ జాంబవంతుడూ

అంగదుడూ హనుమంతుడూ కుముదుడూ నలుడూ గంధమాద నుడూ మైందద్వివిదులూ ఇక్కడ వానర యూధపతులూ కొమ్మలుగా ఉన్నారు. ఆచెట్టుకు సీత పుష్పమూ ఫలమూవంటిది. ఇప్పుడు కొమ్మ లతోకూడా రామవృక్షాన్ని పడకొట్టవలెను. అట్లా చేస్తే పుష్పమూ ఫలమూ అయిన సీత నాకు దక్కుతుంది." అంటూ ఆ అతిరథుడు రావణాసురుడు చెప్పినాడు. రథము కదిలింది. ఆ రథఘోషము దశదిశలా మారు(మ్రోగింది. ఆ రథఘోషానికి ఈ భూమిమీదవున్న పర్వతాలూ నదులూ అడవులూ అడవు లలో ఉన్న వరాహాలూ పక్షులూ మొదలయిన సమస్త చరాచరాలూ సంచలించి పోయినవి. అంతట రావణాసురుడు వానరసైన్యముమీద మహాఘోరమూ అమితతీక్షణమూ అయిన తామసాస్త్రాన్ని వదిలినాడు. ఆ అస్త్రప్రభావంవల్ల మంటలు బయలుదేరి వానరయోధులను దగ్ధముచేయసాగినవి. ఆ తామ సాస్త్రాన్ని బ్రహ్మదేవుడు స్వయముగా సృష్టించినాడు. బ్రహ్మదేవుణ్ణి మెప్పించి రావణాసురుడు దాన్ని ఇదివరకు తెచ్చుకొన్నాడు. ఆ తామ సాస్త్రప్రభావానికి కాలిపోయినవారు పోగా మిగిలిన వానరయోధులు భయ పడి పరుగులెత్తుతూఉంటే ఘోరముగా దుమ్మురేగింది. అట్లా కంపెలకొద్దీ వానరసేనాసమూహాలు భగ్నముఅయిపోవడము రాముడు చూచినాడు. యుద్ధ సన్నద్ధుడు అయినాడు. ఆ ఆజానుబాహు ఆకాశాన్ని ఒరుసుకొనిపోతూ ఉన్న ధనుస్సును పట్టుకొన్నాడు. ఉపేంద్రుడితో ఉన్న దేవేంద్రుడివలె లక్ష్మణు డితో కూడా తేజరిలుతూ ఉన్న ఆ అరిందముణ్ణి ఆ పద్మపత్ర విశాలాక్షుణ్ణి, రాముణ్ణి అప్పుడు రావణాసురుడు చూచినాడు. అట్లా తన మీదికి వస్తూ ఉన్న రావణాసురుణ్ణి రామలక్ష్మణులు చూచినారు. రాముడు సంతోషాతిశయముతో తన కౌర్ముకము నడుము పట్టుకొనిఉత్తమోత్తమము అయినబాణాన్ని ఎక్కించి అల్లెత్రాడును అమిత వేగముతో లాగినాడు. భూమి బ్రద్దలు అయి పోయేటంత మహాధ్వని అయింది. అప్పుడు రావణాసురుడు ఇటు రాముడి మీద బాణాలు వదిలి పెట్టడము మొదలు పెట్టినాడు. రాముడు ధనుస్సు సారించిన మహాధ్వనికి అటు రాక్షసులూ రావణాసురుడు బాణాలు వదులుతూ ఉన్న మహాధ్వనికి ఇటు వానరులూ దిమ్మరపోయి వందలకొద్దీ నేలమీద పడ్డారు. అట్లా రామ లక్ష్మణుల ఎదటికి వచ్చిన రావణాసురుడు అమావాస్యనాడు సూర్యచంద్రులను పట్ట పోయే రాహువు వలె కనిపించినాడు. లక్ష్మణుడు ఆ రావణాసురుడితో ముందుగా పోరాడవలెను అనుకొన్నాడు. అందుకు రాముడు ఒప్పుకొన్నాడు. లక్ష్మణుడు అంతట తన ధనుస్సును వంచి రావణాసురుడి మీద అగ్నిశిఖల వంటి బాణాలను వదిలినాడు. ఆ బాణాలను అన్నిటినీ ఆ మేటి విలుకాడు

రావణాసురుడు తన బాణాలతో ఆకాశములోనే కొట్టివేసినాడు. అంతట తన హస్తలాఘవము చూపిస్తూ రావణాసురుడు లక్ష్మణుడు వదిలిన ఒక్క బాణాన్ని ఒక బాణములోనూ మూడింటిని మూడింటిలోనూ పదింటిని పదింటిలోనూ అంతరిక్షములోనే నరికివేసినాడు.

అంతట ఆ శత్రుహంత రావణాసురుడు తన రథములో లక్ష్మణుణ్ణి దాటిపోయి పర్వతమువలె అచలముగా నిలుచొని ఉన్న రాముణ్ణి ఎదిరించినాడు. కోపముతో కన్నులు ఎర్రచేసి బాణవర్షము కురిపించడము మొదలు పెట్టినాడు. అమిత వేగముతో జలధారలవలె రావణాసురుడి ధనుస్సులోనుంచి వెలువడుతూ ఉన్న బాణాలను చూచి రాముడు కత్తివాయి అమ్ములను తీసినాడు. దేదీప్యమానముగా వెలుగుతూ కుపితవిషసర్పాలవలె భయంకరముగా వస్తూ ఉన్న ఆ బాణాలను తన కత్తివాయి అమ్ములతో రాముడు ఖండించివేసినాడు. అప్పుడు రాముడిమీద రావణాసురుడూ, రావణాసురుడి మీద రాముడూ అమిత వేగముతో వివిధ తీక్ష్ణబాణాలను వర్షముగా కురిపించుకున్నారు. అమిత వేగముతో వచ్చి పడుతూ ఉన్న ఆ బాణాలను అన్యోన్యము తప్పించుకుంటూ ఆ అపరాజితులు ఉభయులూ సవ్యాపసవ్యముగానూ గుండ్రముగానూ ఒకరిచుట్టూ ఒకరు తిరుగుతూ చాలసేపు చిత్రవిచిత్రముగా పోరాడినారు. సర్వనాశనము చేసివేసే రుద్రదేవుడివలెనూ యముడివలెనూ రామరావణులు ఉభయులూ ఏకకాలాన ఒకరిమీద ఒకరు భయంకరముగా బాణాలు వదులుకుంటూ పోరాడుతూ ఉంటే సమస్త ప్రాణికోటి భయపడిపోయింది. వర్షాకాలములో మెరుపులతో కమ్ముకొన్న మేఘాలవలె అప్పుడు ధగధగలాడుతూ తళతళలాడుతూ ఉన్న బాణాలతో ఆకాశము అంతా నిండిపోయింది. అట్లా నిండిపోయిన ఆ బాణాల మధ్యను సందులు ఆ ఆకాశానికి కిటికీలవలె కనుపించినవి.

సూర్యాస్తమయము అయిపోయింది. చిమ్మచీకట్లు కలగచేసే మేఘాలవలె రామరావణులు చెలరేగినారు. గద్దరెక్కల వంటి మంచి మంచి రెక్కలతో అమిత వేగముగా పోయే బాణాలు అన్యోన్యమూ వదులుకొంటూ పోరాడినారు. ఆ బాణపాతము నుంచి భయంకరము అయిన అంధకారము అలముకొన్నది. అప్పుడు రాముణ్ణి చంపివేయవలెను అని రావణుడూ రావణుణ్ణి చంపివేయవలెను అని రాముడూ వృత్రాసుర దేవేంద్రులవలె మహాఘోరముగా పోరాటము సాగించినారు. ఆ పోరాటము అచింత్యముగానూ ఎవరికీ దగ్గరికిపోవలవి కాకుండానూ జరిగింది. ఆ రామరావణులు ఉభయులూ మేటి విలుకాండ్రు. ఉభయులూ శస్త్ర విశారదులు. ఉభయులూ అస్త్రవిదులలో శ్రేష్ఠులు. ఒక్క

మాదిరిగా ఒకరిచుట్టూ ఒకరు ఆ పోరాటములో తిరిగినారు. ఆ వీరులు ఇద్దరూ ఏవైపు తిరిగితే ఆవైపునుంచి రెండు సముద్రాలు ఏకము అయినచోట గాలికి లేచే అలలవలె బాణాలు పైకి ఆకాశమువరకూ లేచినవి. లోకాలను అన్నిటినీ ఏడ్పులు పెట్టే ఆ రావణాసురుడు అప్పుడు తన బాణప్రయోగ చాతుర్యముతో రాముడి నుదుట వరుసగా బాణాలు వదిలినాడు. భయంకరము అయిన ధనుస్సులో నుంచి వెలువడిన నల్ల కలువ రేకుల వంటి ఆ బాణాలు రాముడి నుదుట గుచ్చుకొన్నవి. అయితే అతడు ఏమాత్రమూ బాధ పడలేదు. కానీ ఆ మహా తేజోవంతుడికి మరింత కోపమువచ్చి రుద్ర దేవతాకము అయిన మంత్రాలు జపము చేస్తూ అనేక బాణాలను ధనుస్సుకు ఎక్కించి రావణాసురుడి మీద వదిలినాడు. ఆ బాణాలుపోయి రావణాసురుడు తొడుగుకొని ఉన్న మహా మేఘమువంటి అభేద్య కవచానికి తగిలినవి అవి ఏమాత్రమూ అతనిని బాధ పెట్టలేక పోయినవి. అదిచూచి ఆ సర్వాస్త్ర కుశలుడు రాముడు రథముమీద ఉన్న రావణాసురుడి లలాటాన్ని గురిచేసి పరమాస్త్ర మంత్రముతో అభిమంత్రించి బాణాలను మళ్ళీ వదిలినాడు. రావణాసురుడు ఆ బాణాలను తన బాణాలతో అడ్డగించినాడు. అయితే అవి రావణాసురుడు వదిలిన బాణాలను ఛేదించి బుసలు కొట్టుతూ ఉన్న అయిదు తలల పాములవలె నేల కూలినవి.

అప్పుడు ఆ మహాపరాక్రమవంతుడు రావణుడు మహోగ్రుడు అయినాడు. కోపముతో రెగి బుసలుకొట్టే పామువలె నిట్టూర్పులు విడిచినాడు. అసురదేవతాకము అయిన మహాభయంకరాస్త్రాన్ని అప్పుడు రాముడిమీద వదిలినాడు. ఆ అసురాస్త్రములో నుంచి కొన్ని బాణాలు సింహము ముఖము వలెనూ కొన్ని పెద్దపులి ముఖము వలెనూ కొన్ని రాబందు తల వలెనూ కొన్ని గద్ద తల వలెనూ కొన్ని డేగ తల వలెనూ కొన్ని కాకి తల వలెనూ కొన్ని కోడి తల వలెనూ కొన్ని తోడేలు ముఖము వలెనూ కొన్ని నక్క ముఖము వలెనూ కొన్ని గాడిద ముఖము వలెనూ కొన్ని వరాహ ముఖము వలెనూ కుక్క ముఖము వలెనూ నోరు తెరచిన మొసలి తల వలెనూ కొన్ని భయంకర సర్పాల వలెనూ ఇంకా వివిధ ఆకారాలతోనూ వెలువడినవి.

అట్లా ఆ అసురాస్త్రములో నుంచి వివిధ భయానక రూపాలతో వెలువడిన ఆ బాణాలను అన్నిటినీ అగ్నిహోత్రుడివంటి రాముడు చూచినాడు. అంతట మహోత్సాహముతో ఆ అసురాస్త్రము మీద ఆగ్నేయాస్త్రము వదిలినాడు. మంటలు మండుతూ ఉన్న అగ్నిముఖాలతోనూ సూర్యముఖాలతోనూ చంద్రముఖాలతోనూ అర్ధచంద్ర ముఖాలతోనూ ధూమకేతు ముఖాలతోనూ

గ్రహనక్షత్ర ముఖాలతోనూ బాణాలు వెలువడినవి. అవే కాకుండా పెద్ద పెద్ద కొరవుల వలెనూ మెరుపుతీగల వలెనూ నిశితబాణాలు బయలు దేరినవి. రావణాసురుడు వదిలిన భయంకరాసురాస్త్రబాణాలను ఆకాశములోనే ఆ ఆగ్నేయాస్త్రబాణాలు దహించి వేసినవి.

ఆ అసురాస్త్రము అట్లా ధ్వంసము అయిపోవడము చూచి కామరూపులు అయిన సుగ్రీవాది వానర వీరులు అందరూ రాముడి చుట్టూ మూగి సంతోషాతిశయముతో దిక్కులు పిక్కటిల్లి పోయేటట్లు సింహనాదాలు చేసినారు.

## ౧౦౧

అసురాస్త్రము హతము అయిపోయింది. అందువల్ల రావణాసురుడికి మరింత కోపము వచ్చింది. అంతట ఆ మహాద్యుతిమంతుడు మయుడు సృష్టించిన రౌద్రాస్త్రాన్ని రాముడిమీద వదిలినాడు. వజ్రాయుధము వంటి శూలాలూ దేదీప్యమానము అయిన ముసలాయుధాలూ, గదలూ, తళతళలాడుతూ ముద్గరాలూ, కూటపాశాలూ, ఇంకా వివిధాయుధాలూ ఆ రౌద్రాస్త్ర ప్రభావము వల్ల రావణాసురుడి కార్ముకములోనుంచి ప్రళయకాలవాయువుల వలె వెలువడినవి.

ఆ శ్రీమంతుడు రాముడు వాటిని చూచినాడు. ఉత్తమాస్త్రవిదులలో శ్రేష్ఠుడు అయిన ఆ కాంతిమంతుడు రాముడు అంతట గంధర్వదేవతాకము అయిన పరమాస్త్రాన్ని వదిలినాడు. ఆ గాంధర్వాస్త్రము రావణాసురుడు వదిలిన రౌద్రాస్త్రాన్ని కొట్టి వేసింది. అప్పుడు రావణాసురుడు, కోపముతో కన్నులు ఎర్ర చేసి రాముడిమీద సౌరాస్త్రాన్ని వదిలినాడు. మంటలు మండుతూ పెద్ద పెద్ద చక్రాయుధాలు అప్పుడు ఆ దశగ్రీవుడి ధనుస్సులోనుంచి భయంకర వేగముతో బయలుదేరినవి దేదీప్యమానముగా బయలుదేరి వచ్చి అన్ని వైపులా పడుతూ ఉన్న ఆ చక్రాయుధాలు ఆకాశాన్ని దిశలనూ తేజరిల్ల చేసే సూర్యచంద్రుల వలెనూ, గ్రహాల వలెనూ కనిపించినవి. చిత్రవిచిత్రముగా తిరుగుతూ మంటలు మండుతూ పడబోతూ ఉన్న ఆ చక్రాయుధాలను అన్నిటినీ రాముడు తన ఉత్తమోత్తమ బాణాలతో నరికి వేసినాడు. తాను వదిలిన సౌరాస్త్రము అట్లా హతము అయి పోవడము చూచి రావణాసురుడు రాముడి ఆయువుపట్లు గురిచేసి, పది బాణాలు వదిలినాడు. ఆ పది బాణాలున్నూ తన మర్మస్థానాలలో గుచ్చుకొన్నప్పటికిన్నీ ఆ మహాతేజోవంతుడు రాముడు ఏ మాత్రమూ చలించలేదు. ఎటువంటి కష్టసమయమున నయినా శత్రు

సమూహాలను జయించినట్లే ఆ రాముడు అప్పుడు రావణాసురుడి సమస్త అవయవాలలోను గ్రుచ్చేటట్లు అనేక బాణాలు వదిలినాడు. ఆ సమయములో తన అన్నగారిని లక్ష్మణుడు చూచినాడు. అతనికి కొంచెం విరామము ఇవ్వ తలచినాడు. ఆ మహాబాహుడైన లక్ష్మణుడు అప్పుడు ఏడు బాణాలు వదిలినాడు. అవి అతివేగముతో పోయి మనుష్యశీర్షము చిత్రించి ఉన్న రావణాసురుడి ధ్వజాన్ని ముక్కలు ముక్కలుగా పడకొట్టింది. అంతట ఆ కాంతిమంతుడు ఆ మహాబలవంతుడు లక్ష్మణుడు రావణాసురుడి రథసారథిని గురిచేసి ఒకే ఒక బాణమును వదిలినాడు. ధగధగలాడే కుండలాలతో ఉన్న ఆ రథసారథి శిరస్సును ఆ బాణము తెగనరికింది. అప్పుడు ఆ మహాపరాక్రమవంతుడు మరి అయిదు బాణాలు వదిలి ఆ రాక్షసరాజు రావణాసురుడి చేతిలో పట్టుకొని ఉన్న ఏనుగ తొండము వంటి ధనుస్సును నరికి వేసినాడు.

అది విభీషణుడు చూచినాడు. లక్ష్మణుడికి కొంచెము విరామము ఇవ్వవలెను అనుకొన్నాడు. పైకి ఎగిరి తన చేతిలో ఉన్న గదతో రావణాసురుడి రథానికి కట్టిన గుర్రాలను పడకొట్టినాడు. పర్వతాకారములో ఉన్న నీలమేఘాల వంటి ఆ గుర్రాలు చచ్చి నేలకూలినవి. ఆ గుర్రాలు హతము అయి పోగానే రావణాసురుడు మహావేగముతో రథముమీద నుంచి క్రిందకి దూకినాడు. తన తమ్ముడు విభీషణుడి మీద తీవ్రకోపము వచ్చింది. ఆ మహాశక్తిమంతుడు శక్త్యాయుధాన్ని తీసుకొని విభీషణుడి మీద విసరి వేసినాడు. అది వచ్చి విభీషణుడి మీద పడే లోపలనే లక్ష్మణుడు మూడు బాణాలు గురిచేసి ఆ శక్త్యాయుధము మీద వదిలినాడు. కాంచనమాలలతో జ్వలిస్తూ ఉన్న ఆ శక్త్యాయుధము మూడుచోట్ల విరిగి అగ్నికణాలు రేగుతూ మంటలు మండుతూ ఆకాశమునుంచి రాలే మహోల్కము వలె క్రిందపడ్డది.

అంతట రావణాసురుడు మరి ఒక శక్త్యాయుధాన్ని తీసుకొన్నాడు. అది అతడు నిత్యమూ పూజించేది. యముడు సహితము దానిని ఎదిరించ లేడు. ఎవరూ దానివంక తేరిపార చూడలేరు. అది మహాకాంతివంతము అయిన దేవేంద్రుడి వజ్రాయుధము వంటిది. దానిని రావణాసురుడు తన బలముకొద్దీ గిరగిర తిప్పినాడు. అది అప్పుడు మహాభయంకరముగా మంటలు మండింది. ఆ మహాశక్త్యాయుధమునుంచి ప్రాణసంశయావస్థలో ఉన్న విభీషణుణ్ణి లక్ష్మణుడు చూచినాడు. ఆ మహావీరుడు చటుక్కున పోయి ఆ విభీషణుడికి అడ్డముగా నుంచున్నాడు. ఇట్లై తన ధనుస్సును వంచినాడు. మహాశక్త్యాయుధాన్ని తన చేతులలో నుంచి వదలపోతూ ఉన్న రావణాసురుడి మీద

బాణాలు వదిలి పెట్టినాడు. ఆ విధముగా ఆ మహాధైర్యవంతుడు లక్ష్మణుడు ఎడతెగకుండా బాణాలు వదిలి పెట్టుతూ ఉంటే రావణాసురుని పరాక్రమము పెచ్చెరిగింది. ఆ మహాశక్త్యాయుధాన్ని లక్ష్మణుని మీద విసరి వేయలేక పోయినాడు.

ఆ మహాశక్త్యాయుధమునుంచి తన తమ్ముణ్ణి తప్పించిన లక్ష్మణునికి ఎదురుగుండా రావణాసురుడు పోయి "ఓ లక్ష్మణా, నీ బలాన్ని మెచ్చుకొన్నాను. నీవు నా తమ్ముణ్ణి నా శక్త్యాయుధము నుంచి తప్పించినావు. కనుక వాణ్ణి వదిలిపెట్టి నీ మీదనే ఈ శక్త్యాయుధాన్ని వదులుతాను. ఇనుప గుదియల వంటి నా బాహువులు చూడు. బాహుబలము కొద్దీ ఈ మహాశక్త్యాయుధాన్ని నీమీద విసరివేస్తాను. ఇది నీ గుండెలు పగుల గొట్టుతుంది నీ ప్రాణాలను ఎత్తుకొని పోతుంది. నీ నెత్తురు చుక్కలతో తిరిగి నా దగ్గరకు వస్తుంది" అని చెప్పుతూ మయుడు తన మాయాబలముతో సృష్టించిన ఆ మహాశక్త్యాయుధాన్ని లక్ష్మణుడి ఎదుర రొమ్ముకు గురిచేసి విసరి వేసినాడు. అంతట రావణాసురుడు సింహనాదము చేసినాడు. శత్రువులను సంహారము చేసివేసే ఆ అమోఘశక్త్యాయుధము భగ భగ మంటలు మండుతూనూ దానికి అమర్చిన ఎనిమిది ఘంటలూ మహాభయంకరముగా మోగుతూనూ బయలుదేరింది. వజ్రాయుధము వలె కన్నులు మిరుమిట్లు గొలిపే కాంతులతోనూ చెవులు గింగురులు ఎత్తే మహాధ్వనులతోనూ లక్ష్మణుడి వక్షస్థలము మీద పడిపోతూ ఉన్న ఆ మహాశక్త్యాయుధాన్ని చూచి రాముడు "ఓ శక్త్యాయుధమా, నీ ఉద్యమము హతము అయి పోవలెను. నా తమ్ముడు లక్ష్మణుడు స్వస్థముగా ఉండవలెను" అని అరిచి చెప్పినాడు. ఆ మహాశక్త్యాయుధము అప్పుడు మహాక్రూర విషసర్పము వలె పోయి నిర్భయముగా నిలుచొని ఉన్న లక్ష్మణుడి వక్షస్థలాన పడ్డది. మహావేగముతో మంటలు మండుతూ కన్నులు మిరుమిట్లు గొలిపే సర్పరాజు (ఆదిశేషుడి) నాలుక వలె శక్త్యాయుధము లక్ష్మణుడి విశాల వక్షస్థలము మీద మరీ గాటముగా నాటుకొన్నది. అతని ఎదురురొమ్ముల మీద బలమైన గాయము అయింది. అతడు ఒళ్ళు తెలియకుండా నేలమీద పడి పోయినాడు.

ఆ సమీపములోనే ఉన్న మహాతేజోవంతుడు రాముడు లక్ష్మణుడి ఆ దురవస్థను చూచినాడు. విషణ్ణుడు అయిపోయినాడు. కన్నీళ్ళు కారుస్తూ ఒక ముహూర్తము సేపు ఆలోచించినాడు. దుఃఖపడడానికి అది సమయం కాదు అనుకొన్నాడు. ప్రళయకాలాగ్నిహోత్రునివలె రేగినాడు. ఏమి అయినప్పటికిన్నీ

విభీషణుగారు అయినప్పటికిన్ని రావణాసురుణ్ణి చంపివేయడానికి నిశ్చయించుకొన్నాను. శక్త్యాయుధము గుచ్చుకొని నెత్తురుతో తడిసిపోయి పడిఉన్న లక్ష్మణుడు పాముచేత కరవబడ్డ పర్వతమువలె కనుపించాడు. ఆ శక్త్యాయుధాన్ని వానరులు లాగివేయడానికి ప్రయత్నము చేసినారు. కానీ ఆ బలవంతుడు రావణాసురుడు కురుస్తూఉన్న బాణాలు గుచ్చుకొని బాధపడుతూ ఉన్నందువల్ల దానిని వారు లాగివేయలేక పోయినారు. లక్ష్మణుణ్ణి భేదించి నేలలో దిగబడిపోయిన ఆ మహాశక్త్యాయుధాన్ని అప్పుడు ఆ బలవంతుడు రాముడు తన రెండు చేతులా పట్టుకొని పైకిలాగి దానిని విరిచివేసినాడు.

ఆ మహాశక్త్యాయుధాన్ని రాముడు పైకిలాగి విరిచివేస్తూ ఉండగా రావణాసురుడు రాముని సమస్త అవయవాలలోనూ బాణాలు వదిలినాడు. అట్లా తన మర్మస్థానాలలో పడుతున్న బాణాలను సహించి ఏమాత్రమూ లక్ష్యము చేయకుండా రాముడు లక్ష్మణుణ్ణి కౌగలించుకొని హనుమంతుణ్ణీ సుగ్రీవుణ్ణీ తక్కిన వానరవీరులనూ చూచి "ఓ వానరవీరులారా, మీరు ఇక్కడనే ఈ లక్ష్మణుడిచుట్టూ కనిపెట్టుకొని ఉండండి. ఎంతో కాలమునుంచీ కోరుకొంటూఉన్న చాతకపక్షికి వేసంగి అయిపోగానే మేఘము అగుపించినట్టు బహుకాలమునుంచీ పరాక్రమించవలెను అనుకొంటూ ఉన్న నాకు ఇప్పుడు ఈ పాపాత్ముడు ఈ పాపనిశ్చయుడు రావణాసురుడు దొరికినాడు. వీణ్ణి నేను చంపివేస్తాను.

"ఓ వానరులారా, ఎంతోసేపు పట్టదు. నేను సత్యప్రమాణము చేసి చెప్పుతున్నాను. ఈ జగత్తులో ఒక్క ముహూర్తము సేపటిలో రావణాసురుడు అయినా ఉండడు. లేదా రాముడు అయినా ఉండడు. ఓ వీరులారా, నాకు రాజ్యము పోయింది నేను వనవాసము చేసినాను. దండకారణ్యము అంతా తిరిగి చూచినాను. రాక్షసులు నన్ను ఎదిరించినారు. నా భార్యను సీతను పరపురుషుడు తాకినాడు. ఎత్తుకొని పోయినాడు. ఇన్ని దుఃఖాల పాలు అయినా నేను నిబ్బరించుకొన్నాను. ఇప్పుడు ఈ లక్ష్మణుడికి తగిలిన దెబ్బ నుంచి నేను మహా ఘోరనరకబాధ అనుభవిస్తున్నాను. నా దుఃఖము మేర మీరి పోయింది. ఈ దుఃఖము అంతా తీరి పోవడానికి నేను ఈ రావణాసురుణ్ణి సంహారము చేయవలెను. ఈ రావణాసురుడికోసమే నేను పోరాటములో వాలిని చంపి వేసినాను. సుగ్రీవుణ్ణి వానరరాజుగా చేసినాను. ఈ దురాత్ముడి కోసమే మీ మీ సైన్యాలను ఇక్కడికి తీసుకొని వచ్చినాను. మీ చేత మహా సముద్రానికి సేతువు కట్టించినాను. వీడు ఈ పాపిష్టివాడు ఈ యుద్ధరంగములో

ఇప్పుడు నా కంటికి కనపడుతున్నాడు. విషపు చూపు చూచే పాము కంట పడ్డవాడు ఎవడూ బ్రతుకడు. వీడు ఇప్పుడు నా కంట పడ్డాడు. ఇక వీణ్ణి నేను జీవించనీయను.

"ఓ వానరవీరులారా, మీరు అందరూ ఎదిరించ నలవికాని పరాక్రమవంతులు. నాకు తెలుసును. ఇక్కడ స్వస్థముగా కూర్చొని ఉండండి. నాకూ రావణాసురుడికీ జరిగే యుద్ధము చూడండి. యుద్ధభూమిలో రాముడి రామత్వము ఏమిటో ముల్లోకాలలో ఉన్న దేవతలూ దేవర్షులూ చారణులూ గంధర్వులూ మొదలైనవారు అందరూ ఇప్పుడు చూస్తారు. చరాచరము అయిన సమస్తలోకాలవారూ భూమి ఉండేటంతవరకూ నేను ఎట్లా పోరాడిందీ చెప్పుకొంటారు" అని రాముడు చెప్పినాడు.

అంతట రాముడు హెచ్చరికతో యుద్ధాభిముఖుడు అయినాడు. తప్త కాంచన భూషిత తీక్ష్ణ బాణాలు ఇట్టే అమ్ములపొదిలో నుంచి తీసినాడు. రావణాసురుడి మీద వదిలినాడు. అప్పుడు రాముడి మీద రావణాసురుడు మేఘము జలధారలను వర్షించేటట్లు మంటలు మండుతూ ఉన్న బాణాలనూ భయంకరము అయిన ముసలాయుధాలనూ కురిపించినాడు. రామరావణులు ఉభయులూ వదిలిన బాణాలు పరస్పరమూ ఆకాశములో కొట్టుకొంటూ ఉంటే మహాధ్వని అయింది. అవి అట్లా కొట్టుకొని విరిగి పోయి కొనలు మంటలు మండుతూ అంతరిక్షమునుంచి వెదచల్లినట్లు నేల మీద పడ్డవి. ఆ ఉభయ ధనుష్టంకారధ్వనులకూ సమస్త ప్రాణికోటి సంచలించింది. భయపడ్డది. ఆశ్చర్యపడ్డది.

ఆ మహాపరాక్రమవంతుడు రాముడు జ్వలిస్తూ ఉన్న తన ధనుస్సులో నుంచి బాణవర్షము కురిపిస్తూ ఉంటే ఒంటినిండా ఆ బాణాలు అన్నీ గుచ్చుకొని రావణాసురుడు బాధపడ్డాడు. భయపడ్డాడు. గాలికి మేఘమువలె పరుగు లెత్తినాడు.

## ౧౦౨

రావణాసురుడి మహాశక్త్యాయుధము దెబ్బ తిని ఒళ్లుఅంతా నెత్తురుతో తడిసిపోయిన శూరుణ్ణి లక్ష్మణుణ్ణి చూచి రాముడు కోపముతో రేగి ఆ దురాత్ముడితో దొమ్మిగా పోరాటము సాగిస్తూ సుషేణుణ్ణి చూచి "సుషేణుడా, రావణాసురుడి శక్త్యాయుధము దెబ్బకు నేలమీద పడిపోయిన ఈ వీరుడు లక్ష్మణుడు నా తమ్ముడు పామువలె పొర్లాడుతూ ఉన్నాడు. నేను ఈ దుఃఖము

భరించలేకుండా ఉన్నాను. నీవు నా ప్రాణముకన్న నాకు ఎంతో ఇష్టుడు. ఈ స్థితిని చూస్తూ ఉంటే నా మనస్సు కలవరపడిపోతూ ఉన్నది. ఈ ఘోర యుద్ధంలో నేను ఎట్లా పోరాడగలను. నా శక్తి పోతున్నది. ఈ శుభలక్షణుడు లక్ష్మణుడు చనిపోయాడు నా తమ్ముడు చనిపోయేటట్లయితే నేను బ్రతికిఉండడము దేనికి నేను సుఖపడడము ఎందుకు. దురాత్ముడు రావణాసురుడు నా ఎదుటనే ఈ నా తమ్ముణ్ణి పడకొట్టినాడు. అందువల్ల నా పరాక్రమము కుంటుపడ్డట్లుగా ఉన్నది. దీన్ని చూస్తూ ఉంటే నాకే సిగ్గువేస్తూ ఉంది. ఇప్పుడు ధనస్సు నా చేతిలోనుంచి జారిపోతూ ఉన్నట్లుగా ఉంది. బాణాలు వెనుకకు లాగుతూ ఉన్నట్లుగా ఉన్నది. కన్నీళ్లు కమ్ముకొన్నందువల్ల నాకు చూపు పోతూ ఉన్నట్లుగా ఉంది. కలలో నడుస్తున్న వాడివలె నా పాదాది అవయవాలు ఇప్పుడు తడపడుతూ ఉన్నవి నేను ఇప్పుడు తీవ్రదుఃఖములో ఉన్నాను. నా దుఃఖము పెచ్చు పెరిగిపోతూ ఉన్నది. నాకు ఇప్పుడు చచ్చిపోవలెను అనిపిస్తున్నది" అని చెప్పినాడు. ఆయుద్ధ ప్రదేశములో దెబ్బ తగిలి యమయాతన అనుభవిస్తూ నిట్టూర్పులు విడుస్తూ ఉన్న తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి చూచి రాముడు దుఃఖ పరవశుడు అయినాడు. ఏడ్చినాడు. "ఓ వీరులారా నా తమ్ముడు పడిపోయి నాడు. ఈ యుద్ధభూమిలో దుమ్ముకొట్టుకొని పొర్లాడుతూ ఉన్నాడు. నాకు ఇక యుద్ధముతో ఏమి పని. ప్రాణముతో ఏమి పని. సీతతో ఏమి పని. ఈ యుద్ధభూమిలో నా తమ్ముడు పోయిన తరువాత నేను రాజ్యము చేయడము ఎందుకు. యుద్ధము చేయడము ఎందుకు. దేశదేశాలలోను భార్యలు దొరుకుతారు. దేశదేశాలలోనూ మిత్రులూ బంధువులూ దొరుకుతారు. తోడ పుట్టిన వాడు తమ్ముడు ఏ దేశములో ఎట్లా దొరుకుతాడు" అని ఎలుగెత్తి ఏడ్చినాడు. ఆ దుఃఖముతో అతని దేహేంద్రియాలు స్వాధీనము తప్పిపోయినవి. నేలమీద ఇట్టే చతికిల పడిపోయినాడు పదే పదే నిట్టూర్పులు విడువసాగినాడు శోకధ్యానపరాయణుడు అయినాడు. అప్పుడు ఆ మహావీరుణ్ణి సుషేణుడు చూచి "ఓ మహాబాహూ, ఈ లక్ష్మణుడు విజయలక్ష్మీవర్ధనుడు. ఇతడు చని పోలేదు. ముఖములో ఏ వికారమూ కనిపించటము లేదు. ముఖము వివర్ణము అయిపోలేదు అంతే కాదు. ఇతని ముఖములో కళకాంతులు మాసిపోలేదు. పైగా ముఖము ప్రసన్నముగా కనపడుతున్నది. ఈతని అరచేతులు ఎర్రతామర పూలవలె ఎర్రగా ఉన్నవి. కన్నులు మూసుకొని ఉన్నప్పటికీ ప్రసన్నముగా కనపడుతూ ఉన్నాడు. ఓ ప్రభూ ప్రాణము పోయినవాడి రూపము ఇట్లా ఉండదు. ఈ లక్షణాలు దీర్ఘాయుష్మంతుల ముఖముమీదనే కనపడతవి. ఓ వీరుడా ఈ లక్ష్మివర్ధనుడికి ఇంతవరకూ చావు రాలేదు. ఈ అరిందముడు

ఇంకా ప్రాణముతోనే ఉన్నాడు. ప్రభూ. నీవు దుఃఖపడవద్దు ఇతడు మూర్ఛపోయి ఉన్నాడు చూడు. ఇతని గుండె పదే పదే కొట్టుకొంటూ ఉన్నది. నిట్టూర్పులు విడుస్తూ ఉన్నాడు" అని చెప్పి ఊరడించినాడు.

ఆ మాటనేర్పరి సుషేణుడు ఆ విధముగా రాముణ్ణి ఓదార్చి హనుమంతుణ్ణి చూచి "ఓ మారుతీ నీవు మంచివాడవు. పరమపరాక్రమవంతుడవు. మంగళకరముఅయిన ఓషధిపర్వతాన్ని గురించి నీకు ఇదివరకు జాంబవంతుడు చెప్పి ఉన్నాడు. నీవు వెంటనే ఇప్పుడే ఇక్కడనుంచి బయలుదేరి పోవలెను. ఆ పర్వతము దక్షిణశిఖరముమీద ఉన్న మూలికలను పట్టుకొని రావలెను ఈ వీరుణ్ణి ఈ ప్రాజ్ఞుణ్ణి లక్ష్మణుణ్ణి బ్రతికించవలెను. విశల్యకరణీ సువర్ణకరణీ సంజీవకరణీ సంధానకరణీ అనే నాలుగు మూలికలను చప్పున తీసుకొని రా" అని చెప్పినాడు. ఆ ధైర్యవంతుడు హనుమంతుడు అప్పటికి అప్పుడు బయలుదేరి ఆ ఓషధిపర్వతము మీదికి పోయినాడు. ఆ చెప్పిన మహౌషధులు ఎట్లా ఉంటాయో తెలియక ఆలోచించ సాగినాడు. సుషేణుడు ఈ పర్వతము దక్షిణ శిఖరము మీద లక్ష్మణుణ్ణి బ్రతికించే నాలుగు ఓషధులు ఉన్నవని చెప్పినాడు. అవి ఏవో నాకు తెలియడము లేదు. ఆ ఓషధులను గురించి విచారించడానికి మళ్ళీ పోయి వచ్చేట్టయితే కాలాతీతము అవుతుంది. అందువల్ల మహా హాని జరుగవచ్చును. కాబట్టి ఈ పర్వతశిఖరాన్నే పట్టుకొని పోవడము మంచిది" అనుకొని ఆ అమిత తేజోవంతుడు ఆ మహాబలవంతుడు హనుమంతుడు ఆ పర్వత శిఖరము మీదికి పోయి ముమ్మారు కదిలించినాడు. పూలు విరగపూసిన నానావిధ వృక్షాలతో ఉన్న ఆ పర్వతశిఖరాన్ని పెళ్ళగించి రెండు చేతులా పట్టుకొని పైకి ఎతినాడు జలపూర్ణము అయిన నీలమేఘము వంటి ఆ పర్వత శిఖరాన్ని అట్లా పట్టుకొని ఆకాశమార్గానికి హనుమంతుడు ఎగిరినాడు. మహా వేగముతో పోయి యుద్ధరంగములో ఆ పర్వతశిఖరాన్ని దించి కొంచెము సేపు అలుపు తీర్చుకొని సుషేణుణ్ణి చూచి "ఓ వానరపుంగవా, నీవు చెప్పిన మూలికలు ఎట్లా ఉంటాయో నాకు తెలియవు అందువల్ల ఆ పర్వతశిఖరాన్నే పట్టుకొని వచ్చినాను" అన్నాడు. అందుకు ఆ వాయుపుత్రుణ్ణి ఆ వానరోత్తముడు సుషేణుడు ప్రశంసించినాడు. దేవతలు సహితము చేయలేని పని చేసిన హనుమంతుణ్ణి ఆ యుద్ధభూమిలో వానరులూ రాక్షసులూ చూచి విస్మితులు అయినారు.

అంతట ఆ పర్వతముమీదవున్న మూలికలను ఆ వానరోత్తముడు సుషేణుడు పెళ్ళగించినాడు. ఒక ఓషధిని నలగకొట్టి మహా తేజోవంతుడు అయిన

లక్ష్మణుడి ముక్కు దగ్గర ఉంచినాడు. ఆ మూలికను వాసన చూడగానే ఆ పర వీరహంత శరీరములో గుచ్చుకొన్న ఆయుధపు అలుగులు అన్నీ రాలి పడిపోయి నవి. అంతవరకూ నేలమీద పడివున్న లక్ష్మణుడు అప్పుడు ఏబాధా లేకుండా హాయిగా లేచినాడు. చచ్చిపడిపోయినాడు అనుకొన్న లక్ష్మణుడు లేవ గానే వానరులు అందరూ ఎంతో సంతోషపడ్డారు. అందరూ సుషేణుణ్ని ప్రశంసించినారు.

రాముడు సంతోషములో కనులవెంట నీళ్లు కారుస్తూ "రా రా తమ్ముడా!" అంటూ ప్రేమాతిశయముతో లక్ష్మణుణ్ని గట్టిగా కౌగలించుకొని "ఓ వీరుడా, నీవు నా భాగ్యవశముచేత మళ్లీ జీవించినావు. నీవు జీవించి ఉండక పోయే టట్టయితే నేను జీవించడము ఎందుకు, నాకు సీతతో ప్రయోజనము ఏమిటి, నేను జయించడము ఎందుకు" అని చెప్పుతూ ఉంటే లక్ష్మణుడు ఖిన్నుడు అయిపోయి మాటలు తడబడుతూ "అన్నా రామా, నీవు సత్యపరాక్రముడవు, విభీషణుడికి లంకాపట్టణము కట్టుతాను అని నీవు శపథము చేసినావు, ఎవరో బలములేని అల్పుడివలె నీవు ఇప్పుడు ఈ విధముగా చెప్పవద్దు. రామా, నీవు పాపరహితుడవు సత్పురుషులు ప్రతిజ్ఞ తప్పరు, ప్రతిజ్ఞాపరిపాలనము మహాత్ముల లక్షణము ఓ పుణ్యాత్ముడా, నాకోసము నీవు నిరాశ చెందడము చాలు, ఇక నీవు రావణాసురుణ్ని సంహారము చేసి నీ ప్రతిజ్ఞ చెల్లించవలెను. తీక్షణదంష్ట్రి లతో గర్జిస్తూ ఉన్న సింహాము కంటపడ్డ మహాగజము చావకతప్పదు. అదేవిధముగా నీ బాణపథములోకి వచ్చిన శత్రువు బ్రతికివుండడము ఉత్తది. సూర్యాస్తమయము అయ్యేలోపల ఆ దురాత్ముణ్ని రావణాసురుణి నీవు వధించవలెను, ఇది నా కోరిక.

"ఓ వీరుడా, నీవు లంకాపట్టణానికి విభీషణుణ్ని రాజునుచేసే ప్రతిజ్ఞ చెల్లించవలెను అనుకొంటున్నట్లయితే ఆ జనకాత్మజను సీతాదేవిని పొందవలెను అనుకొంటూ ఉన్నట్లయితే నీవు ఇప్పుడు పోరాటములో రావణాసురుణ్ణి సంహారము చేయవలెను" అని చెప్పినాడు.

## ౧౦౩

లక్ష్మణుడు చెప్పినది అంతా విని ఆ పరమపరాక్రమవంతుడు రాముడు ధనుస్సు తీసుకొన్నాడు. భయంకరము అయిన బాణాన్ని సంధించినాడు.

అప్పుడు రావణాసురుడు మరి ఒక రథము ఎక్కి సూర్యుణ్ణి పట్టుకో పోయే రాహువువలె రాముడికి ఎదురుగుండా వచ్చినాడు. అట్లా రథముమీద

వచ్చిన రావణాసురుణ్ణి గురి చేసి రాముడు మహాభయంకరము అయిన వజ్రపాతము వంటి బాణవర్షము కురిపించినాడు. జ్వలిస్తూ ఉన్న అగ్నిహోత్రము వంటి బంగారు బాణాలు యుద్ధములో ఆరితేరిన ఆ రావణాసురుణ్ణి ఛేదించినవి. రావణాసురుడు మహోగ్రుడు అయినాడు.

రాముడు భూమి మీద ఉండీ రావణాసురుడు రథముమీద ఉండీ పోరాడడము సరిగా లేదు అని దేవతలూ గంధర్వులూ దానవులూ దేవేంద్రుడితో చెప్పినారు. దేవేంద్రుడు అంతట తన రథాన్ని తోలుకొని పొమ్మని తన సారథి మాతలితో చెప్పినాడు ఆ రథాన్ని దేవలోకములోనుంచి మాతలి రాముడి దగ్గరికి తోలుకొని వచ్చినాడు. ఆ రథభాగాలన్నీ బంగారముతో చేసినవి దాని నొగ వైడూర్యమయము అయింది. వందలకొద్దీ ఘంటలు కట్టి ఉన్నవి దానిలో తెల్లని గొడుగు అమర్చి ఉన్నది. అది తరుణాదిత్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్నది. దాని ధ్వజము బంగారుదండెము బంగారు శిరోభూషణాలతోనూ ఒంటినిండా బంగారు ఆభరణాలతోనూ అలంకరించి ఆ రథానికి పూన్చిన ఆకుపచ్చని గుర్రాలు మిట్ట మధ్యాహ్న సూర్యకాంతులతో తేజరిలినవి. ఆ రథసారథి మాతలి మునికోలను పట్టుకొని చేతులు జోడించి రాముడితో "ఓ కాంతిమంతుడా, ఓ బలవంతుడా, ఓ శత్రు సంహారకా, నీకు నమస్కారము. నీ విజయము కోసము దేవేంద్రుడు ఈ రథాన్ని ఇచ్చి నన్ను పంపించినాడు. ఇదిగో ఇంద్ర ధనస్సు. ఇదిగో అగ్నిహోత్రము వంటి కవచము. ఇదిగో సూర్యసమానము అయిన బాణాలు. ఇవే కాదు. నిర్మలమూ అమితతీక్షణమూ అయిన శక్త్యాయుధము ఇచ్చి పంపించినాడు. నేను నీకు ఈ రథము తోలడానికి వచ్చినాను. ఓ వీరుడా, నీవు ఈ రథము ఎక్కు. దానవులను దేవేంద్రుడి వలె రావణాసురుణ్ణి నీవు వధించు. నేను ఈ రథము తోలుతాను" అని చెప్పినాడు.

మాతలి చెప్పిన మాటలు విని రాముడు ఆ రథానికి ప్రదక్షిణము చేసినాడు. నమస్కారము చేసినాడు. తన దివ్యకాంతులతో లోకాలను తేజరిల్ల చేసే రాముడు అప్పుడు ఆ రథము ఎక్కినాడు.

అంతట ఆ మహాబాహువు రాముడికీ రావణాసురుడికి మహాభయంకరము గానూ ఒళ్ళు గగుర్పుట్టించేట్టుగానూ అద్భుతముగానూ యుద్ధము జరిగింది. రాక్షసరాజు రావణాసురుడు వేసిన గంధర్వాస్త్రాన్ని గంధర్వాస్త్రముతోనూ దైవాస్త్రాన్ని దైవాస్త్రముతోనూ ఆ పరమాస్త్రవేత్త రాముడు కొట్టి వేసినాడు. అందుకు ఆ నిశాచరుడు మహోగ్రుడు అయిపోయి మహాభయంకరము

అయిన రాక్షసాస్త్రాన్ని రాముడి మీద వదిలినాడు. అప్పుడు రావణాసురుడి ధనుస్సులో నుంచి వెలువడిన బంగారుబాణాలు మహావిషసర్పాల రూపము ధరించినవి. మంటలు మండుతూ ఉన్న నోళ్లతో మంటలు మండుతూ ఉన్న నిప్పులు కక్కుతూ మహాభయంకరముగా నోళ్లు తెరచి అవి రాముణ్ణి పట్టుకో వచ్చినవి. వాసుకితో సరిసమానము అయిన ఆ మహాసర్పాలు మంటలు మండుతూ ఉన్న పడగలతో అన్నిదిక్కులా వ్యాపించినవి అటూ తనను చుట్టివేస్తూ ఉన్న ఆ మహాసర్పాలను చూచి రాముడు భయంకరము అయిన గారుడాస్త్రాన్ని వదిలినాడు. అప్పుడు రాముడి ధనస్సులో నుంచి వెలువడిన బంగారు బాణాలు అగ్నిహోత్రకాంతులతో తేజరిల్లుతూ ఇట్టే గరుడపక్షుల రూపము ధరించినవి. గరుడ రూపము ధరించిన బాణాలు సర్పరూపము ధరించిన బాణాలను అన్నిటినీ కొట్టివేసినవి

రావణాసురుడు తన రాక్షసాస్త్రము హతము అయిపోవడము చూసినాడు. మహాఘోరము అయిన బాణవర్షము రాముడిమీద కురిపించ సాగినాడు. వేలకొద్ది బాణాలువదిలి రాముణ్ణీ రథముతోలుతూఉన్న మాతలినీ నొప్పించినాడు. అంతట ఒక్క బాణము వదిలి ఆ రథధ్వజాన్ని పడకొట్టినాడు. ఎన్నో బాణాలు వదిలి దేవేంద్రుడి గుర్రాలను నొప్పించినాడు. రావణాసురుడు చేస్తూ ఉన్న ఆ మహాత్కార్యానికి దేవతలూ గంధర్వులూ చారణులూ సిద్ధులూ మహర్షులూ విషణ్ణులు అయిపోయినారు. రాముడు బాధపడడము చూచి విభీషణుడూ వానరవీరులూ వ్యధపడిపోయినారు. రావణాసురుడు అనే రాహువు రాముడు అనే చంద్రుణ్ణి పట్టుకోపోవడము చూచి బుధుడు ప్రజలకు అమంగళము చేయడానికోసము ప్రజాపతి దేవతాకమూ చంద్రుడికి ప్రియమూ అయిన రోహిణీ నక్షత్రాన్ని అప్పుడు ఆక్రమించినాడు అన్నివైపులా పొగలుకమ్ముకొని మహాసముద్రము మంటలు మండుతూ అలలతో సూర్యుణ్ణి పట్టుకోపోతూ ఉన్నట్టు పైకి లేచింది. సూర్యుడి కిరణాల తేజము మందగించింది. ధూమకేతువుతో చేరి సూర్యబింబము ఒక మొండెముగా కనుపించింది. ఆకాశములో స్పష్టముగా కనుపించే ఇంద్రదేవతాకమూ అగ్నిదేవతాకమూ అయిన ఇక్ష్వాకువంశీయుల విశాఖానక్షత్రాన్ని అప్పుడు అంగారకుడు ఆక్రమించినాడు. మహాసముద్రములో మైనాకపర్వతము లేచినట్టు అప్పుడు దశగ్రీవుడు పదితలలతోనూ ఇరవై చేతులతోనూ ధనుర్ధరుడు అయి నిలుచున్నాడు ఆ రణరంగములో అట్లా లేచిన దశగ్రీవుణ్ణి రాముడు చూచినాడు. తికమక పడ్డాడు. ధనుస్సులో బాణాలను ఎక్కుపెట్టలేక పోయినాడు, క్రుద్ధుడు అయిపోయినాడు. కనుబొమలు ముడి

పడిపోయినవి. కన్నులు ఎఱ్ఱబడిపోయినవి. చూపులతో దహించి వేసేటట్టు పదితలలతో లేచిన రావణాసురుణ్ణి చూచినాడు.

## ౧౦౪

అప్పుడు పరమ కుపితుడు అయిన రాముడి ముఖము చూచి సర్వభూత కోటి భయపడిపోయింది. భూమీ పర్వతాలూ మహావనాలూ వణికిపోయినవి. సింహశార్దూలాలు భయంకరముగా గర్జించినవి. నదులూ మహాసముద్రమూ అల్లకల్లోలము అయినవి. ఆకాశములో సంచరించే పక్షులు భయంకరముగా కూసినవి. మేఘాలు మహోత్పాతసూచకముగా ఉరుములు ఉరుముతూ ఆకాశము అంతటా పరుగులెత్తినవి. మహాదారుణము అయిన ఆ ఉత్పాతాలనూ పరమక్రుద్ధుడు అయిపోయిన రాముణ్ణి చూచి, సమస్త ప్రాణులూ భయపడ్డవి. రావణాసురుడున్నూ వెరచినాడు.

ఆ శూరులు రామరావణులు అంతట భయంకరము అయిన నానావిధాయుధాలతోనూ పోరాటము సాగించినారు. ప్రళయము వస్తూ ఉన్నట్లుగా ఆ మహాయుద్ధము జరుగుతూ ఉంది. దేవతలూ గంధర్వులూ మహోరగులూ మహర్షులూ దానవులూ దైత్యులూ గరుత్మంతులూ ఖేచరులూ పైన విమానాలలో నుంచి చూచినారు. రాముడి మీద అనురాగముతో సురలూ రావణాసురుడి మీద అనురాగముతో అసురులూ ఆ మహాయుద్ధాన్ని చూస్తూ సంతోషాతిశయముతో అసురులు రావణాసురుడు జయించవలెను అనీ, సురులు రాముడు జయించవలెను అనీ పదే పదే చెప్పుకొన్నారు.

ఆ సమయములో రావణాసురుడు మహాభయంకరము అయిన శూలాయుధాన్ని అందుకొన్నాడు. అది వజ్రము వంటిది. మహాధ్వనులు చేస్తూ అంతరిక్షములో పోతుంది. సమస్తశత్రువులనూ సంహారము చేసివేస్తుంది. దాని శిఖరాలు పర్వతశిఖరాల వంటివి. దానిని చూస్తేనే భయము వేస్తుంది. పొగలు కమ్ముకొంటూ ప్రళయకాలాగ్ని సమూహమువలె పరమభయంకరము అయినది. యముడు సహితము దానిని సమీపించలేడు. సర్వభూతభయావహము అయిన ఆ శూలము చీల్చి వేయగలదు. నరికి వేయగలదు. అటువంటి ఆ శూలాన్ని రావణాసురుడు క్రోధావేశముతో మండిపడుతూ చేతిలో తీసుకొన్నాడు. రాక్షసుల మధ్యలో ఉన్న ఆ పరమకుపితుడు ఆ అమితపరాక్రమవంతుడు రావణాసురుడు ఆ శూలము మధ్యలో పట్టుకొన్నాడు. ఆ మహాకాయుడు కన్నులలో నుంచి నిప్పుకణాలు రాలుస్తూ ఆ మహాశూలాన్ని పైకి ఎత్తినాడు.

వానికి అటూ ఇటూ ఉన్నవా తన సైన్యము అంతా
సంతోషపడేటట్టు మహాస్వరముగా సింహనాదము చేసినాడు. ఆ దారుణ
సింహనాదానికి భూమీ ఆకాశమూ దిక్కులూ విదిక్కులూ కంపించి పోయి
నవి. పర్వతాలూ విరిగిపడి పోయినవి. సముద్రము అల్లకల్లోలము అయింది.
అప్పుడు ఆ మహాపరాక్రమవంతుడు రావణాసురుడు రాముణ్ణి చూచి
“ఓరామా నీకోసము ఇప్పుడు శూలాన్ని ఎత్తినాను. ఇది వజ్రము అంత
కఠినమైనది. ఇప్పుడే ఈ మహాశూలము నీ ప్రాణాలను తీసివేస్తుంది.
అంతటితో పోదు, నీకు తోడుగా ఉండటానికి నీ తమ్ముడి
ప్రాణాలను కూడా తీసివేస్తుంది. ఓ, రణశ్లాఘీ, నిన్ను ఇప్పుడే
చంపివేస్తాను. ఈ యుద్ధభూమిలో చచ్చిపోయిన రాక్షసవీరుల దగ్గరకు
పోయి చేరు. ఓ రామా, నిలు అంటూ ఆ మహాశూలాన్ని విసరివేసినాడు.
రావణాసురుడి చేతిలో నుంచి వెలువడిన ఆ మహాశూలము దానికి
కట్టిన ఎనిమిది గంటలూ చెవులు బద్దలు అయిపోయేటు మోగుతూ అది
మంటలు మండుతూ మెరుపులవలె మెరిసింది. మంటలుమండుతూ అట్లా భయం
కరరూపముతో తనమీదికి వస్తూ ఉన్న ఆ మహాశూలాన్ని రాముడు చూచినాడు.
తన ధనుస్సును వంచినాడు. ఆ మహాశూలాన్ని గురి చేసినాడు. ప్రళయకాలా
గ్నిని చల్లార్చటానికి దేవేంద్రుడు జలప్రవాహాలను వదిలి పెట్టేటట్టు రాముడు
బాణప్రవాహాన్ని వదిలినాడు. అవి అన్నీ అగ్నిహోత్రములో పడ్డ మిడుతల
దండు వలె ఆ శూలానికి పోయి తగులుకొని దగ్ధము అయి పోయినవి. అవి ఆ
శూలాన్ని తాకే తాకటముతో తగుల పడి బూడిద అయిపోయినవి అది
రాముడు చూచినాడు. మహాక్రుద్ధుడు అయి పోయినాడు. మాతలి రథముతో
తెచ్చిన దేవేంద్రుడి మహాశక్త్యాయుధాన్ని అందుకొన్నాడు. దానిని ఆ బలవం
తుడు రాముడు తన బలముకొద్దీ ఊపినాడు. శూలాయుధము మీద విసరి వేసి
నాడు. దాని ఘంటలు భయంకరముగా మోగినవి. అది ప్రళయకాల
మహోల్కమువలె మంటలు మండింది ఆ మహాశక్త్యాయుధాన్ని రావణా
సురుడు వదిలిన శూలము వచ్చి తాకింది. దాన్ని తాకె తాకటముతో ఆ మహా
శూలము విరిగి పోయింది. దాని కొంతులు మాసిపోయినవి. రెండు ముక్కలు
అయి క్రింద పడిపోయింది. రాముడు అంతట మహాధ్వనులు చేస్తూ అమిత వేగ
ముతో పోయే తీక్షణబాణాలను వదిలి మహావేగముతో పరుగులెత్తే రావణా
సురుడి గుర్రాలను పడకొట్టినాడు. పరమ జాగరూకతతో రావణాసురుడి వక్ష
స్థలముమీద బాణాలు వదిలినాడు. మరి మూడు బాణాలను అతని లలాటము
మీద వదలినాడు. రాముడు వదలిన ఆ బాణాలు అన్నీ గుచ్చుకొని రావణా

సుడి దేహము అంతా నెత్తుటితో తడిసిపోయింది. ఆ నిశాచర రాజు అప్పుడు పూలు విరగపూసిన అశోకవృక్షమువలె కనుపించినాడు. అతనికి దిగులు కలిగింది. పట్టరాని కోపము వచ్చింది.

౧౦౫

పోరాటములో పొగరెక్కిన రావణాసురుడు యుద్ధరంగములో రాముడి బాణాలను ఓర్చుకోలేకపోయినాడు. రోషపడ్డాడు. మహా కోపము వచ్చింది. కన్నులు జ్యోతులు అయిపోయినవి. ధనుస్సువంచి రాముడిమీద బాణాలు కురిపించడము మొదలుపెట్టినాడు. వర్షధారలవలె బాణాలు వచ్చి మీద పడుతూ ఉంటే రాముడు ఏమాత్రమూ చలించకుండా మహా పర్వతము వలె నిలుచున్నాడు. ఆ బాణ ధారలను తన బాణాలతో అడ్డగిస్తూ వాటిని సూర్యకిరణాలవలె సహించినాడు. రావణాసురుడు అప్పుడు మహోగ్రుడు అయి ఒక్క వేయిబాణాలను అమితవేగముతో రాముడిమీద వదిలినాడు. ఆ బాణాలు గుచ్చుకొని దేహము అంతా నెత్తుటితో తడిసిపోయి రాముడు అడవిలో పూలు విరగపూసిన మోదుగచెట్టువలె కనిపించినాడు.

ఆ మహాతేజోవంతుడు రాముడు ఆ బాణాల దెబ్బలకు మహాకోపముతో రేగి ప్రళయకాల సూర్యుడివంటి తేజోమయము అయిన బాణాలనుతీసి ఇట్టే రావణాసురుడిమీద వదిలినాడు. రావణాసురుడున్నూ అమితవేగముతో పోయే బాణాలను రాముడిమీద వదిలినాడు. అట్లా ఉభయులూ ఒకరిమీద ఒకరు బాణాలు వదులుకొంటూ ఉంటే ఆ ప్రదేశము అంతా బాణాలతో నిండి అంధకారబంధురము అయింది. ఆ చిమ్మచీకటిలో రామరావణులు ఒకరికి ఒకరు కనిపించలేదు. అప్పుడు రాముడు నవ్వుతూ రావణాసురుడితో "ఓ రావణుడా, నీవు రాక్షసులలో అధముడవు. ఎందువల్లనంటే జనస్థానములో నేను లేనప్పుడు ఏమిచేయడానికీ తోచక వివశ అయిపోయిన నా భార్యను నాకు తెలియకుండా నీవు అపహరించుకొని వచ్చినావు అందువల్ల నీవు రాక్షసులలో అధముడవు అనీ పరాక్రమహీనుడవు అనీ అంటున్నారు. ఆ మహారణ్య మధ్యములో నేను లేనప్పుడు ఒంటరిగా ఉండి నిన్ను చూచి భయపడి దీనురాలు అయిపోయిన నా భార్యను వైదేహిని నీవు బలత్కారముగా తెచ్చి "నేను శూరుడను" అని నీవు అనుకొంటూ ఉన్నావు. నీవు పరదారలను తనిపే శూరుడవు. తమ భర్తలు దగ్గరలేని స్త్రీల విషయములో కాపురుషులుచేసే పనిచేసి "నేను శూరుణ్ణి" అని నీవు తలుస్తూ ఉన్నావు. నీవు సిగ్గుమాలినవాడవు. నీవు మర్యాద తప్పినావు. సదాచారాన్ని వదిలిపెట్టినావు. కండకావరముతో నీ అంతట

నీవే స్వప్రశంస తెచ్చుకొని "శూరుణ్ణి" అని విర్రవీగుతూ ఉన్నావు. నీవు శూరుడవా? కుబేరుని తమ్ముడవా? సమస్త బల సంపన్నుడవా? కొనియాడ తగిన పనే చేసినావు మహాయశస్సు తెచ్చిపెట్టే పనే చేసినావు. ఓ దుర్మార్గుడా, నీవు గర్వాతిశయముతో మహా పాడుపని చేసినావు. లోకము నిందించే పని చేసినావు. ఆ చేసినపనికి ఇప్పుడు ప్రతిఫలము అనుభవించు. ఓ దుర్మార్గుడా, నేను శూరుణ్ణి అని నిన్ను గురించి నీవు చెప్పుకొంటూ ఉన్నావు. సీతను దొంగ వలె లాగుకొని పోయేటప్పుడు నీకు సిగ్గు వేయ లేదా. సీతను బలవంతముగా ఎత్తుకొని పోవడానికి నేను ఉండగా నీవు వచ్చి ఉన్నట్లయితే నా బాణాలు నిన్ను ఎత్తుకొనిపోయి నీ తమ్ముణ్ణి ఖరుణ్ణి నీకు చూపించి ఉండేవి. ఓ దుష్టాత్ముడా, దైవవశమువల్ల నీవు ఇప్పుడు నా కంటపడ్డావు. నిన్ను ఇప్పుడే నా తీక్షణ బాణాలు యమసదనానికి తీసుకొనిపోతవి.

"ఓ రావణుడా, నేను ఇప్పుడు వదిలే బాణాలు నీ కంఠాన్ని కత్తిరించి వేస్తవి. జ్వలితకుండలాలతో ఉన్న నీ శిరస్సు ఈ యుద్ధభూమిలో దుమ్ములో పడుతుంది. నీ శిరస్సును నక్కలు ఈడ్చుకొని పోతవి. నేల మీద పడే నీ మొండెము ఎదురు రొమ్ముల పైన కొంకులూ గద్దలూ వాలుతవి. నీ దేహములో బాణాలు గుచ్చుకొన్న తూట్లలోనుంచి కారే నెత్తురును దప్పికతీర తాగుతవి. నీవు ప్రాణముపోయి నేలమీద పడగా నే పాములను గరుడపక్షుల వలె నీ పేగులను రాబందులు ముక్కులతో ఈడ్చివేస్తవి" అంటూ ఆ రాక్షసరాజు మీద బాణవర్షము కురిపించినాడు. ఆ పరవీరహంత రాముడి పరాక్రమమూ బలమూ ఉత్సాహమూ అస్త్రబలమూ అప్పుడు ఇబ్బడి అయినవి. ఆ విదితాత్ముడి ఎట ఎదుట అప్పుడు సమస్త అస్త్రాలూ ఆవిర్భవించినవి. ఆ మహాతేజోవంతుడు సంతోషాతిశయముతో తన హస్తలాఘవము కొద్దీ బాణాలను వదిలినాడు. తనకు తోచిన శుభచిహ్నాలను గమనించి రాక్షససంహారము చేయతలచుకొన్న రాముడు అప్పుడు ఎడతెగకుండా రావణాసురుడి మీద బాణాలను వదలసాగినాడు. ఆ విధముగా రాముడు కురిపిస్తూవున్న బాణవర్షాన్ని చూచి వానర యోధులు ఆరావణాసురుడి మీద రాళ్లవాన కురిపించటము మొదలు పెట్టినారు. ఆ బాణవర్షానికీ ఆ రాళ్లవానకూ రాక్షసరాజు చిత్తము భ్రమించింది.

రావణాసురుడి మనస్సు స్వాధీనము తప్పిపోయింది. వైక్లబ్యము వచ్చింది. ఏ ఆయుధాన్ని ఉపయోగించలేక పోయినాడు. విల్లు ఎక్కుపెట్టలేక పోయినాడు. రాముడు పరాక్రమిస్తూ వుంటే తాను తిరిగీ పరాక్రమించలేక పోయినాడు. రాముడు వదిలిన బాణాలూ నానావిధాయుధాలూ వచ్చి పడుతూవుంటే

ఏమీ తోచక మరణకాలము ఆసన్నము అయిన వానివలె నిలుచుండి పోయినాడు. రావణాసురుడి దురవస్థను రథము నడుపుతూ వున్న సారథి గమనించినాడు. అందుకు అతను కలవరపడిపోకుండా ఆ రథాన్ని ఆ యుద్ధరంగములో నుంచి మెల్లగా అవతలకు తోలుకొని పోయినాడు.

## ౧౦౬

రావణాసురుణ్ణి మృత్యుదేవత ప్రోత్సహించింది. అందువల్ల ఒళ్లు ఎరగని కోపము వచ్చింది. కన్నులు ఎర్రచేసి తన రథసారథితో "ఓ సారథీ, నీకు దుర్బుద్ధి పుట్టింది నేను బలహీనుణ్ణి, అశక్తుణ్ణి అనుకొన్నావు నేను పౌరుషము లేనివాణ్ణి అనుకొన్నావు ధైర్యము పోయిందనీ, నాకు పిరికితనము వచ్చిందనీ ఇక నేను పరాక్రమించలేననీ నీవు అనుకొన్నావు. నాకు అటువంటి సమయములో మాయలు తెలియవనీ అస్త్రబలము లేదనీ అనుకొన్నావు. నీ చిత్తము వచ్చినట్టుగా ఈ రథాన్ని తోలుకొని వచ్చినావు. నన్ను అవమానించినావు. అట్లా కాకపోయినట్లయితే నా అభిప్రాయము తెలుసుకోకుండా శత్రు సమక్షములోనుంచి నా ఈ రథాన్ని ఎందుకు ఇట్లా ఇవతలికి తోలుకొని వచ్చినావు?

"ఓ దురాత్ముడా, నేను బలవంతుణ్ణి అనీ పరాక్రమవంతుణ్ణి అనీ ప్రసిద్ధికి ఎక్కినాను. ఎంతో కాలమునుంచి నాకు ఉన్న కీర్తిని పాడు చేసినావు. నేను పోరాటములోనుంచి పారిపోను అని ప్రజలు అందరూ విశ్వసిస్తున్నారు. ఆ నమ్మకాన్ని ఈనాడు నీవు చెడగొట్టినావు నా శత్రువు తనబలానికి ప్రసిద్ధికెక్కినాడు. తన పరాక్రమముతో ఈ లోకాన్ని మెప్పించినాడు. అటువంటి శత్రువు ఎట్టఎదుట ఉన్న నన్ను యుద్ధప్రియుణ్ణి నీవు ఇట్టే అల్పునిగా చేసివేసినావు ఓ దుర్మతీ, నీవు నా రథాన్ని శత్రువుకు ఎదురుగుండా తోలలేదు. నీవు నా శత్రువుదగ్గర లంచము పుచ్చుకొని ఉంటావు నిజము నా మేలుకోరే మిత్రుడు ఎవడూ ఇటువంటి పని చేయడు. శత్రువులకు అనుకూలము అయిన పని నీవు చక్కగా నెరవేర్చినావు.

"ఓ సారథీ, నీవు నా దగ్గర చిరకాలమునుంచీ ఉన్నావు. నేను నీకు ఎన్నో మేళ్లు చేసినాను. ఆ మేళ్ళను తలచుకో. ఇప్పుడు నా శత్రువులు ఎదురుకొంటూ వచ్చి నాపైన పడేలోపలనే ఈ రథాన్ని యుద్ధభూమిలోకి తోలుకొని పో. నేను శత్రువును ఎదిరిస్తాను" అని విస్తరముగా రావణాసురుడు చెప్పినాడు.

అని సారథి తన ఏలిక మేలు కోరేవాడు. కనుక సానునయముగా "రాజా, నన్ను శత్రువులు వశపరచుకోలేరు. వశపరచుకోలేరు కూడాను. నేను మూఢుడ్ని కాను. నేను భయపడలేను. ఏమర్లేను. నాకు నీ మీద స్నేహము లేకపోలేదు. నీవు చేసిన మేళ్లు నేను మరిచిపోలేను. నేను నీకు మంచి చేయవలెను అనుకొన్నాను. నీ కీర్తిని కాపాడవలెను అనుకొన్నాను. నీ మీద నాకు ఉన్న స్నేహాతిశయమునుంచి నిష్కల్మషహృదయముతో నిన్ను సంతోషపెట్టవలెను అనుకొని ఇట్లా రథాన్ని తోలుకొని వచ్చినాను. అయితే నేను చేసిన ఈ పని నీకు అప్రియముగా తోచింది.

"రాజా, నేను నీ ప్రయోజనము కోసము నీకు మంచి చేయడానికోసము యుద్ధరంగమునుంచి రథాన్ని తొలగ తోలుకొని వచ్చినాను. నన్ను నీచుణ్ణిగానూ దుష్టుణ్ణిగానూ నీవు భావించవద్దు. ఆ దోషాలు నాలో లేవు. నేను రథాన్ని ఎందుకు మళ్లించుకొని వచ్చిందీ చెప్పుతాను నీవు విను. ఆలోచించు. చంద్రోదయము అయినప్పుడు సముద్రజలాలు ఉప్పొంగి ఎదురుగా వస్తూ ఉంటే మహానదీ ప్రవాహాలు వెనుకకు మళ్లుతవి. ఆ మహాయుద్ధములో నీవు ఎంత అలసిపోయి ఉందీ నాకు తెలుసు. అయితే నీ ఉత్సాహాన్ని యుద్ధానికి నీ సుముఖతనూ నేను గమనించలేకపోయినాను. రథానికి పూన్చిన గుర్రాలు రథాన్ని లాగి లాగి అలసిపోయినవి. బలము ఉడిగిపోయినవి. వాన దెబ్బ తిన్న ఎద్దులవలె గుర్రాలు ఎండదెబ్బతిన్నవి. అంతేకాదు. ఏ వైపు చూచినా అపశకునాలు కనుపించినవి. అన్నీ ప్రతికూలముగా తోచినవి. రథము నడిపే సారథి శుభాశుభశకునాలనూ దేశకాలాలనూ గమనించవలెను. తన రథికుడి మనస్సు కనిపెట్టవలెను. రథికుడు అలసిపోతున్నదీ లేనిదీ తెలుసుకోవలెను. రథికుడి బలాన్నీ ఎదిరి బలాన్నీ పరిశీలిస్తూ ఉండవలెను. భూమి మిట్టపల్లాలనూ సమప్రదేశాలనూ విషమప్రదేశాలనూ సమయాసమయాలనూ తెలుసుకొంటూ ఉండవలెను. అన్నిటికన్నా ఎక్కువగా ఎదిరి లోపాలను కనిపెట్టుతూ ఉండవలెను. అందుకు తగినట్టుగా తన రథాన్ని శత్రుసమీపానికి తోలుకొని పోవడమో పక్కకు తోలుకొని పోవడమో ఎదురుగుండా తోలుకొని పోవడమో వెనుకకు తోలుకొని పోవడమో చేయవలెను.

"రాజా, నీవు వీరుడవు. నీ అలుపు తీర్చుకో. ఈ గుర్రాలు అలుపు తీర్చుకొంటవి. సహించరాని దుఃఖము రాకుండా ఉండటానికి తగినట్టుగా ఈ రథాన్ని నేను తోలుకొని వచ్చినాను. ప్రభూ, నీవు నా ఏలికవే కాదు. నా స్నేహితుడవు. నీ మీద నాకు ఉన్న స్నేహాతిశయము నుంచీ గౌరవాతిశయము

నుంచీ ఈ రథాన్ని ఇట్లా తోలుకొని వచ్చినాను. రాజా, నీవు శత్రుసంహారకుడవు. ఇప్పుడు నీ ఇష్టము వచ్చినట్లు ఆజ్ఞాపించు. నీ ఆజ్ఞను నేను జవదాటను. నీ ఋణము నేను తీర్చుకొంటాను" అని చెప్పినాడు.

సారథి చెప్పిన మాటలకు రావణాసురుడు సంతుష్టుడు అయినాడు. ఎన్నో విధాల మెచ్చుకొన్నాడు. అంతట సారథిని చూచి "ఓ సూతుడా, ఇప్పుడే రాముడికి ఎదురుగుండా ఈ రథాన్ని తోలు. నేను వాణ్ణి వధించకుండా తిరిగి రాను." అని రావణాసురుడు చెప్పినాడు. ఒక హస్తాభరణాన్ని బహుమానముగా సారథికి ఇచ్చినాడు. అంతట సారథి ఆ రథాన్ని యుద్ధాభిముఖంగా తోలుకొని పోయినాడు.

క్షణకాలములో రావణాసురుడి రథము రాముడికి అభిముఖముగా నిలిచింది.

## ౧౦౭

అప్పుడు ఆ యుద్ధము చూడటానికి దేవతలతో కూడా మహానుభావుడు అగస్త్యుడు వచ్చినాడు యుద్ధము చేయటానికి వచ్చి నిలుచున్న రావణాసురుణ్ణి ఎట్టఎదుట చూచినాడు. అతడు అలుపు తీర్చుకొని తిరిగి యుద్ధానికి వచ్చినందువల్ల రాముడు అప్పుడు అతనితో ఏ విధముగా పోరాడవలసిందీ ఆలోచిస్తున్నాడు. అప్పుడు అగస్త్యమహర్షి రాముణ్ణి సమీపించి "రామా, రామా, నీవు యుద్ధములో శత్రువులను అందరినీ జయించటానికి "ఆదిత్యహృదయం" ఉపదేశము చేస్తాను. అది ఉత్తమోత్తమము అయినది. చాలా రహస్యము అయినది. సనాతనము అయినది. అది పరమపవిత్రము అయినది. ఆ మంత్రాన్ని జపము చేస్తే సర్వశత్రువులూ నాశనము అయిపోతారు. అది శాశ్వతమూ నాశరహితమూ అయిన ఫలాన్ని ఇస్తుంది. నీవు జయిస్తావు అది సమస్తమంగళాలకూ మంగళకరము అయినది. ఆధివ్యాధులను పోగొట్టుతుంది. అది ఆయుస్సును వృద్ధిచేస్తుంది" అని చెప్పి ఆదిత్యహృదయమంత్రము ఉపదేశము చేసినాడు.

అంతట "నాయనా, రామా, నీవు ఏకాగ్రచిత్తముతో దేవదేవుడూ జగత్పతీ అయిన ఆదిత్యుణ్ణి పూజించు. నేను చెప్పిన ఆదిత్యహృదయ మంత్రాన్ని ముమ్మారు జపించు. నీవు యుద్ధములో జయిస్తావు ఓ మహాబాహూ, నీవు ఈ వేళనే రావణాసురుణ్ణి సంహారము చేస్తావు" అని చెప్పి అక్కడనుంచి అగస్త్యమహర్షి అంతర్ధానము అయిపోయినాడు.

ఆ మహాతేజోవంతుడికి రాముడికి దిగులు అంతా వదిలిపోయింది. సంతుష్టుడు అయినాడు. పరిశుద్ధ హృదయముతో ఆదిత్యహృదయాన్ని కంఠస్థము చేసుకొన్నాడు. ముమ్మారు ఆచరించినాడు. శుచి అయి సూర్యుణ్ణి చూచి

ఆదిత్యహృదయాన్ని జపం చేసినాడు. పరమ సంతోషముతో విలు చేతిలో పట్టుకొన్నాడు. సంతుష్ట హృదయముతో యుద్ధసన్నద్ధుడు అయినాడు. రావణాసురుని సంహారము చేయడానికి స్థిరనిశ్చయుడు అయినాడు.

అప్పుడు సూర్యమండలాంతర్గతుడు అయిన హిరణ్మయపురుషుడు మనసా సంతోషించినాడు. ఆయన దేహము పులకరించింది. దేవగణాల మధ్యనుంచి రాముణ్ణి చూచి "ఓ రామా, నిశాచరరాజు నాశనము అయిపోతాడు. నీవు త్వరపడు" అని చెప్పినాడు.

## ౧౦౭

అప్పుడు రావణాసురుడి రథసారథి సంతోషముతో యుద్ధరంగానికి రథాన్ని తోలినాడు. అప్పుడు ఆ రథము శత్రుసైన్యాలను చెదరగొట్టే గంధర్వనగరాకారములో కనుపించింది. దానికి ఎత్తిన పతాకాలు ఎంతో ఎత్తున ఎగురుతూ ఉన్నవి. జయము సూచించే బంగారు ఆభరణాలతో గుర్రాలు కనుపించినవి. ఆ రథమునిండా యుద్ధోపకరణాలు అమర్చిఉన్నవి. దాని ధ్వజమూ పతాక మాలలూ ఆకాశాన్ని మింగివేస్తూ ఉన్నట్టుగా కనుపించినవి. ఆ రథధ్వని భూమి అంతటా వినిపించింది. రాక్షససైన్యాలను సంతోషపెట్టుతూ శత్రుసైన్యాలను నాశనము చేసివేసేటట్టు ఆ రథము అప్పుడు నడిచింది.

అట్లా మహాధ్వనులు చేస్తూ అమిత వేగముతో వస్తూఉన్న ఆ రాక్షసరాజు రావణాసురుడి రథాన్ని రాముడు చూచినాడు. ఆ రథానికి పూన్చిన గుర్రాలు నల్లటివి. ఆ రథానికి ఎత్తిన జండాలు భయంకరము అయిన కాంతులతో మెరుపులవలె మెరపులవలె మెరిసినవి. అందులో ఉన్న ఆయుధాలు ఇంద్రధనస్సుల వలె ధగధగలాడినవి. ధారలుగా జలము వర్షించే మహామేఘమువలె ఆ రథము శరధారలు కురిపించటానికి వస్తూ ఉన్నట్లుగా తోచింది. వజ్రాయుధము దెబ్బకు పగిలిపోతూ ఉన్న పర్వతాల ధ్వనులవలె అది ధ్వనులు చేస్తూ రావటము రాముడు చూచినాడు. తన ధనుస్సును బాలచంద్రాకారముగా వంచినాడు. టంకారము చేస్తూ తన రథసారథితో "ఓ మాతలీ, శత్రురథము అమిత వేగముతో వస్తూ వుంది. చూడు అప్రదక్షిణముగా అమిత వేగముతో శత్రువు వస్తూవున్నాడు. కాబట్టి వాడు యుద్ధములో హతుడు అయిపోవటము తప్పదు. అయినప్పటికీ నీవు ఏమరుపాటు లేకుండా ఉండవలెను. మనరథాన్ని శత్రువుకు ఎదురుగుండా పోనివ్వు. ఆకాశాన్ని ఆవరించిన మేఘాన్ని వాయువువలె ఆ రథముమీద వస్తూవున్న శత్రువును నేను ఎగరగొట్టి వేస్తాను. శత్రుసంరంభానికి నీవు భయపడవద్దు.

కలవరపడవద్దు మనస్సు నిబ్బరముగా ఉంచుకో. చూపు చెదరకుండా చూచుకో. పగ్గాలు క్రమముగా లాగుతూ రథాన్ని వేగముగా పోనివ్వు. నీవు దేవేంద్రుడికి సారథ్యము చేసినవాడవు. నీకు నేను వేరే చెప్పవలసిన పనిలేదు. నేను ఏకాగ్రచిత్తముతో యుద్ధము చేయబోతున్నాను. అందువల్ల కొన్ని విషయాలు నీకు జ్ఞాపకము చేసినాను. కానీ నీకు ఇవి నేర్పటం లేదు" అని రాముడు చెప్పినాడు.

ఈ మాటలకు సురసారథి మాతలి సంతోషముతో ఆ దేవేంద్ర రథాన్ని రావణాసురుడి రథానికి అపసవ్యముగా పోనిచ్చినాడు. అప్పుడు ఆ రథచక్రాలకు లేచిన దుమ్ము రావణాసురుణ్ణి కమ్ముకున్నది. అతనికి ఏమీ కనిపించకుండా పోయింది. అందుకు అతడు కుపితుడు అయినాడు. ఎర్రబడిపోయిన తన కన్నులు ఉరిమి చూచినాడు. తన రథానికి ఎదురుగుండా నిలబడిన రథములో రాముణ్ణి చూచినాడు. అంతట వశ్రగివ్రుడు రాముని మీద బాణాలు వదలినాడు.

ఆ మహాతేజోవంతుడు రాముడు తనమీద రావణాసురుడు బాణాలు వదులుతూ ఉంటే రోషావేశముతో మరింత ధైర్యముగా నిలుచున్నాడు. దేవేంద్రుడి శరాసనాన్ని అందుకొన్నాడు. సూర్యకిరణాలవంటి బాణాలను ఎక్కుపెట్టినాడు. రావణాసురుణ్ణి గురిచేసి వదిలినాడు. ఒకరిని ఒకరు చంపివేయవలెను అనే కాంక్షతో ఒకరికి ఒకరు ఎదురుగుండా నిలుచొని రామరావణులు కోపముతో చెలరేగిన రెండు సింహాలవలె మహాయుద్ధము ఆరంభించినారు.

అప్పుడు దేవతలూ గంధర్వులూ సిద్ధులూ పరమర్షులూ రామరావణ యుద్ధం చూడటానికి వచ్చి ఆకాశములో నిలుచున్నారు. రాముడు జయిస్తాడనీ రావణాసురుడు నాశనము అయిపోతాడనీ సూచిస్తూ ఒళ్ళు గగుర్పాటుచేసే దారుణము అయిన దుర్నిమిత్తాలు కనుపించినవి. అప్పుడు రావణాసురుడి రథముమీద నెత్తురు వాన కురిసింది. అప్రదక్షిణముగా తీవ్రమైన సుడిగాలి కొట్టింది. రావణాసురుడి రథము ఏ వైపుపోతే ఆకాశములో ఆ వైపున గద్దలు గుంపులు కట్టి తిరిగినవి. లంకాపట్టణము అంతటా పట్టపగలు జపాపుష్ప కాంతులతో సంధ్యారాగము అలముకొన్నది. భూమి అంతటా మంటలు మండుతూ ఉన్నట్లు కనిపించింది. ఆకాశములో కొరవులు పిశుఘల వలె మహాధ్వనులు చేస్తూ గిర్రున తిరిగినవి. అవి రావణాసురుడికి అహితము సూచిస్తూ ఉన్నవని రాక్షసులు దిగులు పడిపోయినారు. రావణాసురుడి రథము ఎటు తిరిగితే అటువైపు భూమి కంపించింది. పోరాడుతూ ఉన్న రాక్షసులకు తమ చేతులను ఎవరో పట్టుకున్నట్టుగా తోచింది. సూర్యకిర

కాలు ఎగస్తూ పడుస్తూ తెలుస్తూ నలుస్తూ రంపులతో రావణాసురుడి దేహము మీద ప్రసరించినవి అప్పుడు అతడు పైకొండి ధాతువులతో నిగనిగలాడుతూ ఉన్న పర్వతము వలె కనిపించినాడు. అప్పుడు నక్కలు నోళ్లలో నుంచి నిప్పులు కక్కుతూ రావణాసురుడికి ఎదురుగుండా వచ్చి అమంగళముగా అరిచినవి. ఆ నక్కలతో పాటు ఆకాశములో గద్దలు రావణాసురుడి ముఖము వంక చూస్తూ భయంకరముగా కూసినవి. అప్పుడు ఆ యుద్ధభూమిలో వాయువు ప్రతికూలముగా వీచింది. ఆ గాలికి రేగిన దుమ్ము రావణాసురుడి ముఖాన్ని కప్పి వేసింది. అప్పుడు అతడి కన్నులకు ఏమీ కనపడకుండా పోయింది. మబ్బులు లేకుండా ఉరుములు ఉరుముకుండా ఆకాశమునుంచి భయంకరాకారముతో మహోగ్రములు చేస్తూ కొరవులూ పిడుగులూ రావణా సురుడి సైన్యము మీద పడ్డవి. దుమ్మువాన కురవటము మొదలు పెట్టింది. ఆ దుమ్మువాననుంచి ఆకాశము కనిపించకుండా పోయింది. దిక్కులు అన్నీ చీకట్లు కమ్ముకొన్నవి. అప్పుడు అక్కడి అంతరిక్షములో గోరువంకలు ఘోరముగా పోట్లాడుకొంటూ దారుణముగా కూస్తూ వందలకొద్దీ వచ్చి రావణా సురుడి రథము మీద పడ్డవి. రావణాసురుడి రథగుర్రాల పిరుదులలో నుంచి అగ్ని కణాలు రాలినవి. ఆ గుర్రాల కన్నులలో నుండి కన్నీళ్లు ధారలుగా కారి నవి. ఇట్లా భయంకరమూ అతిక్రూరమూ అయిన ఉత్పాతాలు అనేకము అప్పుడు కనుపించినవి.

జయము సూచించే అనేక శుభనిమిత్తాలు రాముడికి తోచినవి. అందుకు అతడు ఎంతో సంతోషించినాడు. రావణాసురుణ్ణి సంహరించినట్లే తలచి నాడు.

## ౧౦౯

తమ తమ రథాలమీద ఉన్న రామరావణులు అతిక్రూరముగా సర్వ లోకాలవారూ భయపడిపోయేట్లుగా మహాయుద్ధము చేయటము మొదలు పెట్టి నారు. ఆయుధాలతో యుద్ధసన్నద్ధము అయిన రాక్షస సైన్యము అటూ, వానర సైన్యము ఇటూ రామరావణయుద్ధము చూస్తూ కదలకుండా మెదలకుండా నిలు చున్నవి చక్కగా పోరాడుతూ ఉన్న మానవుణ్ణి రాక్షసుణ్ణి చూచి వానర యోధులూ రాక్షసయోధులూ నివ్వెరపోయినారు. ఆశ్చర్యముగా సాగుతూ ఉన్న ఆ యుద్ధము అయిపోబోతున్నదని ఆ యోధులు అందరికీ తెలుసును. చేతు లలో ఆయుధాలు ఉన్నప్పటికీ బాహువులు తొందర చేస్తూ ఉన్నప్పటికిన్నీ రాక్షసులు వానరయోధులను కానీ వానరులు రాక్షసయోధులను కానీ ఎదిరించ

లేదు. చిత్తరువులో చిత్రించిన బొమ్మలవలె రాక్షససేనలు రావణాసురుణ్ణి చూస్తూనూ వానరయోధులు రాముణ్ణి తేరిపార చూస్తూనూ నిలుచుండిపోయి నారు.

ఆ యుద్ధభూమిలో తమకు తమకు తోచిన శుభాశుభనిమిత్తాలను పట్టి బుద్ధి నిశ్చయము చేసుకొని సుస్థిరము అయిన కోపముతో నిశ్చయముగా రామరావణులు యుద్ధము చేయసాగినారు. ఆ యా శుభనిమిత్తాలను పట్టి రాముడు తనకు జయము తప్పదు అనుకొన్నాడు. రావణాసురుడు ఆ యా దుర్నిమిత్తాలను పట్టి తనకు చావు తప్పదు అనుకొన్నాడు. అందువల్ల ఉభయులూ తమ తమ పరాక్రమ సర్వస్వాన్ని కనపరిచినారు. అప్పుడు ఆ పరాక్రమవంతుడు రావణాసురుడు ధనస్సులో బాణాలను ఎక్కించి రాముడి రథధ్వజాన్ని గురిచేసి వదిలినాడు. ఆ బాణాలు పోయి ఆ రథధ్వజాన్ని తాకినవి. అది దేవేంద్రుడి రథధ్వజము అయినందువల్ల ఆ బాణాలు ఏమీ చేయలేక నేలపాలు అయినవి. తన రథధ్వజము మీద బాణాలు వదిలినందుకు రాముడు ప్రతిక్రియ చేయ సంకల్పించుకొన్నాడు. ఆ పరమ పరాక్రమవంతుడు తన బాణాన్ని వంచి ఒకే ఒక బాణాన్ని ఎక్కుపెట్టి రావణాసురుడి రథధ్వజాన్ని గురి చేసి వదిలినాడు. సహించనలవి కాని మంటలు మండుతూ ఆ తీక్ష్ణ బాణము మహాసర్పమువలె పోయి రావణాసురుడి రథధ్వజాన్ని పడకొట్టి భూమిలోకి పోయింది. ఆ రథధ్వజము రెండు తునకలు అయి నేలకూలింది. తన రథధ్వజము విరిగిపోయినందుకు ఆ మహాబలవంతుడు రావణాసురుడు ఓర్వలేక పోయినాడు. దగ్గర ఉన్న వాటిని దహించి వేసే అగ్నిహోత్రము వలె మండిపోయినాడు. కోపపారవశ్యముతో బాణవర్షము కురిపించినాడు. మంటలు మండుతూ ఉన్న బాణాలను రాముడి రథాశ్వాలమీద వదిలినాడు. ఆ రథానికి పూన్చిన ఆకుపచ్చని గుర్రాలు దేవేంద్రుడివి. రావణాసురుడు వదిలిన బాణాలు ఆ గుర్రాలను తామర తూండ్లవలె తగిలినవి. అవిమాత్రము చలించలేదు. భయపడలేదు. స్వస్థముగా ఉండిపోయినవి ఆ గుర్రాలు ఏమాత్రమూ కలవర పడకుండా ఉండటము చూచి రావణాసురుడు మహోగ్రుడు అయి పోయి మళ్లీ బాణవర్షము కురిపించినాడు. గదాయుధాలూ పరిఘాయుధాలూ చక్రాయుధాలూ ముసలాయుధాలూ శూలాయుధాలూ గండ్రగొడ్డళ్ళు ఇంకా భయంకరము అయిన వివిధాయుధాలూ తన ధనస్సులోనుంచి రాక్షసమాయతో రావణాసురుడు వదులుతూ ఉంటే భయంకరము అయిన ధ్వనులు అయినవి. మహావర్షముగా కురిపించిన ఆ వివిధాయుధాలూ గురి తప్పి రాముడి రథము మీద పడకుండా వానరసైన్యము మీద అన్ని వైపులా

పడ్డవి. మనస్సులో మరి ఏ ఇతర ఆలోచనా లేకుండా ఎడతెగని ఉత్సాహములో రావణాసురుడు వేలకు వేలు బాణాలు వదిలినాడు. మహాప్రయత్నములో రావణాసురుడు అట్లా బాణాలు వదలటము చూచి రాముడు నవ్వుతూ తన ధనస్సు ఎక్కు పెట్టి లక్షలకొద్దీ తీక్ష్ణబాణాలను వదిలినాడు. రామరావణులు ఉభయులూ వదలిన ఆ దివ్యమైన బాణపరంపరలు ఆకాశము అంతటా ఆవరించి మరి ఒక ఆకాశము వలె భాసించింది

ఆ యుద్ధములో రామరావణులు వదలిన బాణాలలో ఏ ఒక్కటిన్నీ గురి తప్పి పోలేదు. ఏ ఒక్కటిన్నీ అనుకొన్నట్లుగా భేదించకుండా పోలేదు. ఏ ఒక్కటిన్నీ విఫలము అయి పోలేదు. అయితే ఆ వీరులు ఉభయులూ వదలిన బాణాలు ఒకదానికి ఒకటి తగిలి అన్నీ నేల కూలినవి వారు ఉభయులూ సవ్యాపసవ్యముగా తిరుగుతూ ఎడతెగకుండా బాణాలు వదులుకొంటూ యుద్ధము చేసినారు. గాలి దూరే సందు అయినా లేకుండా ఆ బాణాలు అన్ని వైపులా కమ్ముకొన్నవి. అప్పుడు రాముడు రావణాసురుడి గుర్రాలనూ రావణాసురుడు రాముడి గుర్రాలనూ గురి చేసి బాణాలు వదలినారు. అటూ ఒకరు చేసిన దానికి ఒకరు ప్రతిక్రియ చెసుకొంటూ ఉభయులూ పరమక్రుద్ధులు అయి పోయి అద్భుతముగానూ భయంకరముగానూ ఒళ్లు గగురు పుట్టించేట్లుగానూ ఒక ముహూర్తముసేపు పోరాడినారు.

౧౧౦

రామరావణులు అట్లా యుద్ధము చేస్తూ ఉంటే సర్వభూతకోటీ ఆశ్చర్యపడిపోయింది. వారి ఉభయుల రథాలూ నడుపుతూ ఉన్న సారథుల చాతుర్యమునుంచి ఆ రథాలు అప్పుడు ఒకదానితో ఒకటి ఢీకొట్టబోతూ ఉన్నట్లు ఎదుర్కొన్నవి. మరుక్షణాన మండలాకారముగా తిరిగినవి. వీథులు అనే గతివిశేషాలతో అవి వెనుకకు పోతూనూ ముందుకు వస్తూనూ వివిధవిధాలా తిరుగుతూ భయంకరముగా కనుపించినవి. రాముడు రావణాసురుణ్ణి నొప్పిస్తూనూ రావణాసురుడు రాముణ్ణి నొప్పిస్తూనూ ఒకరిమీద ఒకరు బాణాలు వదులుకుంటూ అమిత వేగముతో సమీపిస్తూ వెంటనే వెనుకకుపోతూనూ పోరాటము సాగించి వారు. అట్లా వారు ఉభయులూ రథాలలోనుంచి ఒకరిమీద ఒకరు బాణవర్షాలు కురిపించుకొంటూ ఉంటే ఆ యుద్ధభూమిలో ఆ రథాలు బాణాలు కురిపించే మహామేఘాలవలె కనుపించినవి. ఆ యుద్ధరంగములో నానావిధాలా తిరుగుతూ ఆ రథాలు అప్పుడు ఒకదానికి ఒకటి ఎదురుగుండావచ్చి నిలుచున్నవి. అటూ నిలబడిన రథాలు రెండూ కాడితో కాడీ పతాకాలతో పతాకాలూ గుర్రాల

ముఖాలతో క్రూర ముఖాలూ ఢీకొట్టిపోయినవి. అప్పుడు రాముడు తన ధనుస్సు ఎక్కుపెట్టి మంటలు మండుతూ ఉన్న నాలుగు బాణాలు వదిలి రావణాసురుడి క్రూరాలను వెనుకకు మళ్ళగొట్టినాడు. అందుకు రావణాసురుడు కోపపరవశుడు అయిపోయి రాముడ్ని గురిచేసి నిశితబాణాలు వదిలినాడు. ఆ బలవంతుడి బాణాలు వచ్చి తనను కుమ్ముకొన్నప్పటికిన్నీ రాముడు ఏమాత్రమూ బాధపడలేదు ఏ వికారమూ చెందలేదు. అంతట ఆ నిశాచరరాజు రావణాసురుడు అరథము నడుపుతూ ఉన్న దేవేంద్రుడి సారథి మాతలిని గురిచేసి బాణాలు వదిలినాడు. అవి పిడుగులవలె మహాధ్వనులు చేస్తూ మాతలి దేహము మీద పడ్డవే కాని అతనిని ఏమీ బాధ పెట్టలేకపోయినవి. ఆ బాణాలకు అతడు ఏమాత్రమూ కలవరపడలేదు తనకు అప్పుడు సారథ్యము చేస్తూ ఉన్న మాతలి మీద రావణాసురుడు అట్లా బాణాలు వదిలినందుకు రాముడికి అమితకోపము వచ్చింది. తనను కొట్టినందుకన్న తన సారథిని కొట్టినందుకు మహాకోపముతో చెలరేగి రాముడు బాణాలు తదేకముగా వదిలి రావణాసురుడ్ని తన ఎదుట నిలవకుండా చేసినాడు.

ఆ పరాక్రమవంతుడు రాముడు రావణాసురుడి రథము మీద ఒక ఇరవై బాణాలు వదిలినాడు. ఆ తరువాత ముప్పయి, అరవై. నూరు. వెయ్యి బాణాలు వదిలినాడు అందుకు రాక్షసరాజు మహోగ్రుడు అయి ప్రతిక్రియగా రాముడి మీద గదాయుధాలూ ముసలాయుధాలూ వింట సంధించి వానగా కురిపించినాడు. ఆ గదాయుధాలూ ముసలాయుధాలూ పరిఘాయుధాలూ వచ్చి పడుతూ ఉంటే ఆ మహాధ్వనులు అయినవి ఆ మహాధ్వనులకు సప్తసముద్రాలూ క్షుభితము అయినవి అప్పుడు పాతాళలోకములో నివసిస్తూ ఉన్న పన్నగులూ దానవులూ మొదలయిన వారందరూ బాధ పడి పోయినారు. భూమి వణికింది. మహావృక్షాలు పడిపోయినవి. పర్వతాలు కదిలినవి సూర్యకాంతులు మాసి పోయినవి గాలి వీచటము ఆగి పోయింది. అప్పుడు దేవతలూ గంధర్వులూ కిన్నరులూ మహోరగులూ సిద్ధులూ మహర్షులూ మొదలైన వారందరూ భయ పడి పోయినారు. ఆ యుద్ధములో రాముడు జయించవలెను అనీ గోవులూ బ్రాహ్మణులూ సుఖముగా ఉండవలెను అనీ సమస్తలోకాలూ చెక్కు చెదరకుండా ఉండవలెను అనీ అప్పుడు దేవతలూ మహర్షులూ జపము చేసినారు ఆ విధముగా ఆకాశములో దేవతలూ మహర్షులూ జపము చేస్తూ ఉంటే భూమి మీద రామరావణులు మహాభయంకరముగా యుద్ధము చేయసాగినారు అప్పుడు గంధర్వులూ అప్సరసలూ గుంపులు గుంపులుగా చేరి నిరుపమానము అయిన ఆ రామరావణయుద్ధము చూస్తూ ఆశ్చర్యపోయినారు. "ఆకాశము వంటిది

ఆకాశమే. అటువంటిది మరి ఒకటి లేదు. సముద్రము వంటిది సముద్రమే. అటువంటిది మరి ఒకటి లేదు. అశేషముగా రామరావణుల వంటి వారు రామరావణులే మరి ఒకళ్లు లేరు. రామరావణయుద్ధము వంటిది రామరావణయుద్ధమే. మరి ఒకటి జరగదు" అని ఆ అప్సరసలూ గంధర్వులూ చెప్పుకొన్నారు.

అప్పుడు ఆ మహాబాహువు రఘువంశ కీర్తివర్ధనుడు రాముడు క్రుద్ధుడు అయి పాము (క్రూరవిషసర్పము) వంటి బాణాన్ని తన వింట సంధించి రావణాసురుడి కంఠాన్ని గురి చేసి వదిలినాడు. జ్వలితకుండలాలతో ఉన్న రావణాసురుడి శిరస్సు ఆ బాణము దెబ్బకు తెగి నేలమీద పడిపోయింది. అట్లా నేలమీద పడిపోయిన ఆ శిరస్సును అప్పుడు ముల్లోకాలవారూ చూచినారు. అట్లా వారు అందరూ చూస్తూ ఉండగానే ఆ శిరస్సు వంటిదే మరి ఒక శిరస్సు రావణాసురుడి మెడమీద మొలిచింది. అట్లా మొలుచుకొని వచ్చిన రావణాసురుడి రెండవ శిరస్సును అప్పటికి అప్పుడు రాముడు తన బాణముతో నరికి వేసినాడు. ఆ శిరస్సును నరికీ నరకటముతో మరి ఒక శిరస్సు పుట్టుకొని వచ్చింది. వజ్రాయుధము వంటి బాణముతో రాముడు ఆ మూడవ శిరస్సును కూడా నరికి వేసినాడు. రావణాసురుడికి అట్లా నూట ఒక్క మారులు శిరస్సులు పుట్టుకొని వచ్చినవి. ఆ పుట్టుకొని వచ్చిన శిరస్సులను రాముడు ఎప్పటికి అప్పుడు నరికి వేస్తూ ఉన్నప్పటికిన్నీ రావణాసురుడి ప్రాణము పోయేటట్లు కానీ కొత్త శిరస్సులు పుట్టకుండా ఉండేటట్లు కానీ కనపడలేదు.

అప్పుడు ఆ సర్వాస్త్రకోవిదుడు ఆ మహావీరుడు ఎన్నో బాణాలు ఉన్న ఆ రాముడు ఆలోచించసాగినాడు. "ఏ బాణాలకు మారీచుడు చచ్చిపోయినాడో, ఏ బాణాలకు దండకారణ్యంలో ఖరదూషణులు చచ్చి పోయినారో ఏ బాణాలకు విరాధుడు చచ్చిపోయినాడో ఏ బాణాలకు క్రౌంచారణ్యములో కబంధుడు చచ్చిపోయినాడో ఆ బాణాలకు ఇప్పుడు రావణాసురుడు ఎందుకు చచ్చిపోలేదు. అవి ఎంతో నమ్మకము అయిన బాణాలు. వాటి శక్తి తగ్గి పోవటానికి కారణము ఏమి అయి ఉంటుంది" అని ఆలోచిస్తూ ఏ మాత్రము ఏమరకుండా రావణాసురుడి వక్షస్థలముమీద రాముడు శరవర్షము కురిపించినాడు. అప్పుడు రాక్షసరాజు రావణాసురుడు రాముడిమీద ప్రతిక్రియగా గదా ముసలాయుధ వర్షము కురిపించినాడు. రామరావణులు ఉభయులూ ఆగ్రహావేశపరవశులు అయి తమ రథాలతో కూడా ఆకాశానికి ఎగిరి కొంతసేపు పోరాడినారు. రథాలతో కూడా నేల మీదికి వచ్చి కొంతసేపు పోరాడినారు. రథాలతో కూడా త్రికూటపర్వతము మీదికిపోయి కొంతసేపు పోరాడినారు.

చూచేవారి ఒళ్లు గగురు పుట్టించేటట్లు మహాభయంకరముగా యుద్ధము చేసినారు. అహోరాత్రములు అనే భేదము లేకుండా రామరావణులు, దేవదానవయక్ష రాక్షసపిశాచ ఉరగులు చూస్తూ ఉండగా ఆ యుద్ధము సాగించినారు. రాత్రిపూట కాని పగటిపూట కాని ఒక ముహూర్తము సేపు అయినా విరామము లేకుండా ఉభయులూ పోరాడినారు.

౧౧౧

ఆ యుద్ధములో ఎంత సేపటికీ రాముడు జయించక పోవటము చూచి సురసారథి అయిన మాతలి రాముడితో "ఓ రామా!, నీవు [illegible] సమస్తాస్త్రాలూ తెలిసినవాడవు ఏమీ తెలియని వాడివలె నీవు ఈ రావణాసురుడు వదిలే బాణాలకు ప్రతిగా ఏవేవో బాణాలు వదలటము ఎందుకు. దేవతలు చెప్పిన వినాశకాలము ఇతడికి ఇప్పుడు వచ్చింది. ఇతడిమీద నీవు బ్రహ్మాస్త్రము వదులు. చచ్చిపోతాడు" అని మాతలి జ్ఞాపకము చేసినాడు.

అప్పుడు ఆ పరాక్రమవంతుడు రాముడు దేదీప్యమానముగా భాసిస్తూనూ మహోగ్రసర్పము వలె బుసలు కొట్టుతూనూ ఉన్న బాణాన్ని తీసినాడు.

ముల్లోకాలూ జయించవలెను అనుకొన్న దేవేంద్రుడి కోసము పూర్వము బ్రహ్మదేవుడు ఆ బాణాన్ని తన ప్రభావముతో సృష్టించినాడు. ఆ బాణముతో దేవేంద్రుడు ముల్లోకాలూ జయించినాడు. ఆ మహాబాణాన్ని ఆ తరువాత దేవేంద్రుడు అగస్త్యమహర్షికి ఇచ్చినాడు. ఆ అగస్త్యమహర్షి రాముడికి అత్యంత ఆదరముతో ఆ అమోఘబాణాన్ని దండకారణ్యములో ఇచ్చినాడు. ఆ మహాబాణము అమోఘము అయినది. దాని రెక్కలు వాయుదేవతాకము అయినవి అందువల్ల అది వాయువేగముతో పోతుంది. దాని ముఖము సూర్యాగ్ని దేవతాకము అయింది. అందువల్ల అది పోయి తాకే తాకటముతో ఏది అయినా సరే భగ్గున మండి బూడిద అయిపోతుంది. దాని శరీరము ఆకాశమయము అయింది. అందువల్ల అది ఆకాశమువలె వ్యాపిస్తుంది. అది గౌరవానికి మేరు మందరపర్వతముల వంటిది. అందువల అది ఆ రెండు పర్వతాలంత బరువు అయింది. ముల్లోకాలలో ఉన్న సర్వభూతాల తేజస్సులనూ గ్రహించి బ్రహ్మదేవుడు సృష్టించిన ఆ మహాబాణము కాంచనపుంఖముతోనూ జాజ్వల్యమానము అయిన ఆకారముతోనూ సూర్యతేజముతోనూ పొగలుకమ్ముకొన్న ప్రళయ కాలాగ్నిశిఖ వలెనూ మంటలు మండుతూ ఉన్న మహావిషసర్పము వలెనూ అమిత వేగముతో పోయి శత్రువుల ఏనుగులనూ గుర్రాలనూ ఇట్టే చీల్చి వేస్తుంది.

కవాటాలను విరుగ కొట్టుతుంది. కోటప్రద్వారాలను పడ కొట్టుతుంది. అగడ్తలను తెగకొట్టుతుంది. పర్వతాలను అయినా పగల కొట్టుతుంది. వజ్రమువలె అది అభేద్యము అయిన బాణము. అదివరకు అది నానావిధ రక్తమాంసాలనూ రుచి చూచింది. కొవ్వు పూసుకొన్నది. యుద్ధరంగములో మహాధ్వనులు చేస్తూ నానావిధ వ్యూహాలనూ రూపుమాపుతుంది. భయంకరముగా బుసలు కొట్టుతూ ఉన్న మహాసర్పమువలె తిరుగుతూ సర్వభూతాలనూ భయపెట్టుతుంది. కంక పక్షులకూ బకపక్షులకూ గద్దలకూ నక్కలగుంపులకూ రాక్షసగణాలకూ యుద్ధ భూమిలో ఎప్పుడూ కావలసినంత ఆహారము పంచి పెట్టుతుంది. భయావహము అయిన యమునిరూపములో యుద్ధరంగములో తిరుగుతుంది. గరుత్మంతుడివలె రంగు రంగుల రెక్కలతో ఎక్కడికి పడితే అక్కడికి యథేష్టముగా పోతుంది. అంతకన్నా ఉత్తమోత్తమము అయిన బాణము ముల్లోకాలలోనూ లేదు. వానరులను అందరినీ సంతోష పెట్టటానికీ రాక్షసులను అందరినీ నాశనము చేసివేయటానికీ శత్రువుల కీర్తిని మాపివేయటానికీ తాను పరమానందము అనుభవించటానికీ రాముడు అప్పుడు ఆ అమోఘబాణాన్ని చేతులో పట్టుకొన్నాడు.

ఆ మహాబలవంతుడు రాముడు వేదములో విధించినట్టుగా ఆ బాణాన్ని అభిమంత్రించినాడు. తన ధనస్సులో సంధించినాడు. నారి సారించినాడు. ఆ కార్ముకాన్ని తన చెవివరకూ లాగినాడు. రావణాసురుణ్ణి గురిచేసి ఆ బాణాన్ని వదిలినాడు. ఆ మహాధ్వనికి సర్వభూతాలూ సంచలించి పోయినవి.

ఆ మహాబాణము దేవేంద్రుడి చేతులలోనుంచి వెలువడిన వజ్రాయుధము వలె ఎదిరించను అలవి కాకుండానూ యముడి వలె అడ్డగించను అలవి కాకుండానూ అమిత వేగముతో పోయి రావణాసురుడి వక్షస్థలాన్ని భేదించింది. ఆ వక్షస్థలములో నుంచి దూసుకొనిపోతూ అతని ప్రాణాన్ని హరించింది. నెత్తురుతో తడిసింది. ఆ రాక్షసరాజు దేహములోనుంచి వెలువడి ఆ మహా బాణము భూమిలోకి పోయింది. తన పని నెరవేర్చినందువల్ల ఆ బాణము అంతట భూమిలో నుంచి బయటికి వచ్చి వినయవిధేయతలతో తిరిగీ రాముడి అంబుల పొదిలోకి పోయి నిలిచింది.

ఆ బాణము వక్షస్థలములో నుంచి దూసుకొని పోతూ ఉండగా తన ప్రాణాన్ని వదిలినట్టు రావణాసురుడు తన చేతిలో ఉన్న కార్ముకాన్ని జార విడిచినాడు. ఆ భయంకర పరాక్రముడు ఆ మహాతేజోవంతుడు రాక్షసరాజు రావణాసురుడు దేవేంద్రుడి వజ్రాయుధము దెబ్బతిని పడిపోయిన వృత్రాసురుడి

వలె రథముమీది నుంచి నేలకూలినాడు. ఆ యుద్ధములో చావగా మిగిలిపోయిన రాక్షసులు ప్రాణము కోలుపోయి అట్లా నేలకూలిన తమ ఏలికను చూచి భయ పడి అన్ని వైపులా పరుగులెత్తినారు. మహావృక్షాలు ఆయుధాలుగా పట్టుకొని ఉన్న వానరయోధులు సంతోషాతిశయముతో సింహనాదాలు చేస్తూ రాక్షస యోధులను తరిమికొట్ట సాగినారు. రావణాసురుడి చావుకూ రాముడి విజయానికీ సంతోషముతో ఉప్పొంగిపోయి వానరయోధులు అట్లా తమను తరిమికొట్టుతూ ఉంటే రాక్షసయోధులు కన్నీళ్లు కార్చుతూ జాలి పడ్డేట్లు ఏడుస్తూ భయపడుతూ లంకాపట్టణాభిముఖులు అయి పారిపోయినారు. అప్పుడు వానరవీరులు అందరూ రావణాసురుడి చావును గురించీ రాముడి విజయాన్ని గురించీ చెప్పుకొంటూ సింహనాదాలు చేసినారు.

దేవతలు అప్పుడు ఆకాశములో మంగళకరముగా దుందుభులు మోగించి నారు. భూమి మీద దివ్యగంధము గుబాళించింది. గాలి హాయిగా వీచింది. రాముడి రథంమీద దేవతలు మనోహరము అయిన పూలవాన కురిపించినారు. భూమి మీద వానరులు ప్రశంసించటమే కాకుండా ఆకాశములో ఉన్న మహానుభావులు అయిన దేవతలు అందరూ రాముణ్ణి వివిధ విధాలా స్తోత్రము చేసి నారు. దేవతల స్తోత్రాలు జగత్తు అంతటా వినిపించినవి. పరమ క్రూరుడూ సర్వలోక భయంకరుడూ అయిన రాక్షసరాజు రావణాసురుడు హతుడు అయి పోయినందుకు దేవతలు అందరూ పరమానందభరితులు అయినారు.

రాముడున్నూ ఆ రాక్షసరాజును రావణాసురుణ్ణి సంహారము చేసి వేసి సంతోషించినాడు. దేవసమూహాల కష్టాలు అన్నీ తీరిపోయినవి. దిశలు అన్నీ ప్రసన్నము అయినవి. ఆకాశము నిర్మలముగా భాసించింది. భూమి ప్రశాంత ముగా తోచింది. గాలి హాయిగా వీచింది. సూర్యుడు నిశ్చలకాంతులతో తేజ రిల్లినాడు.

అప్పుడు సుగ్రీవ విభీషణాది వీరులూ ఇంకా ఇతర మిత్రులూ లక్ష్మణు డితో కూడా చేరి ఆ జగదభిరాముణ్ణి రాముణ్ణి పూజించినారు. దేవసేనల మధ్య దేవేంద్రుడివలె, శత్రు సంహారము చేసి ప్రతిజ్ఞ చెల్లించుకొన్న ఆ మహా తేజోవంతుడు రాముడు అప్పుడు వానరసైన్యాల మధ్యను విరాజిల్లినాడు.

## ౧౧౨

యుద్ధములో చచ్చి పడి పోయిన తన అన్నను రావణాసురుణ్ణి విభీష ణుడు చూచినాడు. ఇట్టే దుఃఖము వచ్చింది. ఏడుస్తూ "ఓ వీరుడా, నీవు పరాక్రమానికి ప్రసిద్ధి కెక్కినావు. సుశిక్షితుడవు. నీతిశాస్త్రము తెలిసినవాడవు.

మహార్హ శయ్యలమీద పడుకోవలసిన వాడవు. ఇప్పుడు వచ్చి ఇట్లా నేల మీద పడి పోయినావా. అయ్యో! సూర్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న నీ కిరీటము తొలగి పోయింది. బాహుపురులు పెట్టుకొన్న నీ పొడుగాటి బాహువులు ఇట్లా పారచాచుకొని పడుకొన్నావా. ఓ వీరుడా, నీవు ఇట్లా అయి పోతావని నేను ఇదివరకే చెప్పినాను. కామపారవశ్యములో ఉన్నందువల్ల నా మాటలు నీకు అప్పుడు రుచించ లేదు. ఇప్పుడు ఈ దురవస్థ నీకు సంప్రాప్తము అయింది. ఇట్లా అవుతుందని ప్రహస్తుడు కానీ, ఇంద్రజిత్తు కానీ, మహాకాయుడు కుంభకర్ణుడు కానీ, నరాంతకుడు కానీ, తదితర రాక్షసులు కానీ వాండ్లె మదము నుంచి అనుకోలేదు. సీతాపహరణ పాపము ఇట్లా చేస్తుందని నీకు అయినా తోచలేదు. నేను చెప్పితే నీవు విన లేదు. ఆ పాపఫలము ఇప్పుడు ఇట్లా ప్రాప్తించింది.

"అన్నా! రాజనీతులకు అన్నింటికీ నీవు సేతువువంటి వాడవు. అగ్నిహోత్రమూ, జపమూ తపమూ అనే గృహస్థ ధర్మము నీ రూపాన అవతరించింది. ఈ జగత్తులో దేహబలము అనేది అంతా నీలో కేంద్రీకరించింది. నీ అంత వాడు లేడు అనిపించుకొన్నావు. నీవు మహావీరుడవు. ఆయుధధారులలో నీవు శ్రేష్ఠుడవు. ఇప్పుడు నీవు నేల కూలితే సూర్యుడు నేల కూలినట్టుగా ఉన్నది. చంద్రుడు చీకటిలో మునిగి పోయినట్టుగా ఉంది అగ్నిహోత్ర జ్వాలలు చల్లారి పోయినట్టుగా ఉన్నది. నీవు ఉత్సాహశక్తికి ఆశ్రయానివి. నీవు పోయినందువల్ల జగత్తు అంతా నిర్వ్యాపారముగా ఉంది. నీవు యుద్ధభూమిలో ఇట్లా దుమ్ముకొట్టుకొని పడి ఉన్నందువల ఈ లోకము అంతా శూన్యముగా కనపడుతూ ఉన్నది.

"అయ్యో, ధైర్యమే చిగురుటాకుగానూ, సహనమే పుష్పముగానూ, తపస్సే దార్ఢ్యముగానూ, శౌర్యమే పాదుకొన్న వేరుగానూ పెరిగి పెద్దది అయిన రావణాసురుడు అనే మహావృక్షము రణరంగములో రాముడు అనే పెనుగాలికి విరిగి పడి పోయింది. పరాక్రమమే దంతాలుగానూ, పితృపితామహాది వంశమే వెన్నెముక గానూ కోపమే దేహము గానూ అనుగ్రహమే తొండముగానూ యథేష్టముగా తిరిగిన రావణాసురుడు అనే మదపుటేనుగ రాముడు అనే సింహముచేతి చిక్కి నేలకూలింది. పరాక్రమమూ ఉత్సాహమూ భగ్గన మండుతూ ఉన్న మంటలు గానూ, నిట్టూర్పులు పొగలు గానూ దేహబలము వేడిగానూ ప్రతాపము తేజస్సు గానూ ప్రజ్వరిల్లిన రావణాసురుడు అనే అగ్నిహోత్రాన్ని రాముడు అనే మేఘము వర్షించి చల్లార్చి

వేసింది. రాక్షసులు తోక గానూ, మూపురము గానూ కొమ్ములు గానూ, తిరిగిన రావణాసురుడు అనే ఆబోతును రాముడు అనే పెద్దపులి చంపివేసింది" అంటూ రోదించినాడు.

ఈ విధముగా రావణాసురుణ్ణి గురించి సహేతుకముగా చెప్పుతూ యుక్తాయుక్తాలు తెలిసిన విభీషణుడు దుఃఖపడుతూఉంటే రాముడు "ఓ విభీషణుడా ఈ రావణాసురుడు పిరికివాడివలె చచ్చిపోలేదు. ప్రచండ పరాక్రమముతో అత్యున్నత మహోత్సాహముతో నిర్భయముగా యుద్ధరంగములో పోరాడి పడి పోయినాడు. ఇట్లా యుద్ధరంగములో చనిపోయిన వారికి వీర స్వర్గము తప్పదు. శూరధర్మము అవలంబించి నిర్భయముగా చనిపోయినవాడి కోసము దుఃఖపడకూడదు. దేవేంద్రుడితోకూడా ముల్లోకాలవారూ యుద్ధములో ఈ ధైర్యవంతుడికి భయపడి పోయినారు అటువంటి వాడికి ఇప్పుడు కాలము ముగింపుకొలి వచ్చింది. అందువల్ల ఇది తీవ్ర దుఃఖపడవలసిన సమయముకాదు. యుద్ధములో ఎవరు జయించేదీ ఎవరూ చెప్పలేరు. శూరుడు అయిన వాడు శత్రువులను చంపివేయను అయినా చంపివేయవచ్చును లేదా శత్రువులచేతిలో చచ్చిఅయినా పోవచ్చును. ఇదే వీరస్వర్గానికి మార్గము అని పూర్వీకులు చెప్పినారు. శూరులు అందరూ అంగీకరించినారు. యుద్ధములో చచ్చిపోయిన శూరుడి కోసము దుఃఖపడకూడదు. పుట్టిన ప్రతివాడికీ చావు తప్పదు. ఈ పరమార్థాన్ని గుర్తించు. దుఃఖాన్ని వదిలిపెట్టు. ఇకముందు చేయవలసిన పనిని గురించి ఆలోచించు" అని చెప్పినాడు.

విభీషణుడు దుఃఖతాపముతో "ఓ రామా, దేవేంద్రుడితో కూడా దేవతలు అందరూ పోరాడినా ఇతడు ఇతఃపూర్వము పరాజితుడు కాలేదు. సముద్రము చెలియలికట్టను తాకి చెదిరి వెనుకకు పోయేటట్లు ఇతడు నిన్ను తాకి పరాజితుడు అయినాడు. హతుడు అయి పోయినాడు. ఈ రావణుడు అనేక దానాలు చేసినాడు. గురువులనూ దేవతలనూ చక్కగా పూజించినాడు. సమస్తభోగాలూ అనుభవించినాడు. భృత్యులను ఆదరించి పోషించినాడు. మిత్రులకు కావలసినంత ధనము ఇచ్చినాడు. శత్రువులను అందరినీ రూపుమాపినాడు. ఇతడు ఆహితాగ్ని. మహాతపస్సు చేసినాడు. వేదాధ్యయనము చేసినాడు. కర్మఠుడు. ఇప్పుడు ఇతని ప్రేతత్వవిముక్తికి చేయవలసిన కర్మలు నీ అనుగ్రహముతో నేను చేయవలెను అనుకొంటున్నాను" అని చెప్పినాడు.

ఇట్లా జాలి పుట్టేటట్లు విభీషణుడు చెప్పిన మాటలు అన్నీ విని ఆ మహాత్ముడు రాముడు రావణాసురుడు స్వర్గానికి పోవటానికి అంత్యేష్టికర్మ చేయ

వలసింది అని చెప్తూ "ఓ విభీషణుడా, చచ్చిపోయేవరకు వైరము, మనము అనుకొన్న పని అయిపోయింది. ఇకను ఈ రావణాసురుడికి ఔర్ధ్వదైహికకర్మ నీవు చేయవలెను. స్నేహవిషయములో ఇతడు నీకు ఎటువంటివాడో నాకూ అటువంటి వాడే" అని చెప్పినాడు.

## ౧౧౩

మహాపరాక్రమవంతుడు రాముడు రావణాసురుణ్ణి చంపి వేసినాడు అని అతని భార్యలందరూ విన్నారు. దుఃఖముతో కుంగిపోయి నేలమీద పడి దుమ్ములో దొర్లుతూ తలవెంట్రుకలు ముడులు ఊడిపోయి వెంట్రుకలు విరబోసుకొని దూడలు పోయిన ఆవుల మాదిరిగా ఏడుస్తూ ఎవరు ఎంత అడ్డగించినా వినకుండా అంతఃపురములో నుంచి బయలుదేరినారు. ఆ రాక్షసాంగనలు దుఃఖముతో బాధ పడుతూ రాక్షసయోధులను వెంటపెట్టుకొని లంకాపట్టణ ఉత్తర ద్వారములో నుంచి వెలుపలికి వచ్చి తమ పెనిమిటి కోసము మహాభయంకరము అయిన ఆ యుద్ధభూమిలో వెతుకుతూ "ఓ రాజపుత్రా", అని రాముణ్ణీ "అయ్యో, నాథా" అని తమ పెనిమిటిని సంబోధించి కేకలు పెట్టుతూ నెత్తురుతో బురద బురద అయిపోయిన ఆ యోధుల శవాలను చూస్తూ అన్ని వైపులా తిరిగినారు. భర్తృదుఃఖము ముంచుకొనిపోయి కన్నులనిండా కన్నీళ్లు కమ్ముకొని ఆ రాక్షసాంగనలు పోతుటేనుగ చచ్చిపోతే ఆడ ఏనుగలవలె గీపెట్టి ఏడ్చినారు.

ఆ యుద్ధభూమిలో నల్లటి కాటుక రాశివలె నేలమీద దుమ్ములో పడి ఉన్న ఆ మహాపరాక్రమవంతుణ్ణి ఆ మహాకాయుణ్ణి తమ పెనిమిటిని రావణాసురుణ్ణి ఆ రాక్షసాంగనలు అందరూ చూచినారు. నరికి వేసిన వనలతలవలె వారు అందరూ రావణాసురుని దేహముమీద వాలినారు. ప్రేమాతిశయముతో ఒకతె ఆ కళేబరాన్ని కౌగలించుకొని ఏడ్చింది. ఒకతె పాదాలు పట్టుకొని ఏడ్చింది. ఒకతె కంఠము పట్టుకొని ఏడ్చింది. ఒకతె భుజాలు ఎత్తిపట్టుకొని ఏడుస్తూ నేలమీద పొర్లాడింది. ఆ చచ్చిపోయిన పెనిమిటి ముఖము వంక చూస్తూ ఒకతె మూర్ఛపోయింది. ఆ పెనిమిటి తలను తన ఒడిలో పెట్టుకొని ఆ ముఖాన్ని చూస్తూ ఒకతె ఏడ్చింది. ఆ ముఖాన్ని తన కన్నీళ్లతో తడుపుతూ ఒకతె ఏడ్చింది. చచ్చి నేలమీద పడి ఉన్న తమ పెనిమిటిని చూచి ఆ స్త్రీలు అందరూ పెద్ద పెట్టున పరిపరి విధాల ఏడ్చినారు.

"నాథా, దేవేంద్రుణ్ణీ యముణ్ణీ భయపెట్టుతూ ఉండే వాడివే! కుబేరుణ్ణి జయించి పుష్పక విమానము తెచ్చుకొన్నావే! మహాపరాక్రమవంతులు అయిన

సురలనూ గంధర్వులనూ గడగడలాడించినావే! అటువంటి నీవు రణరంగములో చచ్చి పడిపోయినావా! అసురులవల్ల కాని దేవతల వల్ల కాని పన్నగుల వల్ల కాని ఏ భయమూ ఎరుగని నీవు ఒక మానవుడి చేతిలో ఇట్లా అయిపోయినావా! ఇదేమిటి! ఇంత దురవస్థ నీకు ఎట్లా వచ్చింది. దేవదానవ రాక్షసులు ఎవరూ వధించలేక పోయిన నిన్ను ఒక పదాతి అంగులో మానవుడు రణరంగములో కొట్టి చంపి వేసినాడా. దేవాసుర యక్షులకు చంపను అలవి కాకుండా పోయిన నీవు ఎవరో బలహీనుడివలె ఒకానొక మానవుడి చేతిలో చచ్చిపోయినావా" అని చెప్పుకుంటూ ఆ రావణాసురుడి భార్యలు అందరూ అనేకవిధాల ఏడ్చినారు. దుఃఖార్తులు అయి మరీమరీ ఏడ్చినారు. "నాథా, నీ మేలు కోరేవారు చెప్పే మాటలు నీవు ఎన్నడూ విని ఎరుగవు. నీ చావుకోసము నీవు సీతాదేవిని తెచ్చుకొన్నావు. నీవు చచ్చిపోవడమే కాకుండా రాక్షససమూహములు అందరూ చచ్చిపోయినారు. మేము ఇప్పుడు ఇట్లా అయిపోయినాము. నీమీది గౌరవాతిశయముతో నీ తమ్ముడు విభీషణుడు నీకు హితము చెప్పినాడు. అతడు ఏమి చెప్పినా ప్రయోజనము లేకపోయింది. నీవు కాలపాశవశంగతుండవు అయినావు. అజ్ఞానమువల్ల అతనితో నిష్ఠురాలు ఆడినావు. పరుషము అయిన మాటలు అన్నావు. అతనిని అవమానించినావు.

"ఓ రాజా, ఆ మైథిలిని సీతాదేవిని రాముడి దగ్గరికి నీవే పంపించి వేసి ఉన్నట్లయితే ఇట్లా సమూలముగా నాశనము అయిపోవడము ఉండేది కాదు గదా! ఈ మహాఘోర దుఃఖము మాకు వచ్చేది కాదుగదా! నీవు అట్లా చేసి ఉన్నట్లయితే నీ తమ్ముడు విభీషణుడి మాటలు చెల్లించిన వాడవు అయ్యేవాడవు. నీ వంశానికి రాముడు మిత్రుడు అయ్యేవాడు. మేము విధవలము అయ్యేవాళ్లము కాము. నీ శత్రువులు అయిన దేవేంద్రాదుల కోరిక నెరవేరి ఉండేది కాదు.

"నాథా, నీవు బలవంతముగా సీతను తెచ్చినావు. నీ క్రూరస్వభావముతో నీవు ఆమెను చెరలో ఉంచినావు అందువలననే నీవూ అందరు రాక్షసులూ ఇట్లా పడిపోయినారు. మా గతి ఇట్లా అయిపోయింది. ఓ రాజా, ఇది అంతా నీ స్వేచ్ఛాచరణమువల్లనే జరగలేదు. ఇది దైవికము. సమస్తమూ దైవమువల్లనే జరిగినది. దైవమే నిన్ను చంపివేసింది. మరి ఒకటి కాదు. ఓ మహాబాహూ, మహాసంగ్రామములో వానరులూ రాక్షసులూ నీవూ దైవయోగమువల్లనే నాశనము అయిపోయినారు. కాని మరి ఒకందువల్ల కాదు. కార్యోన్ముఖము అయిన దైవగతిని అర్థముతో అడ్డగించటము ఉత్తది. స్వేచ్ఛావ్యాపారముతో

కానీ పరాక్రమముతో కానీ దానిని నిరోధించటము అశక్యము. రాజాజ్ఞ పని చేయదు. దైవగతిని ఏదీ తప్పించలేదు. అది జరిగితీర వలసిందేను" అంటూ రావణాసురుడి భార్యలు ఏడుస్తూ కన్నీళ్లు కారుస్తూ దీనలు అయిపోయినారు. దుఃఖార్తలు అయి క్రౌంచపక్షులవలె ఏడ్చినారు.

౧౧౪

ఆ రాక్షసాంగనలు అందరూ అట్లా ఏడుస్తూ ఉండగా రావణాసురుడికి అత్యంత ప్రియురాలూ జ్యేష్ఠపత్ని అయిన మండోదరి అక్కడికి వచ్చింది. ఊహించను అలవికాని పనులు చేసే రాముడిచేతిలో చచ్చిపడిఉన్న తన పెనిమిటిని దశగ్రీవుణ్ణి చూచింది ఆమెకు పట్టరాని దుఃఖము వచ్చింది. వెక్కి వెక్కి ఏడుస్తూ "ప్రభూ, నీవు మహాభాగుడవు. కుబేరుడు అంతటివాడి తమ్ముడవు. నీకు కోపము వస్తే దేవేంద్రుడు అయినప్పటికిన్నీ నీ ఎదట నిలవకుండా భయపడి పారిపోతాడు. మహాప్రభావము కలవారు అని ప్రసిద్ధికెక్కిన మహర్షులూ బ్రాహ్మణులూ ఆకాశములో తిరిగే చారణులూ గంధర్వులూ నీకు భయపడి దిక్కులు తెలియకుండా పారిపోతారే. రాజా, ఇది ఏమిటి. నీవు యుద్ధములో ఒక మనుష్యమాత్రుడి చేతిలో పడిపోవటము ఏమిటి. రాజా, నీవు నీ పరాక్రమముతో ముల్లోకాలూ ఆక్రమించుకొన్న కాంతిమంతుడవు. దేవేంద్రాదులు ఎవ్వరూ ఎదిరించలేని బలవంతుడవు. నిన్ను ఒక అడవిమనిషి ఎట్లా చంపివేసినాడు. మానవుడు తిరగలేనిచోట్ల నీవు తిరగగలవే. కావలెను అనుకొన్న ఆకారము నీవు ధరించగలవే యుద్ధములో నీవు రాముడిచేతిలో చచ్చిపోవటము ఎట్లా సాధ్యము అయింది. సైన్యాలూ సమస్త యుద్ధోపకరణాలూ ఉన్న నిన్ను రాముడు అనే మనుష్యమాత్రుడు యుద్ధములో చంపివేసినాడు అంటే నేను నమ్మలేకుండా ఉన్నాను.

"రాజా, జనస్థానములో అంతమంది రాక్షసులతో ఉన్న నీ తమ్ముణ్ణి ఖరుణ్ణి చంపివేసినాడు అని తెలిసినప్పుడే రాముడు మనుష్యమాత్రుడు కాడు అని నాకు తోచింది. నేను ఆ సంగతి నీతో చెప్పినాను. దేవతలకు అయినా అడుగుపెట్టడానికి అలవికాని మన లంకాపట్టణానికి హనుమంతుడు వచ్చినప్పుడు అందరమూ ఆశ్చర్యపడిపోయినాము. అతని పరాక్రమానికి వ్యథపడిపోయినాము. భయంకరాకారులు అయిన వానరులు మహాసముద్రానికి సేతువు కట్టినారు అని తెలిసినప్పుడు నా మనస్సులో రాముడు మానవమాత్రుడు కాడు అనుకొన్నాను. నిన్ను చంపివేయటానికి ఊహించ నలవికాని మాయతో సీతను సృష్టించి యముడు స్వయముగా రాముడిరూపము ధరించివచ్చి ఉండ

వలెను. లేదా దేవేంద్రుడు అయినా వచ్చి ఉండవలెను. అయితే యముడికి కాని దేవేంద్రుడికికాని నీ ఎదుట నిల్చే శక్తి ఎక్కడిది.

"ఈ రాముడు మనుష్యమాత్రుడు కాడు. ఈతడు లోకరక్షణోపాయ చింతాపరుడున్నూ ఆత్మలకు ఆత్మ అయిన వాడున్నూ అక్షయుడున్నూ పుట్టి పెరిగిచావడము లేని వాడున్నూ శాశ్వతుడున్నూ పరిణామము లేనివాడున్నూ బ్రహ్మేంద్రాదులకన్నా గొప్పవాడున్నూ ప్రకృతికి అతీతుడున్నూ జగత్తును పోషించేవాడున్నూ శంఖచక్రగదాధరుడున్నూ శ్రీవత్సము అనే ఎర్రటి మత్స్యాకారము మచ్చ ఎదుట రొమ్ము కుడిప్రక్కన ఉన్నవాడున్నూ ఎన్నడూ లక్ష్మీదేవిని ఎడబాయని వాడున్నూ అయిన శ్రీమహావిష్ణువు అయి ఉండవలెను. అందువల్లనే అజయ్యుడు అని స్పష్టముగా తెలుస్తూ ఉంది. ఆ మహాద్యుతిమంతుడు ఆ సత్యపరాక్రముడు ఆ సర్వలోకేశ్వరుడు మహావిష్ణువు ప్రత్యక్షముగా లోకాలకు మేలు చేయ తలచి మానవాకారము ధరించినాడు. వానర రూపములో ఉన్న దేవతలను అందరినీ వెంట పెట్టుకొని వచ్చినాడు. నీ రాక్షస పరివారాన్నీ నిన్నూ వధించి వేసినాడు.

"ఓ, రాజా, నీవు ఇదివరకు దేహేంద్రియాలను నిగ్రహించి త్రిభువనాలను జయించినావు. అందుకు ఆ ఇంద్రియాలు పగపట్టి నిన్ను జయించినవి. నీవు వాటికి లోబడి పోయినావు. కామపరవశుడవు అయిపోయినావు. త్రిభువనాలను జయించిన నీవు ఒక ఆడదాని కోసము ఇప్పుడు ఇట్లా అయిపోయినావు. అంతేకాని, నిన్ను సర్వేశ్వరుడు చంపి వేయ లేదు. రాముడితో విరోధము పెట్టుకోవద్దు అని నేను నీతో ఎంతో చెప్పినాను. నీవు నా మాట విన లేదు. దాని ఫలము ఇప్పుడు ఇట్లా నీకు అనుభవానికి వచ్చింది. ఓ రాజా, నీవు సీతాదేవిని కామించినావు. అందువల్ల నీవు పోవడమే కాకుండా నీ బంధుమిత్రులు నిర్హేతుకముగా చచ్చి పోయినారు. నిష్కారణముగా నీ ఐశ్వర్యము నాశనము అయి పోయింది. నీవు అటువంటి పని చేసినావు. ఇంతకూ నీ మతి అప్పుడు చెడి పోయింది. పాతివ్రత్యములో అరుంధతీదేవి కన్నా రోహిణీదేవి కన్నా అధికురాలూ పూజ్యురాలూ అయిన సీతాదేవిని నీవు అవమానించినావు చెయ్య కూడని పని చేసినావు. ఓ ప్రభూ, నీ భార్యలు సౌందర్యవతులు కారు అను కొన్నావు. ఓర్పుకు భూమి కన్నా ఎక్కువ అయిన దానిని సంపదకు లక్ష్మీదేవి కన్నా ఎక్కువ అయిన దానిని మహాపతివ్రత అయిన దానిని, సర్వాంగ సుందరి అయిన దానిని, కల్యాణ స్వరూపిణి అయిన దానిని సీతా దేవిని నిర్జనారణ్యములో ఒంటరిగా ఉన్నప్పుడు కపటోపాయముతో లేవనెత్తుకొని వచ్చినావు. ఆమెను పొందవలెను అను

కొన్నావు. ఆ కోరిక నెరవేరనేలేదు. ఆ మహాపతివ్రత తపోగ్నికి నీవు తగలబడిపోయినావు. సందేహములేదు. ఆ తనుమధ్యను సీతాదేవిని అవమానించినప్పుడే నీవు దగ్ధముఅయిపోయి ఉండవలసింది. అల్లా జరుగలేదు. అది సి మహత్తు. అందుకు అగ్నిహోత్రాదిదేవతలు ఆశ్చర్యపడిపోయినారు. భయపడి పోయినారు. పాపకర్మచేసినవాడు కాలపరిపాకము అయినప్పుడు భయంకరము అయిన ఫలము అవశ్యమూ అనుభవిస్తాడు. ఎంతమాత్రమూ సందేహములేదు. శుభకర్మలు చేసినవాడు శుభఫలమూ పాపకర్మలు చేసినవాడు పాపఫలమూ అనుభవించకతప్పదు. రాజా, నీతమ్ముడు విభీషణుడు రాముణ్ణి ఆశ్రయించినాడు. మంచిపనిచేసినాడు అందువల్ల అతడు సుఖము అనుభవిస్తూఉన్నాడు. ఇక ముందునూ సుఖమే అనుభవిస్తాడు. నీవు పాపిష్ఠిపనిచేసినావు. ఇట్లా అయి పోయినావు.

"ఓ రాజా, సౌందర్యానికి ఆ సీతాదేవిని మించిన ఇతర స్త్రీలు ఎంతో మంది ఉన్నారు. కానీ నీవు కామపారవశ్యమువల్ల అజ్ఞానివి అయి ఆ విషయము తెలుసుకోలేకపోయినావు. ప్రభూ, వంశగౌరవములో కానీ సౌందర్యములో కాని చాతుర్యములో కానీ ఆ మైథిలి నాకన్నా ఎక్కువఅయింది కాదు. నాతో సరిసమానముఅయింది అయినా కాదు. నీ అవివేకమువల్ల నీకు ఆమాత్రము తెలియలేదు. ఇంతేకా సకలప్రాణులూ ఏదోఒక నిమిత్తమునుంచి చచ్చిపోతూ ఉంటవి. అదేవిధముగా నీవు ఆ సీత నిమిత్తమునుంచి చనిపోవలసివచ్చింది. ఆమెమూలాన నీవు మృత్యువును దూరదేశమునుంచి తెచ్చుకొన్నావు. రాజా, ఇకను ఆ సీతాదేవి నిర్విచారముగా రాముడితో విహరిస్తుంది. నేను మంద భాగ్యను ఘోరమైన శోకసాగరములో పడ్డాను.

"ఓ శూరుడా. కైలాసపర్వతముమీదనూ మేరుమందర పర్వతాలమీదనూ చైత్రరథము అనే కుబేరుడి ఉద్యానవనములోనూ సమస్త దేవోద్యానవనాల లోనూ చిత్రవిచిత్రముఅయిన పూలదండలతో అలంకరించుకొని అమూల్యము అయిన వస్త్రాలు ధరించి నీతోకూడా విహరించినాను. సాటిలేని సంపదలతో మనకు అనురూపముఅయిన విమానము ఎక్కిపోయి వివిధదేశాలూ చూస్తూ కోరు కొన్న భోగాలు అన్నీ నీతో అనుభవించినాను ఇప్పుడు నీవు చనిపోయినందు వల్ల ఆ భోగాలు అన్నీ అయిపోయినవి. అటువంటి రాజభోగాలు అనుభవించిన నేను ఇప్పుడు అభాగ్యను అయినాను. రాజుల భోగభాగ్యాలూ నిలకడ లేనివి; ఛీ!

"రాజా, నీముఖము చంద్రునివలె ప్రసన్నము అయినది. పద్మమువలె అందము అయినది. సూర్యునివలె తేజోవంతము అయినది. నీ కనుబొమలు కోమ

లము అయినవి. నీముక్కు పొడుగాటిది. నీది నున్నటి దేహము. ధగధగలాడే కుండలాలతోనూ ఉజ్జ్వలముఅయిన కిరీటాగ్రముతోనూ పూలదండలు అలంకరించుకున్న కంఠముతోనూ పానశాలలో కైపెక్కి కన్నులు తేలిపోతూ ఎర్రటి పెదవులతో మనోహరముగా చిరునవ్వులు నవ్వుతూ మధురముగా మాట్లాడుతూ మంగళకరముగా కనుపించే నీముఖము ఇప్పుడు రామబాణము దెబ్బకు చిల్లులుఅయి పారిన నెత్తుటిలో తడిసిపోయి మెదడు మాంసమూ కమ్ముకొని దుమ్ముకొట్టుకొని అమంగళముగా మారిపోయినది. అయ్యో, నేను మందభాగ్యను. నీకు ఈ దురవస్థ వస్తుంది అని నేను విధవను అవుతాను అని ఎన్నడూ అనుకోలేదు. నాతండ్రి దానవరాజు అనీ నా పెనిమిటి రాక్షసరాజు అనీ నాకొడుకు దేవేంద్రుణ్ణి జయించిన పరమపరాక్రమవంతుడుఅనీ నేను విర్రవీగినాను. నా రక్షకులు నా తండ్రీ, నా పెనిమిటీ, నా కొడుకూ గర్వించిన శత్రువులను మర్దించినారు అనీ శూరులుఅనీ బలపౌరుషాలకు ప్రసిద్ధికెక్కినారు అనీ ఎవరివల్లనూ ఏభయమూ లేనివారు అనీ నేనుగట్టిగా నమ్మినాను. ఓరాజా, ఇటువంటి ప్రభావముకల మీరు మీ కొమారుడూ ఇదివరకు ఎన్నడూ ఊహించని ఒక మనుష్యుని చేతిలో ఎట్లా పడిపోయినారు.

“ఓరాజా, నీ కాయము నల్లని నిగనిగలతో ఇంద్రనీలమణివలెనూ ఎత్తు అయిన పర్వతమువలెనూ తేజరిల్లుతూ ఉండేది. చేతులకు పెట్టుకున్న బంగారు బాహుపురులతోనూ మెడలో వేసుకొన్న వైడూర్యమణిఖచితముక్తాహారాలతోనూ రంగురంగుల పూలదండలతోనూ నీ దేహయష్టి విహారస్థలాలలో మనోహరముగా తేజరిల్లేది. ధగధగలాడే ఆభరణాలతో మెరుపులు మెరుస్తూ ఉన్న నీలమేఘమువలె నీ మహాకాయము సంగ్రామరంగములో కన్నులు మిరుమిట్లు కొల్పేది. అటువంటి నీ మహాకాయములో సందులేకుండా తీక్ష్ణబాణాలు ఎన్నో గుచ్చుకొన్నవి. బాధా, అందువల్ల నిన్ను కౌగలించుకోలానికి కానీ చివరకు తాకటానికికానీ అలవికాకుండా ఉంది. రాజా, నీదేహము అంతటానూ నీ ఆయువుపట్టులలోనూ ఏదుపంది ముళ్ళవలె చోటులేకుండా బాణాలు గుచ్చుకొన్నవి. నరాల ముళ్లుఅన్నీ తెగిపోయినవి. నీ దేహముఅంతా నెత్తుటితో తడిసి కపిశవర్ణముతో వజ్రాయుధము దెబ్బతిన్న పర్వతమువలె ఈ నేలమీద పడిపోయింది. అయ్యో, ఈ చూస్తున్నది అంతా స్వప్నమా? యథార్థమా? రాజా, నీవు మృత్యువుకు మృత్యువే. నీవు ఎట్లా మృత్యువశము అయినావు, రాముడు నిన్ను ఎట్లా చంపివేయ కలిగినాడు.

“రాజా, ముల్లోకాలలో అమూల్య పదార్థాలను అన్నిటినీ తెచ్చుకొని అనుభవించినావు. ముల్లోకాల వారిని గజగజలాడించినావు. లోకపాలకుల

జయించినావు. కోపము వచ్చి శివునితో కూడా కైలాస పర్వతాన్ని ఎగరవేసినావు. గర్వించిన వాళ్లను అందరినీ నిగ్రహించినావు. సమస్త లోకాలవారికీ నీ పరాక్రమాన్ని చూపించినావు. సమస్త లోకాలను బాధ పెట్టినావు. నీ మహానాదముతో భూత కోటిని అంతా ఏడ్పించినావు. శత్రు సన్నిధానములో నీవు గర్వముతో గర్వోక్తులు పలికినావు. భయంకర కన్నులు అయిన బంధువులనూ భృత్యులనూ పరిపాలించినావు రక్షించినావు వేనవేలు దానవ వీరులను సంహారము చేసి వేసినావు. యక్షులను హతమార్చినావు. నివాతకవచులు అనే రాక్షసులను భయపెట్టి స్నేహము చేసుకొన్నావు. నీవు ముల్లోకాలకూ నియామకుడవు అయి ఎన్నో యజ్ఞాలను చెడగొట్టినావు. ధర్మ వ్యవస్థను భేదించినావు. స్వజనాన్ని కాపాడినావు యుద్ధములో మాయలు పన్నినావు. అక్కడక్కడ నుంచి దేవకన్యలనూ అసురకన్యలనూ మానవ కన్యలనూ అపహరించుకొని వచ్చినావు. శత్రువుల భార్యలను దుఃఖ పెట్టినావు. స్వజనులకు నాయకుడవు అయినావు. లంకాద్వీపాన్ని కాపాడినావు భయంకర కృత్యాలకు అన్నిటికీ నీవే కర్తవు మమ్ములను కామభోగాలలో ముంచినావు. నీవు రథికులలో శ్రేష్ఠుడవు ఇంత ప్రభావముకల నిన్ను నా పెనిమిటి రాముడు పడగొట్టితే నా ప్రియుడా చచ్చిపోతే చూస్తూ నేను ఇంకా చావకుండా బ్రతికి ఉన్నాను. ఏమిటి నేను వజ్రశిలనో ఏమో?

"ఓ రాజా, మహాశయ్యలమీద పడుకొని నిద్రపోయే నీవు ఎందుకు ఇక్కడ ఈ నేలమీద ఎర్రటి దుమ్ము కొట్టుకొని నిద్ర పోతున్నావు. నా కొడుకును ఇంద్రజిత్తును లక్ష్మణుడు యుద్ధములో చంపి వేసినప్పుడే నాకు దెబ్బ తగిలింది. సగము ప్రాణము పోయింది. నాథా, ఇప్పుడు నీ చావుతో నేను సంపూర్ణముగా చచ్చిపోయినట్లే అయిపోయింది. నీవు జీవించి ఉన్నట్లయితే బంధు జనులూ నా బిడ్డలూ చనిపోయినందుకు నేను దుఃఖపడను. నా పెనిమిటివి నీవు నన్ను విడిచిపెట్టి పోయినావు నేను ఎన్ని సంవత్సరాలు అయినా దుఃఖము అనుభవించ వలసిందే. రాజా, నీవు ఇప్పుడు దుర్గమము అయిన దూర దేశము పోతున్నావు. నేను దుఃఖార్తను నన్ను కూడా నీతో తీసుకొని పో. నిన్ను వదిలిపెట్టి నేను జీవించి ఉండలేను నా గర్వము ఉడిగిపోయింది. పరమ దుఃఖముతో విలపిస్తున్నాను. నేను మందభాగ్యను. నన్ను వదిలి పెట్టి నీవు ఒక్కడవే ఎందుకు పోతున్నావు. నాతో పలకను అయినా పలకవు ఏమిటి.

"ప్రభూ నేను వస్త్రము పైన కప్పుకోకుండా నగర ద్వారములో నుంచి వెలుపలికి వచ్చి ఇక్కడికి ఇట్లా కాలి నడకను వస్తే నన్ను చూచి నీవు

కోపపడకుండా ఉన్నావు ఎందువల్ల. ఇదుగో వీరు అందరూ నీ ప్రియభార్యలు. వీరు అందరూ సిగ్గు వదిలిపెట్టి పైన బట్టలు కప్పుకోకుండా బయటికి వచ్చినారు. వీళ్లను చూచి నీవు కోపపడకుండా ఉన్నావే. రాజా నీ క్రీడా సహాయలు అయిన భార్యలు అందరు అనాథలు అయి ఇట్లా విలపిస్తూ ఉంటే నీవు ఆశ్వాసించవు. ఆదరించవు ఎందువల్ల.

"రాజా నీవు పరమధర్మ పరాయణురాలూ గురుజన సేవాసక్తురాలూ పరమ పతివ్రతలూ అయిన కులాంగనలను అనేక మందిని విధవలను చేసినావు. వాళ్లు అందరూ దుఃఖతాపముతో నిన్ను శపించినారు. అందువల్ల నీవు ఇప్పుడు ఇట్లా శత్రువుచేతిలో చిక్కిపోయినావు. నీవు బాధపెట్టిన పతివ్రతల శాపమువల్లనే నీకు ఇప్పుడు ఇటువంటి చావు వచ్చింది. పతివ్రతలు కార్చిన కన్నీళ్లు వ్యర్థముఅయిపోవు అనే జనశ్రుతి నీ విషయములో యథార్థము అయింది రాజా నీవు నీ పరాక్రమముతో ముల్లోకాలనూ జయించినావు. శౌర్యముతో గర్వించినావు. ఇటువంటి నీవు నీచముఅయిన స్త్రీచౌర్యము చేసినావు ఏమిటి నీవు మృగమాయతో రాముణ్ణి ఆశ్రమములోనుంచి అవతలకు పంపించివేసి అతని భార్యను తెచ్చుకోవడము నీ పిరికితనానికి నిదర్శనము అయింది. నీకు యుద్ధములో ఒకానొకప్పుడు అయినా పిరికితనము వచ్చినట్లు నాకు జ్ఞాపకము లేదు. ఇంతకూ నీభాగ్య విపర్యయకాలము దాపురించింది. ఆ పిరికిపని చేసినావు. నీవు తెచ్చిన సీతాదేవిని చూచి నీ తమ్ముడు నామరది విభీషణుడు ఆలోచించినాడు. పెద్ద పెద్ద నిట్టూర్పులు విడిచినాడు. అతడు భూతభవిష్యద్వర్తమానాలు అన్నీ తెలిసినవాడు. వర్తమాన విషయాలు పరిశీలించే సామర్థ్యము కలవాడు. అబద్ధము ఆడేవాడు కాడు. అతడు మహాప్రాజ్ఞుడు. అప్పుడు అతడు చెప్పినాడు. నీ కామక్రోధ వ్యసనాలవల్ల రాక్షసవీరులు అందరూ నాశనము అయిపోయినారు. కూకటి వేళ్లతో కూడా సర్వనాశనము అయిపోయిన ఈ మహానర్థము నీ ఒక్కడివలనే జరిగింది. నీ నుంచి రాక్షసవంశము దిక్కుమాలింది అయిపోయింది. అయితే నేమిటి నీవు బలానికి పౌరుషానికి ప్రసిద్ధికి ఎక్కినావు యుద్ధములో చచ్చిపోయినావు. నీకోసము నేను దుఃఖపడకూడదు. అయితే నేను ఆడుదాన్ని. మనస్సు నిలవక ఏడుస్తూ ఉన్నాను.

"ప్రభూ, నీవు సుకృతాన్నీ దుష్కృతాన్నీ మూటకట్టుకొని నీ దారిన నీవుపోతూ ఉన్నావు. అందుకోసము నేను దుఃఖపడటములేదు. నీ ఎడబాటు నేను సహించలేను. భరించలేను. నన్ను గురించి నేను దుఃఖపడుతున్నాను. ఓ పుణ్యాత్ముడా నీ మేలుకోరి నీ మిత్రులు చెప్పిన మాటలు నీవు వినలేదు. నీ

తమ్ముడు విభీషణుడు సర్వవిధాలా నీ మేలుకోరి సహేతుకముగానూ అర్థయుక్తముగానూ యథాశాస్త్రముగానూ శ్రేయస్కరముగానూ ఎంతో మృదువుగా చెప్పినాడు. నీవు వినలేదు. విభీషణుడు ఏమిటి. నీకు మారీచుడే చెప్పినాడు. నీ తమ్ముడు కుంభకర్ణుడు చెప్పినాడు. నా తండ్రి చెప్పినాడు. నీవు నీ పరాక్రమమదము నుంచి ఎవరి మాటలూ వినలేదు. ఇప్పుడు ఈ ఫలము ప్రాప్తము అయింది.

"ఓ నీలమేఘవస్త్రుడా, పసుపువస్త్రము కట్టుకొని అందము అయిన బాహువులలో అలంకరించుకొన్న నీవు నెత్తురులో తడిసి నేలమీద కాళ్ళూ చేతులూ చాచుకొని నిద్రపోతున్న వాడివలె పడుకొన్నావు ఏమిటి? దుఃఖార్తను అయిన నాతో మాట్లాడవు ఏమిటి? నేను మహాపరాక్రమవంతుడూ సమర్థుడూ యుద్ధములో అపరాజితుడూ అయిన మాల్యవంతుడి మనుమరాలిని. నన్ను కన్నెత్తి చూడవు ఎందువల్ల ప్రభూ, ఎందుకు ఇట్లా పడుకొంటావు. నీవు ఇప్పుడు లేవవలెను. లే నూతనము అయిన అవమానము సంప్రాప్తము అయింది. లంకా పట్టణము మీద ఇప్పుడు నిర్భయముగా సూర్యకిరణాలు వచ్చి పడుతున్నవి నీవు లే. అయ్యో సూర్యకాంతులతో తేజరిల్లే నీ పరిఘాయుధము రామబాణాలకు ముక్కలుముక్కలు అయిపోయిందే. దేవేంద్రుడు తన వజ్రాయుధాన్ని వలె బంగారు కట్టు వేసిన నీ పరిఘాయుధాన్ని నీవు నిత్యమూ పూజిస్తూ ఉండేవాడివి. యుద్ధాలలో ఎంతమంది శత్రువులనో నీవు ఈ పరిఘాయుధముతో సంహారము చేసివేసినావు. అయ్యో, నీ పరిఘాయుధము ముక్కలు ముక్కలు అయిపోయిందే నీవు నీ ప్రియురాలినివలె యుద్ధభూమిలో ఈ నేలను కౌగలించుకొని పడుకొని ఉన్నావు. ఆ ప్రియురాలితో మాట్లాడినట్లు నాతో మాట్లాడకుండా ఉన్నావు

"రాజా! నీవు పంచత్వము చెందితే నా గుండె ముక్కలు ముక్కలుగా పగిలిపోలేదు. ఎందువల్ల. ఛీ. ఛీ" అంటూ ఏడ్చింది.

ఇట్లా ఆ మండోదరి ఏడుస్తూ ఉంటే కన్నులు కలకబారి పోయినవి. ఆమె హృదయము కుమిలిపోయింది. ఏడ్చి ఏడ్చి ఒళ్లు తెలియకుండా రావణాసురుడి వక్షఃస్థలముమీద పడి మూర్ఛపోయింది. అప్పుడు ఆమె సంధ్యారాగము అలముకొన్న నీలమేఘముమీద మెరుపుతీగ మాదిరిగా మెరిసింది. ఆమెతో పాటు ఏడుస్తూ ఉన్న ఆమె సవతులు అప్పుడు గబగబా ఆమెను లేవతీసి కూర్చుండపెట్టి "ఓ దేవీ, ప్రతి ప్రాణికి బాల్య, కౌమార, యౌవన, వార్థక దశాభేదాలను పట్టి మార్పు తప్పదు. రాజుల వైభవానికి ఒక నిలకడ ఉండదు. ఈ విషయము

నీకు తెలియనిది ఏమీ లేదు. ఎందుకు దుఃఖపడతావు" అంటూ ఊరడించినారు. ఇట్లా సవతులు ఊరడిస్తూఉంటే మండోదరి కన్నీళ్ళ కాలువలతో తన ఉన్నత స్తనాలు తడిసిపోయేటట్లు పెద్ద పెట్టున ఏడ్చింది.

ఇట్లా రావణాసురుడి భార్యలు ఇటువైపున ఏడుస్తూఉంటే అటువైపున రాముడు విభీషణుణ్ణి చూచి "ఓ మిత్రుడా, నీ అన్నకు దహనసంస్కారము చేయవలసిఉంది. ఈ స్త్రీలను అందరినీ వెనకకు పంపించు" అని చెప్పినాడు. ఇట్లా ధర్మార్థసహితముగా రాముడు చెప్పిన మాటను విని ఆ వినయసంపన్నుడు ఆ ధర్మజ్ఞుడు విభీషణుడు మనసా ఆలోచించినాడు. రాముడు చెప్పినట్లే అనుసరించ తలచుకొన్నాడు. కానీ, పైకి ఇట్లా అన్నాడు. "రామా, ఈ రావణుడు ధర్మము తప్పినాడు. వ్రతానుష్ఠానము వదిలిపెట్టినాడు. వీడు క్రూరుడు. ఘాతుకుడు. అనృతములు ఆడేవాడు. పరదారలను తడిమేవాడు. వీడికి దహన సంస్కారము చేయడానికి నేను తగిన వాణ్ణి కాను. వీడు ఈ రావణాసురుడు నాకు భ్రాతృరూపశత్రువు. పూజ్యుడు అయిన వారికి వీడు అపకారము చేసినాడు. జ్యేష్ఠుడు అనే గౌరవాన్ని పట్టి నాకు పూజ్యుడు అయినప్పటికిన్నీ నేను పూజించతగిన వాడు కాడు. జ్యేష్ఠుడికి ఉత్తరక్రియలు చేయలేదని లోకులు నన్ను వారి చిత్తమువచ్చినట్లు దూషిస్తారు. ఆ తరువాత అతడి గుణగణాలను గురించి తెలుసుకొంటారు. నేను మంచిపనే చేసినాను అని మెచ్చుకొంటారు" అని విభీషణుడు చెప్పినాడు.

ఆ వాక్యకోవిదుడు విభీషణుడు ఇట్లా చెప్పింది విని ఆ ధర్మజ్ఞుడు ఆ వాక్యజ్ఞుడు రాముడు "ఓ విభీషణుడా, నీవు రాక్షసేశ్వరుడవు నీవు నన్ను సంతోషపెట్టవలెను. నీ సహాయమువలనే నేను జయించినాను కాబట్టి నేను అవశ్యము నీకు మేలుఅయ్యేదే చెప్పవలెను. ఈ నిశాచరుడు అధర్మమూ అనృతమూ అవలంబించినాడు. సరే, అది అట్లా ఉండనివ్వు, వీడు పరమ పరాక్రమవంతుడు, అమితబలవంతుడు, యుద్ధాలలో అపజయము ఎరగని శూరుడు. దేవేంద్రుడూ మొదలైన దేవతలవల్ల కూడా అపజయము ఎరగని వాడు, మహాప్రభావము కలవాడు, సమస్తలోకాలనూ గగ్గోలు పెట్టినాడు. మరణమువరకే వైరము. మన ప్రయోజనము నెరవేరింది, ఇతడు స్నేహ విషయములో నీకు ఎటువంటివాడో నాకున్నూ అటువంటివాడు. అయితే, ఇతడు నీ జ్యేష్ఠభ్రాత. కాబట్టి ఇతడి ఉత్తరక్రియలు నీవు చేయవలెను, నీవు సమస్తధర్మాలూ తెలిసినవాడవు. ఈ దశగ్రీవుడికి నీవు కర్మచేయటము శాస్త్రచోదితము అయిన పద్ధతి. అందువల్ల నీకు కీర్తివస్తుంది" అని చెప్పినాడు.

ఈ విధముగా రాముడు చెప్పగానే రావణాసురుడి యోగ్యతకు తగినట్టుగా అంతట దహనసంస్కారము చేయటానికి విభీషణుడు తొందర పడ్డాడు. పట్టువస్త్రా పద్మకమూ అనే సుగంధ ద్రవ్యాలు వేసి చందనపు కట్టెలతో వేదోక్తపద్ధతిని చితి పేర్చినారు. ఆ చితిమీద తెల్లజింక తోలు కప్పినారు, వేదవిహితముగా రావణాసురుడికి అంత్యేష్టిని జరిపినారు. ఆ రాక్షసేంద్రుడికి యథాక్రమముగా పితృమేధసంస్కారము చేసినారు.

ముందుగా ఆ చితికి ఆగ్నేయభాగాన అగ్నివేదిని ఏర్పాటు చేసినారు. ఆ వేదిలో స్థానాలు తప్పకుండా త్రేతాగ్నులను (అంటే, పశ్చిమపు దిక్కున గార్హపత్యాగ్నినీ, తూర్పు దిక్కున ఆహవనీయాగ్నినీ, దక్షిణ దిక్కున దక్షిణాగ్నినీ) స్థాపించినారు. హోమపాత్రల నిండా పెరుగుతో కలిపిన నెయ్యిని పోసి ఋత్విజులు అందరూ అగ్నిహోత్రాన్ని వేల్చినారు. అప్పుడు ఆ రావణాసురుడి పాదాల నడుమను సోమలతను తెచ్చి బండినీ తొడల నడుమ యజ్ఞానికి కావలసిన ధాన్యము దంచే రోటినీ రోకలినీ ఇంకా ఆ యా స్థానాలలో దారుపాత్రలనూ, స్థాలినీ అరణికపైనూ ఉత్తరారణికపైనూ శాస్త్రములో చెప్పినట్టుగానూ స్మృతులలో విధించినట్టుగానూ క్రమము తప్పకుండా ఉంచినారు. ఆ చితిసమీపములో పవిత్రము అయిన యజ్ఞపశువును (మేకను) చంపి అగ్నిహోత్రములో వేల్చినారు అంతట నేతితో తడిపిన దర్భలు రావణాసురుడికి అన్ని వైపులా పరచినారు. విభీషణుడికి సహాయులు అయిన ఋత్విజులు గంధముతోనూ పూలదండలతో నానావిధ వస్త్రాలతోనూ రావణాసురుడి శవాన్ని అలంకరించినారు. అప్పుడు ఆ రాక్షస ఋత్విజులు అందరూ దీనమనస్కులు అయి, కన్నీళ్లు కారుస్తూ ఆ చితి మీద పేలాలు చల్లినారు. విభీషణుడు అప్పుడు మంత్రయుక్తముగా ఆ రావణాసురుడి చితికి నిప్పు పెట్టినాడు.

ఆ తరువాత విభీషణుడు స్నానము చేసి తడి బట్టలతో గరికపోచలు వేసిన తిలోదకాలు భూమిమీద వదిలినాడు. ప్రేతావాహనము చేసి రావణాసురుడి కోసము ఉదకదానం చేసినాడు. అంతట శిరస్నానసంస్కారము చేసినాడు. రావణాసురుడి భార్యలను అందరినీ మంచి మాటలతో పదే పదే ఓదార్చి లంకా పట్టణములోనికి పొమ్మని చెప్పినాడు.

ఆ రాక్షసాంగనలు అందరినీ లంకాపట్టణానికి పంపించి వేసిన తరువాత విభీషణుడు రాముడి దగ్గరకు పోయి వినయము ఉట్టిపడుతూ నిలుచున్నాడు.

వృత్రాసురుణ్ణి సంహారము చేసిన దేవేంద్రుడి వలె శత్రుసంహారము చేసిన రాముడు అప్పుడు సుగ్రీవలక్ష్మణసహితుడుగా వానరసైన్యాల మధ్య ఎంతో సంతోషముతో తేజరిల్లినాడు.

౧౧౭

ఆ యుద్ధము చూడడానికి వచ్చిన దేవతలూ గంధర్వులూ దానవులూ భయంకరము అయిన రావణసంహారాన్ని చూచి రాముని పరాక్రమాన్ని గురించీ వానరవీరుల మహోద్యుక్తాన్ని గురించీ సుగ్రీవుని మంత్రాంగాన్ని గురించీ లక్ష్మణుని అనురాగపరాక్రమాలను గురించీ అటువంటి పుత్రులను కన్న కౌసల్యాసుమిత్రలను గురించీ మంగళకరముగా చెప్పుకొంటూ తమ తమ విమానాలు ఎక్కి తమ తమ తావులకు వెళ్ళిపోయినారు.

ఆ మహావీరుడు రాముడు అప్పుడు దేవేంద్రసారథిని సన్మానించినాడు. అగ్నిహోత్రకాంతులలో తేజరిల్లుతూ ఉన్న దేవేంద్రుని దివ్యరథాన్ని తిరిగి తీసుకొని పోవడానికి అనుమతించినాడు. అంతట మాతలి ఆ దివ్యరథము ఎక్కి దేవలోకానికి ప్రయాణమైపోయినాడు. మాతలి వెళ్ళిపోగానే రాముడు పరమ సంతోషముతో సుగ్రీవుణ్ణి గట్టిగా కౌగలించుకొని గౌరవించినాడు. అప్పుడు లక్ష్మణుడు తమ శిబిరానికి పోదాము అని రామునితో చెప్పినాడు. వానరవీరుల పూజలు అందుకొంటూ రాముడు తన శిబిరానికి పోయినాడు.

రాముడు అక్కడ అప్పుడు తన సమీపములో తేజస్సుతో జ్వలిస్తూ ఉన్న లక్ష్మణుణ్ణి చూచి "నాయనా", ఈ విభీషణుడు మన స్నేహితుడు. నాకు భక్తుడు. మనకు ఉపకారము చేసినాడు. లంకాపట్టణములో నీవు ఇతనికి రాజ్యాభిషేకము చేయవలెను. ఇప్పుడు ఇది నా ముఖ్యమైన కోరిక" అని చెప్పినాడు. "అల్లాగేను" అని చెప్పి లక్ష్మణుడు విభీషణుణ్ణి వెంటపెట్టుకొని లంకాపట్టణానికి పోయినాడు, మనోవేగముతో పోయే మహాబలవంతులు అయిన వానర ముఖ్యులకు బంగారు కుండలు తెప్పించి ఇచ్చి వెంటనే సప్తసముద్ర జలాలు తెమ్మని ఆజ్ఞాపించినాడు. ఆ వానరోత్తములు అప్పటికి అప్పుడు పోయి సప్తసముద్ర జలాలనూ తెచ్చినారు. అంతట లక్ష్మణుడు విభీషణుణ్ణి సింహాసనముమీద కూర్చుండపెట్టినాడు. ఆ సింహాసనము చుట్టూ విభీషణుని మిత్రులూ రాక్షస ముఖ్యులూ కూర్చున్నారు. అప్పుడు ఆ పరిశుద్ధాత్ముడికి ఆ విభీషణుడికి బంగారు కలశములో ఉన్న నీటితో లక్ష్మణుడు రాజ్యాభిషేకము చేసినాడు. అందుకు విభీషణుడి అమాత్యులూ తక్కిన రాక్షసులూ ఎంతో సంతోషించినారు. లంకాపట్టణములో ఉన్న పౌరముఖ్యులు అక్షతలూ మోదకాలూ పేలాలూ దివ్యమైన పుష్పాలూ ఇంకా అనేక సుగంధద్రవ్యాలూ విభీషణుడికి సమర్పించినారు. రామానుగ్రహము వల్ల లంకారాజ్యానికి విభీషణుడు అప్పుడు రాజు అయినాడు. అప్పుడు అతడు ప్రజలకు అందరికీ మంచి మాటలు చెప్పి

సంతోష పెట్టినాడు. పట్టాభిషేకము అయిపోయిన తరువాత విభీషణుడు మళ్ళీ రాముడి దగ్గరకు పోయినాడు. నిశాచరపౌరులు అందరూ తనకు సమర్పించిన మంగళద్రవ్యాలను అన్నిటినీ ఆ గుర్తజ్ఞుడు విభీషణుడు రామలక్ష్మణులకు సమర్పించినాడు. కృతార్థుడూ పరిపూర్ణమనోరథుడూ అయిన విభీషణుడు సమర్పించిన మంగళద్రవ్యాలను రామలక్ష్మణులు సంతోషముగా స్వీకరించినారు.

రాముడు అప్పుడు తనపక్కను చేతులుజోడించి నిలుచొనిఉన్న పరమ పరాక్రమవంతుణ్ణి, పర్వతాకారుణ్ణి హనుమంతుణ్ణి చూచి, "ఓమారుతీ, ఇదుగో, ఈ మహారాజును విభీషణుణ్ణి చూడు. ఈయన అనుమతిని సంపాదించి నీవు లంకాపట్టణానికి ఇప్పుడే పోవలెను. రావణాలయములో ఉన్న వైదేహినిచూచి నా విజయాన్ని గురించి చెప్పు. ఆమెను సంతోషపెట్టు. సుగ్రీవుడూ నా తమ్ముడు లక్ష్మణుడూ నేనూ కుశలముగా ఉన్నాము అని చెప్పు. నేనే ఆ రావణాసురుణ్ణి సంహారము చేసివేసినానని కూడా చెప్పు. ఓ హనుమంతుడా, ఆ మైథిలి సంతోషించే విషయము అంతా చెప్పి ఆమె ఏమిచెప్పుతుందో విను. తిరిగివచ్చి ఆమె మాటలు నాతో చెప్పు" అన్నాడు.

## ౧౧౬

రామాజ్ఞను శిరసావహించి హనుమంతుడు లంకాపట్టణానికి పోయినాడు, అక్కడ రాక్షసులు అందరూ అతనిని గౌరవించినారు. ఆ మహాతేజోవంతుడు హనుమంతుడు అంతట రావణాసురుడి నివేశనములోనికి పోయినాడు. అక్కడ చెట్టు క్రింద రాక్షసాంగనల అందరి మధ్యనూ గ్రహబాధ అనుభవిస్తూ ఉన్న రోహిణీదేవి వలె స్నానాది దేహసంస్కారాదులు లేకుండా నిరానందంగా కూర్చొని ఉన్న సీతాదేవిని చూచినాడు. ఆమెను సమీపించినాడు. తన పేరు చెప్పుకొని హనుమంతుడు ఆమెకు నమస్కారము చేసినాడు. నిశ్చలుడుగా వినమ్రుడుగా నిలుచొన్నాడు. ఆ మహాబలవంతుణ్ణి హనుమంతుణ్ణి సీతాదేవి చూచింది. క్షణలేశము ఊరకున్నది. చప్పున స్ఫురించింది. ఆ వచ్చినవాడు హనుమంతుడు అని తెలుసుకొన్నది. ఆమె ముఖము ఇట్టె వికసించింది. అది చూచి హనుమంతుడు "ఓ వైదేహీ, రాముడు రావణాసురుణ్ణి సంహారము చేసి వేసినాడు. ఆ అరిందముడు కృతకృత్యుడు అయినాడు. తన కుశలము నీతో చెప్పుమని నన్ను పంపించినాడు. లక్ష్మణ సుగ్రీవ విభీషణులతోనూ వానర సైన్యాలతోనూ ఇప్పుడు స్వస్థముగా ఉన్నాడు.

"ఓ దేవీ, వానరసైన్యాలు భయంకరముగా పోరాడినవి, విభీషణుడు సహాయము చేసినాడు. లక్ష్మణుడు తన రాజనీతి నైపుణ్యాన్నీ పరాక్రమాన్నీ చూపించినాడు. రాముడే రావణాసురుణ్ణి చంపి వేసినాడు. ఆ వీరుడు ఆ రఘుకుల దీపకుడు ఇప్పుడు కృతార్థుడు అయినాడు. నీ కుశలము అడిగి తెలుసుకొని రమ్మన్నాడు. ఇంకా నీతో ఇట్లా చెప్పుమన్నాడు.

"ఓ దేవీ, నీకు సంతోషవార్త చెప్పుతూ ఉన్నాను. నిన్ను మరింత సంతోష పెట్టుతాను. నీవు పాతివ్రత్య ధర్మము తెలిసినదానవు. నా భాగ్యవశేమువల్ల నీవు ఇంతవరకూ జీవించి ఉన్నావు. ఓ, సీతా, నేను యుద్ధములో గెలిచినాను. ఇంతటితో నీవ్యథ అంతా తీరిపోయింది. ఇక నీవు స్వస్థముగా ఉండు. మన శత్రువు రావణాసురుడు చచ్చి పోయినాడు నిన్ను శత్రువు చేతిలో నుంచి విడిపించటానికి నేను దృఢముగా సంకల్పించుకొన్నాను. నేను నిద్రపో లేదు. మహోదధిలో సేతువు కట్టించినాను. రావణాసురుణ్ణి సంహారము చేసి వేస్తాను అన్న నా ప్రతిజ్ఞను చెల్లించుకొన్నాను. ఈ లంకారాజ్యము అంతా నావశము అయింది. నేను ఈ లంకారాజ్యాన్ని అంతా ఇప్పుడు విభీషణుడి అధీనము చేసి వేసినాను. నీవు ఇంకా రావణాలయములో ఉన్నందుకు కలవర పడ నవసరము లేదు. నేను లంకారాజ్యాన్ని విభీషణుడికి ఇచ్చి వేసినందువల్ల నీవు స్వగృహములో నే ఉన్నట్లు భావించు. నీవు దుఃఖపడవద్దు. విభీషణుడు సంతోషముతోనూ ఉత్సాహముతోను నీ దర్శనము చేయడానికి వస్తాడు.

"ఈ విధముగా రాముడు చెప్పుమన్నాడు" అని హనుమంతుడు సీతాదేవితో చెప్పినాడు. ఆ శశినిభానన సీతాదేవి లేచి నిలుచొన్నది. సంతోషముతో ఉప్పొంగి పోయింది. ఏమీ మాట్లాడలేక పోయింది. ఉత్ఫుల్ల నేత్రాలతో చూస్తూ ఊరకున్నది. బదులు చెప్పకుండా ఉన్న ఆ సీతాదేవిని చూచి ఆ వానరోత్తముడు హనుమంతుడు "ఓ దేవీ, ఏమిటి ఆలోచిస్తున్నావు. ఏమీ మాటాడవు. ఏమిటి" అని అడిగినాడు. ఆ మహా పతివ్రత సీతాదేవి అప్పుడు హర్షగద్గదకంఠముతో "ఓ హనుమంతుడా, నా పెనిమిటి విజయము నీవు చెప్పినావు. నాకు పట్టరాని సంతోషము వచ్చింది. నాకు ఇంత సంతోషవార్త చెప్పిన నీకు ఏమని బదులు చెప్పటమా అని ఒక క్షణము ఆలోచించినాను. నా సంతోషాన్ని ఎట్లా వెల్లడించవలెనో నాకు తోచలేదు. అందువల్ల ఊరకున్నాను. ఓ హనుమంతుడా, యింత సంతోషవార్త నీవు చెప్పినావు. ఏది అయినా నీకుయిచ్చి నిన్ను సంతోష

పెట్టవలెను అనుకున్నాను. అయితే నీవు చెప్పిన సంతోషవార్తకు ఇవ్వతగిన వస్తువు ఈ భూలోకములో ఏది నాకు కనపడలేదు. నీకు ఇవ్వతగిన వస్తువు ఈ భూలోకములో నే కాదు; ముల్లోకాలలోనూ లేదు. ఉన్న వెండి అంతా ఇచ్చినా చాలదు. ఉన్న బంగారము అంతా ఇచ్చినా చాలదు. నానావిధ రత్నరాసులు అన్నీ ఇచ్చినా చాలవు. త్రైలోక్యాధిపత్యము యిచ్చినా చాలదు. నీవు చెప్పిన సంతోషవార్తకు ఇవ్వతగిన వస్తువు ఏది ఈ జగత్తులో లేదు" అని చెప్పింది.

ఈ విధముగా సీతాదేవి చెప్పిన మాటలకు చేతులు జోడించి ఆమె ఎదుట ఎదుట నిలుచొని ప్రసన్న హనుమంతుడు "ఓ దేవీ, నీకు కావలసింది నీ పెనిమిటి సంతోషము. నీ పెనిమిటి శ్రేయస్సు. నిరంతరమూ నీ భర్త విజయాన్ని కాంక్షించినావు. నా మీద నీకు ఉన్న వాత్సల్యము నుంచి ఈ విధముగా అంటున్నావు. ఓ ప్రసన్నురాలా, నేను చెప్పిన వార్తకు నీ సంతోషము మేరమీరింది. నన్ను సంతోషపెట్టడానికి ఒక బదులు మాట కానీ వస్తువు కానీ లేదు అన్నావు. ఎంతో ప్రేమతో నీవు మహోదాత్తార్థ్యము అయిన మాట అన్నావు. నానావిధ రత్నరాసుల కన్నానూ, దేవరాజ్యము కన్నానూ నీవు అన్న మాట విలువ అయింది. ఆ మహానుభావుడు శత్రుసంహారము చేసినాడు. జయించినాడు. స్వస్థముగా ఉన్నాడు. నేను చూస్తూ ఉన్నాను. అదే నాకు పరమార్థము. దేవరాజ్యముకన్నా నానావిధ, రత్నరాసుల కన్నా నాకు ఎక్కువ అయిన సంపద సమకూరినట్లుగా ఉన్నది" అన్నాడు.

హనుమంతుడు అన్న ఈ మాటలు విని ఆ జనకాత్మజ మైథిలి మరింత మంగళకరముగా "ఓ హనుమంతుడా, నీవు కాబట్టి సుశబ్దసంపన్నముగానూ శ్రవణపేయముగానూ గ్రహణధారణాదిసమర్థము అయిన బుద్ధితో రామ విజయ వార్త చెప్ప కలిగినావు. ఓ వాయుపుత్రుడా. నీవు నీ తండ్రిని మించిన శ్లాఘనీయుడవు. నీవు పరమధార్మికుడవు. నీ యుద్ధోత్సాహమూ నీ శరీర దార్ఢ్యమూ నీ పరాక్రమమూ నీ క్షమాగుణమూ నీ ధైర్యమూ నీ వినయమూ నీ శాస్త్రజ్ఞానమూ ఉత్తమము అయినవి. నీలో ఇంకా ఎన్నో మంగళకరము అయిన గుణాలు మూర్తీభవించినవి. సందేహము లేదు. లేని గుణాలు ఉన్నవి అని నేను నిన్ను స్తోత్రము చేయడములేదు" అని చెప్పింది. ఈ మాటలకు హనుమంతుడు చలించలేదు. చేతులు కట్టుకొని నిలుచొనిఉన్న హనుమంతుడు సవినయముగా సంతోషముగా "ఓ దేవీ, నీవు ఇప్పుడు అనుమతించేట్టయితే

నిన్ను ఇదివరకు బెదిరించిన ఈ రాక్షసాంగనలు అందరినీ హతమార్చివేస్తాను. నీవు దైన్యముగా భావించిన పెనిమిటిని ఎడబాసి అశోకవనములో దుఃఖపడుతూ ఉంటే ఈ భయంకరాకారలు ఈ భయంకరాచారలు ఈ భయంకర నేత్రలు ఈ క్రూరరాక్షసాంగనలు నిన్ను దారుణము అయిన మాటలు అన్నారు. కాబట్టి నా కోరిక నీవు మన్నించవలెను.

"ఓ మంగళస్వరూపిణీ, నీకు అప్రియము చేసిన ఈ ఘోరాకారలను అందరినీ నా పిడికిళ్లతో పొడిచివేస్తాను. అరచేతులతో చరుస్తాను. పాదాలతో తన్నుతాను. భయంకరముగా వీళ్ల మోకాళ్లను విరగకొట్టుతాను. వీళ్ల పళ్లు ఊడ కొట్టుతాను. చెవులూ ముక్కులూ కొరికివేస్తాను. తలవెంట్రుకలు పెరికివేస్తాను. వాడివాడిగోళ్లతో వీళ్లను చీల్చివేస్తాను. ఎగిరి వీళ్లమీద దూకి వీళ్లను అందరినీ పడకొట్టుతాను. వివిధ విధాలా వీళ్లను చంపివేయవలెను అనుకొంటున్నాను. ఓ యశస్వినీ ఈ రాక్షసాంగనలు అందరూ నీకు అపకారము చేసినారు. నేను వీళ్లను వివిధ విధాలా పీడించవలెను అనుకొంటున్నాను. ఇది నా కోరిక" అని చెప్పినాడు.

ఈ మాటలకు ఆ జనకాత్మజ ఆ వైదేహి ఆ యశస్విని సీతాదేవి హనుమంతుణ్ణి చూచి ధర్మయుక్తముగా "ఓ వానరోత్తమా, ఈ రాక్షసాంగనలు అందరూ రాజసేవా పరతంత్రలు. రావణాసురుడి దాసీలు. రాజు ఆజ్ఞను శిరసావహించినారు. వీళ్ల మీద కోపము ఎందుకు. ఓ హనుమంతుడా, నా భాగ్యవైపరీత్యమువల్లనూ నేను ఇదివరకు చేసిన పాపకర్మల వల్లనూ నాకు ఈ కష్టము అంతా వచ్చింది. ఈ కష్టము అంతా నా పూర్వకర్మఫలము అని నేను నమ్ముతున్నాను. ఈ రాక్షసదాసీల దోషము ఏమీ లేదు. అందువల్ల వీళ్లను నేను మన్నిస్తున్నాను. రావణాసురుడు ఆజ్ఞాపించినందువల్ల ఈ రాక్షసస్త్రీలు నన్ను అట్లా బెదిరించినారు. ఇప్పుడు ఆ రావణాసురుడే చచ్చి పోయినాడు. ఇకను వీళ్ళు నన్ను ఎందుకు బెదిరిస్తారు. ఎందుకు నన్ను బాధిస్తారు.

"ఓ హనుమంతుడా, ఒకవేళ ఈ రాక్షసస్త్రీలు స్వతంత్రించి నన్ను బాధ పెట్టే ఉన్నప్పటికిన్నీ ఇప్పుడు వీళ్లకు నేను అపకారము చేయను. చేయనీయను. ఇందుకు ఒక కథ చెప్పుతాను. విను. ఒకానొక అడవిలో ఒక వేటకాణ్ణి పెద్దపులి తరుముకొని వస్తూ ఉంటే చెట్టు ఎక్కినాడు. ఆ చెట్టు మీద ఒక ఎలుగుబంటు ఉన్నది. పెద్దపులి ఆ ఎలుగుబంటును చూచి "ఈ చెట్టుఎక్కిన మానవుడు మన వన్యమృగాలకు అన్నిటికీ శత్రువు కాబట్టి వీణ్ణి క్రిందికి పడద్రోయుమని చెప్పింది. "శత్రువు అయినప్పటికిన్నీ నా దగ్గరకు వచ్చిన వాణ్ణి కాపాడవలె

నా భర్తము" అని ఆ ఎలుగుబంటు చెప్పింది. అంతట అది నిద్రపోయింది. అప్పుడు ఆ చెట్టుక్రింద ఉన్న పెద్దపులి వేటకాన్ని చూసి "నిన్ను వదిలిపెట్టి పోతాను. ఎలుగుబంటిని పడద్రోయమని చెప్పింది. ఆ వేటకాడు అందుకు ఒప్పు కొని ఆ ఎలుగుబంటిని పడద్రోసినాడు. ఆ ఎలుగుబంటికి చటుక్కున నిద్ర మెలకువ వచ్చి అలవాటు చొప్పున మరి ఒక కొమ్మ పట్టుకొని క్రింద పడకుండా తప్పించుకొన్నది. అప్పుడు ఆ పెద్దపులి ఎలుగుబంటును చూచి "ఓ భల్లూకమా చూడు. ఈ మానవుడు ఉపకారికి అపకారము చేసినాడు. ఈ దుష్టుణ్ణి ఇప్పుడు అయినా నీవు క్రిందపడద్రోయవలెను" అని చెప్పింది. "వీడు నాకు ఎంత అప కారముచేసినా వీడికి నేనుతిరిగి అపకారము చేయను" అని ఆ ఎలుగుబంటి పెద్దపులితో ఖచ్చితముగా చెప్పింది.

ఆ భల్లూకము ఆ పెద్దపులితో ఇంకా ఈ విధము ఒక పద్యము చెప్పింది.

"ప్రాజ్ఞుడు అయినవాడు తనకు అపకారము చేసినవారికి ప్రత్యపకారము చేయడు. అపకారము చేసిన వారికి ఉపకారము చేయడమే సత్పురుషుల సదా చారము. సదాచారమే సత్పురుషులకు ఆభరణము." ఓ హనుమంతుడా. ఎటటి వారు పాపకర్ములు అయినా వధార్హులు అయినా సత్పురుషులు కారు ణ్యముచూపిస్తారు. ఏమంటే, ఈ లోకములో అపరాధము చేయనివాడు ఎవడూ లేడు అని వారి అభిప్రాయము. లోకాన్ని హింసించడము రాక్షసులకు ఒక వినోదము. వాళ్లు పాపకర్మలు చేస్తూ ఉంటారు. కామరూపులు. అది వాళ్ళ స్వభావము. వాళ్లకు కీడుచేయడము తగిన పనికాదు" అని సీతాదేవి చెప్పింది.

ఈ మాటలకు ఆ వాక్యకోవిదుడు హనుమంతుడు "ఓ దేవీ, నీవు ఆ రాముడికి తగిన ధర్మపత్నివి. ఓ యశస్వినీ, ఇక నాకు బదులు చెప్పి పంపించు. నేను రాముడిదగ్గరకు పోవలెను" అని చెప్పినాడు.

"ఓ హనుమంతుడా, నేను నా పెనిమిటిని చూడవలెను అనుకొంటు న్నాను. ఇదే నా కోరిక" అని ఆ వైదేహి హనుమంతుడితో చెప్పింది. అంతట ఆ మహాద్యుతిమంతుడు ఆ మారుతాత్మజుడు హనుమంతుడు ఆ మైథిలితో "ఓ పూజ్యురాలా, స్థిరచిత్తులను మిత్రులనుగా చేసుకొన్నాడు. శత్రువులను అందరినీ సంహారము చేసి వేసినాడు. ఇప్పుడు తన తమ్ముడు లక్ష్మణుడితో కూడా స్వస్థముగా ఉన్న ఆ పూర్ణచంద్రాననుణ్ణి రాముణ్ణి శచీదేవి దేవేంద్రుణ్ణి వలె నీవు చూడగలవు." అని సాక్షాన్మహాలక్ష్మీదేవి వలె విరాజిల్లుతూ ఉన్న ఆ సీతాదేవితో చెప్పినాడు.

అంతట హనుమంతుడు అమితవేగముతో రాముడి దగ్గరకు పోయినాడు.

## ౧౧౭

కార్యసాధనోపాయాలు అన్నీ తెలిసిన ఆ హనుమంతుడు అప్పుడు ఆ మహాధానుష్కుణ్ణి ఆ మహాప్రాజ్ఞుణ్ణి రాముణ్ణిచూచి "ఓ ప్రభూ, నీవు ఎవరి కోసము ఇంత ప్రయత్నము చేసినావో ఎవరికోసము సేతు బంధనాది రావణ సంహారపర్యంతమూ పాటు పడినావో ఆ శోకసంతప్తను సీతాదేవిని నీవు ఇప్పుడు చూడవలసి ఉంది. దుఃఖపరవశ అయిపోయి కన్నీళ్లతో కన్నులు కలక బారి పోయిన ఆ మైథిలి నీ విజయాన్ని గురించి నేను చెప్పగానే సంతోష ముతో ఉప్పొంగిపోయింది. అదివరకు ఆమె నన్ను ఎరిగిఉన్న కారణమునుంచీ నా మీద ఆమెకు ఉన్న నమ్మకమునుంచీ నాతో "ఓ హనుమంతుడా, కృతా ర్థుడు అయిన నా పెనిమిటిని ఆ రామప్రభువును నేను దర్శనము చేయవలెను అనుకొంటున్నాను. ఎప్పుడూ ఆయన వెంట ఉండే నా మరదిని లక్ష్మణుణ్ణి చూడవలెను అనుకొంటున్నాను. ఇదే నా కోరిక" అని చెప్పింది అన్నాడు.

హనుమంతుడు చెప్పిన ఈ మాటలు వినీవినడముతో ఆ పరమధార్మికుడు రాముడు ఆలోచించినాడు. (అంతకాలము రావణాసురుడి ఇంట్లో ఉన్న సీతా దేవిని స్వీకరించేట్లయితే మహాలోకాపవాదము వస్తుంది అనీ ఆమె నిర్దోషిఅయి నందువల్ల పరిత్యజించేట్లయితే మహాదోషమువస్తుంది అనీతోచింది) కొంచెముగా కన్నీళ్లు కమ్ముకొన్నవి. పెద్ద పెద్ద వేడి వేడి నిట్టూర్పులు విడిచినాడు. నేలవంక చూస్తూ తన సమీపములోఉన్న నీలమేఘము వంటి విభీషణుడితో "ఓ మిత్రుడా సీతను అభ్యంగనస్నానము చేయించి దివ్యాంగరాగాలు పూయించి దివ్యాభరణాలు పెట్టించి నీవు ఇక్కడికి తీసుకొని రావలెను. ఆలస్యము చేయ వద్దు" అని రాముడు చెప్పినాడు.

రామాజ్ఞను శిరసావహించి విభీషణుడు త్వరత్వరగా లంకా పట్టణములో తన అంతఃపురానికి పోయి తన స్త్రీలచేత సీతాదేవికి ఈవిధముగా చెప్పించినాడు:

"ఓ దేవీ నీకు శుభము అవుతుంది. నీ పెనిమిటి రాముడు నిన్ను చూడవలెను అనుకొంటున్నాడు. నీవు చక్కగా అభ్యంగన స్నానముచేసి దివ్యాంగరాగము అద్దుకొని దివ్యాభరణాలు పెట్టుకొని వాహనము ఎక్కిపోవలెను."

ఈవిధముగా చెప్పిన స్త్రీల చేతనే ఆవైదేహి "నేను స్నానము చేయ కుండానే ఈవిధముగానే నాభర్తను చూడవలెను అనుకొంటున్నాను" అని విభీషణుడికి చెప్పించింది.

"ఓ దేవీ రాముడు నీ పెనిమిటి అంతేకాదు. ఆయనరాజు. అతడు ఎట్లా చెప్పితే నీవు అట్లా చేయవలెను" అని విభీషణుడు చెప్పించినాడు.

ఆమె తనభర్తనే దేవతగా భావించింది. ఆమె భర్తృభక్తి వ్రత. ఆసాధ్వి అంతట "అట్లాగేను, బాగుంది" అని చెప్పింది. అప్పుడు రాక్షస యువతులు ఆమెను అభ్యంగస్నానము చేయించినారు. ఆమెను అలంకరించినారు మహార్హమైన ఆభరణాలు పెట్టుకొని మహార్హమైన వస్త్రము కట్టుకొని మహాశ్రేష్ఠము అయిన వస్త్రము కప్పుకొని దివ్యతేజముతో సీతాదేవి శిబికను ఎక్కింది. విభీషణుడు ముందునడిచాడు. అతనివెనుక రాక్షస రాజభటుల రక్షణతో సీతఎక్కిన శిబికను మోసుకొనిపోయినారు.

విభీషణుడు అట్లా వస్తూ ఉన్నాడు అని రాముడికి తెలిసింది. అతడు ఆలోచించ సాగినాడు. అప్పుడు విభీషణుడు వచ్చి, నమస్కారము చేసి సీతాదేవిని తీసుకొనివచ్చినట్లు సంతోషముగా రాముడితో విన్నవించినాడు. చాలా కాలము రాక్షసగృహములో ఉన్న సీతాదేవి "వచ్చింది" అని చెప్పగానే రాముడు సంతోషించినాడు. ఉత్తరక్షణాన దీనుడు అయిపోయినాడు. రోషమువచ్చింది. అతని మనస్సులో సంతోషమూ, దైన్యమూ, కోపమూ, సుళ్లు తిరిగినవి. పరిమర్శముగా ఆలోచించినాడు. ముఖాన సంతోషచిహ్నాలు లేకుండా తనపక్కన ఉన్న విభీషణుణ్ణిచూచి "రాక్షసరాజా, నీవు మంచివాడవు. సీతాదేవిని వెంటనే నాదగ్గరకు రానివ్వు. ఆమె ఎప్పుడూ నేను జయించవలెను అనుకొంటూ ఉంటుంది" అని చెప్పినాడు.

ఇట్లా రాముడుచెప్పింది విభీషణుడు విన్నాడు. వెంటనే అక్కడనుంచి అందరినీ వెళ్లగొట్టే ఏర్పాటు చేసినాడు. కంచుకాలూ శిరోవేష్టాలూ ధరించిన రాక్షస రాజభటులు బెత్తాలు ఝుళిపిస్తూ అక్కడ ఉన్న వారిని అందరినీ అవతలకు వెళ్ళగొట్టుతూ అన్నివైపులా తిరుగ సాగినారు. అట్లా తరిమి వేస్తూ ఉంటే అప్పుడు అక్కడ ఉన్న భల్లూక వీరులూ వానరయోధులూ రాక్షసయోధులూ గుంపులు గుంపులుగా పరుగులెత్తిన మహాధ్వని సముద్రఘోషము వలె వినిపించింది. ఆ మహాసంభ్రమాన్ని రాముడు చూచినాడు. అతనికి జాలి వేసింది. అట్లా అందరినీ తరిమి వేయడము సహించలేక పోయినాడు. కోపము వచ్చింది. మహాప్రాజ్ఞుడు అయిన విభీషణుణ్ణి పిలిపించినాడు. అతనిని చూపులతో దహించి వేసేటట్లు చూస్తూ నిందాగర్భముగా "ఓ విభీషణుడా, నీవు నన్ను అనాదరముతో చూస్తున్నావు. ఎందుకు వీళ్ళను అందరినీ బాధపెట్టుతావు? వీళ్లు అందరూ నా స్వజనము. నీ ఈ ఏర్పాట్లు అన్నీ కట్టిపెట్టు. స్త్రీలకు ఇండ్లుకానీ వస్త్రాలుకానీ గోడలుకానీ తెరలుకానీ ఆవరణలు కావు. ఈ రాజగౌరవాలు ఎంతమాత్రమూ ఆవరణలు కావు. స్త్రీల

సచ్చరిత్రమే ఆదరణము. వారి వారు పోయిన దుఃఖసమయాలలోనూ రాజ్యక్షోభమూ మొదలైన సంకటసమయాలలోనూ యుద్ధాలలోనూ యజ్ఞాదులలోనూ స్వయంవరసమయాలలోనూ వివాహసమయాలలోనూ స్త్రీ పరపురుషులకు అగుపడడము దోషముకాదు. సీతాదేవి ఇప్పుడు యుద్ధభూమికి వచ్చింది. మహాకష్టస్థితిలో ఉన్నది. పైగా నా సమీపానికి వస్తున్నది. ఆమెను ఇతరులు చూచినందువల్ల దోషము ఏమీ లేదు. ఓ విభీషణుడా, నీవు ఆమెను వెంటనే నా దగ్గరకు తీసుకొనిరా! నా చుట్టూ మిత్రులు అందరూ ఉండగానే ఆమె నన్ను చూస్తుంది" అని చెప్పినాడు.

ఈ విధముగా రాముడు అన్న మాటలకు విభీషణుడు విచారపడ్డాడు. వినయముతో వెళ్ళిపోయినాడు. రాముడు అన్న మాటలకు విభీషణుడే కాకుండా లక్ష్మణుడూ సుగ్రీవుడూ హనుమంతుడూ మనస్సులో చాలా బాధ పడ్డారు. భార్యమీద అపేక్ష లేని దారుణమైన ఇంగితాలను రాముడిలో వారు చూచినారు. అతనికి సీతాదేవి మీద ప్రేమ తప్పినట్లు ఊహించినారు.

అప్పుడు విభీషణుడి వెనుక సీతాదేవి సిగ్గుతో తన దేహావయవాలను అన్నిటినీ ముడుచుకొంటూ వచ్చి రాముడి ఎదుట నిలుచొన్నది. ఆమె ఆ జన సమూహములో సిగ్గుపడుతూ ముఖము కనపడకుండా వస్త్రము కప్పుకొని రాముణ్ణి సమీపిస్తూ "ఓ పూజ్యుడా" అని సంబోధించి ఏడ్చింది.

పతినే దేవతగా ఆరాధించే ఆ మహాప్రసన్నముఖి సీతాదేవి అప్పుడు విస్మయపడుతూనూ సంతోషపడుతూనూ అనురాగము ఉట్టిపడుతూనూ ఆ ప్రసన్నముఖుణ్ణి తన భర్తను రాముణ్ణి చూచింది.

ఆ నిర్మలచంద్రబింబానన సీతాదేవి బహుకాలమునుంచీ కనపడకుండా అప్పుడే ఉదయిస్తూ ఉన్న పూర్ణచంద్రబింబమువంటి మనోహరము అయిన తన పెనిమిటి ముఖబింబాన్ని చూచి మనస్సులో ఉన్న దుఃఖాన్ని అంతా వదిలిపెట్టింది.

## ౧౧౮

రాముడు తన మనస్సులో వున్న క్రోధాన్ని అంతా తెలియచెప్పటానికి ఎదుట వినయవిధేయలతో నిలుచొని వున్న మైథిలిని చూచి "ఓ మంగళ స్వరూపిణీ, నేను యుద్ధములో శత్రువును జయించి నిన్ను సంపాదించుకొన్నాను. పౌరుషముతో చేయవలసింది అంతా చేయడము అయిపోయింది. నా కోపము సార్థకము అయింది. శత్రుతిరస్కారాన్ని తుడిచివేసినాను. నా

జరిగిన అవమానాన్ని నా శత్రువుతోపాటు ఏకకాలాన నిర్మూలనము చేసివేసినాను. ఇప్పుడు నా పౌరుషము బైటపడ్డది. నేను పడ్డకష్టము అంతా సఫలము అయింది. నా ప్రతిజ్ఞ నెరవేరింది. నేను ఇప్పుడు స్వతంత్రుణ్ణి.

"ఓ మైథిలీ, నేను లేనప్పుడు నిన్ను చలచిత్తుపు రాక్షసుడు ఎత్తుకొని వచ్చినాడు. దైవికముగా నాకు అవమానము అయింది. ఆ అవమానాన్ని నేను పురుషప్రయత్నముతో పోగొట్టుకొన్నాను. అవమానాన్ని తనపరాక్రమముతో పోగొట్టుకోని పరాక్రమహీనుడికి ఏ పురుషార్థమూ చేకూరదు. హనుమంతుడు సముద్రలంఘనము చేసి లంకా పట్టణాన్ని గగ్గోలు పరిచినాడు. అతడు చేసిన ఆ శ్లాఘనీయము అయిన పని ఇప్పుడు సఫలము అయింది. సుగ్రీవుడు యుద్ధములో తన పరాక్రమము చూపిస్తూ నాకు మేలు అయ్యే పద్ధతులు అన్నీ ఆలోచిస్తూ తన సైన్యాలతో పడ్డపాటు అంతా ఇప్పుడు సఫలము అయింది. గుణహీనుడు అయిన తన అన్నను వదిలిపెట్టి విభీషణుడు స్వయముగా నా దగ్గరకు వచ్చి నాకు భక్తుడు అయి పడ్డ ప్రయాసము అంతా ఇప్పుడు సఫలము అయింది" అని చెప్పుతూవుంటే లేడిపిల్లవంటి సీతాదేవి ఉత్ఫుల్ల నేత్రాలనిండా కన్నీళ్లు కమ్ముకొన్నవి.

కన్నీళ్లు కారుస్తూ ఉన్న సీతాదేవిని రాముడు చూచినాడు. మంటలు మండుతూ ఉన్న అగ్నిహోత్రములో మరి కొంత నెయ్యి పోసినట్టు అతని కోపము మరింత అయింది. కనుబొమలు ముడి వేసి పక్కకు చూస్తూ ఆ వానర రాక్షసులు అందరి మధ్యనూ సీతాదేవితో కఠినముగా "ఓసీతా, అవమానము పోగొట్టుకోవడానికి మనుష్యుడు చేయవలసింది అంతా చేయడము అయిపోయింది. ఆత్మజ్ఞానసంపన్నుడు అయిన అగస్త్యముని తన తపోబలముతో ప్రాణికోటికి అడుగు పెట్టడానికి అలవికాకుండా ఉన్న దక్షిణదిక్కును జయించినాడు. అదే విధముగా నిన్ను ఎత్తుకొని వచ్చిన రావణాసురుణ్ణి నా పరాక్రమముతో సంహారము చేసి వేసి నేను నిన్ను జయించుకొన్నాను.

"ఓ మంగళ స్వరూపిణీ, ఈ యుద్ధములో నేను పడ్డపాటూ, నా మిత్రుల పరాక్రమముతో నేను జయించడమూ, నీ కోసము కాదు అని నీకు ఇదివరకు తెలియకపోతే నేను ఇప్పుడు చెప్పుతున్నాను కాబట్టి తెలుసుకో. సదాచారము కాపాడటానికిన్నీ సర్వవిధాలా ప్రసిద్ధికెక్కిన నా వంశానికి అపవాదమూ అపకీర్తీ రాకుండా ఉంచటానికిన్నీ నేను యుద్ధము చేసినాను. నీ నడవడి సందేహాస్పదము అయింది. నీవు నా ఎదట నిలుచొని ఉంటే నేత్రరోగికి దీపము వలె నీవు నాకు ప్రతికూలవుగా కనపడుతున్నావు. ఓ భాగ్యవతీ

నీవు జనకమహారాజు కూతురివి. ఇప్పుడు దశదిశలలో నీ చిత్తము వచ్చిన చోటికి పో. నేను అనుమతిస్తున్నాను. నీతో నాకు పనిలేదు. సత్కులములో పుట్టినవాడూ అందులో పరాక్రమవంతుడు అయినవాడూ ఎవడు అయినా పరగృహములో నివసించిన భార్యను సుహృల్లేఖము అయిన మనస్సుతో స్వీకరిస్తాడా. ఓ సీతా, నీవు రావణాసురుడి ఒడిలో నలిగి జారి నావు. నీ మీద దుష్టము అయిన చూపులు పడ్డవి. నేను సద్వంశములో పుట్టి నాను. ఆ వంశానికి నేను కీర్తి తేవలసిఉంది. నిన్ను ఎట్లా పరిగ్రహిస్తాను? అవమానము పోగొట్టుకోడానికి యుద్ధము చేసి నిన్ను సాధించుకొన్నాను. మళ్ళీ కీర్తి సంపాదించుకొన్నాను. నీ మీద నాకు ఆసక్తిలేదు. నీ ఇష్టము వచ్చిన చోటికి నీవు పో.

"ఓ భాగ్యవతీ, నేను ఇది చక్కగా ఆలోచించి చెప్పుతూ ఉన్నాను. నీ ఆత్మపోషణార్థము లక్ష్మణుడి దగ్గర కానీ, భరతుడి దగ్గర కాని ఎక్కడ ఉంటే సుఖముగా ఉంటుంది అని నీవు అనుకుంటావో అక్కడె ఉండు. లేదా వానరరాజు అయిన సుగ్రీవుడి దగ్గర ఉండు. అట్లా కాకపోయేటట్లయితే రాక్షసరాజు అయిన విభీషణుడి దగ్గర ఉండు ఓ సీతా, నీ రూపము దివ్యము అయినది. నీవు మనోహరము అయిన దానవు. రావణాసురుడి స్వగృహములో ఉన్నావు. అతడు నిన్ను చూస్తూ బహుకాలము సహించి ఉండడు" అని రాముడు చెప్పినాడు.

చెవులారా ప్రియవచనాలు వినవలసిన ఆ మైథిలి చిరకాలానికి కనిపించిన ప్రియుడు అప్రియాలాడుతూ ఉంటే విని మదపుటేనుగ తొండము దెబ్బతిన్న అందుగు తీగవలె గజగజ వణుకుతూ కన్నీళ్లు కార్చింది.

## ౧౧౮

రాముడు అట్లా కోపముతో పౌరుషముగా మాట్లాడుతూఉంటే వైదేహి ఉలిక్కిపడ్డది. ఆమెకు పరమదుఃఖమువచ్చింది. ఆ మహాజన మధ్యములో తన భర్త తనను అదివరకు ఎన్నడూ అని ఎరగని మాటలు అంటూఉంటే, విని ఆ మైథిలి సిగ్గుపడిపోయింది. తలవంచుకొన్నది. రాముడి వాక్శల్యాలు విని ఒంటి నిండా శల్యాలు గుచ్చుకొన్న దానివలె బాధపడుతూ సంతతధారగా కన్నీళ్లు కార్చింది. ఆ కన్నీళ్లతో ఆమె ముఖముఅంతా తడిసిపోయింది. ఆ కన్నీళ్లు తుడుచుకొంటూ, మెల్లగా గద్గదస్వరముతో "ఓ వీరుడా, పామరుడు పామర స్త్రీని అన్నట్టు మీరు నన్ను ఇటువంటి అనరాని శ్రవణదారుణముఅయిన

మాటలు ఎందుకు అంటున్నారు. ఓ మహాబాహూ, నేను మీరు అనుకొంటూ ఉన్నటువంటి దానను కాను. నేను నా సచ్చరిత్రముమీద ఒట్టు పెట్టుకొంటు న్నాను. నామాట నమ్మండి. అట్లా కాకపోయేటట్లయితే మీరు ఏ ప్రమాణము చేయమంటే అది చేస్తాను. ఎవరు ఎవరో స్త్రీల దుర్వృత్తిని పట్టి నన్ను సందే హించవద్దు. మీరు నన్ను పరీక్షించండి. మీ సందేహము వదిలిపోతుంది.

"ప్రభూ, నేను వివశను అయి ఉన్నప్పుడు రావణుడు నా దేహాన్ని స్పృశించినాడు. అప్పుడు అయినా నేను అందుకు అంగీకరించలేదు. ఆ అపరా ధము దైవానిది. నాది కాదు. నా అధీనములో ఉన్న నా మనస్సు మాత్రము మీమీదనే నిలచి ఉన్నది. పరాధీనను అయిపోయిన నేను నా దేహవిషయ ములో నేను అప్పుడు అస్వతంత్రురాలను. నేను ఏమి చేసేది? ఓ మానవుడా, నేను మీతో కూడా పెరిగి పెద్దదానను అయినాను. మిమ్మల్ని ఎడబాయకుండా మీతో ఎప్పుడూ కలిసిమెలిసి తిరిగినాను. నన్ను గురించి మీకు తెలియకపోయి నట్లయితే ఇక దేనివల్లను నన్ను గురించి మీకు తెలియదు. నేను శాశ్వతముగా హతము అయిపోయినాను.

"ఓ ప్రభూ, అప్పుడు నన్ను చూచిరావటానికి ఆ వీరుణ్ణి హనుమంతుణ్ణి మీరు పంపించినారే, అప్పుడే నేను లంకలో ఉన్నప్పుడే మీరు నన్ను ఎందుకు వదిలిపెట్టలేదు? మీరు వదిలిపెట్టినట్లు చెప్పి ఉన్నట్లయితే ఆ హనుమంతుడి ఎద టనే నా ప్రాణాలు వదిలిపెట్టి ఉండేదానిని. అట్లా జరిగి ఉన్నట్లయితే ప్రాణ సంశయము అయిన యీ వృథాశ్రమ మీకు లేకుండా పోయేది. నిష్ప్రయోజనముగా మీ మిత్రులు అందరూ కష్టపడవలసిన పనే లేకుండాపోయేది.

"ఓ నరశార్దూలమా, కోపములో ఉన్న మీరు ఒక అల్పుడివలె స్త్రీత్వాన్ని పురస్కరించుకొని నన్ను మాటలు అన్నారు. మీరు అందరి వద్దా తెలిసినవారు. నేను జనకమహారాజు కూతురినే. కాని వాస్తవానికి భూమిలో నుంచి పుట్టిన దానను. అది మీరు ఆలోచించ లేదు. నా సద్వర్తనాన్ని మీరు గమనించలేదు. మీరు చిన్నవారుగా ఉన్నప్పుడు నా పాణిగ్రహణము చేసి నారు. అప్పుడు మీరు చేసిన ప్రమాణము మీకు ఇప్పుడు కాకుండా ఉన్నది. మీ మీద నాకు ఉన్న భక్తిని, నా శీలాన్ని, నా సర్వాన్ని మీరు ఇప్పుడు వెన కకు తోసి వేస్తూ ఉన్నారు" అని చెప్పి సీతాదేవి ఏడ్చింది.

ఆమె కన్నీళ్ళు కారుస్తూ, అక్కడ దీనుడు అయి ఆలోచిస్తూ నిలుచొని ఉన్న లక్ష్మణుణ్ణి చూచి గద్గద స్వరముతో "ఓ సౌమిత్రీ, నా ఈ దుఃఖానికి ఔషధము ఒక చితి. నేను మిథ్యాపవాదముతో హతను అయిపోయినాను.

నీవు నాకు చితిని పేర్చి పెట్టు. ఇంకా జీవించి ఉండటానికి నాకు ఇష్టము లేదు. నా పాతివ్రత్యాది గుణాలకు సంతోషించకుండానూ నన్ను మెచ్చుకోకుండానూ నన్ను ఈ మహాజన మధ్యములో నా పెనిమిటి వదిలిపెట్టినాడు. అగ్నిప్రవేశము చేయడము కన్నా నాకు ఇప్పుడు వేరే గతి లేదు" అని చెప్పింది.

సీతాదేవి చెప్పిన ఈ మాటలు విని ఆ పరవీరహంత లక్ష్మణుడు పరమ దీనుడు అయిపోయి రాముడి ముఖము వంక చూచినాడు. అతని అభిమతాన్ని తెలుసుకొన్నాడు. అంతట రాముడి సమ్మతితో చితిని పేర్చినాడు.

అప్పుడు ఆ వైదేహి తలవంచుకొని మెల్లమెల్లగా రాముడికి ప్రదక్షిణము చేసింది. భగ భగ మండుతూ ఉన్న ఆ చితి దగ్గరకు పోయింది. అప్పుడు ఆ మైథిలి దేవబ్రాహ్మణులను ఉద్దేశించి నమస్కారము చేసింది. చేతులు జోడించి అగ్నిహోత్రాన్ని ఉద్దేశించి "ఓ అగ్నిహోత్రుడా, నీవు లోకసాక్షివి. నా మనస్సు ఎప్పుడూ నా పెనిమిటి మీదనే నిలచి ఉన్నది. అన్యత్రా చలించ లేదు. ఇది వాస్తవము అయినట్లయితే నన్ను నీవు అన్ని విధాలా రక్షించు. ఓ లోకసాక్షీ, నా ప్రవర్తనము పరిశుద్ధము అయినది అయినట్లయితే రామప్రభువు నన్ను శంకించి అనుకొంటూ ఉన్న దోషము నాలో లేక పోయినట్లయితే నన్ను అన్నివిధాలా రక్షించు. మనసా వాచా కర్మణా నేను ఆ సర్వధర్మజ్ఞుడైన రామ ప్రభువును అతిక్రమించకుండా ఉన్నట్లయితే ఓ అగ్నిహోత్రుడా, నన్ను అన్నివిధాలా రక్షించు. భగవంతుడు అయిన సూర్యుడూ చంద్రుడూ వాయువూ దశదిశలూ అహోరాత్రములూ ప్రాతఃసాయంసంధ్యలూ ఈ పృథివి, నేను పతివ్రతను అని నమ్మేట్లయితే ఓ అగ్ని హోత్రుడా, నన్ను అన్ని విధాలా రక్షించు" అని చెప్పుతూ ఆ అగ్నిహోత్రానికి ప్రదక్షిణము చేసింది.

అంతట ఆ వైదేహి తన దేహముమీద ఏ మాత్రమూ ఆసక్తిలేని అంతరాత్మతో భగ భగ మండుతూ ఉన్న అగ్ని హోత్రములో ప్రవేశించింది.

తప్తకాంచన భూషణాలు ధరించిన అతి ప్రసన్న హేమాభ, సీతాదేవి సమస్త లోకాలవారూ చూస్తూ ఉండగా భగ భగ మండుతూ ఉన్న అగ్ని హోత్రములో పడిపోయింది. పవిత్రము అయిన ఆజ్యాహుతి వలె అగ్ని హోత్రములో పడుతూ ఉన్న ఆ మహాభాగను సీతాదేవిని ముల్లోకాల వారూ చూచినారు. యజ్ఞములో మంత్రపూర్వకముగా వేల్చే నిరంతరాజ్యధార వలె మంటలు

మండుతూ ఉన్న అగ్ని హోత్రములో ఆ పూజ్యురాలు సీతాదేవి పడటము చూచి దేవాంగనలు అందరూ పెద బొబ్బలు పెట్టినారు. ఎలుగెత్తి ఏడ్చినారు. శాపగ్రస్త అయి స్వర్గలోకములోనుంచి భూమిమీద పడుతూ ఉన్న దేవాంగన వలె అగ్ని హోత్రములో పడుతూ ఉన్న ఆ సీతాదేవిని ముల్లోకాలలో ఉన్న దేవదానవగంధర్వులు అందరూ చూచినారు.

సీతాదేవి అగ్నిప్రవేశము చూచి అక్కడి జన సమూహము భయపడి పోయింది. వ్యాకులపడిపోయింది. బాలురూ వృద్ధులూ హడలి పోయినారు. రాక్షసులూ వానరులూ ఆశ్చర్య పడిపోయి పెద్ద పెట్టున హాహాకారాలు చేసినారు.

## ౧౨౦

అందరి హాహాకారాలూ అందరూ చెప్పుకొంటున్న మాటలూ ఆ ధర్మాత్ముడు రాముడు విన్నాడు. మనస్సులో బాధ పడ్డాడు. కన్నీళ్ళతో అతని కన్నులు కలకబారినవి. ఒక కొంచెము సేపు ఆలోచించినాడు.

అప్పుడు అక్కడికి రాజరాజు అయిన కుబేరుడూ, సర్వసంహారకుడు అయిన యమధర్మరాజూ, సహస్రాక్షుడు అయిన దేవేంద్రుడూ, పరంతపుడు అయిన వరుణుడూ వృషభధ్వజుడూ త్రిలోచనుడూ శ్రీమంతుడూ అయిన మహాదేవుడూ, సర్వలోక కర్త అయిన బ్రహ్మదేవుడూ సూర్యసమానము అయిన విమానాలలో వచ్చినారు. ఆ దేవోత్తములకు రాముడు చేతులు జోడించి నమస్కారము చేసినాడు. వారు అందరూ కంకణాద్యాభరణాలు పెట్టుకొన్న తమ తమ దీర్ఘ బాహువులు ఎత్తి "ఓ రామా, నీవు సర్వ లోక కర్తవు. సర్వోత్తముడవు. జ్ఞానవంతులలో శ్రేష్ఠుడవు. ఇటువంటి నీవు సీతాదేవి అగ్నిహోత్రములో పడుతూ ఉంటే ఎట్లా ఉపేక్షించినావు. నీవు దేవగణాలకు అన్నిటికీ ఉత్తమోత్తముడవు. నీకు ఈ సంగతి ఎట్లా తెలియకుండా పోయింది. అష్టవసువులలో నీవు పూర్వము ఋతధాముడు అనే ప్రజాపతివి. నీవు ముల్లోకాలకూ ఆదికర్తవు. సర్వనియామకుడవు. రుద్రుని అష్టమూర్తులలో నీవు ఎనిమిదవ వాడవు. పన్నెండు మంది సాధ్యులలో నీవు అయిదవ వాడవు. ఓ పరంతపా, నీ చెవులు అశ్వినీదేవతలు, నీ కన్నులు సూర్యచంద్రులు. సర్వలోకాలూ సృష్టించడానికి పూర్వము ఉన్న వాడవు నీవు ఒక్కడవే. ప్రళయకాలములో నీవు కనపడతావు. నీవు సర్వశక్తిమంతుడవు. సర్వజ్ఞుడవు. సర్వేశ్వరుడవు ఏమీ ఎరగని పామరుడి వలె నీవు వైదేహిని ఎందుకు ఉపేక్షించినావు." అని అడిగినారు.

ఇట్లా అడిగిన లోకపాలకులను చూచి ఆ పరమధార్మికుడు, ఆ రఘుకులదీపకుడు, ఆ లోకనాథుడు, రాముడు "ఓ దేవతలారా, నేను దశరథ మహారాజు కొమారుణ్ణి. రాముణ్ణి అనుకొంటున్నాను. మీరు ఏమేమో చెప్పుతున్నారు. నేను ఎవడనో ఏమి ప్రయోజనము కోసము పుట్టినానో అది అంతా ఈ మహాత్ముడు బ్రహ్మదేవుడు నాకు చెప్ప వలెను. చెప్పితే సంతోషిస్తాను." అని అడిగినాడు.

బ్రహ్మదేవుడు "ఓ రామా, నీవు సాక్షాత్తూ శ్రీమన్నారాయణమూర్తివి" అంటూ (20 శ్లోకాలలో) రాముణ్ని స్తోత్రము చేసినాడు.

## ౧౨౧

బ్రహ్మదేవుడు చేసిన రామస్తోత్రము అంతా విని అగ్నిహోత్రుడు మనుష్యాకారముతో ఆ చితిని అంతా విదిలించివేస్తూ సీతాదేవిని ఎత్తుకొని పైకి లేచినాడు. తప్తకాంచనాభరణాలతోనూ వాడిపోని పూలదండలతోనూ ఉంగరాలు తిరిగిన నల్లటి తలవెంట్రుకలతోనూ రక్తాంబరముతోనూ అగ్నిప్రవేశానికి పూర్వము ఏ రూపములో ఉన్నదో ఆ రూపములోనే ఉన్న ఆ యౌవనమధ్యస్థను, బాలసూర్యప్రభలతో వెలుగొందుతూ ఉన్న ఆ ప్రసన్న హృదయను సీతాదేవిని ఆ లోకసాక్షి అగ్నిహోత్రుడు రాముడికి ఒప్పగించి "ఓ రామా, ఇదిగో, నీ భార్య వైదేహి. ఈమె ఏ పాపమూ ఎరుగదు. ఈమె సువృత్త. వాచా, మనసా, కర్మణా నిన్ను ఎన్నడూ మీరలేదు. ఓ సచ్చరిత్రుడా ఈమె నిన్ను మీరి మరి ఒకరిని కంటితో చూడడముకానీ మనసా ఆలోచించడము కానీ ఎన్నడూ చేసి ఎరగదు. నీవు లేనప్పుడు నిర్జనారణ్యములో ఈమె దీన అయిపోయినప్పుడు, వివశ అయిపోయినప్పుడు రావణాసురుడు తన పరాక్రమముతో బలవంతముగా ఎత్తుకొని పోయినాడు. ఈమెను తన అంతఃపురములో నిర్బంధించినాడు. పరమభయంకరముగా కనుపించే వికారముఖాల రాక్షసాంగనలను అనేకమందిని ఈమెకు కావలి ఉంచినాడు. ఎంత నిర్బంధించినా ఈమె తన మనస్సును అంతా నీ మీదనే ఉంచింది. నిన్నే పరమగతిగా విశ్వసించింది. ఈమెను వివిధవిధాలా ప్రలోభపెట్టినాడు. ఇంకా ఎన్నో విధాల బెదిరించినారు. ఎన్ని ఆశలు పెట్టినా, ఎంత బెదిరించినా ఈమె నిన్నే ధ్యానిస్తూ తన మనస్సు అంతా నీ మీదనే లగ్నము చేసింది. ఆ రావణాసురుణ్ని గురించి ఆలోచించనయినా లేదు. ఈమె పరిశుద్ధహృదయ. పాపరహిత. ఈమెను తిరిగి స్వీకరించు. నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. నా మాటకు నీవు బదులు చెప్పవద్దు" అన్నాడు.

ఈ మాటలకు ఆ ధర్మాత్ముడు రాముడు సంతోషపడ్డాడు. ఆతని కన్నుల వెంట ఆనందబాష్పాలు దొర్లినవి. క్షణలేశము ఆలోచించినాడు. అంతట ఆ మహాపరాక్రమవంతుడు, ఆ మహాద్యుతిమంతుడు రాముడు బ్రహ్మదేవుణ్ణి చూచి "ఓ దేవా ఈ సీత ఏ పాపమూ ఎరుగదు అని ముల్లోకాలవారికీ తెలియవలెను. ఏమంటే, ఈ మంగళకరి బహు కాలము రావణాసురుడి ఇంట్లో ఉన్నది. నేను ఈ జానకిని పరీక్షించక పోయేటట్లయితే ఈ దశరథరాముడు మూర్ఖుడూ కాముకుడూ అని నన్ను అందరూ అంటారు. ఈమె జనకాత్మజ మైథిలి. అందువల్ల ఈమె సద్వృత్తము నేను ఎరుగుదును. ఈమె మనస్సు అంతా నా మీదనే ఉంచింది అనీ ఈమె నా భక్తురాలు అనీ నా చిత్తాన్ని అనుసరించి ఉంటుంది అనీ నాకు తెలుసును. నేను సత్యము నమ్మినాను ముల్లోకాలవారి నమ్మకముకోసము ఈమె అగ్నిహోత్రములో పడుతూ ఉంటే నేను ఉపేక్షించినాను. ఈమె తన పాతివ్రత్య ప్రభావములో తనను కాపాడుకోగలదు చెలియలి కట్టను మహాసముద్రము అతిక్రమించలేదు. అదేవిధముగా ఈ విశాలాక్షిని ఆ రావణాసురుడు అవమానించలేదు. మండలు మండుతూ ఉన్న అగ్నిశిఖవలె పొందనలవికాని ఈ మైథిలిని మనస్సులో అయినా అతిక్రమించే శక్తి ఆ దురాత్ముడికి రావణాసురుడికి లేదు. ఈ శుభాంగి, రావణాంతఃపుర వైభవాన్ని కోరదు. సూర్యుడితో కాంతివలె ఈమె నాతో నా నీడగా ఉంటుంది. ఈ జనకాత్మజ ముల్లోకాలలోనూ పరిశుద్ధురాలు. ప్రజ్ఞావంతుణ్ణి కీర్తివలె నన్ను ఈమె వదిలి ఉండదు.

"ఓ దేవతలారా, మీరు లోకపూజ్యులు. మీకు అందరికీ నామీద ఉన్న స్నేహాతిశయమునుంచి నాకు హితము చెప్పినారు. మీరు అందరూ చెప్పే మంచి మాటలు నేను అవశ్యమూ వినవలెను, మీరు చెప్పినట్టు చేయవలెను." అని చెప్పినాడు.

ఆ మహాబలవంతుడు ఆ రఘుకుల దీపకుడు సుఖము అనుభవించవలసిన ఆ రాముడు తనకు తెలిసింది అంతా చెప్పి తాను చేసిన పనికి మహాత్ములు అయిన బ్రహ్మాదులు పొగడుతూ ఉంటే సీతాదేవిని దగ్గరకు చేర తీసుకొన్నాడు.

## ౧౨౨

ఆ విధముగా రాముడు ఎంతో చక్కగా చెప్పినాడు. అది విని మహేశ్వరుడు అంతకన్నా చక్కగానూ మంగళకరముగానూ "రామా, నీవు పుండరీకాక్షుడవు. మా భాగ్యవశమువల్ల నీవు రావణాసురుణ్ణి సంహారము చేసి వేసి

నావు. ఈ పనిని నీవు తప్ప మరి ఎవ్వరూ చేయలేరు. ఆ రావణాసురుని భయము సర్వలోకాలవారినీ గాఢాంధకారము వలె ఆవరించింది. నీవు కాబట్టి ఆ రావణాసురునితో యుద్ధము చేసి వాణ్ణి వధించివేయ కలిగినావు. ఇది మా భాగ్యము.

"ఓ మహాబలవంతుడా, నీవు ఇక అయోధ్యానగరానికి పో. నీ రాక ఎదురు చూస్తూ భరతుడు దిగులు పడుతూ ఉన్నాడు. అతణ్ణి ఊరడించు. ఆ భాగ్యశాలిని కౌసల్యాదేవినీ కైకేయీదేవినీ సుమిత్రాదేవినీ సందర్శించి సంతోషపెట్టు. రాజ్యాభిషేకము చేసుకో. నీ బంధువులనూ నీ మిత్రులనూ హాయిగా పోషించు. ఇక్ష్వాకువంశము సుస్థిరముగా ఉండడానికి పుత్రులను కను. అశ్వమేధము చేసి దేవతలను ఆరాధించు. బ్రాహ్మణులకు ధనము దానము ఇవ్వు. కీర్తి సంపాదించు. బహుకాలము జీవించు. ఆ తరువాత స్వర్గలోకనివాసానికి ప్రయాణము అయి పో.

"రామా, ఇదుగో, మహాయశుడూ మానవలోకములో నీ తండ్రీ అయిన దశరథమహారాజు. — ఈ విమానములో కూర్చున్నాడు. పుత్రుడవు అయిన నీ వల్ల ఈ శ్రీమంతుడు తరించినాడు. ఇంద్రలోకములో నివసిస్తున్నాడు. నీవూ నీ తమ్ముడూ పోయి ఆయనకు నమస్కారము చేయండి" అని చెప్పినాడు.

ఈ విధముగా శివదేవుడు చెప్పిన మాటలు రామలక్ష్మణులు విన్నారు. ఆశ్చర్యపోయినారు. అక్కడ విమానములో ఉన్నతాసనము మీద దివ్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న తమ తండ్రిని దశరథమహారాజును సందర్శించినారు. నిర్మల వస్త్రాలు ధరించిన ఆ మహీపతి దశరథమహారాజు తన పుత్రులను చూచి మహా సంతోషపడ్డాడు. తన ప్రాణాల కన్నా ఎక్కువగా ప్రేమించే రాముణ్ణి దగ్గరకు లాగుకొని తన ఒడిలో కూర్చుండ పెట్టుకొని గట్టిగా కౌగలించుకొని "రామా! నిన్ను అయోధ్యాపురములో వదిలిపెట్టి వచ్చినాను. నేను ఉంటూ ఉన్నది స్వర్గలోకములోనే; అయినప్పటికీ స్వర్గసౌఖ్యాలు నన్ను సంతోషపెట్టడము లేదు. నన్ను ఇక్కడ ఎప్పుడూ దేవర్షులు సన్మానిస్తూనే ఉన్నారు. కానీ నాకు మనశ్శాంతి లేదు. నేను నిజము చెప్పుతూ ఉన్నాను. ఒట్టు పెట్టుకొని చెప్పుతూ ఉన్నాను. నాయనా, నీవు ఇప్పుడు శత్రుసంహారము చేసినావు. నీ మనోరథము ఈడేరింది. నీ వనవాస గడువుకాలము అయిపోయింది. నాకు ఇప్పుడు ఎంతో సంతోషముగా ఉంది. రామా, నీవు మాట నేర్పరివి. నిన్ను అడవికి పంపించడానికి కైకేయీదేవి ఏ ఏ మాటలు చెప్పిందో అవిఅన్నీ నాకు జ్ఞాపకము ఉన్నవి. నీవు లక్ష్మణుడితో కూడా క్షేమముగా ఉన్నావు.

అదే నాకు చాలు. మిమ్ములను చూచినాను. నిన్ను కౌగలించుకొన్నాను. సూర్యోదయముతో మంచు వదిలి పోయినట్లు నిన్ను చూడడముతో నా దుఃఖము అంతా వదిలి పోయింది.

"నాయనా, పూర్వము జనకమహారాజు సభలో పరమధర్మాత్ముడు అయిన ఏకపాదుడు అనే బ్రాహ్మణుణ్ణి వరుణపుత్రుడు వంది అనే వాడు శాస్త్రవాదములో జయించినాడు. అప్పుడు ఆ వందిని శాస్త్రవాదములో ఏకపాదుడి పుత్రుడు అష్టావక్రుడు ఓడించి తన తండ్రిని తరింపచేసినాడు. నాయనా, అదే విధముగా నీవు నీ పరమపూజ్యము అయిన స్వభావముతో నన్ను తరింపచేసినావు.

"ఓ ప్రసన్నుడా, రావణసంహారముకోసము నీ రాజ్యాభిషేకానికి దేవేంద్రాదులు ఎట్లా విఘ్నాలు కలుగచేసిందీ నాకు ఇప్పుడు తెలిసింది. రామా, నీవు పురుషోత్తముడవు. అరినిషూదనుడవు. నీవు ఇక్కడినుంచి అయోధ్యానగరానికి పో. కౌసల్య నిన్ను చూచి ఎంతో సంతోషపడుతుంది. నాయనా, ఇంతకూ ఆమె కృతార్థురాలు. ఆమేకాదు. అయోధ్యానగరములో నీ రాజ్యాభిషేకము చూసే రాజులు అందరూ కృతార్థులే. వారేకాదు. నీ రాజ్యాభిషేకము చూసే ప్రతివాడూ కృతార్థుడే.

"రామా, ఆ బలవంతుణ్ణి ఆ పరిశుద్ధుణ్ణి ఆ పరమధార్మికుణ్ణి నీ మీద ఎంతో అనురాగముతో ఉంటూఉన్న ఆ భరతుణ్ణి నీవు అయోధ్యానగరములో కలుసుకొన్నప్పుడు మిమ్ములను నేను చూడవలెను. ఇది నా కోరిక. నాయనా, నీవు సీతతోనూ బుద్ధిమంతుడు అయిన ఈ లక్ష్మణుడితోనూ పధ్నాలుగు సంవత్సరాలు అడవిలో గడపివేసినావు. నీ వనవాసము పూర్తిచేసినావు. నీ ప్రతిజ్ఞ సఫలము అయింది. యుద్ధములో రావణాసురుణ్ణి సంహారము చేసివేసి దేవతలను అందరినీ మెప్పించినావు. ముల్లోకాలవారూ కొనియాడే పని చేసినావు. అఖండ యశస్సు సంపాదించినావు. నాయనా, ఇక నీవు రాజ్యపాలనము చేస్తూ నీ తమ్ములతోకూడా బహుకాలము జీవించు" అని ఆశీర్వదించినాడు.

రాముడు అప్పుడు చేతులు జోడించి "ఓ తండ్రీ, నీవు సమస్తధర్మాలూ తెలిసినవాడవు. నేను అడుగుతున్నాను. నన్ను అనుగ్రహించు. నీవు అప్పుడు కైకేయీ దేవిని భరతుడితోకూడా పరిత్యజించినాను అని చెప్పినావు. ప్రభూ, అది ఘోరము అయిన శాపము. నీవు ఇప్పుడు వారిని అనుగ్రహించు. ఆ భయంకరశాపము వారిని అంటకుండా నీవు కాపాడవలెను" అని వేడుకొన్నాడు.

"అట్లానేను" అని రామునితో చెప్పి అంతట దశరథమహారాజు లక్ష్మణుణ్ణి కౌగలించుకొని "నాయనా, లక్ష్మణా, నీవు సీతారాములకు భక్తితో సేవ చేసినావు. అందుకు నేను ఎంతో సంతోషపడుతూ ఉన్నాను. అందువల్ల నీకు గొప్ప పురుషార్థము లభ్యము అయింది. నాయనా, నీవు ధర్మజ్ఞుడవు. నేను చెప్పవలసిన పనిలేదు. రాముడు ప్రసన్నుడు అయ్యేట్టయితే నీకు ఈ భూమిమీద సమస్త ధర్మఫలాలూ సంప్రాప్తము అవుతవి. నీవు గొప్ప వాడవు అవుతావు. అఖండము అయిన యశస్సు వస్తుంది. ఆ తరువాత స్వర్గసౌఖ్యాలు అనుభవిస్తావు. నీవు సుమిత్రానందవర్ధనుడవు. నాయనా, లక్ష్మణా, బ్రహ్మ నాశరహితము అయినది. అది రహస్యముగా వుంటుంది. దేవతల హృదయాంతర్యామి. చిత్తశుద్ధి లేనివారు దాన్ని తెలుసుకోలేరు. ఆ బ్రహ్మమే శత్రువులను తాపము ఎత్తించే ఈ రాముడి రూపాన భూలోకంలో అవతరించింది అని బ్రహ్మర్షులు చెప్పినారు. నీవూ విన్నావు. కాబట్టి నీవు ఈ సీతారాములకు భక్తితో సేవ చేస్తూ ఉండు" అని తన ఎదుట చేతులు జోడించి నిలుచొని ఉన్న లక్ష్మణుడితో చెప్పినాడు.

అంతట ఆ దశరథమహారాజు సీతాదేవిని చూచి "ఓ వైదేహీ, నిన్ను రాముడు వదిలి పెట్టుతాను అన్నాడు. అందుకు వాడి మీద నీకు కోపమువద్దు. నీ మేలుకోరి నీ పవిత్రచరిత్రము లోకానికి వెల్లడించడానికి అట్లా నీతో చెప్పినాడు. అంతే. ఓ సుభ్రూ, పతిసేవనుగురించి నేను నీకు చెప్పవలసిన పని ఏమీ లేదు. అయినప్పటికిన్నీ నేను నీ మామగారిని కాబట్టి అవశ్యమూ చెప్పవలెను. నీ భర్త ఈ రాముడే నీకు పరమదైవము" అని చెప్పినాడు.

ఈ విధముగా దశరథమహారాజు రామలక్ష్మణులతోనూ తనకోడలు సీతాదేవితోనూ చెప్పి దివ్యకాంతులతో విరాజిల్లుతూ విమానము మీద దేవేంద్రలోకానికి వెళ్ళిపోయినాడు.

## ౧౨౩

పాకాసురుణ్ణి సంహారము చేసిన దేవేంద్రుడు అప్పుడు తన ఎదుట చేతులు జోడించి నిలుచొని వున్న రాముణ్ణి చూచి "ఓ రామా, నిన్ను మేము చూడడానికి వ్యర్థముగా రాలేదు. నీవు మా దర్శనము చేయడము వ్యర్థము కాకూడదు. కాబట్టి నీ మనస్సులో ఉన్న కోరిక చెప్పు. మేము సంతోషంగా నెరవేరుస్తాము" అని చెప్పినాడు.

ఈ మాటలకు సీతారామలక్ష్మణులు ముగ్గురూ దేవేంద్రుడికి నమస్కారమూ చేసినారు. అంతట రాముడు "ఓ సురేశ్వరా, నీవు మాట నేర్చరివి. నీకు

నా మీద ప్రేమ ఉన్నట్లయితే నేను కోరేది యథార్థముగా చేసి పెట్టవలెను. నా నిమిత్తము వానరవీరులు అందరూ తమ భార్యాపుత్రులను వదులుకొని సంతోషముగా నా వెంట వచ్చి తమ ప్రాణాలను అయినా లెక్కచేయకుండా పరమపరాక్రమముతో యుద్ధము చేసినారు. కొంతమంది ప్రాణాలు కోల్పోయినారు. నీవు అనుగ్రహించి వాళ్ళను అందరినీ బ్రతికించవలెను. ఓ దేవేంద్రుడా, నీవు ఆశ్రితుల గౌరవాన్ని కాపాడే వాడవు. వానరవీరులతో పాటు గోలాంగూల వీరులూ భల్లూకవీరులూ కొంతమంది చనిపోయినారు. చని పోయిన నా యోధులు అందరూ ఏ బాధా లేకుండా వ్రణాలు అన్నీ నయము అయిపోయి ఎప్పటి బలపరాక్రమాలతో బ్రతికి లేవవలెను. ఇదే నా కోరిక. మరి ఒక చిన్న కోరిక ఉన్నది. వానరులు నివసించే ప్రదేశాలలో అకాలములో అయినా ముఖ్యము అయిన కందమూలాలూ, వివిధ ఫలాలూ పండుతూ ఉండ వలెను. నదులు నిర్మలజలాలతో అక్కడ ప్రవహించవలెను. ఇదే నేను కోరే వరము" అని అడిగినాడు.

ఇందుకు దేవేంద్రుడు సంతోషముగా "నాయనా, నీవు అడిగిన వరము గొప్పది. అయినా నేను మాట తప్పను. రెండు మాటల వాణ్ణి కాను. నీవు కోరి నట్లుగా అవుతుంది. యుద్ధములో రాక్షసుల దెబ్బలకు చేతులూ కాళ్ళూ తలలూ తెగి చచ్చిపోయిన వానరులూ, గోలాంగూలులూ, భల్లూకవీరులూ అం దరూ ప్రాణాలతో లేస్తారు. వాళ్ల గాయాలు అన్నీ నయము అయిపోయి ఏ రుగ్మతా లేకుండా ఎప్పటి మాదిరిగా బలపరాక్రమాలతో ఉంటారు. నిద్ర మేల్కొన్నట్లుగా లేస్తారు. వాళ్లు అందరూ లేచి పరమ సంతోషముతో పోయి వాండ్ల వాండ్ల స్నేహితులనూ బంధువులనూ జ్ఞాతులనూ స్వజనులనూ కలుసుకొంటారు. ఓ ధనుర్ధారీ, నీవు కోరినట్టుగా వానరులు నివసించే ప్రదేశా లలో వివిధ వర్ణాలతో ఎప్పుడూ పూలు పూస్తూ వృక్షాలు ఫలవంతముగా ఉం టవి. కందమూలాలు ఎప్పుడూ సమృద్ధముగా దొరుకుతూ ఉంటవి. నదులు నిర్మలోదకాలతో ఎప్పుడూ ప్రవహిస్తూ ఉంటవి" అని చెప్పినాడు. ఈ వరము దేవేంద్రుడు అనుగ్రహించగానే గాయాలు అయిన గాత్రాలతో చచ్చి పడిఉన్న వానర గోలాంగూల భల్లూక వీరులు అందరూ గాయాలులేని దేహా లతో నిద్రపోయి లేచిన వారి మాదిరిగా లేచి నుంచొన్నారు. అందుకు అం దరూ ఆశ్చర్యపోయినారు. చచ్చి బ్రతికిన ఆ వీరులు అందరూ అప్పుడు రాముడికి సాష్టాంగ నమస్కారములు చేసినారు.

అంతట అక్కడ ఉన్న దేవోత్తములు అందరూ సమస్తార్థాలూ సమ కూరిన రామలక్ష్మణులను చూచి ముందుగా స్తోత్రము చేసినారు. దేవేంద్రుడు

రాముణ్ణి ప్రశ్నించి "ఓ వీరుడా, నీవు ఈ వానరవీరులను అందరికీ వారి వారి తావులకు పంపించు. ఈ మైథిలిని సమాధానపరచు. ఇక్కడి నుంచి అయోధ్యకు పో. నీ తల్లులు అందరికీ కనపడు. నిన్ను ఎడబాసిన దుఃఖముతో నియమవ్రతుడుగా ఉన్న నీ తమ్ముణ్ణి భరతుణ్ణి సంతోషపెట్టు. ప్రాజ్ఞస్వభావుణ్ణి నీ తమ్ముణ్ణి శత్రుఘ్నుణ్ణి ఆదరించు. నీవు రాజ్యాభిషేకము చేసుకో. అయోధ్యాపౌరులను అందరినీ సంతోషపెట్టు" అని చెప్పినాడు.

అంతట సీతారామలక్ష్మణులు ఆ దేవోత్తములకు అందరికీ నమస్కారము చేసినారు. ఆ దేవతలు వారికి వీడ్కోలు చెప్పి సూర్యకాంతులతో తేజరిల్లుతూ ఉన్న వారి వారి విమానాల మీద స్వర్గలోకానికి ప్రయాణము అయి పోయినారు.

పూర్ణచంద్ర కాంతులతో తేజరిల్లే రాత్రివలె రామలక్ష్మణులు కాపాడుతూ ఉన్న ఆ మహాసేనాసమూహము ఎంతో యశస్సు సంపాదించిన సంతోషముతో అక్కడ అంతటా విరాజిల్లింది.

## ౧౨౪

ఆ రాత్రి అంతా అక్కడ హాయిగా నిద్రపోయి లేచిన ఆ అరిందముణ్ణి రాముణ్ణి చూచి విభీషణుడు చేతులు జోడించి జయాశీర్వాదము చెప్పి "రామా, స్నానయోగ్యము అయిన జలాలూ అంగరాగాలూ నానావిధ పుష్పమాలలూ ఆభరణాలూ దివ్యచందనాలూ నూతనవస్త్రాలూ సిద్ధము చేయడము అయింది. ఇదుగో కమలనేత్రలు. ఈ యువతులు స్నానము చేయించడములోనూ అలంకరించడములోనూ ఆరితేరినారు. నిను యథాశాస్త్రముగా మంగళస్నానము చేయించడానికి వీళ్ళు వచ్చినారు. నా కోరిక అనుగ్రహించు" అని అడిగినాడు.

అందుకు రాముడు "మిత్రుడా, నీవు సుగ్రీవుడూ మొదలుఅయిన వానరవీరులను మంగళస్నానము చేయమని చెప్పు. నేను ఇప్పుడు మంగళస్నానము చేయను. ఆ మహాబాహువు ఆ ధర్మాత్ముడు సుఖము అనుభవించవలసిన ఆ సుకుమారుడు ఆ చిన్నవాడు నా తమ్ముడు భరతుడు నానుంచి అయోధ్యలో పరితపిస్తూ ఉన్నాడు. ఆ కైకేయీ పుత్రుణ్ణి ప్రతిజ్ఞ తప్పని నా తమ్ముణ్ణి చూడకుండా మంగళస్నానము చేయను, నేను నూతనవస్త్రాలు ధరించను. ఆభరణాలు పెట్టుకోను. నేను అయోధ్యాపట్టణానికి వెంటనే వెళ్ళిపోవలెను. ఆ పట్టణము ఇక్కడికి చాలాదూరానఉన్నది. నేను సరాసరి అక్కడికి పోవలసిఉంది" అని చెప్పినాడు.

"ఓ రాజా, నిన్ను ఒక్కరోజులో అయోధ్యాపట్టణానికి చేరుస్తాను. నీకు శ్రమ ఉండదు. సూర్యసమాన కాంతులతో తేజరిల్లే పుష్పక విమానము ఇక్కడ లంకాపట్టణములో ఉన్నది. అది శ్రేష్ఠము అయినది. దేవలోకములోది. కోరుకొన్న చోటికి కోరుకొన్న వేగములో తీసుకొనిపోతుంది. అది మా అన్న కుబేరుడిది. రావణాసురుడు యుద్ధములో జయించి దాన్ని కుబేరుడిదగ్గరనుంచి తీసుకొనివచ్చినాడు. ఇప్పుడు ఇక్కడికివచ్చిన కుబేరుడికి నేను ఆ విమానాన్ని ఇవ్వకుండా నీకోసమే అట్టిపెట్టినాను. ఆకాశములో అది మహామేఘమువలె పోతుంది. నీవు అందోళనపడవద్దు. దానిమీద నీవు హాయిగా అయోధ్యానగరానికి పోవచ్చును.

"ప్రభూ, నీవు సర్వమూ తెలిసినవాడవు. నామీద నీకు అనుగ్రహము ఉన్నట్లయితే నా భక్త్యాదిగుణాలను నీవు మెచ్చుకొంటూ ఉన్నట్లయితే, నామీద నీకు వాత్సల్యము ఉన్నట్లయితే నీవు ఇక్కడ మంగళస్నానము చేయకపోయినప్పటికిన్నీ నీవు నీ భార్య వైదేహితోనూ నీ తమ్ముడు లక్ష్మణుడితోనూ ఒక్కరోజు అయినా ఇక్కడ ఉండు. నా కోరిక తీర మిమ్ములను నేను సత్కరిస్తాను. ఆ తరువాత మీరు వెళ్ళిపోవచ్చును.

"రామా, నేను నిన్నే కాదు. నీ సైన్యాలనూ నీ సుహృద్గణాలనూ నేను సంతోషముగా సత్కరిస్తాను. అందుకు అవసరము అయిన ప్రయత్నాలను అన్నిటినీ చేసినాను. నీవు అంగీకరించవలెను. రామా, నీవు నన్ను గౌరవించినావు. ప్రేమించినావు. నేను నీ భృత్యుణ్ణి. కాబట్టి నేను నిన్ను ఆజ్ఞాపించలేను కదా స్నేహపూర్వకముగా నిన్ను వేడుకొంటున్నాను. నీవు ఇక్కడ ఒక్కరోజు అయినా ఉండి పోవలెను" అని విభీషణుడు చెప్పినాడు.

అప్పుడు రాముడు రాక్షసులూ వానరులూ మొదలు అయినవారు అందరూ వింటూఉండగా "ఓ ప్రసన్నుడా, నీవు పరంతపుడవు. నీవు నాకు సాచివ్యము చేసినావు. నాకోసము నీవు నీ పరాక్రమాన్ని చూపించినావు. నాతో ఉత్తమము అయినస్నేహము చేసినావు. సర్వాత్మనా నీవు నన్ను సత్కరించినావు. ఓ రాక్షసరాజా నీవు చెప్పినట్లు నేను చేయకుండా ఉండడము అనేది లేదు. అయితే నేను ఇప్పుడు అయోధ్యకు పోవలెను. నేను అరణ్యవాసము ఆరంభించినప్పుడు నన్ను మళ్లీ అయోధ్యకు తీసుకొని పోవలెను అనుకొని నా తమ్ముడు భరతుడు చిత్రకూట పర్వతానికి వచ్చినాడు. నన్ను శిరసా యాచించినాడు. నేను అందుకు అప్పుడు ఒప్పుకోలేదు. పధ్నాలుగు సంవత్సరాలూ అయి

పోగానే వస్తాను అని చెప్పినాను. ఆ నా తమ్ముణ్ణి భరతుణ్ణి చూడవలెను అని నా మనస్సు నన్ను తొందరచేస్తూ ఉన్నది. ఆ కీర్తిశాలిని మా అమ్మను కౌసల్యాదేవిని నేను చూడవలెను. ఈ లక్ష్మణుని తల్లిని సుమిత్రాదేవిని ఆ భరతుని తల్లిని కైకేయీ దేవినీ మా గురువులనూ నేను చూడవలెను. నా స్నేహితులనూ వారి పిల్లలనూ పాపలనూ అయోధ్యాపౌరులనూ ఎప్పుడు ఎప్పుడు చూడడమా అని నా మనస్సు తహతహలాడుతున్నది. ఓ రాక్షసేంద్రా ఇప్పుడే విమానము తెప్పించు. నేను చేయవలసిన పనులు అన్నీ అయిపోయినవి. ఇకను నేను ఇక్కడ ఉండలేను. ఓ ప్రసన్నుడా నేను వెళ్ళిపోతాను. అనుమతించు. ఓ విభీషణుడా, నీవు నన్ను చక్కగా సత్కరించినావు. నీకు కోపమువద్దు. నేను వెళ్ళిపోవలెను. త్వరగా అనుమతించు" అని చెప్పినాడు.

అంతట విభీషణుడు లంకాపట్టణానికి పోయి పుష్పకవిమానాన్ని తీసుకొని తిరిగి వచ్చినాడు.

ఆ విమానము మేరుశిఖరాకారాన ఉన్నది. దానిని విశ్వకర్మ నిర్మించినాడు. దాని అవయవాలు అన్నీ బంగారముతో చిత్ర విచిత్రముగా అమర్చి ఉన్నవి. అది స్వచ్ఛకాంతులతో తేజరిల్లుతూ ఉంది. ఆ విమానములో వైడూర్యమణిమయము అయిన వేదికలూ మంటపాలూ ఉన్నవి. అంతే కాదు. ఆ విమానములో కాంచనహర్మ్యాలు నిర్మించి ఉన్నవి. ఆ హర్మ్యతలాలు స్ఫటికాలతోనూ వైడూర్యాలతోనూ తాపటము చేసి ఉన్నవి. అంతటా ఉత్తమ ఆస్తరణాలు పరిచి ఉన్నవి. ఆ హర్మ్యాలలో ఎంతో విలువ అయిన వరాసనాలు ఉన్నవి. బంగారు పద్మాలు అలంకారముగా పెట్టి ఉన్నవి. ఆ హర్మ్యాల కిటికీలకు ముత్యాలూ మణులూ పొదిగి ఉన్నవి. దానిమీద బంగారుధ్వజాలూ తెల్లటి పతాకాలూ శోభయమానముగా ఉన్నవి. ఆ విమానము ఆకాశములో మధురధ్వనులు చేస్తూ దానికి కట్టి ఉన్న చిన్న చిన్న గంటలూ పెద్ద పెద్ద గంటలూ గణగణ మోగుతూ అది ఏ అడ్డూ లేకుండా మనోవేగముతో పోతుంది.

ఆ పుష్పకవిమానాన్ని రామునికి సమర్పించి, విభీషణుడు అక్కడ నిలుచున్నాడు.

## ౧౨౪

ఆ పుష్పకవిమానాన్ని రాముడు చూచినాడు. విభీషణుడు అప్పుడు వినయముతో తలవంచి, చేతులు జోడించి "ప్రభూ, నేను ఇప్పుడు ఏమి చేయవలెను" అని రాముణ్ణి అడిగినాడు.

ఆ మహాతేజోవంతుడు రాముడు లక్ష్మణుడితో కూడా ఆలోచించి విభీషణుడితో స్నేహపూర్వకముగా "ఓ మిత్రుడా, ఈ వానరవీరులు అందరూ చేయవలసిన ప్రయత్నము అంతా చేసినారు. మనకు కార్యసాధకులు అయినారు. నీవు వీరిని సత్కరించు. వివిధవస్తువులూ వస్త్రాలూ రత్నాద్యాభరణాలూ ఇచ్చి వీరిని సంతోషపెట్టు. దేవతలు సహితము యుద్ధము చేసి ఈ లంకా పట్టణాన్ని స్వాధీనము చేసుకోలేక పోయినారు. ఈ వానరవీరులు తమ ప్రాణాలను తెగించి పరమోత్సాహములో పోరాడినారు. అందువల్లనే మనము జయించ కలిగినాము. జయప్రదముగా యుద్ధము చేసిన ఈ వానర వీరులను అందరినీ నీవు సత్కరించవలెను.

"ఓ మిత్రుడా, నీవు మర్యాదలు అన్నీ తెలిసిన వాడవు. సమ్మానార్హులు అయిన ఈ వానరులను నీవు కృతజ్ఞతతో సమ్మానించెటట్టయితే వీళ్లు అందరూ ఎంతో సంతోష పడతారు. నీవు త్యాగశీలుడవు అనీ దయాపరుడవు అనీ స్నేహపాత్రుడవు అనీ తెలుసుకొంటారు. నిన్ను వీళ్లు అందరూ మెచ్చుకొంటారు. నీవు యశస్వివి అవుతావు, అందుకోసము నేను నీకు ఈ విషయము చెప్తున్నాను. రాజు తన ఔదార్యాదిగుణాలతో అందరినీ సంతోష పెట్టుతూ ఉండవలెను. క్రోధమే ప్రధానముగా భావించే రాజును చూచి సైన్యాలు విసుగు చెందుతవి. అటువంటి రాజును యుద్ధములో వదిలి పెట్టి ఆ సైన్యాలు పారి పోతవి" అని చెప్పినాడు.

రాముడు ఈ విధముగా చెప్పగానే విభీషణుడు వానరవీరులను అందరినీ యథార్హముగా రత్నాద్యాభరణాలు ఇచ్చి సమ్మానించి సంతోష పెట్టినాడు.

అంతట రాముడు ధనుర్ధరుడు అయిన తన తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి వైదేహినీ వెంట పెట్టుకొని ఆ పుష్పకవిమానము ఎక్కినాడు. సిగ్గుపడుతూ ఉన్న ఆ యశస్విని సీతాదేవిని తన ఒడిలో కూర్చుండ పెట్టుకొన్నాడు. అప్పుడు ఆ మహాపరాక్రమవంతుడు రాముడు సుగ్రీవుణ్ణి విభీషణుణ్ణి వానరవీరులను అందరినీ సమ్మానిస్తూ "ఓ వీరోత్తములారా, మీరు మీ మిత్రకార్యము నెరవేర్చినారు. ఇకను యథేష్టముగా మీ మీ తావులకు పొండి. నేను అనుమతిస్తున్నాను."

"ఓ సుగ్రీవుడా, నీవు పరంతపుడవు. నీవు నా స్నేహితుడవు. ప్రతిఫలాపేక్ష లేకుండా ఆపత్కాలములో ఆదుకొని సుహృదుడివలెనూ మంత్రిసత్తముడివలెనూ నీవు నాకు పని చేసి పెట్టినావు. నీకు అధర్మము అంటే ఎంత భయమో నాకు తెలుసును. నీవు పరమధార్మికుడవు. ఇక నీవు నీ సైన్యాలను వెంట పెట్టుకొని కిష్కింధానగరానికి వేగముగా పో.

"ఓ విభీషణుడా, నీరాజ్యాన్ని నీకు ఇచ్చివేసినాను. నీవు ఇక హాయిగా లంకాపట్టణములో నివసించు. దేవేంద్రుడితో కూడా దేవతలు అందరూ ఎత్తి వచ్చినా నిన్ను జయించలేరు. మిత్రుడా, నేను మా తండ్రిగారి రాజధానీ నగరానికి పోతున్నాను. నాకు మీరు అనుజ్ఞ ఇవ్వండి. మిమ్ములను అందరినీ అడుగుతున్నాను. నేను అయోధ్యానగరము పోవడానికి మీరు అందరూ అనుమతించండి" అన్నాడు.

ఈ విధముగా రాముడు అనగానే రాక్షసరాజు విభీషణుడున్నూ, వానరరాజు సుగ్రీవుడున్నూ మహాబలవంతులు అయిన వానరవీరులు అందరున్నూ చేతులుజోడించి "ఓ రామప్రభూ, మేము అందరమూ అయోధ్యానగరానికి రావలెను అనుకొంటున్నాము. నీవు మమ్ములను అందరినీ తీసుకొనిపోవలెను. మేము అక్కడివారికిఎవరికీ ఏ ఇబ్బంది కలగచేయము. హాయిగా మీ మహా నగరములోనూ, మీ ఉద్యానవనాలలోనూ సంచరిస్తాము. ఓ రాజా, నీవు మంగళస్నానముచేసి రాజ్యాభిషిక్తుడవు కావడము మేము అందరమున్నూ కన్నులారా చూస్తాము. ఓ రామప్రభూ, నిన్నుకన్న మీ అమ్మకు కౌసల్యా దేవికి మేము అందరమూ నమస్కారము చేయవలెను. ఆ తరువాత వెంటనే మేము అందరమూ మా మా తావులకు వెళ్ళిపోతాము" అని చెప్పినారు. ఈ విధముగా విభీషణాదులు చెప్పగానే ఆ ధర్మాత్ముడు, ఆ శ్రీమంతుడు, రాముడు సుగ్రీవుణ్ణీ విభీషణుణ్ణీ చూచి "ఓ మిత్రులారా, సీతా సమాగమమునుంచి నేను సంతోషపడ్డాను. భరతుణ్ణి చూడపోతున్నానని అంతకన్నా సంతోషపడ్డాను. ఇప్పుడు మీరు అందరూ నా వెంటవస్తాము అని అంటూఉంటే నేను అన్నిటి కన్నా ఎక్కువగా సంతోషపడుతున్నాను. ఓ సుగ్రీవుడా, నీవు నీ వానర వీరులతో ఈ విమానము ఎక్కు, ఓ విభీషణుడా; నీవు నీ అమాత్యులతో కూడా రా" అని చెప్పినాడు.

అంతట సుగ్రీవుడు వానరసమూహాలతో గబా గబా ఆ దివ్యవిమానము ఎక్కి కూర్చున్నాడు. విభీషణుడు తన అమాత్యులతో ఆవిమానము ఎక్కినాడు, హంసప్రతిమలతో భాసిస్తూఉన్న ఆ పుష్పకవిమానములో రాముడు పరమ సంతోషముతో కూర్చొని, అందరి పొగడ్తలూ వింటూ కుబేరుడివలె విరాజిల్లినాడు.

మహాబలవంతులు అయిన వానర రాక్షసవీరులు అందరూ ఆ దివ్యవిమాన ములో ఇరుకు లేకుండా యథాసుఖముగా సంతోషముగా కూర్చున్నారు.

అప్పుడు రాముడి అనుజ్ఞతో ఆ పుష్పకవిమానము ఆకాశానికి ఎగిరింది.

## ౧౨౬

రాముడు అనుమతించగానే వాయువేగానికి మహామేఘమువలె ఆ ఉత్తమోత్తమ విమానము ఆకాశానికి ఎగిరి పోయింది. రాముడు అప్పుడు ఆ విమానములో నుంచి అన్ని వైపులా తన దృష్టి సారిస్తూ ఆ శశినిభాననను సీతాదేవిని చూచి "ఓ వైదేహీ; చూడు, కైలాసశిఖరాకారాన లంకాపట్టణము త్రికూట పర్వతశిఖరము మీద ఉన్నది. ఈ పట్టణాన్ని విశ్వకర్మ నిర్మించినాడు. ఇదిగో, ఈ యుద్ధభూమి చూడు. నెత్తుటితోనూ, మాంసముతోనూ బురద అయి పోయింది. రాక్షసులూ వానరులూ ఎంతో మంది ఇక్కడనే చచ్చి పడి పోయినారు.

"ఓ విశాలాక్షీ, బ్రహ్మదేవుడి వరము సంపాదించిన ఆ లోకహింసకుణ్ణి, రావణాసురుణ్ణి నీ కోసము నేను వధించింది ఇక్కడనే. నేను కుంభకర్ణుణ్ణి కొట్టింది కూడా ఇక్కడనే. ఆ నిశాచరుడు ప్రహస్తుడు హతుడు అయిపోయింది ఇక్కడనే. హనుమంతుడు ధూమ్రాక్షుణ్ణి సంహారముచేసి వేసిందిన్నీ, రావణాసురుడి కొడుకు ఇంద్రజిత్తుతో లక్ష్మణుడు పోరాడిందిన్నీ ఇక్కడనే. ఆ ఇంద్రజిత్తు ఇక్కడనే చచ్చి పడి పోయినాడు. వికటుడు అనే రాక్షస వీరుణ్ణి అంగదుడూ, విద్యున్మాలి అనే రాక్షసుణ్ణి సుషేణుడూ చంపివేసింది ఇక్కడనే. ఎదిరించ నలవికాని విరూపాక్షుడూ మహాపార్శ్వమహోదరులూ అకంపనుడూ, ఇంకా బలవంతులు అయిన రాక్షసవీరులు ఎంతో మంది హతము అయిపోయింది ఇక్కడనే. ఈ యుద్ధభూమిలోనే. రావణాసురుడి జ్యేష్ఠభార్య మండోదరిన్నీ ఆమె సవతులు వెయ్యిమందిన్నీ వచ్చి చనిపోయిన తమ పెనిమిటిని రావణాసురుణ్ణి చూచి ఏడ్చినారు.

"ఓ వరాననా, అదుగో, మేము సముద్రము దాటి ఆ రాత్రి అంతా కడపిన చోటు. చూడు ఈ సముద్రతీరము. ఇదిగో సేతువు ఈ సముద్ర జలాలలో నేను నలుడిచేత నీ కోసము ఈ సేతువు కట్టించినాను. ఇటువంటి సేతువును ఇదివరకు ఎవ్వరూ కట్ట లేదు. ఓ వైదేహీ, చూడు క్షోభపెట్ట నలవికాని అపారము అయిన ఈ సముద్రాన్ని చూడు. ఇది ఎంత భయంకరముగా గర్జిస్తూ ఉన్నదో గమనించు. ఓ మైథిలీ, నీ కోసము హనుమంతుడు ఈ సముద్రాన్ని దాటి వచ్చేటప్పుడు అతిడు విశ్రమించటానికి ఈ సముద్రాన్ని భేదించుకొని పైకి లేచి వచ్చిన కాంచనశైలము; ఇదిగో, ఇదే, మైనాకపర్వతము. సముద్రము కడుపులో ఉన్న ఈ మైనాకపర్వతము వానర దండుకు విడిది పట్టు అయింది. ఓ సీతా, ఇదుగో చూడు ఈ తీర్థము. శంఖాల

తోనూ ముత్తెపు చిప్పలతోనూ ఉన్న మహాప్రభావము కల ఈ సముద్రతీరమే సేతుబంధనము అని ప్రసిద్ధికి ఎక్కింది. ఇది పరమపవిత్రము అయినది. ఇది పుణ్యక్షేత్రము. ఈ తీర్థములో స్నానము చేసేవారి మహాపాతకాలు అన్నీ నాశనము అయిపోతవి. ఈ తీర్థాన్ని ముల్లోకాలవారూ పూజించినారు. ఇక్కడ పూర్వము ఆ ప్రభువు మహాదేవుడు (ముల్లోకాల వారికి) ప్రసన్నుడు అయినాడు. ఇక్కడనే రాక్షసరాజు విభీషణుడు నన్ను కలుసుకొన్నాడు.

"సీతా, ఈ విమానము అమిత వేగముతో పోతున్నది. చూడు. ఆ కనబడు తున్నదే కిష్కింధానగరము. అదే సుగ్రీవుని రాజధాని నగరము. అది అందము అయిన పట్టణము. ఇవిగో చిత్రవిచిత్రము అయిన వనాలు. నేను వాలిని సంహారము చేసివేసింది ఇక్కడనే" అని చెప్పినాడు.

వాలి పరిపాలించిన కిష్కింధానగరాన్ని సీతాదేవి చూచింది. అంతట ఆమె రాముడితో సవినయముగా సంతోషాతిశయముతో "ఓ పుణ్యపురుషుడా, తార మొదలైన సుగ్రీవుని ప్రియభార్యలనూ తక్కిన వానరవీరుల భార్యలనూ మనము వెంటపెట్టుకొని మన రాజధానీనగరానికి పోదాము. ఇది నా కోరిక" అని చెప్పింది.

"అటాగేను" అని రాముడు ఆ పుష్పకవిమానాన్ని కిష్కింధాపట్టణము దగ్గర ఆపించి సుగ్రీవుణ్ణి చూచి "ఓ వానరశార్దూలమా, వానరవీరులు అందరి భార్యలను వెంటపెట్టుకొని అయోధ్యా నగరానికి పోవలెను అని సీతాదేవి కోరుతూ ఉన్నది. ఇది వానరవీరులు అందరితో చెప్పు. నీవు పోయి నీ భార్యలను అందరి భార్యలను వెంటపెట్టుకొనిరా. వేగిరముగా పోయిరా. ఆలస్యము చేయవద్దు" అని చెప్పినాడు.

అంతట ఆ శ్రీమంతుడు సుగ్రీవుడు ఆయా వానరవీరులు అందరితోను చెప్పి కిష్కింధానగరానికి పోయినాడు. సుగ్రీవుడు తన అంతఃపురములోకి పోయి తారను చూచి "ఓ ప్రియురాలా వానరవీరుల భార్యలను అందరినీ వెంట తీసుకొని అయోధ్యానగరము పోవలెను అని సీతాదేవి సంతోషముతో కోరుకొన్నది. అందుకు రాముడు అంగీకరించినాడు. నీవు త్వరగా లే. వానరవీరుల భార్యలను అందరినీ తీసుకొనిపోదాము. అయోధ్యానగరములో దశరథ మహారాజు భార్యలను అందరినీ చూచి వద్దాము" అని చెప్పినాడు.

సుగ్రీవుడు చెప్పింది వినే వినడముతో తార సంతోషముతో ఉప్పొంగి పోయింది. శోభాయమానముగా సర్వాంగాలూ అలంకరించుకొన్నది. తక్కిన

వానరవీరుల ఇల్లాండ్రను అందరినీ పిలిపించింది. వాళ్లనుచూచి "మనము మన మగవాళ్లను వెంబడించడానికి సుగ్రీవుడు అనుమతించినాడు. అయోధ్యానగరము చూడగలము అని నేను సంతోషపడుతున్నాను. మనము అందరమూ పోదాము. రాముడు అయోధ్యానగరము చేరడమూ ఆయనకు అక్కడివాళ్లు జానపదులూ ఎదురుకోలు చెప్పడమూ చూద్దాము. దశరథమహారాజు భార్యలను అందరినీ చూద్దాము" అని చెప్పింది.

అంతట వానరవీరుల భార్యలు అందరూ యథావిధిగా అలంకరించుకుని తార వెంట బయలుదేరినారు. వారు అందరూ ఆ విమానానికి ప్రదక్షిణముగా పోయినారు. ఆ విమానము ఎక్కినారు. వానరాంగనలు అందరూ కూర్చున్న తరువాత ఆవిమానము పైకి ఎగిరింది. అది ఋశ్యమూకపర్వతాన్ని సమీపిస్తూ ఉండగా రాముడు "ఓసీతా, చూడు. ఆ పర్వతము బంగారుకాంతులతోనూ గైరికాదిధాతువులతోనూ ధగధగలాడుతూ ఉన్నది. మెరుపులు మెరుస్తూఉన్న మేఘమువలె కనబడుతున్నది. ఇదే ఋశ్యమూకపర్వతము. ఇక్కడనే నేను వానరరాజును సుగ్రీవుణ్ణి కలుసుకున్నాను. వాలిని వధించివేస్తాను అని నేను ప్రతిజ్ఞ చేసిందన్నీ ఇక్కడనే.

"ఇదుగో, చూడు, చిత్రవిచిత్రములయిన వనాలతో పంపాసరస్సు కనపడుతున్నది. నీ ఎడబాటునుంచి నాకు పట్టరాని దుఃఖమువచ్చి నీకోసము నేను విలపించింది ఇక్కడనే. ఈ పంపాతీరాననే ఆ తాపసిని శబరిని చూచినాను. యోజనదూరము బాహువులు చాచే కబంధుణ్ణి నేను చంపివేసింది ఇదుగో ఇక్కడనే.

"ఓ విలాసినీ, ఈ ప్రదేశము చూడు. ఆ ఘాతుకుడు రావణాసురుడు నీ నుంచి ఘోరముగా పోరాడి జటాయువును చంపివేసింది. శ్రీమంతముఅయిన ఈ వృక్షము దగ్గరనే. ఇదుగో, చూడు. జనస్థానము. ఓ వరవర్ణినీ, మహాపరాక్రమవంతులుఅయిన ఖరదూషణత్రిశిరులను నూటిగాపోయే బాణాలు వదిలి నేను సంహారము చేసివేసింది ఇక్కడనే. ఇదుగో, ఇదే మనోహరముఅయిన మన ఆశ్రమపదము. ఇదుగో, అందముఅయిన మన పర్ణశాల. రావణాసురుడు నిన్ను బలవంతముగా ఎత్తుకొనిపోయింది ఇక్కడినుంచే.

"ఓ మైథిలీ, మనోహరమూ, మంగళకరమూ అయిన గోదావరీనది! ప్రసన్నోదకాలతో ప్రవహిస్తూ ఉన్నది చూడు. అదుగో అగస్త్యమహర్షి ఆశ్రమపదము. ఇదుగో సుతీక్ష్ణమహర్షి ఆశ్రమము! దివ్యకాంతులతో తేజరిల్లుతూ ఉంది చూడు. ఓ వైదేహీ, ఇదుగో శరభంగాశ్రమము. మనము ఇక్క

డికి చేరినప్పుడే ఆ సహస్రాక్షుడు దేవేంద్రుడు ఇక్కడికి వచ్చిపోయినాడు. ఓ మైథిలీ, ఆ మహాకాయుణ్ణి విరాధుణ్ణి నేను వధించింది ఇదుగో ఈ ప్రదేశము లోనే అదుగో, సూర్యవైశ్వానర ప్రభలతో తేజరిల్లుతూ ఉన్న అత్రిమహర్షి ఆశ్రమపదము. ఇదిగో, ఋష్యాశ్రమపదాలు; కనపడుతున్నవి చూడు. ఓ సుతనూ, నన్ను ప్రసన్నుణ్ణి చేసుకొని తిరిగీ అయోధ్యకు తీసుకొని పోవలెను అనుకొని కైకేయీ పుత్రుడు భరతుడు వచ్చిన చిత్రకూటపర్వతము ఇదుగో, చూడు.

"అదుగో దూరముగా కనపడుతూ ఉన్నది సుందరవనాలతో, యమునా నది. అదుగో మనము చూచిన భరద్వాజాశ్రమము. శ్రీమంతముగా తేజరిల్లుతూ ఉన్నది అదుగో చూడు. స్వర్గమర్త్య పాతాళలోకాలలో మూడు పాయలుగా ప్రవహించిన గంగానది. నానావిధ పక్షులు గుంపులు గుంపులుగా తిరుగుతూ ఉన్నవి. అదిగో, విరగపూసిన అడవులు. గుహుడు వచ్చి మనలను కలుసుకొన్న శృంగిబేరపురము అదుగో, దూరముగా కనుపడుతున్నది. సీతా, చూడు. నానావిధ వృక్షాలతో ఉన్న ఆ అడవులు. చెట్లు అన్నీ పూలు పూసినవి. అదిగో, యజ్ఞాలు చేసిన యూపస్తంభాల పంక్తులు. అదుగో, సరయూనది. అదుగో, చూడు. దూరముగా మా నాయనగారి రాజధానీ నగరము అయోధ్య కనపడుతున్నది. ఓ వైదేహీ, మళ్ళీ మనము వస్తూ ఉన్నాము. నీవు ఆ అయోధ్యానగరానికి నమస్కారము చేయవలెను" అని చెప్పినాడు.

ఇట్లా రాముడు చెప్పగానే వానరులూ రాక్షసులూ విభీషణుడూ సుగ్రీవుడూ మొదలైన వారు అందరూ సంతోషముతో ఎగిరి ఎగిరి మంగళకరము అయిన ఆ మహానగరాన్ని చూచినారు. దేవేంద్రుడి అమరావతీపట్టణము వలె విశాలము అయిన కక్ష్యలు ఉన్న తెలటి హర్మ్యాలతోనూ గుర్రాలతోనూ ఏనుగలతోనూ కిటకిటలాడుతూ ఉన్న అయోధ్యానగరము వారికి కనిపించింది.

## ౧౨౭

ఆ నాడు పంచమి తిథి. నాటితో పధ్నాలుగవ సంవత్సరము అయిపోయింది. ఆ నాడు రామలక్ష్మణులు భరద్వాజాశ్రమములోనికి పోయినారు. వినయసంపన్నులుగా ఆ మహామునికి ఆ తపోధనుడికి భరద్వాజమహర్షికి నమస్కారము చేసినారు. అంతట రాముడు "ఓ మహాత్ముడా, అయోధ్యానగరము సుభిక్షముగా ఉంటూ ఉన్నదా. అందరూ ఆరోగ్యముగా ఉంటూ ఉన్నారా. ఈ విషయము మీరు వింటూ ఉన్నారా. భరతుడు చక్కగా రాజ్యపాలనము

చేస్తూ ఉన్నాడా. మా తల్లులు అందరూ క్షేమముగా ఉన్నారా” అని అడిగినాడు.

ఆ మహాముని భరద్వాజుడు రాముడు అడిగిన ప్రశ్నలకు పరమసంతుష్టుడు అయినాడు. చిరునవ్వు నవ్వుతూ “రామా, నీ ఇంట్లో అందరూ కుశలముగా ఉన్నారు. నీ పాదుకలను ముందు పెట్టుకొని భరతుడు రాజ్యపాలనము చేస్తూ ఉన్నాడు. అతని తలనిండా జడలు పెరిగిపోయినవి. దేహసంస్కారాదులు లేనందువల్లనూ, కటిక నేలమీద పడుకొంటూ ఉన్నందువల్లనూ దుమ్ముకొట్టుకొన్న శరీరంతో ఉన్నాడు. నీ రాక ఎదురుచూస్తూ ఉన్నాడు.

“ఓ సమితింజయా, నీవు పితృవాక్య పరిపాలనము కోసము కైకేయీదేవి మాటకు కట్టుపడి పోయి రాజ్యమూ సర్వభోగాలు సర్వస్వమూ వదులుకొని కేవలమూ ధర్మాన్నే శిరసావహించి వల్కలాలు కట్టుకొని మహారణ్యములో కందమూలఫలాదులు తింటూ కాలము కడపటానికి నీ భార్యను వెంటపెట్టుకొని నీ తమ్ముణ్ణి తోడుచేసుకొని పాదచారుడవు అయి స్వర్గలోకములో నుంచి జారిపోయిన దేవత వలె పూర్వము నా ఆశ్రమానికి వచ్చినప్పుడు నిన్ను చూచినాను. అప్పుడు నిన్ను చూడగానే నాకు జాలివేసింది.

“రామా, ఇప్పుడు నీవు శత్రువులను అందరినీ జయించి సమస్తకార్యాలూ సాధించుకొని నీ మిత్రసమూహాలతోనూ నీ భార్యతోనూ నీ తమ్ముడితోనూ నన్ను చూడవచ్చినావు. ఇప్పుడు నిన్ను చూస్తూఉంటే నాకు పరమసంతోషము వేస్తూఉన్నది. రామా, వనవాసములో నీవు అనుభవించిన సమస్త సుఖ దుఃఖాలూ నేను ఎరుగుదును.

“ఓ ధర్మవత్సలా, నీవు జనస్థానములో రాక్షసులను అందరినీ సంహారము చేసి వేయడమూ మహర్షులు ప్రార్థించినందువల్ల నీవు తాపసులను అందరినీ కాపాడటమూ ఆ అనిందితను నీ భార్యను సీతను రావణాసురుడు అపహరించవలెను అనుకోవడమూ మారీచుడు జింకరూపాన రావడమూ అప్పుడు సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకొని పోవడమూ, నీవు కబంధుణ్ణి చూడడమూ, పంపా సరస్సుకు పోవడమూ, సుగ్రీవుడితో సఖ్యము చేయడమూ, వాలిని హతమార్చి వేయడమూ, వైదేహిని వెతికించడమూ, మారుతాత్మజుడు హనుమంతుడు సముద్రలంఘనము చేయడమూ, లంకను దహించివేయడమూ, సీతాదేవి వృత్తాంతము నీకు తెలియచెప్పడమూ, నీవు నలుడిచేత సేతువు కట్టించడమూ, వానరవీరులు ఉత్సాహముతో లంకాపట్టణాన్ని దహించి వేయడమూ, దేవకంటకుడు అయిన రావణాసురుణ్ణి పుత్రులతో బంధువులతో సర్వసైన్యాలతో నీవు సంహారము

చేయడమూ దేవతలు అందరూ వచ్చి నిన్ను చూడడమూ, దేవేంద్రుడు నీకు వరము ఇవ్వడమూ ఈ మొదలైన వృత్తాంతము అంతా నేను నా తపోబలముతో తెలుసుకొన్నాను.

"ఓ రామా, నేనూ నీకు వరము ఇవ్వతలచినాను. అడుగు ఇస్తాను. అంతే కాదు. నేను నీకు ఈ వేళ అతిథిసత్కారము చేస్తాను. నా సత్కారాన్ని పొంది రేపు అయోధ్యానగరానికి పో" అని చెప్పినాడు.

భరద్వాజుడు చెప్పిన ఈ మాటలకు ఆ కీర్తిమంతుడు రాముడు శిరసా నమస్కారము చేసి "బాగుంది; బాగుంది" అంటూ "ఓ మహాత్ముడా, నేను ఇప్పుడు అయోధ్యానగరానికి పోతున్నాను. నేను పోయే దారిలో వృక్షాలు అన్నీ కాలముకాని కాలములో కూడా ఫలప్రదముగా ఉండవలెను. ఆ వృక్షాలకు మధువు స్రవించవలెను. వివిధ ఫలాలూ అమృతమువంటి రుచితో పండవలెను. ఇదే నేను అడిగే వరము" అన్నాడు.

"అట్లాగేను" అని భరద్వాజుడు అన్నాడు. ఆ మహర్షిమాట తప్పిపోదు. అప్పటికి అప్పుడు అక్కడ ఉన్న వృక్షాలు అన్నీ స్వర్గములో కల్పవృక్షాల వలె కోరుకొన్న పండ్లు పండేవి అయినవి. అంతవరకూ పండ్లు పండకుండా ఉన్న చెట్లమీది కాయలు అప్పటికి అప్పుడు పండిపోయినవి. అంతవరకూ పూలు పూయకుండా ఉన్న చెట్లు అన్నీ అప్పటికి అప్పుడు విరగపూసినవి. ఎండిపోయిన చెట్లు ఆకులు వేసినవి. పెద్దగా పెరిగిన చెట్లకు తేనెలు కారినవి. అక్కడనుంచీ అయోధ్యానగరానికి పోయే మూడు యోజనాల దూరములో ఉన్న చెట్లు అన్నీ పుష్పఫలమధుప్రదాలు అయినవి.

అప్పుడు ఆ వానరవీరులు అందరూ పరమసంతోషములో నానావిధ ఫలాలనూ కోరుకొన్నన్ని లెక్క లేకుండా తిని స్వర్గాన్ని జయించిన వారివలె విర్రవీగినారు.

## ౧౨౮

రాముడు అయోధ్యను గురించి ఆలోచించినాడు. హనుమంతుణ్ణి చూచి "వాయుపుత్రుడా, నీవు ఇప్పుడు అయోధ్యానగరానికి పోవలెను. అక్కడ రాజభవనములో ఉంటూ ఉన్న వారి అందరి కుశలమూ తెలుసుకొని రావలెను. నీవు ముందుగా శృంగిబేరపురము పో. అక్కడ నిషధాధిపతిని గుహుణ్ణి చూడు. అతడు నా స్నేహితుడు. ఆ వనచరుడికి నా కుశలము చెప్పు. నా కోసము అతడు విచారపడుతూ ఉంటాడు. నా క్షేమము తెలుసుకొని ఎంతో సంతోషిస్తాడు.

అయోధ్యాపట్టణము పోవటానికి నీకు దారి చూపిస్తాడు. భరతుడి వృత్తాంతము నీకు తెలియ చెప్పతాడు. అక్కడినుంచి నీవు భరతుడి దగ్గరకు పో. ఆ నా తమ్ముడితో నేనూ నా భార్య సీతాదేవి నా తమ్ముడు లక్ష్మణుడూ కుశలముగా ఉన్నాము అనీ నేను కృతార్థుణ్ణి అయినాను అనీ చెప్పు. బలవంతుడు అయిన రావణాసురుడు సీతాదేవిని అపహరించుకొని పోవడమూ నేను సుగ్రీవుణ్ణి కలుసుకోవడమూ వాలిని సంహరించి వేయడమూ సీతాదేవి కోసము మీరు వానరులు అందరూ వెతకడమూ అవ్యయము అయిన మహాసముద్రాన్ని నీవు లంఘించడమూ నీవు సీతాదేవిని చూచి రావడమూ ఆ తరువాత మనము అందరమూ ఆ సముద్రతీరానికి పోవటమూ నాకు సముద్రుడు దర్శనము ఇవ్వడమూ మీరు అందరూ సముద్రానికి సేతువు కట్టడమూ రావణాసురుణ్ణి నేను సంహారము చేయడమూ దేవేంద్రుడు బ్రహ్మ వరుణదేవులను ఆలోచించి నాకు వరము ఇవ్వడమూ మహాదేవుడి అనుగ్రహము వల్ల మా తండ్రి దశరథమహారాజు మమ్మలను చూచి మాట్లాడడమూ నేను రాక్షసరాజు విభీషణుడితోనూ వానరరాజు సుగ్రీవుడితోనూ ఇక్కడికి రావడమూ నీవు మెల్లగా భరతుడితో చెప్పు.

"ఓ హనుమంతుడా, నీవు చెప్పినది అంతా వినగానే భరతుడి ముఖమై ఖరి చూడు. నన్ను గురించి అతని మనోగతాన్ని కనిపెట్టు. ఎట్లాగు అంటే రాముడు శత్రుసమూహాలను సంహారము చేసి వేసినాడు అనీ అఖండయశస్సు సంపాదించినాడు అనీ పరిపూర్ణమనోరథుడు అయినాడు అనీ మహాబలవంతులు అయిన మిత్రులను వెంటపెట్టుకొని వస్తూ ఉన్నాడు అనీ చెప్పు. ఆ భరతుడి ముఖము వంక చూడు. అతని ముఖవర్ణము వల్లనూ అతని చూపుల వల్లనూ అతని మాటల వల్లనూ అతడి మనోభావాలను నీవు కనిపెట్టవచ్చును. అతడి వృత్తాంతము అంతా యథార్థముగా తెలుసుకో. పితృపైతా మహము అయిన రాజ్యము అందులో ఏనుగలతోనూ గుర్రాలతోనూ రథాలతోనూ చేతికి వచ్చి సమస్తకోర్కెలూ సమృద్ధముగా సమకూరుతూ ఉంటే ఎటువంటివాడి మనస్సు అయినా తిరిగిపోకుండా ఉంటుందా. ఆ శ్రీమంతుడు భరతుడు ముల్లోకాలూ ఏలగల రఘువంశములో పుట్టినాడు. పద్నాలుగు సంవత్సరాలు రాజ్యము ఏలినాడు. ఆ అనుభవము వల్ల వాడే రాజ్యపాలనము అపేక్షించే టట్లయితే ఈ భూమిని అంతా వాణ్ణే ఏలనీ,

ఓ హనుమంతుడా, భరతుడి అభిప్రాయము తెలుసుకో. అతని ప్రయత్నము ఏమిటో తెలుసుకో. మేము ఇక్కడినుంచి ఆటే దూరము రాక పూర్వమే నీవు వచ్చి మమ్మలను కలుసుకో. నేనే రాజ్యము ఏలవలెను అని వాడు అనుకొంటూ ఉన్నట్లయితే నీవు రానక్కరలేదు" అని చెప్పినాడు.

అంతట హనుమంతుడు రామాజ్ఞను శిరసావహించి అయోధ్యానగరానికి ప్రయాణము అయినాడు. మనుష్యరూపము ధరించినాడు. మహాసర్పాలను పట్టడానికి అమితవేగముతో ఆకాశానికి ఎగిరే గరుత్మంతుడివలె ఆ మారుతాత్మజుడు హనుమంతుడు పైకి ఎగిరినాడు. ఆ పరమపరాక్రమవంతుడు తనతండ్రి వాయుదేవుడు సంచరించే ఆకాశమార్గాన పోయి మంగళకరమూ మహాపర్వాలకు స్నానస్థానమూ అయిన గంగా యమునా సంగమప్రదేశము దాటి శృంగిబేరపురము చేరినాడు. గుహుణ్ణిచూచి సంతోషాతిశయముతో మంగళకరముగా "ఓ నిషాదుడా, నీ స్నేహితుడు రఘువంశతిలకుడు రాముడు సీతాలక్ష్మణ సహితముగా కుశలముగా ఉన్నట్టు నీతో చెప్పమన్నాడు. ఈ నాడు పంచమి తిథి. భరద్వాజమహర్షి కోరినందువల్ల ఈ రాత్రి అంతా ఆ మహర్షి ఆశ్రమములో గడుపుతాడు. ఆ మహర్షి అనుజ్ఞతో రేపు ఉదయము బయలుదేరుతాడు. నీ స్నేహితుణ్ణి రాముణ్ణి ఇంకత్వరలో చూస్తావు" అని చెప్పినాడు.

అంతట ఆ మహాతేజోవంతుడు ఆ మహావేగవంతుడు హనుమంతుడు రాముడి మిత్రుడికి రాముడి క్షేమవృత్తాంతము చెప్పినాను అనే పరమసంతోషముతో దేహము పులకలెత్తి అక్కడి వనపర్వతాదుల రామణీయకాన్ని అయినా గమనించకుండా అమితవేగముతో ఆకాశానికి ఎగిరినాడు. అట్లా ఆకాశమార్గాన పోతూ దారిలో పరశురామ తీర్థాన్ని వాలుకినదినీ గోమతీనదినీ భయంకరము అయిన సాలవనాన్ని సస్యసమృద్ధముగా ఉన్న జనపదాలనూ, ఆ జనపదాలలో ఉన్న వేలకొద్దీ ప్రజలనూ చూస్తూ పోయిపోయి నందిగ్రామ సమీపము చేరినాడు. అక్కడి ఉద్యానవనాలలో వృద్ధులూ, స్త్రీలూ తమ తమ బిడ్డలతో విహరించడము చూచినాడు. విరగపూసిన చెట్లతోనూ లతలతోనూ ఆ ఉద్యానవనాలు దేవేంద్రుడి నందనోద్యానవనము వలెనూ కుబేరుడి చైత్రరథ వనము వలెనూ కనుపించినవి.

అక్కడికి అయోధ్యానగరము క్రోశెడు దూరములో ఉన్నది. ఆ నందిగ్రామములో భరతుడు నివసిస్తూ ఉన్న ఆశ్రమపదానికి హనుమంతుడు పోయినాడు. అక్కడ వల్కలాలు కట్టుకొని కృష్ణాజినము కప్పుకొని దిగులుతో చిక్కిపోయి తలనిండా జడలు పెరిగి ఒంటినిండా మురికిపట్టి తన అన్న రాముణ్ణి గురించిన దుఃఖముతో బాధపడుతూ ఫలమూలాదులు తింటూ దేహేంద్రియాలను నిగ్రహించి ధర్మానుష్ఠానములో, తపోనిష్ఠతో, వాక్సంయమముతో మనోనియమముతో బ్రహ్మర్షివలె తేజరిల్లుతూ రాముడి పాదుకలను ముందు పెట్టుకొని రాజ్యము ఏలుతూ చతుర్వర్ణాల వారికినీ ఏ ఇబ్బందీ కలగకుండా

కాషాకుతూ పరిశుద్ధులూ కాషాయాంబరధారులూ అయిన అమాత్యులతోనూ పురోహితులతోనూ, సేనాధ్యక్షులతోనూ ఉంటూ ఉన్న భరతుణ్ని హనుమంతుడు చూచినాడు. మంత్రులూ మొదలైన అయోధ్యా పౌరముఖ్యులు అందరూ పరమ ధార్మికులు. రాజపుత్రుడు భరతుడు వల్కలాజినాలు ధరించినందువల్ల వారు అందరూ తమ తమ వస్త్రాదివ్యాభరణాలను ధరించటము మానివేసినారు.

ధర్మము మూర్తీభవించినటుగా ఉన్న ఆ ధర్మజ్ఞుడికి భరతుడికి హనుమంతుడు చేతులు జోడించి "ఓ దేవా, వల్కలాజినాలు ధరించి దండకారణ్యములో నివసిస్తూవున్న ఎవరికోసము నీవు దుఃఖపడుతున్నావో ఆ రాముడు నీ అన్న నీ కుశలము అడుగుతున్నాడు. ఓ ప్రభూ, నిన్ను సంతోషపెట్టే వృత్తాంతము చెప్పుతాను. విను. దారుణమైన నీ దుఃఖాన్ని వదిలిపెట్టు. నీవు మీ అన్న రాముణ్ని ఈ ముహూర్తాన కలుసుకొన్నట్టే భావించు.

"ఓ రాజా! రామప్రభువు రావణాసురుణ్ని సంహారము చేసివేసినాడు. మైథిలిని తెచ్చుకొన్నాడు. పరిపూర్ణమనోరథుడు అయినాడు. మహా బలవంతులు అయిన మిత్రులను వెంటపెట్టుకొని వస్తున్నాడు. దేవేంద్రుడివెంట శచీదేవివలె ఆ రామప్రభువువెంట ఆ పరమయశస్విని సీతాదేవి వస్తూ వున్నది. వారివెంట ఆ మహాతేజోవంతుడు నీ తమ్ముడు లక్ష్మణుడు వస్తూ వున్నాడు" అని చెప్పినాడు.

హనుమంతుడు చెప్పిన ఈ మాటలు ఆ భ్రాతృవత్సలుడు భరతుడు విన్నాడు. సంతోషము అతిశయించింది. తటాలున పడిపోయినాడు. అత్యుత్కటసంతోషముతో మూర్ఛపోయినాడు. ఒక ముహూర్తము సేపటికి తెప్పరిల్లినాడు. లేచినాడు. స్వస్థచిత్తముతో హనుమంతుణ్ణి చూచినాడు. ఆ శ్రీమంతుడు భరతుడు హనుమంతుణ్ని గబుక్కున గట్టిగా కౌగలించుకొన్నాడు. సంతోషముతో వెల్లువలై పారుతున్న కన్నీళ్ళతో హనుమంతుణ్ని తడిపివేస్తూ "ఓ ప్రసన్నుడా, నీవు ఎవరవు. నీవు దేవుడివా. మనుష్యుడవా. నా మీద ఎంతో దయతో ఇక్కడికి వచ్చినావు. నాకు సంతోషవార్త చెప్పినావు. ఇందుకు నీకు ఒక లక్ష గోవులనూ, ఒక నూరు గ్రామాలను కానుకగా ఇస్తున్నాను. ఇంతేకాదు. చక్కని కుండలాలతో, బంగారు వన్నెతో, చంద్రబింబాలవంటి ముఖాలతో వుండే సర్వాభరణ సంపన్నలను శుభాచారలను కులశీలవతులను పదహారుమంది కన్యలను నీకు భార్యలుగా యిస్తాను" అని చెప్పినాడు.

నిరుపమానముగా ఆ వానరోత్తముడు చెప్పిన రామాగమనవార్తను విని భరతుడు సంతోషముతో ఉప్పొంగిపోయినాడు. రాముణ్ణి చూడబోతూ ఉన్న సంతోషాతిశయముతో హనుమంతుణ్ణి చూచి భరతుడు ఈ విధముగా చెప్పడము మొదలు పెట్టినాడు.

## ౧౨౬

“అయ్యా, రాముడు నా ప్రభువు. ఎన్నో సంవత్సరాలు మహారణ్యవాసము చేసినాడు. నీవు ఇప్పుడు సంతోషకరము అయిన సంగతి చెప్పినావు. నేను విన్నాను. “బ్రతికి ఉంటే నూరు సంవత్సరాలు అయిపోయిన తరువాతను అయినా మానవుడు సంతోషము అనుభవిస్తాడు” అనే లోకోక్తి యథార్థము అని తోస్తూ ఉన్నది. చిత్రమే.

“ఓ వానరుడా, రాముడూ వానరులూ ఎట్లా కలుసుకొన్నారు. ఏ దేశములో దేనికోసము స్నేహము చేసినారు నేను అడుగుతున్నాను. జరిగింది జరిగినట్లు చెప్పు” అని అడిగి హనుమంతుడు కూర్చుండటానికి భరతుడు ఒక బ్రుసిని (ఋషులు కూర్చుండే పీటను) ఇచ్చినాడు. హనుమంతుడు ఆ బ్రుసిమీద హాయిగా కూర్చొని “ఓ ప్రభూ రాముణ్ణి ఎట్లా వనవాసానికి పంపించిందీ నీ తల్లి కైకేయీదేవికి నీ తండ్రి దశరథమహారాజు ఎట్లా వరాలు ఇచ్చిందీ నీ తండ్రి పుత్రశోకముతో ఎట్లా చనిపోయిందీ రాజగృహపట్టణములో ఉన్న నిన్ను దూతలు వెంటనే అయోధ్యకు ఎట్లా పిలుచుకొని వచ్చింది రాజ్యపాలనము చేయడము నీకు ఎట్లా ఇష్టము లేకపోయిందీ సత్పురుషులు ఆచరించే ధర్మము కోసము నీవు చిత్రకూటపర్వతానికి ఎట్లా వచ్చిందీ రాజ్యపాలనము చేయడానికి రాముణ్ణి రమ్మని నీవు ఎట్లా అడిగిందీ దశరథమహారాజుకు ఇచ్చిన మాట మీద నిలిచి రాముడు రాజ్యపాలనము చేయడము ఎట్లా వదులుకొన్నదీ ఆ పూజ్యుడి పాదుకలు తీసుకొని నీవు తిరిగి ఎట్లా వచ్చిందీ నాకన్నా నీకు ఎక్కువ బాగా తెలుసును.

“ఓ మహాబాహూ, నీవు రాముడి పాదుకలను తీసుకొని వెళ్ళిపోయిన తరువాత జరిగింది అంతా నేను చెప్తాను. విను. నీ సైన్యాలను చూచి అక్కడ చిత్రకూటపర్వతము మీద ఉంటూ ఉన్న మృగాలూ పక్షులూ కలవరపడి పోయినవి. నీ సైన్యాల రాకపోకలవల్ల ఆ వనము అంతా గలిబిలి అయిపోయింది. సీతారామలక్ష్మణులకు అక్కడ ఉండటానికి ఇష్టము లేకపోయింది. వారు అక్కడినుంచి బయలుదేరి దండకారణ్యానికి పోయినారు. అది జనసంచారము లేని ఘోరారణ్యము. అక్కడ మదపుటేనుగులు చెట్లను విరిచి వేస్తూనూ లతలను

తొక్కి వేస్తూనూ తిరుగుతున్నవి. సింహాలూ, పెద్దపులులూ, జింకలూ యథేష్టముగా విహరిస్తూ ఉన్నవి. సీతారామలక్ష్మణులు ఆవిజనారణ్యములో నడిచిపోతూ ఉండగా చేతులు పైకిఎత్తి తలవంచుకొని పెద్ద పెట్టున కేకలు పెట్టుతూ ఉన్న విరాధుడు అనే రాక్షసుణ్ణి ఎట్టఎదట చూచినారు. ఆబలవంతుడు ఆరాక్షసుడు విరాధుడు వారిని అడ్డగించినాడు. రామలక్ష్మణులు ఆ రాక్షసుణ్ణి, అరస్తూ ఉన్న ఏనుగను వలె ఒక గుంటలో పడద్రోసి, పాతి పెట్టినారు. అటువంటి దుష్కరకార్యము చేసి ఆ అన్నతమ్ములు రామలక్ష్మణులు సీతాదేవిని వెంట పెట్టుకొని అక్కడి నుంచి బయలుదేరి ఆ సాయంత్రానికి శరభంగమహర్షి ఆశ్రమానికి చేరినారు. అది మనోహరము అయిన ఆశ్రమపదము. ఆ నాడు శరభంగ మహాముని తన శరీరాన్ని వదిలి పెట్టి స్వర్గానికి పోవడము సీతా రామలక్ష్మణులు చూచినారు. అప్పుడు అక్కడికి వచ్చిన మహర్షులకు అందరికీ నమస్కారము చేసి వారి వెంట బయలుదేరి జనస్థానానికి పోయినారు.

సీతారామలక్ష్మణులు జనస్థానములో ఉంటూ ఉండగా ఒకనాడు శూర్పణఖ అనే రాక్షసి రాముడి దగ్గరికి వచ్చింది. ఆ రాక్షసి సీతాదేవిని చంపి వేయ పోయింది. అప్పుడు రాముడు ఆజ్ఞాపించినందువల్ల మహాబలవంతుడు లక్ష్మణుడు లేచి ఖడ్గము అందుకొని ఇట్టె ఆ శూర్పణఖ ముక్కూ చెవులూ తెగ వేసినాడు. అందుకు అప్పుడు ఆ జనస్థానములో ఉంటూ ఉన్న భయంకరకర్ములు అయిన పధ్నాలుగు వేల మంది రాక్షసులు ఎత్తి వచ్చినారు. ఆ మహాత్ముడు రాముడు ఒక్కడే ఒక్క జాము సేపటిలో (మూడు ఘడియల కాలము) వారిని అందరినీ సంహారము చేసి వేసినాడు. తపోవిఘ్నము చేస్తూ దండకారణ్యములో నివసించిన ఆ పధ్నాలుగు వేల మంది రాక్షసులు మహాబలవంతులు. అమిత పరాక్రమవంతులు. వాళ్లను అందరినీ చంపి వేయడమే కాకుండా వాళ్ళ రాజు అయిన ఖరుణ్ణి కూడా రాముడు ఆ యుద్ధములో చంపి వేసినాడు.

చెవులూ ముక్కులూ తెగిపోయిన ఆ మూర్ఖురాలు శూర్పణఖ అప్పుడు లంకాపట్టణములో ఉన్న తన అన్న రావణాసురుడి దగ్గరకు పోయి జరిగింది అంతా చెప్పింది. అతడు జనస్థానానికి బయలుదేరి వచ్చినాడు. ఆ రావణాసురుడి అనుచరుడూ భయంకరుడూ అయిన మారీచుడు అనే రాక్షసుడు అప్పుడు రత్నమయము అయిన మృగరూపము ధరించి వైదేహిని వ్యామోహ పెట్టినాడు. ఆమెకు ఆ జింక మీద మోజు పుట్టి దాన్ని పట్టుకో వలసింది అనీ, అది తను ఆశ్రమములో ఉండేటట్లయితే మనోహరముగా ఉంటుంది అనీ రాముడితో

చెప్పింది. అప్పుడు రాముడు సన్నద్ధుడు అయినాడు. పరుగెత్తుతూ ఉన్న ఆ జింకవెంట పడ్డాడు. అది ఎంతసేపటికీ చిక్కకుండా పరుగెత్తుతూ ఉన్నందువల్ల రాముడు సన్నటి కణుపులబాణము ఆ జింకమీద వదిలినాడు.

"ఓ ప్రసన్నుడా, రాముడు ఆ జింకను తరుముకొని పోతూ ఉండగా రాముడికోసము లక్ష్మణుడున్నూ ఆ ఆశ్రమపదములో నుంచి వెళ్లిపోయినాడు. అప్పుడు ఎవరూ లేని ఆ సమయములో రావణాసురుడు ఆ ఆశ్రమములో చొరబడ్డాడు. ఆకాశములో అంగారక గ్రహము రోహిణిని పట్టుకొన్నట్టు, ఆ ఆశ్రమపదములో రావణాసురుడు సీతాదేవిని బలవంతముగా పట్టుకొన్నాడు. అప్పుడు ఆ సీతాదేవిని కాపాడటానికి జటాయువు అనే గద్దరాజు అడ్డము పోయినాడు. ఆ జటాయువును రావణాసురుడు పోరాటములో చంపివేసి సీతాదేవిని బలవంతముగా ఎత్తుకొని పోయినాడు.

రావణాసురుడు సీతాదేవిని అట్లా ఆకాశమార్గమున ఎత్తుకొని పోతూ ఉండగా ఋష్యమూకపర్వతము మీద ఉన్న మేము వానరులము చూచినాము. ఆ లోకరావణుడు రావణుడు సీతాదేవితో లంకాపట్టణానికి పోయినాడు. సుందరమూ విశాలమూ అయిన కాంచనగృహములో ఆమెను ఉంచినాడు. మంచి మాటలు చెప్పి చూచినాడు. ఆమె అతని మాటలను గడ్డిపోచలకన్న తక్కువగా గణించింది. అతనిని ఆమె ఏ మాత్రమూ లెక్క చేయలేదు. అందుకు ఆ రాక్షసరాజు ఆమెను అశోకవనములో ఉంచినాడు.

ఆ మహారణ్యములో అప్పుడు రాముడు ఆ మాయామృగాన్ని చంపివేసి వెనుకకు మళ్లినాడు. తన ఆశ్రమపదానికి సమీపములో చచ్చి పడి ఉన్న జటాయువును చూచినాడు. మహావ్యథ పడ్డాడు. సీతాదేవి ఆశ్రమములో కనపడలేదు. ఖేద పడ్డాడు. తన తండ్రికి ప్రియసఖుడు అయిన ఆ జటాయువుకు దహన సంస్కారము చేసినాడు. అంతట రాముడు లక్ష్మణుణ్ణి వెంటపెట్టుకొని సీతాదేవి కోసము గోదావరీనదీ తీరాన ఉన్న పుష్పితారణ్యాలను అన్నిటినీ వెతికి చూచినాడు. ఆ సీతాదేవి వారికి కనుపించలేదు. వారు ఆయా మహారణ్యాలను అన్నిటినీ వెతకుతూ ఉండగా కబంధుడు అనే రాక్షసుడు ఆ అన్నతమ్ములను రామలక్ష్మణులను అడ్డగించినాడు. ఆ కబంధుడు చచ్చిపోతూ చెప్పినందువల్ల రామలక్ష్మణులు ఋష్యమూకపర్వతానికి వచ్చినారు. రాముడు సుగ్రీవుణ్ణి కలుసుకొన్నాడు. రామసుగ్రీవులు ఉభయులూ కలవకపూర్వమే వారి మనస్సులలో ఒకరిమీద ఒకరికి స్నేహము కుదిరింది. సుగ్రీవుడి అన్న వాలి. ఆ వాలికి అదివరకు కోపము వచ్చి సుగ్రీవుణ్ణి వెళ్ళగొట్టినాడు. రాముడూ సుగ్రీవుడూ

పరస్పరము మాట్లాడుకొన్నారు వారు గాఢ స్నేహితులు అయినారు. అప్పుడు రాముడు తన భుజపరాక్రమముతో సుగ్రీవుడికి వానరరాజ్యము ఇప్పిస్తాను అని వాగ్దానము చేసినాడు. అంతట రాముడు ఆ మహాబలవంతుణ్ణి ఆ మహాకాయుణ్ణి వాలిని యుద్ధములో చంపి వేసినాడు. వానరరాజుగా సుగ్రీవుణ్ణి రాముడు స్థాపించినాడు. అంతట సుగ్రీవుడు సీతాదేవిని వెదక వలసింది అని పదికోట్ల మంది వానరవీరులను ఆజ్ఞాపించినాడు. ఆ వానరవీరులు ఆయా దిక్కులలో సీతాదేవిని వెదకటానికి పోయినారు.

"మేము వింధ్యపర్వతానికి దక్షిణదిక్కున చాలా దూరము పోయినాము. కాలము గతించి పోయింది. మేము దిగులుతో బాధ పడుతూ ఉండగా జటాయువు అన్న సంపాతి మాకు కనుపించినాడు. సీతాదేవి లంకాపట్టణములో రావణాసురుడి ఇంట్లో ఉంది అని ఆ సంపాతివల్ల మాకు తెలిసింది. నా వాళ్ళ దిగులు నేను పోగొట్ట తలచినాను. నేను అప్పుడు నా పరాక్రమముతో విజృంభించి నూరుయోజనాల సముద్రాన్ని లంఘించినాను. లంకాపట్టణము చేరినాను. అశోకవనములోకి పోయినాను. అదివరకు ఆశ్రమములో కట్టుకొని ఉన్న పట్టుచీరతోనే సీతాదేవి అక్కడ కనుపించింది. నిరానందగానూ మలినాంగిగానూ దృఢవ్రతగానూ ఉన్న ఆ సీతాదేవిని నేను చూచినాను

"నేను ఆమెను యథావిధిగా సందర్శించినాను. రాముడు నా చేతికి ఇచ్చి పంపించిన కాంతిమంతమూ మహామణిమయమూ అయిన ఉంగరాన్ని ఆమెకు గుర్తుగా ఇచ్చినాను. ఆ అనిందితురాలిని అడిగి సమస్తమూ తెలుసుకొన్నాను. ఆమె నాకు గుర్తుగా ఇచ్చిన చూడామణిని తీసుకొని చరితార్థుణ్ణి అయి తిరిగి వచ్చినాను. ఆమె గుర్తుగా ఇచ్చిన కాంతిమంతము అయిన ఆ చూడామణిని రాముడికి ఇచ్చినాను. సీతాదేవి క్షేమము రాముడు విన్నాడు. ప్రాణము పోతున్న వాడు అమృతము తాగి జీవించినట్టు సీతాదేవి క్షేమవృత్తాంతమువిని రాముడు సంతోషాతిశయముతో విజృంభించినాడు. రావణాసురుణ్ణి సంహారము చేసి వేయడానికి యుద్ధప్రయత్నాలు అన్నీ చేసినాడు. ప్రళయకాలములో సమస్తలోకాలనూ దహించి వేసే అగ్నిహోత్రుడి వలె రాముడు శత్రుసంహారానికి బయలు దేరినాడు. వానరసైన్యాలతో సముద్రతీరానికి చేరినాడు. ఆ సముద్రానికి నలుడిచేత సేతువు కట్టించినాడు. ఆ సేతువు మీద మమ్ములను అందరినీ దాటించి తీసుకొని పోయి లంకాపట్టణాన్ని ముట్టడించినాడు. రాక్షస సేనానాయకుణ్ణి ప్రహస్తుణ్ణి వానరవీరుడు నీలుడూ కుంభకర్ణుణ్ణి రాముడూ ఇంద్రజిత్తును లక్ష్మణుడూ సంహారము చేసి వేసినారు. ఆ తరువాత రావణాసురుణ్ణి రాముడే సంహరించి వేసినాడు.

## ౧౩౦

హనుమంతుడు పరమానందభరితుడుగా చెప్పింది అంతా ఆ భరతకుమారుడు! ఆ అమోఘ పరాక్రమవంతుడు ధర్మాత్ముడు విని తిరిగి సంతోషపడుతూ శత్రుఘ్నుడితో పలికి 'తమ్ముడా. ఇప్పుడు అయోధ్యానగర దేవాలయాలలో దేవతలను పూలదండలతో అలంకరించవలెను. సుగంధ ధూపాలు వేయవలెను. మంగళవాద్యాలు మోగించవలెను. పవిత్రులు అయిన బ్రాహ్మణులను రప్పించవలెను. ప్రాజ్ఞులూ, స్తోత్రపాఠకులూ అయిన సూతులూ మేలుకొలుపులు పాడే వైతాళికులూ వివిధవాద్యగాండ్రూ, ఆటకత్తెలు అయిన నట్టువరాండ్రూ, సమూహాలు సమూహాలుగా రామప్రభువును సందర్శించటానికి బయలుదేరి రావలెను" అని చెప్పినాడు.

అంతట శత్రుసంహారకుడు శత్రుఘ్నుడు రామసందర్శనానికి ఆ యా ఏర్పాటును చేయించటానికి మొదలు పెట్టినాడు. అనేక వేలమంది కూలివాండ్లను పిలిపించినాడు. నందిగ్రామమునుంచి అయోధ్యానగరము వరకున్నూ చతురంగబలాలూ, మహాజన సమూహాలూ, హాయిగా నడవడానికి మిట్టపల్లాలను సమమట్టము చేసేటందుకు కొంతమందిని వినియోగించినాడు. మార్గము అంతటా మంచువంటి చల్లని నీళ్లతో తడపటానికి కొంతమందినీ, ఆ మార్గములో పేలాలు చల్లి పూలతో అలంకరించడానికి మరికొంతమందినీ నియమించినాడు. సూర్యోదయము అయ్యేలోపల అయోధ్యానగర రథ్యలలోనూ, రాజవీథులలోనూ పతాకాలు ఎత్తవలసింది అనీ ప్రతిగృహాన్నీ శోభాయమానముగా అలంకరించవలసింది అనీ, రాజవీథిలో పూలదండల తోరణాలు కట్టి, విడిపూలు అలంకారముగా చల్లి అయిదురంగుల ముగ్గులు పెట్టవలసింది అనీ, సుగంధధూపాలు పట్టణము అంతటా వేయవలసింది అనీ అయోధ్యాపౌరులకు అప్పుడు శత్రుఘ్నుడు తెలియజేసినాడు.

ఆ తెల్లవారుజామున అయోధ్యాపట్టణము నుంచి దశరథ మహారాజు భార్యలూ అమాత్యులూ సైనికులూ సైనికులభార్యలూ రాజన్యులూ బ్రాహ్మణులూ శ్రేణీముఖ్యులూ రామదర్శనము చేయటానికి గుంపులు గుంపులుగా బయలుదేరినారు. అమాత్యులు అయిన ధృష్టి జయంతుడూ సిద్ధార్థుడూ అర్థసాధకుడూ అశోకుడూ మంత్రపాలుడూ సుమంతుడూ బంగారు ఆభరణాలతో అలంకరించిన మదపుటేనుగుల మీద బయలుదేరినారు. బంగారు మోకులు నడుములకు కట్టిన మదపుటేనుగుల మీదనూ, వాటి పార్శ్వాన ఆడ ఏనుగ గున్నలమీదనూ రాజపురుషులూ మంచి మంచి గుర్రాలు కట్టిన రథాల

మీద మహారథులూ బయలుదేరినారు. శక్తులూ అష్టులూ ప్రాసాలూ అనే ఆయుధాలు చేతుల్లో పట్టుకొని వీరపురుషులూ ధ్వజాలూ పతాకాలూ పట్టుకొని వేలకువేలు పదాతులూ వారివెంట మంచి మంచి గుర్రాలమీద అశ్వికులూ బయలుదేరినారు. కౌసల్యా సుమిత్రలూ వారితోపాటు కైకేయీదేవీ వాహనాలమీద బయలుదేరినారు. వారివెనుక వాహనాలమీద దశరథ మహారాజు తక్కిన భార్యలు అందరూ నందిగ్రామానికి పోయినారు. అప్పుడు నడిచిన గుర్రాల గిట్టల చప్పుళ్ళకూ రథచక్రాల ధ్వనులకూ శంఖదుందుభుల మోతలకూ భూమి అంతా కంపించి పోతూ ఉన్నట్టుగా తోచింది.

శంఖాలు పూరిస్తూ భేరీలు మోగిస్తూంటే వందిమాగధులు మంగళ గానము చేస్తూ ముందు బయలుదేరినారు. వారివెనుక వల్కలాలు కట్టుకొని కృష్ణాజినము కప్పుకొన్న ఆ ధర్మకోవిదుడు, ఉపవాసాలతో కృశించిపోయిన ఆ దీనుడు, అంతకుముందు రామాగమన వార్త విన్న ఆ మహాత్ముడు భరతుడు రామపాదుకలు శిరస్సున పెట్టుకొని రామదర్శనార్థము బయలుదేరినాడు. తెల్లని పూలదండలతో శోభిస్తూన్న శ్వేతఛత్రాన్నీ రాజార్హమూ హేమభూషితమూ అయిన వింజామరలనూ తీసుకుని రాజపురుషులూ పూలదండలూ మోదకాలూ చేతులలో పట్టుకొని అమాత్యులూ బ్రాహ్మణ ముఖ్యులూ వర్తక శ్రేష్ఠులూ శ్రేణీముఖ్యులూ రామదర్శనార్థము భరతుడివెంట నడిచినారు.

తెల్లవారవచ్చింది. రాముడిజాడ ఏమీ కనిపించలేదు. అందరూ ఆతుర పడసాగినారు. భరతుడున్నూ నిరీక్షించి నిరీక్షించి ప్రక్కను ఉన్న హనుమంతుణ్ణి చూచి "ఓ వాయుపుత్రుడా, ఆ పూజ్యుడు ఆ పరంతపుడు రాముడు వస్తూ ఉన్న జాడ తెలియడము లేదు. కామరూపులైన వానరులు అయినా కనపడటము లేదే. నాయనా, నీవు వానరసంబంధము అయిన చలచిత్తముతో రాముడు వస్తూ ఉన్నాడని నాతో చెప్పలేదు కదా" అని అడిగినాడు.

రామాదులు రావడానికి ఎందుకు ఆలస్యము అయిందీ చెప్ప తలచుకొని హనుమంతుడు "ఓ పరంతపా! చూడు. భరద్వాజుడు అనుగ్రహించినందు వల్ల వృక్షాలు అన్నీ ఇప్పుడు పూలు పూస్తున్నవి. పండ్లు పండుతున్నవి. ఆ యా చెట్లనుంచి తేనెలు కారుతున్నవి. తుమ్మెదలు మత్తెక్కి ఝుంకారము చేస్తున్నవి. రాముడు అడిగినందువల్ల భరద్వాజమహర్షే కాకుండా దేవేంద్రుడున్నూ వానరులు ఎక్కడ ఉంటే అక్కడ అన్ని వృక్షాలూ అన్ని కాలాలలోనూ పుష్పఫలప్రదము అయ్యే వరము ఇచ్చినాడు. ఆయా చెట్లపండ్లకు ఆశపడి వానరులు ఆలస్యము చేసి ఉండవచ్చును. అంతేకాదు. భరద్వాజమహర్షి రాముడికి

సైన్యసమేతముగా అతిథిసత్కారము చేస్తాను అని చెప్పినాడు. అందుకే నిన్నటి దినము ప్రయాణము కాకుండా రామాదులను ఆపివేసినాడు. ఒకవేళ ఆ కారణము వల్ల ఆలస్యము అయి ఉండవచ్చును.

"ఓ పరంతపా, అదుగో విను వానరులు ఎంత భయంకరముగా గర్జిస్తున్నారో, ఆలకించు, అవి వానరుల సంతోషధ్వనులు. వానరసైన్యము ఇప్పుడు గోమతీనదిని దాటుతున్నది అని తోస్తున్నది. అదుగో చూడు, పైకి ఎంతో ఎత్తున దుమ్ము రేగింది. దుమ్ము వాన కురుస్తున్నట్లుగా కనపడుతున్నది. ఇప్పుడు వాలుకీనదిని వానరసైన్యము దాటుతున్నది అనుకొంటాను. అదుగో, అదుగో చూడు. వానరసైన్యము సాలవనములో ప్రవేశించింది. ఆకాశవీథిలో విస్తారముగా చంద్రమండలము వలె అదుగో దూరముగా కనుపడుతున్నది చూడు. అదే పుష్పకవిమానము. దానిని పూర్వము విశ్వకర్మ బ్రహ్మకొఱకై కోసము నిర్మించినాడు. దానిని ఆ బ్రహ్మదేవుడు కుబేరునికి అనుగ్రహించినాడు. ఆ కుబేరుణ్ణి కొట్టి రావణాసురుడు తనకోసము లంకాపట్టణానికి ఆ దివ్యవిమానాన్ని ఎత్తుకొని వచ్చినాడు. ఆ రావణాసురుణ్ణి సబాంధవముగా సంహారము చేసి రాముడు ఇప్పుడు ఆ విమానము మీద వస్తున్నాడు. చూడు. అది తరుణాదిత్యకాంతులతో తేజరిల్లుతూ మనోవేగముతో వస్తున్నది అదుగో ఆ విమానములో సీతారామలక్ష్మణులు. అదుగో వారి ప్రక్కను మహాతేజోవంతుడు వానరరాజు సుగ్రీవుడూ రాక్షసరాజు విభీషణుడూ ఉన్నారు" అని చెప్పినాడు.

ఇట్లా హనుమంతుడు భరతుడితో చెప్పుతూ ఉండగా అందరూ ఆ విమానమువంక చూచి "అదుగో రామప్రభువు! అదుగో రామప్రభువు" అంటూ కేకలు వేసినారు. స్త్రీలూ పిల్లలూ యువకులూ వృద్ధులూ, సంతోషాతిశయముతో "రాముడు వస్తున్నాడు. రాముడు వస్తున్నాడు" అంటూ ఆకాశము అంటేటట్టు కేకలు పెట్టినారు. అంతట ఆయావీరులు రథాలమీది నుంచీ గుర్రాలమీది నుంచీ ఏనుగులమీది నుంచీ దిగి నేలమీద నిలుచొని ఆకాశములో చంద్రునివలె విమానములో ఉన్న రాముణ్ణి చూచినారు.

నేలమీదికి దిగుతూ ఉన్న ఆ విమానములో రాముణ్ణి చూచి "అన్నా నీవు నీ ప్రతిజ్ఞ తప్పకుండా వచ్చినావు" అంటూ భరతుడు సంతోషాతిశయముతో చేతులు జోడించి స్వాగతము చెప్పినాడు. ఆ విశాల దీర్ఘనేత్రుడు రాముడు అప్పుడు ఆ దివ్య విమానములో దేవేంద్రుడివలె తేజరిల్లినాడు. ఆ విమానములో ఉన్న రాముడు అప్పుడు మేరువు పర్వతముమీద సూర్యుడివలె విరాజిల్లినాడు. అమిత వేగముతో ఆకాశములో పోయే ఆ విమానము హంస

ప్రతిమలతో భాసిస్తూ అప్పుడు నేలమీద వాలింది. ఆ అమోఘ పరాక్రమవంతుడు భరతుడు అంతట ఆ విమానము ఎక్కి రాముణ్ణి సమీపించి సంతోషాతిశయముతో సాష్టాంగ నమస్కారము చేసినాడు. అంత కాలానికి కనుపించిన ఆ తమ్ముణ్ణి భరతుణ్ణి రాముడు లేవనెత్తి కౌగలించుకొన్నాడు. ఆ తరువాత భరతుడు లక్ష్మణుణ్ణి సంభావించినాడు. సంతోషాతిశయముతో తన పేరు చెప్పకొని సీతాదేవికి నమస్కారము చేసినాడు.

ఆ కైకేయీ పుత్రుడు భరతుడు అంతట సుగ్రీవుణ్ణి జాంబవంతుణ్ణీ అంగదుణ్ణి మైందద్వివిదులనూ నీలుణ్ణి ఋషభుణ్ణీ శరభుణ్ణీ పనసుణ్ణి సుషేణుణ్ణీ సంభావించి వరుసగా వారిని కౌగలించుకొన్నాడు. మానవరూపము ధరించిన ఆ కామరూపులు వానరులు అందరూ సంతోషాతిశయముతో భరతుణ్ణి కుశలప్రశ్న చేసినారు. అప్పుడు భరతుడు వానరరాజు సుగ్రీవుణ్ణి కౌగలించుకొని "ఓ సుగ్రీవుడా" మాకలుగురి అన్నతమ్ములకున్నూ నీవు, అయిదవ వాడవు. ఆపత్కాలములో సాయపడ్డవాడే మిత్రుడూ స్నేహితుడూనూ అపకారము చేసినవాడు శత్రువు అవుతాడు" అని చెప్పినాడు. అంత విభీషణ్ణి చూచి ఎంతో మంచిగా "ఓ మిత్రుడా నీవు దైవవశమువల్ల మా అన్నకు సహాయ పడ్డావు. దుష్కరమైన కార్యము చేసినావు" అని చెప్పినాడు.

శత్రుఘ్నుడు అప్పుడు రామలక్ష్మణులకు నమస్కారము చేసి అణకువతో సీతాదేవి పాదాలకు ప్రణమిల్లినాడు. రాముడు అప్పుడు దిగులుతో చిక్కిపోయిన తన తల్లిని కౌసల్యాదేవిని చూచి ఆమె మనస్సు ప్రసన్నము అయ్యేటట్లుగా సాష్టాంగ నమస్కారము చేసినాడు. ఆ తరువాత సుమిత్రాదేవికిన్నీ ఆ యశస్వినికి కైకేయీదేవికిన్నీ తక్కిన తల్లులకున్నూ నమస్కారము చేసినాడు. అక్కడికి వచ్చిన పురోహితుడికి వశిష్ఠమహర్షికి పాదాభివందనము చేసినాడు.

అప్పుడు అయోధ్యాపౌరులు అందరూ రాముడి దగ్గరికిపోయి చేతులు జోడించి "ఓ మహాభాగా, ఓ కౌసల్యానందవర్ధనా, నీకు స్వాగతము" అని చెప్పినారు. అట్లా చెప్పి తామరమొగ్గలవలె చేతులు జోడించి అట్లా నిలుచుని ఉన్న వేలకొద్దీ ఆ పౌరులను రాముడు ప్రసన్నముగా చూచినాడు.

ఆ ధర్మవిదుడు భరతుడు అప్పుడు రాముపాదుకలను స్వయముగా రాముడి పాదాలకు తొడిగి చేతులు జోడించి "ఓ రాజా, నీ రాజ్యాన్ని నేను ఇల్లడముగా కాపాడినాను. నీ రాజ్యాన్ని నీకు ఇప్పుడు మళ్లీ ఒప్పగించినాను నీవు మళ్లీ అయోధ్యానగరానికి రాజుగా వచ్చినావు. ఇప్పుడు నా జన్మ సఫలమైంది.

నా మనోరథము ఈడేరింది. ఓ ప్రభూ, నీ పట్టణాన్ని నీ సైన్యాన్ని చూచుకో. నీ కోశాగారాన్ని నీ ధాన్యాగారాన్ని పరిశీలించు. నేను నీ ప్రభావమువల్ల సమస్తాన్నీ పదింతలుగా పెంచినాను.” అని విన్నవించినాడు.

ఆ భ్రాతృవత్సలుణ్ణి భరతుణ్ణి చూచి వానరులూ రాక్షసరాజు విభీషణుడూ ఆనందబాష్పాలు వదలినారు. అప్పుడు రాముడు సంతోషముతో భరతుణ్ణి దగ్గరకు తీసుకొని ఒడిలో కూర్చుండపెట్టుకొని తన పరివారముతో కూడా ఆ పుష్పక విమానముమీద భరతాశ్రమానికి పోయినాడు. నందిగ్రామములో భరతాశ్రమము దగ్గరకు పోగానే రాముడు తన పరివారముతో కూడా ఆ విమానములో నుంచి దిగి భూమిమీద నిలుచున్నాడు. అంతట ఆ పుష్పక విమానము వంక చూచి “ఓ విమానమా, నీకు నేను అనుజ్ఞ ఇస్తున్నాను. ఇక నీవు పోయి ఆ కుబేరుడికి వాహనముగా ఉండు” అని రాముడు అన్నాడు. రామానుజ్ఞతో ఆ విమానము అప్పుడు ఉత్తర దిక్కుగా పోయి కుబేర భవనము చేరింది.

బృహస్పతి పాదాలకు నమస్కారముచేసి ఆ దేవపురోహితుణ్ణి కూర్చుండపెట్టి తాను శుభాసనముమీద కూర్చుండే దేవప్రభువు దేవేంద్రుడివలె అప్పుడు తనకు అనురూపపురోహితుడు అయిన వసిష్ఠమహర్షి పాదాలకు నమస్కారము చేసి ఆయనను ఒక శుభాసనముమీద కూర్చుండపెట్టి మరి ఒక శుభాసనము మీద రాముడు కూర్చున్నాడు.

## ౧౩౧

కైకేయీనందవర్ధనుడు భరతుడు శిరస్సున చేతులు జోడించి ఆ అమోఘ పరాక్రముణ్ణి తన జ్యేష్ఠభ్రాతను రాముణ్ణి చూచి “ఓ రామా, నీవు మా అమ్మను గౌరవించినావు. అందుకోసము వనవాసముచేసినావు నాకు ఈ రాజ్యము ఇచ్చినావు. నీవు నాకు ఎట్లా ఇచ్చినావో అట్లాగే నీ రాజ్యాన్ని ఇప్పుడు నీకు నేను ఇచ్చివేస్తున్నాను - పెద్ద బలంతమైన ఒక ఎద్దు మోసే భారాన్ని ఒక లేగ దూడ మోయలేదు. రాజ్యపాలనము అనే ఈ మహాభారాన్ని మోసేశక్తి నాకు లేదు. మహాజలప్రవాహవేగానికి గండిపడి కొట్టుకుపోతున్న ఆనకట్టకు ఆకులూ చెట్లకొమ్మలూ ఇంత గడ్డీ వేసి అడ్డగిస్తేనే ఆ ఆనకట్ట నిలుస్తుంది అదేవిధముగా ఎన్నో ఛిద్రాలతో కూడుకొన్న ఈ రాజ్యాన్ని మంత్రమూ కోశమూ మొదలైనశక్తులతో పరిపాలిస్తేనే నిలుస్తుంది. నాకు అంతశక్తిలేదు. నీకున్న సామర్థ్యము నాకు లేదు. హంసమాదిరిగా కాకి ఎగిరిపోలేదు. తురగము మాదిరిగా గాడిద పరుగెత్తలేదు. ఓ రామా, నీవు అరిందముడవు. మహాప్రభావము కల

వాడవు. నీమాదిరిగా రాజ్యపాలనముచేసే శక్తికానీ సామర్థ్యముకానీ నాకు లేదు.

"ఓ మహాబాహూ. ఇంట్లో ఒక చెట్టునాటితే అది పెరిగి పెద్దదిఅయి పెద్దమానుకట్టి పెద్ద పెద్ద కొమ్మలు వేసి పూలుపూసి, ఆ తరువాత పండ్లు పండక పోయేటట్లయితే, ఆ చెట్టు వేసినవాడివలె నే ఇప్పుడు నీవు మమ్ములను రాజ్య పాలనము చేయకపోయినట్లయితే మేమూ అయిపోతాము. ఇది ఉపమానముగా చెప్పుతున్నాను. దీని అర్థము నీకు నేను వివరించ నక్కరలేదు. మేము నీ భక్తు లము. నీ భృత్యులము మమ్ములను నీవు పరిపాలించవలెను. కాపాడవలెను.

"ఓ రాజా, నీవు ఇప్పుడు రాజ్యాభిషేకము చేసుకొని మిట్టమధ్యాహ్న సూర్యుడి వలె మహా తేజముతో తేజరిల్లడము ఈ లోకము అంతా చూడవలెను. ఓ రామా, నీవు ఇంతవరకూ ఘోరారణ్యాలలో భయంకర మృగారావాలకు మేలుకొంటూ వచ్చినావు. ఇకనుంచి వివిధ వాద్యాలూ మోగుతూ ఉంటే స్త్రీల అందెలచప్పుళ్ళూ, మొలనూళ్ళ చప్పుళ్ళూ చేస్తూ ఉంటే, మనోహర సంగీతాలాపాలూ వింటూ మేలుకొన వలెను. జ్యోతిశ్చక్రము ఎంత కాలము తిరుగుతూ ఉంటుందో ఈ భూమి ఎంత కాలము ఉంటుందో అంత కాలమూ నీవు ఇక్కడ ప్రభువుగా సమస్తమూ పరిపాలించ వలెను" అని చెప్పినాడు.

భరతుడు చెప్పిన ఈ మాటలకు పరపురంజయుడు ఆ రాముడు "అట్లా గేను" అన్నాడు అంతవరకూ చేతులు జోడించి నిలుచొని ఉన్న భరతుడు అప్పుడు ఒక శుభాసనము మీద కూర్చొన్నాడు.

అంతట శత్రుఘ్నుడి ఆజ్ఞను శిరసావహించి సుఖముగానూ వేగముగానూ పని చేసే క్షురకులు వచ్చినారు. వారు పట్టాభిషేకసమయము అతిక్రమించ కుండా రామలక్ష్మణభరతుల గడ్డాలనూ మీసాలనూ తీర్చి దిద్దినారు. ముందుగా భరతుడు మంగళస్నానము చేసినాడు. ఆ తరువాత మహాబలవంతుడు లక్ష్మణుడూ అతని తరువాత వానరరాజు సుగ్రీవుడూ రాక్షసరాజు విభీషణుడూ మంగళ స్నానాలు చేసినారు. జడలు కట్టుకొని పోయిన తల వెంట్రుకలు అన్నీ చిక్కు తీసిన తరువాత రాముడు మంగళస్నానము చేసినాడు. చందనాది మై పూతలతోనూ రంగు రంగుల పూలదండలతోనూ మహార్హవస్త్రాలతోనూ రాముణ్ణి అలంకరించినారు. అప్పుడు దివ్యకాంతులతో జ్వలిస్తూ ఉన్న సింహాసనము మీద రాముడు కూర్చున్నాడు. శత్రుఘ్నుడు రామలక్ష్మణభరతులకు హారకేయూరాదులతో అలంకారము చేయించినాడు. దశరథమహారాజు భార్యలు అందరూ మంచి మనస్సుతో సీతాదేవిని స్నానము చేయించి

స్వయముగా అలంకరించినారు. పుత్రలాలస అయిన కౌసల్యాదేవి అంతట ఎంతో సంతోషముతో అవసరము అయిన ఏర్పాట్లు అన్నీ చేయించి వానరాంగనలకు అందరికీ శోభాయమానము అయిన అలంకారాలు చేయించింది.

శత్రుఘ్నుడి ఆజ్ఞను అనుసరించి సుమంత్రుడు గుర్రాలు పూన్చి సర్వాంగసుందరము అయిన రథాన్ని తోలుకొని వచ్చినాడు. సూర్యమండలము వంటి ఆ దేదీప్యమాన దివ్యరథము మీద ఆ మహాబాహువు ఆ అమోఘ పరాక్రమవంతుడు రాముడు ఎక్కినాడు. దివ్యవస్త్రాలు ధరించి ధగ ధగ లాడే కుండలాలు పెట్టుకొని దేవేంద్రుడి వంటి కాంతులతో తేజరిల్లుతూ హనుమంతుడూ సుగ్రీవుడూ ఆ రథము వెంట అయోధ్యకు బయలుదేరినారు. వారి వెనుక సీతాదేవితో, అందమైన కుండలాలు పెట్టుకొన్న వరాభరణసంపన్నలు సుగ్రీవుడి భార్యలు అందరూ అయోధ్యానగరము చూడబోతూ ఉన్న వేడుకతో బయలుదేరినారు.

సీతా రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల కన్నా ముందుగా దశరథమహారాజు భార్యలు అందరూ మంత్రులు అందరితోనూ కలిసి అయోధ్యాపట్టణానికి పోయినారు. అప్పుడు దశరథమహారాజు మంత్రులు అశోకుడూ విజయుడూ సుమంత్రుడూ వసిష్ఠమహర్షిని పురస్కరించుకొని ఇక నప్పుడు చేయవలసిన పనులను గురించీ రామాభివృద్ధిని గురించీ అయోధ్యానగరాభివృద్ధినిగురించీ ఆలోచించినారు. ఆ మహాత్ముడు రాముడి అభిషేకము కోసము ముందుగా ఏమే శుభకర్మలు చేయవలెనో వాటిని అన్నిటినీ చేయించవలసింది అని వసిష్ఠమహర్షితో చెప్పి మంత్రులు అందరూ మళ్ళీ అయోధ్యాపట్టణమునుంచి బయలుదేరి రాముడికి ఎదురుకోలు చెప్పటానికి పోయినారు.

ఆకుపచ్చని గుర్రాలు పూన్చిన రథము మీద వచ్చే సహస్రాక్షుడు దేవేంద్రుడి వలె అప్పుడు రాముడు రథముమీద అయోధ్యానగరానికి వస్తూ ఉన్నాడు. ఆ రథసారథ్యము చేయటానికి గుర్రాల పగ్గాలు భరతుడు పట్టుకొన్నాడు. శత్రుఘ్నుడు రాముడికి గొడుగు వేసినాడు. లక్ష్మణుడు ముందర నిలుచొని విసనకర్రతో రాముడి శిరస్సుమీద విసరుతూ రెండవ చేతితో ఒక వింజామరను పట్టుకొన్నాడు. చంద్రుడి వంటి మరి ఒక వింజామరను రాక్షసరాజు విభీషణుడు పట్టుకొన్నాడు. అప్పుడు ఆకాశములో మహర్షిగణాలూ మరుద్గణాలూ దేవగణాలూ రాముణ్ణి గురించి చేసిన మనోహరస్తోత్రధ్వనులు వినిపించినవి. వానరరాజు సుగ్రీవుడు పర్వతము అంతఎత్తునఉన్న శత్రుంజయము అనే ఏనుగను ఎక్కి ఆ రథము

వెంట పోయినాడు. మానవరూపము ధరించి సమస్తాభరణాలతో అలంకరించు కొన్న వానరవీరులు తొమ్మిదివేల ఏనుగులమీద ఆ రథమువెంట బయలు దేరి నారు. అప్పుడు ప్రజలు సంతోషాతిశయముతో శంఖాలు పూరిస్తూ దుందు భులు మోగిస్తూఉంటే ఆ పురుషశార్దూలుడు రాముడు రమ్యహర్మ్యపంక్తులు చూస్తూ అయోధ్యానగరము ప్రవేసించినాడు. పరివారపురస్సరముగా రథము మీద వస్తూఉన్న ఆ అతిరథుణ్ణి రాముణ్ణి అప్పుడు మంత్రులు అందరూ చూచి నారు. జయము ఆశీర్వదించినారు. ఆ మంత్రులను అందరినీ అభినందించి వారి వెంట ఆ మహాతేజస్వుడు రాముడు తన తమ్ములతో అయోధ్యాపట్టణములోకి పోయి నాడు. మంత్రులూ బ్రాహ్మణులూ ప్రజలూ మొదలైనవారి అందరిమధ్యనూ అప్పుడు రాముడు నక్షత్రాలమధ్యఉన్న చంద్రుడివలె విరాజిల్లినాడు.

చతుర్విధవాద్యాలు మోగిస్తూ కొందరూ తాళాలూ స్వస్తికాలూ చేతు లతో మోగిస్తూ కొందరూ మంగళగానము చేస్తూ కొందరూ మోదకాలు తీసు కొని రాజపురుషులూ పసుపురంగు అక్షతలు తీసుకొని బ్రాహ్మణులూ కన్నె పడుచులూ రాముడి ముందుగా నడిచినారు. ఆవులున్నూ రాముడి ముందు నడిచినవి. సుగ్రీవుడి సఖ్యాన్ని గురించీ హనుమంతుడి ప్రభావాన్ని గురించీ వానరులు చేసిన మహత్తర కార్యాలనుగురించీ రాక్షసుల బలాతిశయాన్ని గురించీ విభీషణుడు వచ్చి తనతో చేరడాన్ని గురించీ రాముడు అప్పుడు తన వెంటవున్న మంత్రులతో చెప్పినాడు. ఆవృత్తాంతము అంతా విని ఆమంత్రులూ అయోధ్యాపౌరులూ ఆశ్చర్యపోయినారు. అట్లా ఆయా విషయాలు అన్నీ చెప్పుతూ రాముడు వానరవీరులను వెంటపెట్టుకుని పౌరులు అందరూ సంతోష ముతో ఓలలాడుతూఉన్న అయోధ్యానగరములోకి వచ్చినాడు. అయోధ్యలో ఇంటింటా పతాకలు ఎత్తినారు. ఇక్ష్వాకువంశీయులు తన పితృపితామహులు నివ సించిన రాజభవనములోకి అప్పుడు ఆ రఘువంశలలాముడు రాముడు పోయినాడు. ఆ రాజభవనములోకి పోయే పోవడముతో కౌసల్యా సుమిత్రా కైకేయీలకు నమస్కారము చేసినాడు. పరమధార్మికుడు అయిన తన తమ్ముణ్ణి భరతుణ్ణి చూచి అర్థవంతముగా "తమ్ముడా, మన ఆవరణలో అశోకవనము పక్కను ముక్తావైడూర్యమణిఖచితమైన నా మందిరములో ఈ సుగ్రీవుణ్ణి విడిది చేయించు." అని చెప్పినాడు.

ఆ సత్యపరాక్రముడు భరతుడు సుగ్రీవుడి చెయ్యి పట్టుకొని ఆ రామ మందిరానికి తీసుకొని పోయినాడు. అప్పుడు ఆ మందిరంలో శత్రుఘ్నుడు తైల దీపాలూ పర్యంకాలూ వాటి మీద పరిచే ఆస్తరణాలూ, అమర్చినాడు. సుగ్రీ వుడు ఆ భవనములో సుఖముగా విడిది చేసినాడు.

ఆ మహాతేజోవంతుడు భరతుడు ఆ తరువాత కొంత సేపటికి ఆ భవనములో సుగ్రీవుణ్ణి చూచి "ఓ వానరరాజా, నీవు రామాభిషేకము కోసము ఇప్పుడు సముద్రజలాలు తెప్పించవలెను" అని చెప్పినాడు. అప్పుడు సుగ్రీవుడు నలుగురు వానరవీరులను పిలిచినాడు. నానారత్నభూషితకాంచనకలశాలను నాలుగింటిని ఆ నలుగురి చేతికీ ఇచ్చి తెల్లవారే లోపల నాలుగు సముద్రాల జలాలనూ తెమ్మని ఆజ్ఞాపించినాడు. వారి కోసము అందరూ ఎదురు చూస్తూ ఉంటారు. అని కూడా ఆ వానరవీరులతో చెప్పినాడు. అది సుగ్రీవాజ్ఞ. పెద్ద పెద్ద ఏనుగుల వంటి ఆ నలుగురు వానరవీరులు గరుత్మంతుడి వలె అప్పటికి అప్పుడు ఆకాశానికి ఎగిరి నాలుగు దిక్కులకూ సముద్రజలాలు తేవడానికి పోయినారు.

ఆ నలుగురే కాకుండా అప్పుడు జాంబవంతుడూ, హనుమంతుడూ ఋషభుడూ వేగదర్శీ పోయి అయిదు వందల నదుల జలాలను కాంచనకలశాలలో పట్టుకొని వచ్చినారు. సత్త్వసంపన్నుడు సుషేణుడు రత్నభూషిత కాంచన కలశము నిండా పూర్వసముద్ర జలాన్ని తీసుకొని వచ్చినాడు. ఋషభుడు (నదీ జలాలు తెచ్చిన ఋషభుడు కాడు) బంగారు కలశము నిండా దక్షిణ సముద్రజలాలను ముంచుకొని అవి చిందిపోకుండా రక్తచందన వృక్షశాఖలు ఆ కలశానికి మూతగా పెట్టి అమితవేగముతో వచ్చినాడు. వాయు వేగముతో పోయే గవయుడు రత్నఖచిత కాంచన కలశమునిండా పశ్చిమ సముద్రమునుంచి శీతలోదకాలను తెచ్చినాడు. గరుత్మంతుడి వేగముతోనూ వాయువేగముతోనూ పోయే నలుడు బంగారు కలశము నిండా ఉత్తరసముద్ర జలాలను తెచ్చినాడు.

రామాభిషేకము కోసము వానరవీరులు బంగారు కలశాల నిండా పుణ్యోదకాలు తేవడము చూచి శత్రుఘ్నుడు ఆ విషయము వసిష్ఠమహర్షికిన్నీ బంధుజనులకున్నూ విన్నవించినాడు.

అంతట వసిష్ఠమహర్షి బ్రాహ్మణులను వెంట పెట్టుకొని సీతాసమేతముగా రాముణ్ణి రత్నమయ పీఠము మీద కూర్చుండ పెట్టినాడు. అష్టవసువులు దేవేంద్రుణ్ణి అభిషేకించినట్టుగా అప్పుడు వసిష్ఠుడూ వామదేవుడూ జాబాలీ కాశ్యపుడూ కాత్యాయనుడూ సుయజ్ఞుడూ గౌతముడూ విజయుడూ అనే ఎనిమిది మంది మహర్షులూ సుగంధము గుబాళిస్తూ ఉన్న నిర్మలోదకాలతో ఆ నరశార్దూలానికి రాముడికి అభిషేకము చేసినారు. ఆ తరువాత ఋత్విక్కుల చేతనూ బ్రాహ్మణోత్తముల చేతనూ పెండ్లి కాని కన్య పడుచుల చేతనూ మంత్రుల చేతనూ వర్తకుల చేతనూ పౌరముఖ్యుల చేతనూ యోధుల చేతనూ

సంతోషముగా వసిష్ఠాది మహర్షులు రాముడికి అభిషేకము చేయించినారు దేవతలు అందరూ నలుగురు దిక్పాలకులతో చేరి ఆకాశములో నిలుచుండి దేవలోకసంబంధము అయిన సర్వౌషధరసాలతో రాముడికి అభిషేకము చేసినారు. అప్పుడు రాముడికి మంగళకరము అయిన శ్వేతచ్ఛత్రాన్ని శత్రుఘ్నుడు పట్టినాడు. వానరరాజు అయిన సుగ్రీవుడు ఒక తెల్లటి వింజామరతోనూ రాక్షసరాజు అయిన విభీషణుడు చంద్రబింబమువంటి మరి ఒక తెల్లటి వింజామరతోనూ రాముడికి వీచినారు. అప్పుడు దేవేంద్రుడు చెప్పినందువల్ల వాయుదేవుడు నూరు కమలాలతో జ్వలిస్తూ ఉన్న ఒక కాంచనహారాన్ని తీసుకొనివచ్చి రాముడికి ఇచ్చినాడు. దేవేంద్రుడు మళ్ళీ ప్రోత్సహించినందువల్ల వాయుదేవుడు నవరత్నాలతోనూ నడుమ నాయకమణితోనూ అలంకరించిన ముత్యాలహారాన్ని తెచ్చి రాముడికి ఇచ్చినాడు. ఆ ధీమంతుడికి రాజ్యాభిషేకము జరుగవలసిన ఆ రాముడికి రాజ్యాభిషేకము జరుగుతూ ఉన్న ఆ సమయాన దేవగంధర్వులు సంగీతము ఆలాపించినారు. అప్సరసలు నాట్యము ఆడినారు.

రామ రాజ్యాభిషేక సమయాన ఈ భూమి మీద పయిర్లు అన్నీ చక్కగా పండినవి. చెట్లు అన్నీ కాయలు కాసి పండ్లు పండినవి. పూలు ఘుమ ఘుమ వాసనలు గుబాళించినవి.

ఆ పురుషోత్తముడు రాముడు అప్పుడు ముందుగా బ్రాహ్మణోత్తములకు ఒక లక్ష గుర్రాలనూ కొత్తగా ఈనిన ఒక లక్ష గోవులనూ ఒక నూరు ఆబోతులనూ ఇచ్చినాడు. అంతేకాదు. ఆ బ్రాహ్మణోత్తములకు రాముడు ముప్ఫయి కోట్ల బంగారు నాణ్యాలనూ మహార్ఘ్యము అయిన వస్త్రాలనూ వరాభరణాలనూ దానము ఇచ్చినాడు. సూర్యకిరణాలవలె కన్నులు మిరుమిట్లు గొలిపే మణిమయ దివ్యకాంచనమాలను ఆ మానవేంద్రుడు రాముడు అప్పుడు సుగ్రీవుడికి బహుమానముగా ఇచ్చినాడు. ఎంతో అందముగా వైడూర్యమణులూ వజ్రాలూ పొదిగిన బంగారు బాహుపురులను ఆ ధృతిమంతుడు రాముడు అంగదుడికి బహుమానముగా ఇచ్చినాడు చంద్రకిరణాలవంటి కాంతులతో విరాజిల్లుతూ ఉన్న మణిమయముక్తాహారాన్ని రాముడు అప్పుడు సీతాదేవికి ఇచ్చినాడు. ఆ వైదేహి తన భర్త చూస్తూవుండగా అప్పుడు రెండు నిర్మలదివ్య వస్త్రాలనూ అందము అయిన ఆభరణాలనూ హనుమంతుడికి బహుమానముగా ఇచ్చింది. అంతట ఆ జనకనందిని సీతాదేవి తనకు రాముడు ఇచ్చిన మణిమయముక్తాహారాన్ని మెడలో నుంచి తీసి తన భర్త వంకనూ వానరులు అందరి వంకనూ పదే పదే చూచింది. మనోగతాలను బట్టి కనిపెట్టే రాముడు అప్పుడు ఆ జన

కాత్మజను సీతాదేవిని చూచి "ఓ భామినీ, ఎవడు తన పౌరుషముతో తన పరాక్రమముతో తన బుద్ధిబలముతో నిన్ను సంతోషపెట్టినాడో నీవు ఆ బుద్ధిమంతుడికి నేను నీకు ఇచ్చిన ముక్తాహారాన్ని బహుమానముగా ఇవ్వు" అని చెప్పినాడు.

అప్పుడు ఆ అసితేక్షణ సీతాదేవి ఆ ముక్తాహారాన్ని హనుమంతుడికి ఇచ్చింది. చంద్రకిరణాల వంటి తెల్లని ఆ మనోజ్ఞ ముక్తాహారాన్ని హనుమంతుడు పెట్టుకొన్నాడు. అప్పుడు ఆ హనుమంతుడు తెల్లటి మేఘము ఆవరించిన పర్వతము వలె శోభాయమానముగా కనిపించినాడు.

ఆ పరంతపుడు ఆ భూపాలుడు రాముడు అప్పుడు మైందద్వివిదులకూ నీలుడికీ వారి వారి కోరికలను గమనించి బహూకరించినాడు. ఇంకా తక్కిన వానర వీరులకు అందరికినీ, వానరవృద్ధులకు అందరికినీ వారి వారి యోగ్యతలను పట్టి ఆభరణాలనూ, వస్త్రాలనూ, బహుమానముగా ఇచ్చినాడు. ఈ విధముగా విభీషణుడికీ సుగ్రీవుడికీ హనుమంతుడికీ జాంబవంతుడికీ తక్కిన వానర వీరులకు అందరికీ వారి వారి యోగ్యతలకు తగినట్టుగా పుష్కలముగా రత్నాద్యాభరణాలు ఇచ్చి రాముడు సంతోషపెట్టినాడు. వారి వారి కోర్కెలు చెల్లించినాడు. వారిని అందరినీ సత్కరించినాడు. అప్పుడు వానరోత్తములు అందరూ సంతుష్టులు అయి ఆ పూజ్యుడికి వీడ్కోలు చెప్పి సుగ్రీవుడి వెంట కిష్కింధానగరానికి ప్రయాణమై పోయినారు. ఆ తరువాత రాక్షసరాజు విభీషణుడు రాముడికి వీడ్కోలు చెప్పి తన కులధనము అయిన లంకా రాజ్యానికి ప్రయాణము అయి పోయినాడు.

శత్రువులను అందరినీ సంహారము చేసి వేసిన ఆ మహాశయుడు ఆ పరమోదారుడు రాముడు పరమసంతోషముతో తన రాజ్యాన్ని పరిపాలించడము మొదలు పెట్టినాడు. ఆ ధర్మవత్సలుడు రాముడు సమస్తధర్మాలూ తెలిసిన తన తమ్ముణ్ణి లక్ష్మణుణ్ణి చూచి "ఓ ధర్మజ్ఞుడా, మన పూర్వీకులు అయిన రాజులు అందరూ తమ సామర్థ్యముతో ఈ భూమిని ఏలినారు. ఇప్పుడు నీవున్నూ నాతో కూడా ఈ రాజ్యము ఏలవలెను. పితృపితామహము అయిన ఈ రాజ్యభారాన్ని నేను ఒక్కడనే ధరించలేను, కాబట్టి నీవు యువరాజుగా ఉండవలెను" అని చెప్పినాడు. అందుకు లక్ష్మణుడు ఎంత మాత్రమూ ఒప్పుకోలేదు. అప్పుడు ఆ పరమపూజ్యుడు రాముడు భరతుణ్ణి యువరాజుగా అభిషేకము చేసినాడు.

రాముడు రాజ్యపాలనము ఆరంభించిన తరువాత పౌండరీకమూ అశ్వమేధమూ వాజపేయమూ ఇంకా వివిధ యజ్ఞాలూ చేసినాడు. భూరిదక్షిణలు బ్రాహ్మణులకు ఇచ్చి నూరు అశ్వమేధయాగాలు చేసినాడు. ఆ ధర్మాత్ముడు రాముడు తన స్నేహితులతోనూ దాయాదులతోనూ బంధువులతోనూ వివిధ యజ్ఞాలూ చేసి దేవతలను పూజించినాడు. లక్ష్మణుడి సహాయంతో రాముడు పదకొండువేల సంవత్సరాలు రాజ్యపాలనము చేసినాడు.

రాముడు రాజ్యపాలనముచేస్తూ ఉన్న కాలములో దుష్ట మృగభయము కానీ చోరభయముకానీ రోగభయముకానీ ఎవరూ ఎరగరు, ఎవరూ ఆపదలు ఎరగరు. స్త్రీలు వైధవ్యదుఃఖము ఎరగరు. వృద్ధులకన్నా ముందుగా చిన్నవాళ్లు ఎవరూ చనిపోయి ఎరగరు. సమస్త ప్రాణికోటీ సంతోషములో ఓలలాడింది. సమస్తజనులూ ధర్మపరులుగా జీవించినారు. ఒకరిని ఒకరు హింసించి ఎరగరు. ఆరోగులుగానూ దృఢగాత్రులుగానూ వేలకొద్దీ పుత్రులతో ప్రతివారూ అనేక వేల సంవత్సరాలు జీవించినారు. ప్రతివారూ ఏ విషయానికి అయినా రాముణ్ణి గురించి చెప్పుకొంటూ, అనుక్షణమూ "రామా రామా" అని స్మరిస్తూ ఈ జగత్తును అంతా రామమయముచేసి వేసినారు.

రామరాజ్యములో ప్రతివృక్షమూ ఆ యీ కాలము అనే భేదము లేకుండా మానకట్టి, కొమ్మలు విస్తరించి పూలు పూస్తూనూ పిందెలు కట్టుతూనూ కాయలుకాసి పండ్లు పండుతూనూ ఉండేవి. కాలము తప్పకుండా మేఘాలు వర్షిస్తూ ఉండేవి. సర్వకాలాలలోనూ గాలి హాయిగా వీస్తూ ఉండేది. సర్వజనులూ ధర్మరతులు. ఎవరూ అనృతమాడి ఎరగరు. సర్వజనులూ సమస్త సల్లక్షణసంపన్నులు. ధర్మపరాయణులు.

ఆ శ్రీమంతుడు రాముడు తమ్ములతో కూడా ఆ విధముగా పదకొండువేల సంవత్సరాలు రాజ్యపాలనము చేసినాడు.

## ఫలశ్రుతి

ఇది ఆదికావ్యము. వేదార్థాన్ని వివరిస్తూ కవులు ఎవ్వరూ పుట్టక పూర్వము వాల్మీకి మహర్షి ఈ మహాకావ్యాన్ని చెప్పినాడు. దీనిని చదివినా, విన్నా సమస్త పాపాలూ నాశనము అయిపోతవి. ఈ పుణ్యకావ్యమువల్ల జీవితము ధన్యము అవుతుంది. ఆయువు వృద్ధి అవుతుంది. రాజులు అయినవారు చదివినా విన్నా ఈ భూమిని అంతా జయిస్తారు. రామరాజ్యాభిషేకము వరకూ ఉన్న ఈ గ్రంథాన్ని విన్నవారూ చదివినవారూ పుత్రులను కోరుకొంటే

పుత్రులు పుడతారు. ధనము కోరుకొంటే ధనము వస్తుంది. రాజులు విన్నా చదివినా శత్రువులను అంతటినీ జయించి ఈ భూమిని అంతా ఏలుతారు.

ఈ ఆదికావ్యాన్ని స్త్రీలు వినేట్టయితే రాముణ్ణి కన్న కౌసల్యాదేవి వలెనూ లక్ష్మణ శత్రుఘ్నులను కన్న సుమిత్రాదేవి వలెనూ భరతుణ్ణి కన్న కైకేయీదేవి వలెనూ దీర్ఘాయుష్మలుగా ఉండే పుత్రులను కని సుఖపడతారు.

ఈ రామాయణము విన్నవాడు దీర్ఘాయుష్మంతుడు అవుతాడు. వేదార్థాన్ని ప్రతిపాదిస్తూ వాల్మీకిమహర్షి చెప్పిన ఈ ఆదికావ్యాన్ని శ్రద్ధతో వినే ప్రతివాడూ కోపాన్ని జయిస్తాడు. కష్టాలలోనుంచి తరిస్తాడు. విదేశవాసము చేస్తూ ఉన్న బంధువులు అందరూ దగ్గరకువచ్చి సహాయపడతారు. రామానుగ్రహము వల్ల సమస్తకోరికలూ సఫలము అవుతవి.

ఈ రామాయణాన్ని చక్కగా వింటే దేవతలు అందరూ సంతోషిస్తారు. ఆ విన్నవారి ఇండ్లలో విఘ్నాలు కలుగచేసే భూతాలు అన్నీ శమించిపోతవి. విదేశము పోయినవాడు స్వస్థముగా తిరిగీ స్వస్థానికివస్తాడు. పుష్పవతులు అయిన స్త్రీలు ఈ రామాయణ మహాకావ్యాన్ని వినేట్టయితే సర్వోత్తములు అయిన పుత్రులను కంటారు.

ఈ ఆదికావ్యము పురాతనము అయిన ఇతిహాసము. దీనిని పూజిస్తూ పఠించేవారి సమస్తపాపాలూ పరిహారము అయిపోతవి అంతేకాదు. దీర్ఘాయుష్మంతులు అవుతారు. ఈ రామాయణాన్ని ఎప్పుడూ చదువుతూఉన్నా వింటూఉన్నా రాముడు సంతోషిస్తాడు. రాముడు నిత్యుడు ఆదిదేవుడు. సమస్తపాపాలనూ హరించివేసే శ్రీహరి. సృష్టికిపూర్వము జలము నివాసస్థానముగా చేసుకొన్న శ్రీమన్నారాయణమూర్తి. సర్వేశ్వరుడు మహావిష్ణువు.

ఈ మహాకావ్యము మహా అర్థవంతము అయినది సమస్తశుభాలను ఇస్తుంది. దీనిని విన్నవారి కుటుంబము వృద్ధిఅవుతుంది. ధనధాన్యాలు వృద్ధి అవుతవి. వారి ఇండ్లలో స్త్రీలు ఉత్తమోత్తములుగా ఉంటారు. ఉత్తమోత్తమ సౌఖ్యము అనుభవిస్తారు. వారికే కార్యసిద్ధి అవుతుంది. ఈ భూమిమీద సమస్త వైభవాలు సమకూరుతవి.

ఈ రామాయణాఖ్యానాన్ని సంపదలుకోరే సత్పురుషులు నియమముతో వినవలెను. అట్లా నియమముతో వినేవారికి ఈ పుణ్యకావ్యము ఆయువునూ ఆరోగ్యాన్నీ సత్కీర్తినీ మంచి మంచి తోబుట్టువులనూ సౌభాగ్యాన్నీ జ్ఞానాన్నీ తేజస్సునూ ఇస్తుంది.

ఇది ఇట్లా పూర్వముజరిగిన ఆఖ్యానము. దీనిని శ్రద్ధతో చదవండి. మీకు మేలు అవుతుంది. మీకు విష్ణుబలము వృద్ధిఅవుతుంది. ఈ రామాయణ శ్రవణము వల్ల దేవతలు అందరూ సంతోషించడమే కాకుండా మీ పితృదేవతలు అందరూ తృప్తిచెందుతారు.

వాల్మీకిమహర్షి చేసిన ఈ రామాయణసంహితను భక్తితో వ్రాయించే వారూ వ్రాసేవారూ (ప్రకటించేవారూ) ఇహలోకసౌఖ్యాలే కాకుండా పునరావృత్తిరహితము అయిన స్వర్గలోకసౌఖ్యము అనుభవిస్తారు.

వాల్మీకి రామాయణము ఇంతటితో సమాప్తము.



శ్రీ రామచంద్ర శ్రితపారిజాతః
సమస్తకళ్యాణ గుణాభిరామః
సీతాముఖాంభోరుహాచంచరీకో
నిరంతరం మంగళ మాతనోతు.
శ్రీ రామచంద్రార్పణమస్తు.